శ్రీః

శ్రీరామాయనమః

# శూద్రకమలాకరము

అనుశూద్రధర్మతత్త్వము

శ్రీమహేంద్రాద్రిచక్రచూడామణిమహాదధీశనవలక్షధనుర్ధరేంద్రకళింగాధిపతి
మన్నెసుల్తాన్మీర్జారాజాబహద్దూరిత్యా ద్యనేకబిరుదావళీ విరాజమానులును-
హిజ్-హైనస్-ది- మహారాజా ఆఫ్
విజయనగరం - కె - సీ - ఐ - ఇ - వారునగు

## శ్రీమద్రాజాధిరాజమహారాజ

## శ్రీమదానందగజపతిమహారాజులుంగారి

ఆజ్ఞచొప్పున సర్వజనసాధారణముగ శూద్రధర్మరహస్యమెల్లవారికి
దెల్లంబగునట్లు
తన్మహారాజ సంస్థానాస్థానస్థిత పండితవర్యులగు
బ్రహ్మశ్రీ కొల్లూరి, కామశాస్త్రులవారిచే
సంపూర్ణముగ దెనుగింపబడి
చెదలవాడ, సుందరరామశాస్త్రులవారిచే బరిష్కరింపబడి

శాలివాహనశకాబ్దంబులు ౧౮౦౯ వదగు సర్వజిద్వత్సరమాఘ
కృష్ణసప్తమీస్థిరవాసరంబున

ఆదిసరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందు ముద్రింపంబడి
ప్రకటింపంబడియె.

మంగళమస్తు.

చెన్నపురి.

శ్రీరస్తు.

ఉపోద్ఘాతము.

విద్వజ్జనులారా యాంధ్రధర్మసింధుసారము ముఖపత్రములో సిద్ధాంత
పరచినరీతిని జగదుద్ధారమునకై యవతరించినశ్రుతి స్మృతులకు బక్షపాతదోష
ములేకుండుటస్వాభావికమై యుండకతీరదు మరియు "నాలోడ్య సర్వశాస్త్రాణి
విచార్యచపునఃపునః । పరోపకారఃపుణ్యాయ పాపాయపరపీడనం॥" అనుభా
రతవచనమందు స్వారసికార్థముచే బహుజనోపకారము కృతార్థతనిచ్చునని
సిద్ధించినది - అందులోక్షణికమైన యీజన్మమందుమాత్రమే యుపయోగించు
ధనాద్యుపకారములకంటె జన్మాంతరములందుసహితముశ్రేయస్కరమగుజ్ఞానోప
కారము ప్రశస్తమని స్పష్టముగ దెలియవచ్చుచున్నది - ఇట్లుండినను ప్రాచీన ని
బంధనకారులందరుస్త్రీశూద్రులకంటెలెక్కకు మిక్కిలి యుండక్కువైనద్విజు
లధర్మములుమాత్రము ప్రధానముగనుద్దేశించి నడచిరి-సరియేకదా - కొంద
రు మీదుమిగిలి "నశూద్రాయమతిందద్యాత్॥" అనువచనమునకు దాత్పర్యార్థ
ముదెలుసుకొనంజాలక నిందింపనుసాగిరి - అనియాలోచించికరుణించి శ్రీకమలా
కరభట్టాచార్యుడు శూద్రధర్మతత్వమును బ్రధానముగ నుద్దేశించి యీగ్రంథము
రచించి నిందించువారిముఖముల వంచెను - అయిన నట్టి శూద్ర ధర్మతత్వము
సంస్కృతభాషావగుంఠనముచే గూఢమైకుంతిదాచిన కర్ణోత్పత్తివలెనుపయోగిం
పకుండెను- ఇట్లనన్యగతికమైన జగమునుద్ధరించుటకై సర్వసాధారణమైనస్పష్టభా
షతోదానిందెనుగించుటకు నుత్సహించి శ్రీమద్విజయనగరసంస్థాననిరతిశయోదయ
ప్రతిష్ఠాపననిష్ఠాగరిష్ఠులును వసిష్ఠగోత్రపవిత్రీకరణధురీణవర చరిత్రులు నప్రతిమ
ప్రతిభానికషకషితసర్వశాస్త్ర సిద్ధాంత విశేషులును శ్రీపూషవాడ్వంశ పయఃపా
రావారరాకాసుధాకరులును శ్రీమహేంద్రాద్రి చక్రచూడామణి మహాదధీశ
నవలక్ష ధనుర్ధరేంద్ర కళింగాధిపతి మన్నెసుల్తాన్ మీర్జా బహదూర్ ఇత్యాది
నానాబిరుదమండలమండితులును- హిజ్- హైనెస్- ది-ఆనరేబిల్ మహారాజా-
ఆఫ్-విజయనగరం-కే-సి-ఐ-ఇ-వారునగు శ్రీమదానందగజపతిమహారాజచంద్రులా
రంభించియు నింతకుమున్నె మిస్టర్-మిల్ దొరగారుచేసిన యాంగ్లేయ తర్కశా
స్త్రమును దాము దెనుగించుటకు బూనియున్నందుననవకాశమునిదయచేయించి

న దత్సంస్థానసభామాన్య మానుడగు కొల్లూరికామశాస్త్రిచే సంపూర్ణముగ దెనుగింపఁబడిన యీశూద్రధర్మతత్త్వమైన శూద్రకమలాకరము లోకమునందా చంద్రతారకముగ వారి యుద్దేశముఫలింపజేయుచు సర్వోపకారకమై వెలుంగుగాక.

క్షమయుఁ సత్యము సాహసంబు దయయుఁ గాంభీర్యముఁ
ధైర్యముఁ। శమముఁ జ్ఞానము మానముఁ సమతయై
శ్వర్యాదులెల్లఁ సమ। గ్రముగాగఁ దనసుం
డిలోకమున కెక్కుఁ లెస్సవ్యత్యస్తయ।
త్నమవద్యంబ యటన్న నీతిగతు
లానందింపని కేతగుఁ.



శ్రీ

# శూద్రకమలాకరము, విషయసూచిక.

ఇట్లు, శూద్రకమలాకరమునందలి

ప్రధానవిషయసూచిక

ముగిసినది.



శ్రీః

శుభమస్తు, అవిఘ్నమస్తు.

ఓం నమః పరదేవతాయై శ్రీదుర్గాంబాయై.

# శూద్రకమలాకరము, ప్రారంభము.

శ్రీరాజితదుర్గాంబా। ధీరవ్యాదానందగజపతిమహారాజ। ప్రేరణ
మున బహుజగదుప। కారము దెనుగింతు శూద్రకమలాకరముఁ॥

ఇపుడు గ్రంథకర్తయగు కమలాకర భట్టుడు శ్రుతిస్మృతుల యొక్క గూఢమైన సర్వసమతను బ్రకటించుచు నవరజాతుల నుద్ధరింపగ శూద్రాదిధర్మములనిర్ణయించు నీశూద్రకమలాకరమను గ్రంథము రచింపబూని నిర్విఘ్నపరిసమాప్తి కొరకును ప్రేప్సగలవారు ప్రవర్తించుటకును మంగలాచరణ పూర్వముగఁ బ్రతిజ్ఞ చేయుచున్నాడు- "శ్రీరామచంద్రుని దనతలిదంద్రులను నమస్కరించి రామకృష్ణపుత్రుఁడైన కమలాకరభట్టుడు శూద్రధర్మము నిరూపించు నీగ్రంథము జేయుచున్నాఁ"డని. అందు శూద్రత్వము విప్రత్వాదులవలె వివాహమాడిన సవర్ణ స్త్రీయందు బుట్టుటయేయని గ్రహించవలెను- ఈలక్షణము సృష్ట్యాదిని బుట్టినవానికిని విశ్వామిత్రాదులకును బట్టదు. అయినను వారికదృష్ట విశేషముచేగల్గిన శరీరమునొందుటయే విప్రత్వము. తక్కినవారికి మీదజెప్పినలక్షణము. ఇట్లు శూద్రునకును గావచ్చును. అనగా, సృష్టిప్రలయపరంపర యనాదియగుటవలనఁబూర్వపూర్వకర్మరూపమైన యదృష్టభేదమున బ్రహ్మక్షత్రవైశ్యశూద్రజాతులు సత్వరజస్తమఃప్రధానములై ప్రతిసృష్టియందునగును- అట్టిజాతులలోవివాహితమైన సవర్ణస్త్రీయందు భర్తకుబుట్టిన వాడెల్లనాయాజాతి వాఁడగునని సమన్వయము. కనుక, "జన్మనాజాయతేశూద్రః" యనునది శూద్రసమానత్వముజెప్పునని తాత్పర్యము. ఇందులకుప్రమాణవచనములు "ధాతాయథాపూర్వమకల్పయత్। పద్భ్యాంశూద్రోఅజాయత। శూద్రోమనుష్యాణామశ్వఃపశూనాం" అని బహ్వృచతైత్తిరీయాదిశ్రుతులును- "ముఖబాహూరుపజ్జాతాస్తస్యవర్ణాయథాక్రమం।లోకానాంతువివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః। బ్రాహ్మణంక్షత్రియం

వైశ్యంశూద్రంచనిరవర్తయత్ । బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచపరంతప । కర్మాణిప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః॥" అనుమనుభగవద్గీతాదిస్మృతులునని యెఱుంగునది. ఇట్లుశూద్రు లొకవర్ణముగానున్నప్పటికిని వారికిగర్మానధికారము నిషేధవచనముచేతను న్యాయముచేతనుం గానంబడుచున్నది. ఎట్లనిన, "పద్యుహవాఏతచ్ఛ్మశానంయచ్ఛూద్రః" అనిశతపథబ్రాహ్మణము, అనగా శూద్రుడు, పద్భ్యాంయుజ్యతే=పద్యు, పాదములతోఁగూడిన, యనగామనుష్యాకారమైన, శ్మశానమే, యనగా, నట్టియపవిత్రుఁడగుటచేఁ గర్మాధికారములేదనిభావము. మరియు "తస్మాచ్ఛూద్రోఽయజ్ఞేనవక్లృప్తః। నహిదేవతా అన్వసృజ్యత" యని తైత్తిరీయశ్రుతి, అనగాశూద్రుడు దేవతలననుసరించి, యనగా, దేవకర్మములు చేయుటకుసృజింపఁబడలేదు, గనుక, యజ్ఞమందుగల్పింపఁబడడనగ, నధికారిగనిర్ణయింపబడలేదనియర్థము. ఇకన్యాయము, పూర్వమీమాంసయందాద్యాధికరణసిద్ధిలో రెండవదియునారవదియు. ఎట్లనిన, ఆద్యాధికరణమందు, స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అనియధ్యయనముకర్మార్థకమైన తవ్యప్రత్యయముశ్రుతమైనందునస్వాధ్యాయప్రయోజనమెయని తెలియఁబడుచున్నదిగనుక నక్షరగ్రహణార్థమగుట వలనను దృష్టార్థమే యగుటను నంతమాత్రముచే విధిసఫలమైనందునను విచారరూపార్థము దెచ్చు నావశ్యకతలేనందున మీమాంసాశాస్త్ర మారంభించనక్కఱలేదు కనుక "వేదమధీత్యస్నాయాత్" అనువిధిలోవిచారము జేయకుండగనే సమావర్తనము జేయవచ్చును, కాబట్టి యధ్యయనవిధిచేసిద్ధమగువిద్య లేనందున గ్రమవిధులచే విద్యావశ్యకత సూచింపఁబడినను ద్విజులకువలెశూద్రునకును బుస్తకపాఠముచే విద్యసంభవించును గనుకగర్మాధికారము వానికినుండ వచ్చునని పూర్వపక్షమునందు జెప్పఁబడినది. ఇందులకు సిద్ధాంతమైన యారవదానియందు, నధ్యయనమర్థజ్ఞానమునకు హేతువగుటచే దృష్టార్థముగనుక సామగానమునకు బుగక్షరాభివ్యక్తిద్వారమున స్తోత్రార్థత్వము సంభవించినటుల నధ్యయనవిధికిని తవ్యప్రత్యయావగతమైన స్వాధ్యాయార్థత్వము ద్వారముగ నర్థజ్ఞానార్థమగుట యావశ్యకము కాబట్టివిచారములేక యట్టియర్థజ్ఞానము సంభవించనందున మీమాంసాశాస్త్రమారంభించకతప్పదు. అనునర్థము, "అథాతోధర్మజిజ్ఞాసా" యనుసూత్రమందలి అతశ్శబ్దమునకునధ్యయనవిధిదృష్టార్థమగుటవలననని వ్యాఖ్యఁజేయుటచే శాబరభాష్యమందును సూచింపఁబడినది. కాబట్టి, విచారములేకుండగ నధ్య

యనవిధి పూర్తిగానందున, "వేదమధీత్యస్నాయాత్" అనుస్మార్తస్నానమునకున
ధికారము సిద్ధించును. అట్లయినను ప్రకృతమేమయ్యెననిన, అట్టియధ్యయనవిధియు,
"ఉపనయీత 1-తమధ్యాపయీత । ఉపనీయగురుశ్శిష్యంమహావ్యాహృతి పూర్వ
కం । వేదమధ్యాపయేదేనం శౌచాచారాంశ్చశిక్షయేత్॥" అనిస్మృతియుండుట
చేతను నుపనయనము దృష్టార్థమగుటచేతను, నుపనీతులైనబ్రహ్మచారుల ను
ద్దేశించియె ప్రవర్తించినది. అట్టియుపనయనము, "ఆధానేసర్వశేషత్వాత్" అ
నిద్వితీయాధ్యాయమందలి న్యాయముచేత "వసంతేబ్రాహ్మణముపనయీతగ్రీష్మే
రాజన్యంశరదివైశ్యం" అనుశ్రుతులచేమూడువర్ణములకే విధింపఁబడినందున,
శూద్రునకదిసంభవింపదు. కాబట్టియజ్ఞాదివిధు లట్టియధ్యయనవిధిచేప్రాప్తమైన
విద్యగలత్రైవర్ణికులవిషయమై వినియోగించినందున విద్యనుదోపించు నావశ్యక
తలేకుండుటచేఁబుస్తకపాఠాదులచే విద్యనుసంపాదించు శూద్రునకుయజ్ఞాదిక
ర్మలందధికారము సిద్ధింపదని, పార్థసిద్ధాంతముప్రమాణమనుట. మరియేమనిన,
శ్రుత్యంతరమందు, "అష్టవర్షంబ్రాహ్మణముపనయీత తమధ్యాపయీత" యని
యధ్యాపనమంచే యుపనీతుని గ్రహించుట యున్నదిగాని, యధ్యయనమం
దులేదు, అయిననుఅధ్యాపనము జీవికానిమిత్తమగుటచే "యాజయేత్" అనువ
దివలెవిధికనర్హమగుటచేతను నాచార్యునిధర్మమగుటచేమాణవకుని సంస్కా
రము కాకుండుటనుండియు, "బ్రాహ్మణముపగచ్ఛేత్ సోధీయీత" యనివిధికివిపరి
ణామము జేసుకొనియర్థముగ్రహింపవలెనని వివరణకారాదులుచెప్పిరి. స్వాధ్యా
యవిధివలెను, "చమసాధ్వర్యూన్ వృణీత" యనువిధివలెను నుపయనసంస్కార్యుఁ
డైన వటునికిగూడదీనిచేతనే వినియోగముగనుకను నుపాదేయత్వ,మనగవిధివిష
యత్వము, సంభవించునని పార్థసారథిరాణకాదులంద్రు. అందువసంతాదివాక్య
ములచే నుపనయనవిధిసిద్ధించినందున బ్రాహ్మణవిశిష్టమైనయుపనయనము నను
వదించియష్టవర్షాదికాలము నీశ్రుతివిధింపుచున్నది. అట్లైననువాక్యభేదదోష
మురాదు ఉద్దేశ్యపూర్తికానందున విశిష్టమునుద్దేశించునపుడాదోషముగాదని హే
మాద్రిచెప్పినదివాస్తవము, విచారించినచోవినిగమకములేనందున శాఖాంతరమ
గుటచే రెండిటియందువిశిష్టవిధియెసిద్ధించును, కనుకనేపుంస్త్వముగూడ విధేయ
ముగావివక్షింపఁబడినది, అట్లుగానిచో, ననగానుపనయనమందు సంస్కార్యుఁ
డగుటచే, "గృహంసంమార్ష్టి" యనువిధియందుగ్రహమునకే కర్త్వమువలెపుం

త్త్వము వివక్షింపనియెడ, స్త్రీలకుగూడ నుపనయన ప్రాప్తియెట్లు వారింపఁబడును? ఇకతంత్రరత్నమందు, "తస్యాయావదుక్తమాశీర్బ్రహ్మచర్యం" అనుస్థలముననష్టవర్షవాక్యమందు ద్వితీయచేసంస్కార్యయగుటచేతలింగము వివక్షింపకున్నందున న్యాయముచే స్త్రీకుపనయనము ప్రాప్తించినను నిషేధమున్నందున స్త్రీకుపనయనములేదనిచెప్పఁబడినది. అదిసంగతముగాదు, ఏమనిన, "అధ్వర్యుంవృణీత" యనువిధివలెస్వాధ్యాయమునుపాదేయముగనుక వసంతాదివాక్యమందునది గ్రహింపవలయును, అనగానధ్యయనార్థమైవిధింపఁబడినయుపనయనము స్త్రీకిబ్రాప్తించదనిభావము. కనుకనే శూద్రునితోసమానుడగుటవలనషండునికుపనయనములేదు, కనుకనేయట్లుమితాక్షరయందు దేవలవచనము, "షండకోలింగహీనస్స్యాత్సంస్కారార్హశ్చనైవసః॥" అనగాపుంలక్షణములులేనివాడు షండుఁడు ఉపనయనాది సంస్కారమునకనర్హుఁడనుట. మరియుయాజ్ఞవల్క్యవచనము. "షండంతుబ్రాహ్మణం హత్వాశూద్రహత్యావ్రతంచరేత్॥" అని, యనగా బ్రాహ్మణజాతీయుఁడైనను షండునిజంపినయెడశూద్ర హత్యావ్రతముజేయవలెననిఅనగాషండుఁడు బ్రాహ్మణుఁడైనను సంస్కార హీనుఁడగుటచేశూద్రసమానుఁడనిభావము. ఇక, బౌధాయనసూత్రము స్మృత్యర్థసారముమొదలగువానియందుమాత్రము షండునకువచనమున్నందున నుపనయనము గావచ్చుననియున్నది. అదిముందునిర్ణయింపఁబడును, కనుకనే యుపాదేయమైనవటువునందుండుటచే నేకత్వము నష్టవర్షత్వముగూడవివక్షింపఁబడినది. ఇకనిట్లున్యాయముచేతనే శూద్రునకుఁ గర్మానధికారముసిద్ధింపుచుండగ, "తస్మాచ్ఛూద్రోయజ్ఞేఽనవక్లృప్తః" అనినిషేధము వ్యర్థమనిశంకించిన, న్యాయప్రాప్తమైనయర్థమునేయనువదించినదని భాట్టులుచెప్పిరి. వేదాంతిమతమందైనచో, తవ్యప్రత్యయముచే స్వాధ్యాయమునకు భావనావిషయత్వానుభవము ప్రథమోపస్థితమగుట నుండియు, హుంఫట్ ఇత్యాదులందావశ్యక మగుటనుండియు, ఏకరూపమగుటనుండియు, నక్షరగ్రహణమె భావనావిషయమగును, అయిననీమతమందుఁ గ్రతువిధులచే విద్యాక్షేప, మనగావాటియర్థజ్ఞానమన్యథానుపపత్తిచేవచ్చుట యావశ్యకము, గనుక పుస్తకాదులచేనట్టిజ్ఞానముసంపాదించుశూద్రు నకధికారమెట్లువారించుననిన, భాట్టమతమందధ్యయనవిధిసిద్ధమైనవిద్యను గ్రహించుటచేఁ గ్రతువిధులకు విద్యాక్షేపకత్వమెట్లు సంభవించదోయట్లనె యీమతమందునర్థజ్ఞానమక్షరగ్ర

హణోపాయముచే నధ్యయనవిధి సిద్ధమైనందున శూద్రునకు పుస్తకాద్యుపా
యాంతరము నాక్షేపింపలేదని తుల్యయుక్తిచేత నేవారించును. లేదా, శూద్రున
కట్లధికారమువచ్చినను, "పద్యుహవా ఏతచ్ఛ్మశానంయచ్ఛూద్రః" అనుశ్రుతిచేనది
నిషేధింపఁబడినది. ఇట్లునిషేధముండుటచేత నీయధ్యయనవిధి కక్షరగ్రహణార్థత్వ
మేనిశ్చయింపఁబడినది, అట్లుగానిచోశూద్రునకుఁ బ్రాప్తియె లేకుండుటవలననిషే
ధము వ్యర్థమేయగునని చెప్పుదురు. కాబట్టి, యెట్లువిచారించినను శూద్రునికిగ
మాణాధికారములేదనుట సిద్ధించినది. గ్రహణవివాదమైనచో "నుపనయీత" యని
ణీఞ్ ధాతువుపై "సమ్మాననోత్సంజనాచార్యకరణజ్ఞానభృతివిగణనవ్యయేషునియః"
అనుపాణినిస్మృతిచే నాచార్యకరణత్వముభావనావిషయమగుచో నాత్మనేపదము
స్మరించినందున నుపనయనమంగమగుటచే స్వతంత్రఫలములేకున్నను, "ఉపనీయతు
యశ్శిష్యం వేదమధ్యాపయేద్ద్విజః । సకల్పంసరహస్యంచతమాచార్యంప్రచక్ష
తే॥" యనియనగా శిష్యునికుపయనసంస్కారముఁజేసి కల్పరహస్యములతోఁ గూడ
వేదమును బఠింపఁజేసినద్విజుఁడే యాచార్యుఁడనఁబడుననుస్మృతివలననధ్యాపన
ఫలమేయంగమందుపచరింపబడును. ఎట్లనిన "వర్ష్మవా ఎతదాజ్ఞాయక్రియ తెయత్ప్ర
యాజా ఇజ్యంతె" యనుప్రయాజయాగవిధికి ప్రధానయజ్ఞఫలముచేతనే ఫలవ
త్త్వముగల్గినట్లని తెలియునది. కనుకనధ్యాపనవిధిప్రయుక్తమైనను నధ్యయనము
మాణవకనిష్ఠమగుటచేనంతరంగమయినందుననర్థజ్ఞానార్థత్వముగూడసిద్ధించును. ఇ
కగ్రతువులునట్టి యధ్యయనసిద్ధమైనజ్ఞానముచే నుపజీవించునుగావున నుపాయాం
తరముదోపించు నావశ్యకతలేదుగనుక శూద్రున కధికారములేదని ప్రాభా
కరులుచెప్పిరిగాని, యదియసంగతము. ఎట్లనిన ఆచార్యకరణత్వముకర్తృగామిగా
వివక్షింపఁ బడెనేనిణీఞ్ ధాతువునందిత్సంజ్ఞి కఞకారమున్నందున "స్వరితఞితఃక
ర్త్రభిప్రాయెక్రియాఫలె" యనుసూత్రముచేతనే యాత్మనేపదముసిద్ధించును, గను
కసమ్మాననెత్యాదిసూత్రము వ్యర్థమేయగును- కాబట్టికర్తృగామిగ క్రియాఫలము
వివక్షింపకుండునపుడాత్మనేపదము సిద్ధించుటకె యీసూత్రము కనుకనేమహాభా
ష్యమందున "కర్త్రభిప్రాయార్థే యమారంభః" అనియున్నది - కనుక క్రియాఫల
మైనప్పటికిని గర్త్రభిప్రాయము గానందున నాచార్య కరణత్వము, భావనావిష
యముగాదని గ్రహించునది - ఇక్కడివిశేషము వివరణమందును దంతరత్నమం
దును దెలియునది - అందుశూద్రునకు వేదశ్రవణమందు నధికారములేదు, అట్లుని

షేధవచనము - "కపిలాక్షీరపానేన బ్రాహ్మణీ గమనేనచ । వేదాక్షర విచారేణ శూద్ర శ్చండాలతాం వ్రజేత్" అని, యనగా కపిలగోవుపాలు ద్రావినను బ్రాహ్మణ స్త్రీసంగము జేసినను వేదాక్షరములు విచారించినను శూద్రునికిచండాలత్వము వచ్చునని పరాశరవచనము. మఱియునుత్తరమీమాంసయం దపశూద్రాధికరణములో వేదశ్రవణాదులుశూద్రునకు "స్మృతేశ్చ" యనుసూత్రమందునిషేధింపఁబడినవి - అట్లుశంకరాచార్యులచేవ్యాఖ్యానము చేయఁబడినది-ఎట్లనిన"శ్రవణప్రతిషేధోభవతి - అథహాస్య వేదముపశృణ్వతస్త్రపుజతుభ్యాంశ్రోత్రపూరణమితి । పద్యుహవా ఏతచ్ఛ్మశానం యచ్ఛూద్ర ఇతి భవతిచోదాహరణేజిహ్వాచ్ఛేదోధారణే శరీరభేదఇతి॥" అనగాశూద్రుఁడు వేదము వినినయెడ సీసముచేతను లక్కచేతను చెవులు నింపుట ప్రాయశ్చిత్తమనియు వేదముచ్చరించినచోజిహ్వాగోయుటయు నావృత్తిజేసి ధరించినచోశరీరభేదము ప్రాయశ్చిత్తమనియు నుండుటచే వేదశ్రవణాదులందు శూద్రున కధికారము లేదనివ్యాఖ్యానము-అట్లు వేదార్థజ్ఞానముగూడ శూద్రునకునిషిద్ధము "నశూద్రాయమతిందద్యాన్నోచ్ఛిష్టం నహవిఃప్లుతం । నచాస్యోప దిశేద్ధర్మంనచాస్య వ్రతమాదిశేత్" అని, అనగా శూద్రునకుజ్ఞానమీగూడదు అనగ "నశూద్రాయపరిజ్ఞానందద్యాద్వేదముఖేనతు" అని పరాశరీయపురాణ వచన మున్నందున నిక్కడవేదార్థజ్ఞానమని తాత్పర్యము- అట్లుబ్రాహ్మణోచ్ఛిష్టము హవిస్సును నీగూడదు అట్లుధర్మమును వ్రతమునుపదేశింప గూడదనిపాద్మస్మృత్యర్థము - ఇట్లు వేదార్థజ్ఞానమునిషేధింపఁబడినందున దన్మూలమైన మీమాంసాధ్యయనముగూడనిషిద్ధమే- అట్లు వేదమూలకమగుటచే స్మృతిపురాణాద్యధ్యయనమునిషిద్ధము- "పురాణంపంచమోవేదః- పురాణం వేదసంమితం" అనిస్మృతి వచనములున్నవి- మఱియును"తస్మాదిదంవేదవిద్భిరధ్యేతవ్యం ప్రయత్నతః । శిష్యేభ్యశ్చ ప్రవక్తవ్యం సద్వృత్తేష్వేవధర్మతః"॥ అనిస్మృతి కౌముదియందత్రిస్మృతి- అనగానిది వేదార్థమే గనుకవేదవేత్తలగువారు ప్రయత్నముచేదీని జదువవలెను శిష్యులకైనను ధర్మముచే సద్వృత్తముగలవారికే యుపదేశింపవలెనని యర్థము-ఇట్లుమనువచనము- "నిషేకాది శ్మశానాంతో మంత్రైర్యస్యోదితోవిధిః । తస్యశాస్త్రేఽధికారోస్మిన్ జ్ఞేయోనాన్యస్య కస్యచిత్" అని, అనగా గర్భాధానము మొదలుగ నంత్యేష్టివరకును వేదమంత్రములచే కర్మములువిధింపఁబడ్డవారికేయీమనుధర్మ

శాస్త్రముఁజదువుట కధికారముగాని యితరులకు లేదనియర్థము అట్లుస్మృతులు వినుటయు నిషేధింపఁబడినది- "నావేదవిద్భ్యః కథనీయమేతత్పురాణరత్నంపురశాసనస్య । నాభక్తశిష్యాయచ నాస్తికేభ్యో దత్తం హియత్తన్నరకం దదాతి"॥ యని,వాయు సంహితావచనము- అనగానీశ్వరుని మహిమను జెప్పునీపురాణరత్నమును వేదవేత్తలుగానివారికి నుపదేశింపఁగూడదు,అట్లుభక్తుఁడుశిష్యుఁడుగాకున్నవానికిని నాస్తికునికిని జెప్పఁగూడదు,అట్లుచెప్పినచో నరకమువచ్చునని. అట్లుకౌర్మవచనము-"నాధ్యేతవ్య మిదంశాస్త్రం వృషలస్యతు సన్నిధౌ । యోధీతేచైవ మోహాత్మా సయాతి నరకాన్ బహూన్"॥ అని,యనగా నీశాస్త్రముఁ శూద్రుని యెదుటజదువఁగూడదు మోహముచేనట్లు చదివినవాఁడనేకనరకములొందునని యర్థము- మఱియుభవిష్యత్పురాణ వచనము- "యాన్యేతానిత్వయోక్తాని ధర్మశాస్త్రాణిసువ్రత । నేచ్ఛామిశ్రోతుం విప్రేంద్రగుహ్యాన్యేతానిహిద్విజ। త్రయాణామేవ వర్ణానాం ప్రోక్తాన్యేతాని పండితైః । శ్రేయసేనతు శూద్రాణామత్రమేవచనం శృణు । బ్రాహ్మణాదిషు వర్ణేషు త్రిషు వేదాః ప్రతిష్ఠితాః । మన్వాదీనిచ శాస్త్రాణితథా చాంగానిసర్వశః॥" అని,అనగా సువ్రతుఁడవైన యోద్విజశ్రేష్ఠుఁడా ధర్మశాస్త్రము లెవ్వియైననునీవుచెప్పగావినుటకు నేగోరదను-ఏమనిన నవిగుహ్యము లనగరహస్యములు మూఁడువర్ణములవారికె విధింపబడినవని పండితులుచెప్పుదురు శూద్రులకవిశ్రేయస్కరములుగావుగనుక నావచనము వినుము బ్రాహ్మణాదులైనమూఁడువర్ణములందె వేదములు ప్రతిష్ఠింపఁబడియున్నవిమఱియు దన్మూలకములైన వేదాంగములును మన్వాది శాస్త్రములు నచ్చటనే యుండవలె ననియర్థము. ఇట్లుస్మృతిపురాణాదులను చెప్పుటకును వినుటకును నిషేధముసాక్షాత్తుగా శూద్రునుద్దేశించిచేసినయెడనేగాని విప్రద్వారముగ జరిగినచో లేదు- అట్లుమహాభారతవచనము "శ్రావయేచ్చతురో వర్ణాన్ కృత్వా బ్రాహ్మణమగ్రతః॥" అనియనగా బ్రాహ్మణు నెదుటనుంచుకొని నాల్గువర్ణములవారికిని భారతము వినుపింపవచ్చుననుట. ఇట్లు నారదీయవచనము "యేచధర్మపరా రాజన్ దేవద్విజపరాయణాః । తేషాంమధ్యేహరేరగ్రే పఠనీయం ద్విజాతిభిః॥" అని,యనగానీపురాణము ధర్మపరులును దేవబ్రాహ్మణ భక్తులునగు వారిమధ్యమందుభగవంతు నెదుటను బ్రాహ్మణులు చదువవలెననుట. ఇట్లుభాగవతమందును,"స్త్రీశూద్రద్విజ బంధూనాంత్రయీనశ్రుతిగోచరా । కర్మశ్రేయసి మూ

ఘానాంశ్రేయ ఏవంభ వేదిహ । ఇతిభారతమాఖ్యానంకృపయామునినాకృతం॥" అని,యనగా స్త్రీలకు శూద్రులకునుద్విజబంధువులనగద్విజులకుశూద్రస్త్రీయం దుబుట్టినవారికిలేదావ్రాత్యులకైనను వేదమువినుటనిషేధింపఁబడినందున కర్మశ్రేయస్సునందు మూఢులైయనన్యగతికులగు వారలకు శ్రేయస్సుగలుగుటకుకృపచే భారతాఖ్యానమును మునిరచించెననియున్నది. మరియుభవిష్యపురాణ వచనము, "చతుర్ణామపివర్ణానాం యాని ప్రోక్తాని శ్రేయసే । ధర్మశాస్త్రాణి రాజేంద్ర శృణుతాని నృపోత్తమ । విశేషతస్తు శూద్రాణాంపావనాని మనీషిభిః । అష్టాదశపురాణాని చరితం రాఘవస్యచ॥" అనియనగానోరాజేంద్రుఁడ నాల్గు వర్ణములవారికి శ్రేయస్సు గల్గుటకు ధర్మశాస్త్రములువిద్వాంసులచే జేయబడినవియందు శూద్రులకుమిక్కిలి పావనములైనవి-అవియేవనిన - పదునెనిమిది పురాణములును రామాయణముననియర్థము- మరియువాయవీయమందు "ఏతాని నృపశార్దూల ధర్మశాస్త్రాణిపండితైః।సాధారణాని ప్రోక్తాని వర్ణానాం శ్రేయసేసదా।చతుర్ణామిహ రాజేంద్ర శ్రోతుమర్హాణి సువ్రత॥"అని,యనగానో సువ్రతుఁడవైన రాజశ్రేష్ఠుఁడా యీధర్మశాస్త్రము లన్నియు సర్వసాధారణములై శ్రేయస్సుగలుగ జేయుననిపండితులచే జెప్పబడినవిగనుక నన్నివర్ణముల వారువినవచ్చుననియర్థము-అట్లుస్కాందసంహితయందు "అన్యేచ బ్రాహ్మణావిష్ణోరాజానశ్చతథైవచ। వైశ్యాశ్చతారతమ్యేనజ్ఞానాభ్యాసేధికారిణః । ద్విజస్త్రీణామపిశ్రోతజ్ఞానాభ్యాసేధికారితా । అస్తిశూద్రస్య శుశ్రూషా పురాణైనైవ వేదనం । పఠంతికేచిద్విద్వాంస స్త్రీణాంశూద్రసమానతాం॥" అనియనగానోవిష్ణువాయితరమైన బ్రాహ్మణులు రాజులువైశ్యులుగూడ తారతమ్యముచే ననగను లాచారయోగ్యత ననుసరించిజ్ఞానాభ్యాస మందధికారులగుదురు. ద్విజస్త్రీలుసహితమువైదికకర్మలయొక్క జ్ఞానాభ్యాసముచేయవచ్చును, ఇకశూద్రునకు ద్విజ శుశ్రూషయుపురాణమువినుటచేజ్ఞానాభ్యాసముగావచ్చును. కొందరుద్విజస్త్రీలకును శూద్రునికివలెనే జ్ఞానాభ్యాసమనిరి, అనియున్నది, అట్లనే "సిద్ధాంతశ్రవణం ప్రాహుర్ద్విజానాం మునిసత్తమాః । శూద్రాణాంచ విరక్తానాం తథా స్త్రీణాంమహామునే । సిద్ధాంతశ్రవణం ప్రోక్తంపురాణ శ్రవణంబుధైః॥" అనియున్నదియనగా ద్విజులకునువిరక్తులైన శూద్రులకును నట్టిస్త్రీలకును బురాణమువినుటచే సిద్ధాంతమనగ స్మృత్యర్థమంతయు దెలియవచ్చునని

మునిశ్రేష్ఠులంద్రు- అనియర్థము- ఇట్లు రామాయణమందును "పఠన్ద్విజో వా
గృషభత్వ మీయాత్స్యాత్క్షత్రియో భూమిపతిత్వమీయాత్ । వణిగ్జనః పణ్యఫ
లత్వమీయాజ్జనశ్చ శూద్రోపి మహత్త్వమీయాత్॥" అనియున్నది యనగా నీరా
మాయణమును బఠించి బ్రాహ్మణుఁడు వక్తలలో శ్రేష్ఠుఁడగును క్షత్రియుఁడు భూ
పతియగును వైశ్యుఁడు పణ్యఫలమునొందును శూద్రుఁడుదీనివిని శ్రేష్ఠత్వమునొందు
నని, ఇక్కడ పఠన్ అని యనువర్తించినను ప్రమాణాంతరమును బట్టి వినుచు నని
యర్థమును వ్యాఖ్యాతలుచెప్పిరి కొన్నిటిలో "శృణ్వంశ్చ శూద్రోపి" యనిపాఠమే
యున్నది - అట్లు వినుటయును బ్రాహ్మణద్వారముగ గావలెను - అట్లు భవి
ష్య పురాణమునందున్నది ॥ "దేవార్చాంపురతఃకృత్వా బ్రాహ్మణాంశ్చ నృపో
త్తమ । శ్రోతవ్య మేవశూద్రేణ తథావైశ్యైశ్చద్విజాతిభిః" అనియనగా దేవతా
ప్రతిమను బ్రాహ్మణులను ముందర నుంచుకొని శూద్రుఁడును నితరద్విజులును బు
రాణము వినవలెను. ఇట్లు పురాణశ్రవణము విధించుటనుండి యేతదంతర్గ
తమైన వైదికమంత్రములు వినినను దోషములేదు - అట్లువార్తికమందు జెప్ప
బడినది - "తానేవవైదికాన్మంత్రాన్ భారతాదినివేశితాన్ । విహాయమంత్ర ని
యమం లోకబుద్ధ్యా ప్రయుంజతే ॥" యని - అనగా భారతాదులందు ను
దాహరించిన యా వేదమంత్రములనే స్వరాదిమంత్ర నియమములక్కరలేక లౌకిక
వాక్యములను బుద్ధిచే నుచ్చరింపవచ్చును విననువచ్చుననుట- మరియేమని వేదోక్త
ముగానిచో నదృష్టమును పుట్టింపలేదు గనుక బురాణోక్తమైన స్తోత్రపాఠా
దులును వేదమందొక్కచోనున్నదేయనికల్పించఁబడును. అయినను వచనమున్నం
దున దోషములేదు - అనిత్యమైనను ప్రవాహము నాదిగ నంగీకరించుటచేఁ గల్ప
సూత్రాదికమువలె నిత్యత్వవిధిలో విషయముగావచ్చును - ఇకశంఖుఁడను ఋషి
విద్యాస్థానములఁజెప్పి "ఏతాని బ్రాహ్మణోధికురుతే సచవృత్తిందర్శయతీతరేషా" మ
ని బహువచనముచే విప్రద్వారముగ జ్ఞానోపదేశము శూద్రునకుగావచ్చునని చె
ప్పెను - అదియును శ్రవణపరమేయని తెలియవలెను ఇక్కడశూద్రులకు విధిం
పఁబడినవియు నిషేధింపఁ బడినవియు నగు ధర్మములు శూద్రసములైన య
నుపనీతద్విజులకు స్త్రీలకు షండులకు కుండగోళకులకును సంకర జాతులకు
ను గూడనగునని తెలియునది - వారిలక్షణము ముందు చెప్పఁబడును - కాబట్టి
శూద్రునకు విప్రద్వారముగ బురాణశ్రవణముచే జ్ఞానాధికారమని సిద్ధించినది.

ఇకశూద్రునికి మంత్రవిచారము - అందువిద్యాహీనుఁ డగుటచే వేదమంత్రములం
దధికారములేదు- అట్లువ్యాసవచనము - "శూద్రోవర్ణశ్చతుర్థోపివర్ణత్వాద్ధ
ర్మ మర్హతి । వేదమంత్రస్వధాస్వాహా వషట్కారాదిభిర్వినా॥" అని,అన
గా చతుర్థుఁడైన శూద్రుడును నొకవర్ణ మగుటచే ధర్మమాచరించుట క
ర్హుఁడుగాని వేదమంత్రములు స్వధాస్వాహావషట్ అనుశబ్దములు నుచ్చరింపక
చేయవలె ననుట - అట్లునృసింహతాపినీయోపనిషత్తు నందును - "సావిత్రీంప్ర
ణవంయజుర్లక్ష్మీంస్త్రీశూద్రాయ నేచ్ఛతి" అనియున్నది అనగాసవిత్రృ గాయ
త్రీమంత్రము నోంకారమును యజుస్సులక్ష్మీ బీజము స్త్రీ శూద్రుల కంగీకరింప
దనుట-యిట్లుపరాశరభాష్యమందు నున్నది - అట్లురామతాపినీయమందును-"సా
విత్రీంలక్ష్మీంయజుః ప్రణవంయ దిజానీయాత్ స్త్రీశూద్రస్సమృతో ధోగచ్ఛతి" అ
నియున్నది యనగా మీదజెప్పినసావిత్రీ ప్రణవయజుస్సులనులక్ష్మీబీజమనగశ్రీం అ
నునదియు విధిపూర్వముగ స్త్రీశూద్రులు గ్రహించినచో మరణానంతరమధోగ
తియగుననుట - మరియు "వ్యాహరణె జిహ్వాచ్ఛేదః"అనిశ్రుతియునున్నది - అన
గానట్టివేదమంత్రములుచ్చరించినచో శూద్రునకు జిహ్వాచ్ఛేదము ప్రాయశ్చిత్తమ
నుట - తిథితత్వమను గౌడనిబంధనమందుస్కాందవచనము- "స్వాహాప్రణవ సం
యుక్తంశూద్రే మంత్రందదద్ద్విజః । శూద్రోనిరయమాప్నోతి బ్రాహ్మణ శ్శూ
ద్రతామియాత్॥" అని అనగాస్వాహాకారముతోగానియోంకారముతోగానిమం
త్రమును శూద్రున కుపదేశించెనేని ద్విజుడు శూద్రత్వమొందును శూద్రుడునన
రకము నొందుననుట - ఇట్లుపురాణము విష్ణుసహస్ర నామము చండీస్తోత్రము
మొదలగునవి పఠించుట కధికారములేదు. ఏమనిన శ్రవణమాత్రమం దధికారము
చే పాఠమునకుఁ బ్రసక్తియేలేదు - కనుకనే హరివంశమందు "సుగతిమియాచ్ఛ్ర
వణాచ్ఛూద్రజాతిః"అనిచెప్పబడినది - అనగా శూద్రుఁడు వినుటచేతనే సద్గతి
నొందుననుట - కనుకనేభారతమందు విష్ణుసహస్ర నామములలో " వేదాంత
గోబ్రాహ్మణస్స్యాత్ క్షత్రియోవిజయీభవేత్। వైశ్యోధనసమృద్ధస్స్యాచ్ఛూద్ర
స్సుఖమవాప్నుయాత్"అను శ్లోకమునందుశూద్రుడుశ్రవణముచేతనే సుఖమునొం
దునని శంకరాచార్యులవారి వ్యాఖ్యానమున్నది- ఇకననేకములువ్రాయనేల శూ
ద్రుడు చేయు స్నానదాన శ్రాద్ధాదులందు సహితము పురాణ మంత్రముల
ను విప్రుడే పఠింపవలెను శూద్రుడు వినవచ్చునుగాని పఠింపగూడదు ." శ్రావ

యేచ్చతురో వర్ణాః" అనువిధి "నిషాదస్థపతింయాజయేత్" అనునది వలెశ్శృణు
యః అనివిపరిణామము నొందుటచే శూద్రునికి శ్రవణమువల్ల గల్గిన జ్ఞానమే
కర్మలకు పయోగించును - మరియును పురాణపఠనమం దధికారము లేనందున
పౌరాణమంత్రములు పఠించుటకు బ్రసక్తియే లేదు - అట్లువారాహమందును
"అయమేవవిధిః ప్రోక్తశ్శూద్రాణాంమంత్ర వర్జితః। అమంత్రస్యతుశూద్రస్య
విప్రోమంత్రేణగృహ్యతే॥" అనియున్నది - అనగా నీవిధానమేశూద్రులకువేద
మంత్రములుచ్చరింపకుండగ విధింపబడినది శూద్రునికి మంత్రపాఠములేదు గను
క బ్రాహ్మణుఁడు మంత్రముచే గ్రహింపబడును అనగావిప్రుడు పౌరాణమంత్ర
ములుపఠింపుచుండగ శూద్రుడు యథావిధిగకర్మజేయవచ్చుననుట-ఇట్టీ వచనము
శ్రాద్ధప్రకరణమందు బఠింప బడినప్పటికిని బరిభాషయనగ సంక్షేపరూపమైయ
న్ని కర్మలకు నుపయోగించును. ఇదివాక్యరూపము గనుక దుర్బలమైన ప్రకరణ
ముచే బాధింప బడనేరదు కనుక శూద్రుడుచేయుదానములు శ్రాద్ధములు మొద
లగువాని యందంతటను నర్థము గనుపించుటకు విప్రునిచే మంత్రపాఠమావశ్య
కమనిశూలపాణి చెప్పెను - ఇకవైదికమంత్రము కూడవిప్రునిచేబఠింపించవచ్చు
నని యాచార్యచూడామణి చెప్పును మాధవీయమందు నిట్లనేయున్నది - శ్రాద్ధ
మందేశాఖలో విప్రునికి మంత్రపాఠము చెప్పబడునో యవిశూద్రుని శ్రాద్ధ
మునందును గావచ్చునని స్మృతికౌముది చెప్పుచున్నది అను మదనపారి జాత
వ్యాఖ్యాన మసంగతము వచనములో శూద్రుని కమంత్రస్యయని విశేషణ ము
న్నందున మంత్రప్రసక్తియేలేదు ఇట్లనే స్త్రీలకును దత్తుల్యులకు నగునని శూల
పాణిచెప్పెను - మరియేమనిన మంత్రజన్య నియమముచే నదృష్ట మెట్లు సిద్ధించు
నని శంకించుకొని "అనుమతోస్యనమస్కారో మంత్రః" అని గౌతమవచన మున్నం
దున నమస్కారముచేతనే సిద్ధించునని యతడే చెప్పెనుగాని యది యుక్తము
గాదు, ఏమనిన దృష్టద్వారముగగదా యదృష్టము సిద్ధించును స్వతంత్రముగ నె
ట్లుసిద్ధించును మంత్రమే నిషేధించినచోనియ మాదృష్ట ప్రాప్తి గా నేరదు న
మస్కారముచేతనే సిద్ధించుననుట కదిమంత్రముగాదుగదా - అట్లుగాకున్నను
సిద్ధించుననిరేని వ్రీహులను గోళ్లచే నొల్చినను నవహనన విధిచే గల్గు నదృష్ట
ము సిద్ధించుటకు నమస్కారముగూడ జేయబడవచ్చును - గనుకమంత్రములేక
నమస్కరించుటమాత్రమున నదృష్టము సిద్ధించుననుట యసంగతము- ఇకగల్పతరు

కారుడైనచో పౌరాణకర్మలు స్త్రీశూద్రులకు బ్రత్యేకముగ విధింపబడియున్న వి గనుక మంత్రవిశిష్టములై పుట్టుటచే నట్లనే వినియోగించును కాబట్టి పురాణ మంత్రపాఠముగానే వచ్చునని చెప్పెను గాని నమస్కార విధిచే బాధ గల్గుట నుండియు వారాహవచన విరోధమునుండియు నట్లనగూడదు వైదికమంత్రస్థాన మందు బ్రతినిధిగానమశ్శబ్దము నుచ్చరింపవలెనని కొందరంద్రు ఇకయథార్థము ను విచారించినచో మంత్రహీన స్థలమందే నమశ్శబ్దము గనుక "పితౄణాం నామగోత్రతః" అనిమొదలగు స్థలమందు ద్విజులకుగూడ మంత్రము విధింపనిచోట శూద్రునకు సర్వమంత్ర నిషేధము బ్రాప్తింపుచుండగ ప్రతిప్రసవమనగ బాధక ము బోగొట్టుటకు మాత్రమె గౌతమీయ వచనముగా వచ్చును అంతమాత్రముచే దిలావాపము మొదలగువానికదియె యనగూడదు - మరియుగొందరు "ఆవా హనాది కర్తవ్యం యథాశూద్రేణ తచ్ఛృణు । దేవానాం దేవనామ్నాతు పితౄణాం నామగోత్రతః ॥" అని భవిష్యపురాణ వచనము హేమాద్రిలో నున్నది అనగా శూద్రుడు శ్రాద్ధమంచావాహనాదిక మెట్లుచేయవలెనని దేవక ర్మయందు దేవనామముచేతను పితృకర్మయందు నామగోత్ర ముచ్చరించియు నని యున్నందున దైవకర్మమందు దేవేభ్యోనమయనియు బితృకర్మయందు పి తృభ్యోనమయనియు నామమంత్రము జెప్పుదురు, అనగా గేవలనామము బ్రయో గింప వలనుగాదు గనుక నమశ్శబ్దాంతముగ నుచ్చరించిరి కాబట్టి నమఃఅను నంతమాత్రమె మంత్రమని యాచార్యచూడామణి మదనపారిజాతాదులు చెప్ప ట బ్రత్యాఖ్యాతమాయెను. ఇకహారదత్తాదులు నమస్కారము పంచమహాయ జ్ఞములను గురిచి విధింపబడినదంద్రు, అదిసరిగాదు అట్లైనచోశ్రాద్ధాదులం దు నమోవిధానమునకు మూలాంతరము గల్పింప వలసివచ్చును గనుక సర్వా ర్థ మనకతప్పదు. కనుకనే విజ్ఞానేశ్వరునిచే గృచ్ఛ్రాదివ్రతమందు నమోమం త్రజపమువిధింపబడినది. మాపితృచరణులైనచో "నమస్కారేణ మంత్రేణ పం చయజ్ఞాన్న హాపయేత్"అను యాజ్ఞవల్క్యవచనమందు యజ్ఞశబ్దముచే శూద్ర కర్మల నన్నిటి నుద్దేశించి నమస్కారము విధింప బడినది ఉద్దేశ్యములైన య జ్ఞములకు పంచత్వముగూడ విధించినచో వాక్యభేదదోషము గ్రహైకత్వ వివక్ష యందు వలె సంభవించును ; కనుకనె శూద్రుడుచేయుతులాదానాది పూర్త కర్మలందు నమస్కారమె శూద్రునికి మంత్రమనిరి. పౌరాణమంత్రము విప్రుని

కిగావచ్చును గనుక దాని విరోధములేదు - కనుక నమస్కారము పంచయజ్ఞ
ములందె విధింపబడినందున శూద్రునికి వివాహ హోమాదికము లేదని మదన
పారిజాతమందు జెప్పుట పరాస్తమైనది - కనుకనే "యోనమసాస్వధ్వరః" అను
శ్రుతినుండియు "నమస్కారేణ వై ఖల్వపినే వేదేవానమస్కారమితి యజ్ఞోవైనమ
ఇతి చ బ్రాహ్మణంభవతి" యని యాశ్వలాయన ఋషిచెప్పుటనుండియునమస్కా
రము గూడ సర్వకర్మల కంగమగును అదియు ద్విజులకాయాకర్మలందు వైది
క మంత్రములు విధించుటచే నెట్లు బాధింపబడునో మంత్రము జెప్పని చైత్యయ
జ్ఞాదిక మందెట్లు ప్రవర్తించునో యట్లనే శూద్రునికిని కర్మను జెప్పి మంత్రము
జెప్పనిచో నమస్కారమె ప్రవర్తించును - కనుకనె శూద్రునికి కాతీయసూత్ర
మందు జెప్పిన వెనిమిది సంస్కారములును వివాహమును హరిహరునిచే జెప్ప
బడినవి- కనుకనే "అనుమతోస్య నమస్కారోమంత్రః" అనుగౌతమీయ వచనము
శూద్రుని యందుగూడ బ్రతిప్రసవమైనది - అదియాచరించుకర్మను ప్రకాశిం
పకుండినను వచనమున్నందున "నయథార్థమైంద్రీస్యాత్" అనున్యాయముచే నం
గముగా వచ్చును- ఇట్లుసిద్ధించుటచే "దేవతాభ్యః పితృభ్యశ్చ" యనునదివైనను
నమస్కారమంత్రముగా వచ్చునని విజ్ఞానేశ్వర మదన పారిజాతాదులు చెప్పుట
యప్రామాణిక మగుటచే నిరస్తమైనది - ఇచ్చట గొందరు చెప్పుదురు- "విప్రో
మంత్రేణ గృహ్యతే" యనునపుడు వైదికమంత్రము విప్రునికగు పౌరాణమంత్రము
శూద్రునిచే బఠింపదగినది- అట్లు వచనమున॥ "నవేదేష్వధికారోహికశ్చిచ్ఛూద్ర
స్య విద్యతె । పురాణేష్వధి కారోమే దర్శితో బ్రాహ్మణైరిహ" ॥ అనిశూల
పాణిగ్రంథమందు పాద్మవచనము - అనగాశూద్రునకు వేదమువిషయమై యే
విధమైన యధికారములేదు మరియేమనిన బురాణముల యందు మాత్రమెయధి
కారము బ్రాహ్మణులచే నిర్ణయింపబడినదనుట - శ్రీదత్తుడుగూడనిట్లనేచెప్పె
ను - తిథితత్వమందు స్మార్తవచనము వైదికేతరమైన మంత్రముల బఠించుటకు
శూద్రునికిగూడ నధికారమున్నది- ఏమనిన "వేదమంత్ర వర్జం శూద్రస్య" యని
యాచారచింతామణియందును ఛందోగాహ్నికమందును జెప్పబడి యున్నదివేద
మంత్ర వర్జమను నపుడు వేదశబ్దము నుచ్చరించినందున "శ్రోతవ్యమేవ శూద్రేణనా
ధ్యేతవ్యంకదాచన" యను పురాణనిషేధము మంత్రము తప్పదక్కిన పురాణభాగ
మునకని తెలియవచ్చుచున్నది - పంచయజ్ఞములందును స్నానమందును శ్రాద్ధ

మంత్రమును నైనచో పౌరాణమంత్రముగూడలేదు - ఏమనిన "నమస్కారేణ మంత్రేణ"యని పంచయజ్ఞములందుయాజ్ఞవల్క్య వచనమును"బ్రహ్మక్షత్రవిశాంత్వేవంమంత్రవత్స్నాన మిష్యతే । తూష్ణీమేవహి శూద్రస్య సనమస్కారకంమతం॥" అని అనగా బ్రహ్మక్షత్రవైశ్యులకు మాత్రమె మంత్రయుక్తమైన స్నానమువిధింపబడినది శూద్రునికైనచో నూరకయే నమస్కారయుక్తముగ స్నానమువిధింపబడినదని స్నానమందున యోగి యాజ్ఞవల్క్య వచనమును॥ "అయమేవవిధిఃప్రోక్తశ్శూద్రాణాం మంత్రవర్జితః॥" అనిశ్రాద్ధమందు వారాహావచనమును మంత్రమక్కరలేదని చెప్పుచున్నవని యుదాహరించెను - మరియు "అనుమతోస్య నమస్కారోమంత్రః"అనుగౌతమవచనము గూడ పంచయజ్ఞాది తాత్పర్యముచే నైనను వైదికమంత్రపరమైనను గావచ్చునని చెప్పెను అదియప్రామాణికము ఏమనిన " నాధ్యేతవ్యమిదం శాస్త్రం వృషలస్యతు సన్నిధౌ " అనికౌర్మవచనముచే ననగా నీపురాణము శూద్రుని సన్నిధియందు బఠింపగూడదనిపురాణమునకే నిషేధమున్నపుడు వేదమునకు నిషేధము చెప్పనక్కరలేకుండ గనే సిద్ధించును - మరియును "అధ్యేతవ్యం బ్రాహ్మణేన వైశ్యేన క్షత్రియేణచ। శ్రోతవ్యమేవ శూద్రేణ నాధ్యేతవ్యంకదాచన । శ్రౌతంస్మార్తంచవై ధర్మం ప్రోక్తమస్మిన్ నృపోత్తమ । తస్మాచ్ఛూద్రైర్వినా విప్రం నశ్రోతవ్యం కదాచన"॥ యని శూలపాణి గ్రంథమందు బురాణాధికారములో భవిష్య వచనముదాహరింపబడినది - అనగా బ్రహ్మక్షత్రవైశ్యు లధ్యయనము చేయ వచ్చును శూద్రుడు వినవలెనే గాని చదువ గూడదు ఏమనిన శ్రౌతస్మార్త ధర్మములు యావత్తునిందు నిరూపింపబడినవి కనుకవిప్రునిముందరనుంచుకొనక వినుసుగూడదనియర్థము - కనుకనే "విప్రోమంత్రేణగృహ్యతే" యనునది సర్వకర్మలకు గానిశ్రాద్ధమునకే గాదని శూలపాణి యందున్నది - ఇట్లునిషేధము సిద్ధించుటచే "నాధ్యేతవ్యంకదాచన"యనునది మంత్రము తప్పదక్కిన పురాణభాగమునకనిశ్రీదత్తుడు మొదలగు మైథిలులమతము పోయినది - "వినావిప్రం నశ్రోతవ్య"మనుటచే పురాణము వినుటయు విప్రునిద్వారముగ గావలెనని విధింపబడినది - తక్కినవిశేషము నిర్ణయసింధువునందు దెలియునది - మరియును ద్విజుల కధ్యయనవిధిలో జదివిన మంత్రములచేతనే యర్థస్మృతి దెచ్చుకొనవలె గనుక కర్మలందుమంత్రపాఠమేయంగ మగునుగాని స్మృతిమాత్రము గాదు మంత్రము

లు క్రియాశూన్యము లనగాచలింపలేవు గనుక స్వయముగా కర్మలతో సంబం
ధించ నేరవు- అట్లనేశూద్రులకు "శ్రావయేచ్చతురోవర్ణాన్" అను శ్రవణవి
ధిలో శ్రుతములైన విధులచేతనే ప్రవృత్తినిజేయవలెను శ్రుతములైన మంత్ర
ముల చేతనే యర్థస్మృతిని దెచ్చుకొనవలెనని యర్థమగుటచే శూద్రునికి
తులాదానాది కర్మలలో మంత్ర శ్రవణమేయంగ మగును గాని పాఠముగా
నేరదు- అట్లైనచో "శ్రావయేచ్చతురో వర్ణాన్" అనువిధియున్నందునద్విజు
లకు గూడతులాదానాదిక మందు మంత్రశ్రవణమె గావలెను గాని మంత్ర పాఠ
ము గూడదని ప్రాప్తించు ననిన జెప్పెదము॥ "అధ్యేతవ్యం బ్రాహ్మణేన వైశ్యే
న క్షత్రియేణచ॥" యనిభవిష్యవచనముచే నధ్యయనమే విధింప బడినది - మరి
యు "నిషేకాదిశ్మశానాంతః" అనిమొదలగు వచనముచేనధ్యయనమునకే కర్మాం
గత్వము మరియును "విదుషాబ్రాహ్మణే నేదమధ్యేతవ్యంప్రయత్నతః" అని మ
నువచనము వలన బ్రాహ్మణుని కధ్యయన మావశ్యకము- అట్లుగానిచో "వేదా
థర్వపురాణాని సేతిహాసాని శక్తితః । జపయజ్ఞ ప్రసిద్ధ్యర్థం విద్యాం చా
ధ్యాత్మికీంజపేత్॥" అని యనగా వేదములు నథర్వవేదము పురాణములు నితి
హాసములును బ్రహ్మయజ్ఞపూర్తికై యాధ్యాత్మవిద్యయు జపింపవలె ననియు
"గాథానారాశగ్‌సీరితిహాస పురాణాని యద్బ్రాహ్మణానీతిహాసాన్ పురాణా
ని కల్పాన్ గాథానారాశగ్ంసీః" అనియుబ్రహ్మయజ్ఞమందు విధించుటవ్యర్థమేయ
గును - మరియును "పురాణన్యాయమీమాంసాధర్మ శాస్త్రాంగ మిశ్రితాః।
వేదాస్థానాని విద్యానాం ధర్మస్యచ చతుర్దశ॥" యనియనగా బురాణము
లు న్యాయశాస్త్రము మీమాంసాశాస్త్రములు ధర్మశాస్త్రములు నంగములన
గ శిక్షవ్యాకరణము ఛందస్సునిరుక్తము జ్యోతిషము కల్పమునను నారును నాల్గు
వేదములు నను నీపదునాల్గునుధర్మము దెలియుటకు స్థానములని యాజ్ఞవల్క్య
యవచనముచే జ్ఞానార్థమై గూడ నధ్యయనము విధింప బడినది - ఇక శ్రవణ
ము గూడ ఫలవిశేషమునకై విధింపబడినది "య ఇదంశృణుయాన్నిత్యం యశ్చా
పి పరికీర్తయేత్ । నాశుభం ప్రాప్నుయాత్కించి త్సోముత్రేహచమానవః॥"
అని అనగా దీని నిత్యము వినువాడును బఠించువాడును నుభయలోకము లందున
మంగలము నెపుడు బొందడనియు చండీపాఠాదిక మంచును ఫలము చెప్పబడి
యున్నది - మరియు యాజ్ఞవల్క్య వచనము "యఇదం శ్రావయేద్విద్వాన్ ద్వి

జాః పర్వసు పర్వసు । అశ్వమేధఫలం తస్య తద్భవానను మన్యతాం॥" అని అనగా పర్వములందు దీని ద్విజులకు వినుపించు వాడు అశ్వమేధముజేసిన ఫలము నొందవలెనని నీవు తలంపవలెననుట - కాబట్టిద్విజులకు స్వాధ్యాయవిధిజ్ఞాన ద్వారముగ గమార్థ మయినను పారాయణాదులకై యక్షర గ్రహణార్థమగుటనుండియు నదృష్టార్థమగును సిద్ధాంతమంద్దైనను నక్షరగ్రహణ మున కు భావనావిషయత్వము విశువబడదుగదా కనుకనె న్యాయరత్నమాలయందు "న కేవలార్థవిజ్ఞానసిద్ధి రస్యప్రయోజనం । దృష్టార్థం దృశ్యతే యద్యత్తత్స ర్వం ఫల మిష్యతే॥" యనిస్పష్టముగ పారాయణాదులకై యక్షర గ్రహణార్థ త్వముగూడ జెప్పబడినది - అట్లనె పురాణాదుల కధ్యయనము శ్రవణము గూ డ విధింపబడినను నధ్యయనము జ్ఞానద్వారముగ గమార్థమగుటచే దృష్టార్థ ము శ్రవణమైనచో నదృష్టార్థమగును శూద్రులకైనచో నిది విపరీతము అనగా శ్రవణమే జ్ఞానద్వారమున గమార్థమగుటచే దృష్టార్థము ఫలసాధక మగు టచే నదృష్టార్థమునగుననుట. అధ్యయనము శూద్రునికి నిషిద్ధమే గనుక లేదు - అట్లు వచనము॥ "శ్రోతవ్యమేవ శూద్రేణ నాధ్యేతవ్యంకదాచన॥" యని-మరియే మనిన వార్తికమందును రాణకమందును "ధర్మేచార్థేచకామేచ మోక్షేచభ రతర్షభ॥" యనుభారత వచనము చేత ధర్మాధికము యొక్క స్వీకారము నకు చకారములచే నధర్మాదుల యొక్క పరిహారమునకు సంగమైన జ్ఞాన మేఫలము గనుక దృష్టార్థమే శ్రవణమని యున్నది అయిననది శూద్ర మా త్ర విషయమని తెలియునది ద్విజులకైన చో పాఠమేజ్ఞానార్థ మగును - లే దా వినిగమకము లేనందున ద్విజులకుగూడ శ్రవణము దృష్టార్థముగా వచ్చు ను అయినను మొదట వ్రాసిన "అధ్యేతవ్యం బ్రాహ్మణేన" య నుభవిష్య వచనము చేతనే ద్విజులకు మంత్రపాఠము సిద్ధించును - అట్లుగాక "శ్రావయేత్" అను వి ధిశూద్రమాత్ర విషయమె యనినయెడ శూద్రునకు మోక్షాధికార ముత్తరమీ మాంసయందు నిషేధింప బడినందున॥ "మోక్షేచ" యనుభారతవచనము విరో ధించును - ఇట్లే గ్రంథకర్త వ్రాసెనుగాని యుత్తరమీమాంసలో "వేద పూ ర్వస్తునాస్త్యధికారః" అని స్మృతి పురాణాది ద్వారముగ శూద్రునకును బ్రహ్మ విద్యాధికారము చెప్పబడినది. ఇక మొదటిపక్షముచే శ్రవణవిధిశూద్రునకు జ్ఞానా ర్థమగుటచేదృష్టార్థము గనుకనియమవిధియగును ద్విజులకు ఫలార్థము గనుక

నపూర్వ విధియగునని వైషమ్యము శంకింపఁగూడదు-అధ్యయన విధి యందువలె
యచ్ఛక్యతే యని యధ్యాహరించుటచే సర్వముగ్రహింపఁబడును - మఱియును
"సర్వత్రాపూర్వ విధిస్తత్వంఫలతోనియమా దివ్యపదేశః" అనివార్తికమందు
జెప్పినట్లనగా నంతట నపూర్వవిధియే యథార్థము ఫలమునుబట్టి నియమవిధిప
రిసంఖ్యావిధియని మొదలుగవ్యవహరించుట యని యున్నందున దోషములేదు-
కనుక నధ్యయన విధిస్థానాపన్నమైనందున శ్రవణవిధి యందుదాని న్యాయమం
తయు సంచరింపఁ జేయవలెను- ఈసంగతి యంతయు"ఏవంభారతాది వాక్యా
న్యపియోజ్యాని"యని మొదలగు గ్రంథముచే వార్తికమందును సూచింపఁబడినది-
గనుకనిట్లు నేనువ్రాసిన ప్రమాణతాత్పర్యమును విద్వాంసులు గాఢముగ నాలో
చింప వలెను - కాబట్టి శూద్రుడుచేయు పూర్తాది కర్మలందు బురాణము
లోనిమంత్రములనె విప్రుఁడుచ్చరింప వలెనుగాని వేదమంత్రము లుచ్చరింపఁ గూడ
దని సిద్ధించినది. ఇక శూద్రునికి గర్మాధికారము - అందుస్వర్గాదికామ శ్రు
తులు అధ్యయన విధిసిద్ధమైనవిద్యగల ద్విజుల నుద్దేశించియే వినియోగించుటచే వి
ద్యనుదోపించు నావశ్యకత లేనందున శూద్రునకట్టి విద్యలేనందున శ్రౌతకర్మ
లం దధికారములేదని యెట్లు చెప్పఁబడినదో యట్టిన్యాయముచేతనే స్మృతిపురా
ణములందు సిద్ధమైన గ్రహయజ్ఞ మహాదానపూర్తశ్రాద్ధాది విధులును ఫలకా
ముకులగుటను శ్రవణవిధిసిద్ధమైన విద్యగలవాడగుటను చతుర్వర్ణముల నుద్దేశిం
చియే కృతార్థములగునని చెప్పవలయును గనుక యాకర్మలందు శూద్రునకుఁ
గూడ నధికారము సిద్ధించును విధులకు విద్యాక్షేపము లేనందున మ్లేచ్ఛాదులకై
నచో నదిసిద్ధింపదు - అట్లైనచో స్మృతి పురాణములలోఁ జెప్పిన మహారుద్ర
లక్షహోమాదులందును శూద్రునకధికారముప్రాప్తించునని శంకింపఁ గూడదు.
ఆకర్మలకు వైదికమంత్రము లంగములగుటచే శూద్రునకు సర్వాంగోపసంహార
ము వలనుగాదు గనుక నందాదులకువలె వీనికి నధికారములేదు - సర్వాంగో
పసంహారము సంభవించినచోఁ బ్రధానవిధిప్రవర్తించును లేనియెడ లేదని పూ
ర్వ మీమాంసలోషాష్ఠమందు వర్ణింపఁబడినది - అట్లైనచో వైదికమంత్రము
లతోఁ గూడిన గృహ్యసూత్రోక్తమైన హోమమున కంగమగుకుశకండికనపేక్షిం
చు తులాదులందుశూద్రున కెట్లధికారమనిన వినుము న్యాయముచేతనధికారముని
షిద్ధమైనను గొన్నికర్మలందు బ్రతిప్రసవమనగానిషేధమునకుబాధకములై విశేషవ

చనము లున్నందున నిషాదస్థపతికినగా నధిపతియైన కిరాతునికి రౌద్రేష్టియందు వలె నధికారము రావచ్చును - ఇకగృహ్యోక్తమైన యంగజ్ఞానము లేనిచో మూడంశలనగా కర్మకరణేతికర్తవ్యతాంశలతో భావనదెలియనందునశూద్రు నకెట్లధికారమనిన "వేదానధీత్య వేదౌవా వేదం వాపియథాక్రమం" అనిస్మృతియు న్నందున నొక్క వేదముజదివిన పక్షమందు మరియొకవేదమందలి హోత్రము నౌ ద్గాత్రము మొదలగువానికివలె శ్రవణము నుపదేశము మొదలగు నుపాయముల చే వానిజ్ఞానము సంభవించును. లేదా, ఋత్విక్కు చేయుకర్మ గనుక తెలియవ లెనను నియమమక్కరలేదు - నియమము ప్రధానమాత్రమందె కావలెను - ఈ సంగతి సవిస్తరముగ దానకమలాకరమందు నిరూపింప బడినది ఇక్కడగూడ జెప్పబడును - ఇక వైదికమంత్ర మంగముగాని కర్మలం దైనచో వచనము లే కున్నను శూద్రుని కధికారమగును - ఏమనిన శ్రవణవిధిచేసిద్ధమైన విద్యగలుగు టనుండియు అనగా బురాణము వినుటచే నట్టికర్మజ్ఞానము గలిగి యదిచేయ వలెనని కోరిక గల్గి యున్నందున సిద్ధించును - అవియేవనిన వినాయక శాంతి మొదలగునవి- మరియును వికల్పముచే మరియొకమంత్రము విధించిన కర్మయం దునట్లనె సిద్ధించును ఎట్లనిన స్మృతిసంగ్రహమందు గ్రహయజ్ఞములో "నామమం త్రేణ శూద్రస్య కుర్యాద్ధో మాదికంబుధః ॥ " అనియనగా శూద్రుని గ్రహ యజ్ఞమందు నామమంత్రముచేతనే విప్రుడు హోమముచేయ వలెనని మం త్రాంతరము విధించినందున నధికారముసిద్ధించును అక్కడ వైకల్పికమంత్రము చేతనైనను సర్వాంగోప సంహారము సంభవించును - ఇట్లుసిద్ధించు నధికా రముగల కర్మలు వివేచన చేయబడును. అందు విహితము లెవ్వియనిన అగ స్త్యసంహిత యందువచనము "శుచిర్వ్రతతమాశ్శూద్రా ధార్మికాద్విజసేవ కాః। స్త్రియః పతివ్రతాశ్చాన్యే ప్రతిలోమానులోమజాః॥ లోకాశ్చాండాలపర్యం తం సర్వేప్యత్రాధికారిణః" అనిఅనగాద్విజశుశ్రూషచే శౌచాచారములునేర్చిధర్మ బుద్ధిగలశూద్రులును పతివ్రతలైనస్త్రీలునుమరియును బూర్వపూర్వవర్ణపురుషు లచేనుత్తరోత్తరవర్ణస్త్రీలయందు బుట్టినవారనులోమజులు విపరీతముగబుట్టువా రు ప్రతిలోమజులు అట్టి సంకరజాతులును చండాలుని పర్యంతమైన మనుష్యులం దరు నీరామమంత్రమం దధికారులని యర్థము - అట్లు విశేషవచన మక్కడనే యున్నది ఎట్లనిన "మంత్రోయ ముపదేష్టవ్యో బ్రాహ్మణాద్యనురూపతః । శ్రు

త్రిబ్రహ్మణేహ షడ్వర్ణం స్మృతి ర్వర్ణద్వయాత్మకం । షడ్వర్ణం బ్రాహ్మ ణాదీనాం త్రయాణాం యద్ద్వివర్ణకం । తదన్యేషాం దేశికేన వక్తవ్యం తార కంపరం॥" అనగా నీరామమంత్రమును బ్రాహ్మణాదివర్ణముల యోగ్యతనను సరించి యుపదేశించునది - ఎట్లనిన - ఆరక్షరములు గల మంత్రము బ్రహ్మ స్వరూపమైన శ్రుతిచేఁ జెప్పఁబడినది రెండక్షరములుగలది స్మృతిచేఁ జెప్పఁబడిన ది అందు మొదటిది బ్రాహ్మణుఁడు మొదలగు మూఁడువర్ణముల వారికి నుపదే శింప వలసినది. రెండవది తక్కినశూద్రుఁడు మొదలగుజాతుల కన్నిటికి నుపదేశిం పవచ్చును - మీఁదజెప్పిన రీతి నిట్లధికారము సిద్ధించినది యది సంసార బంధము తరింపఁజేయు శ్రేష్ఠసాధనమనుట. ఇట్లు బ్రహ్మోత్తరఖండమందును శివ పంచా క్షర మంత్రము నుద్దేశించి "మహాపాతక దావాగ్ని స్సోయంమంత్ర షడక్షరః। ప్రణవేన వినామంత్ర స్సోయంపంచాక్ష రోమతః । స్త్రీభి శ్శూద్రై శ్చ సంకీ ర్ణై ర్ధార్యతే ముక్తికాంక్షిభిః । నాస్యదీక్షా నహోమశ్చ నసంస్కారోన తర్పణం । నకాలనియమశ్చాత్ర జప్యస్సర్వై రయం మనుః॥" అని చెప్పఁబడిన ది అనగా నీమంత్రము ప్రణవముతోఁగలసి యారక్షరములు గలది యదిలేనిచోఁ బం చాక్షర మనఁబడును ఇది మహాపాతకములను దావాగ్నివలె దహించును దీనిశూ ద్రులు స్త్రీలు సంకరజాతులైనను మోక్షాభిలాషముచేత ధరింప వచ్చును దీనికి దీక్షగాని హోమముగాని సంస్కారముగాని తర్పణముగాని కాలనియమము గాని యక్కరలేదు అట్లందరు నీమంత్రము జపింప వచ్చునని యర్థము - దీ నియుపదేశ దీక్షయు నక్కడనే యొకరికిఁ జేసినట్లు చెప్పఁబడినది-ఎట్లనిన - "పు ణ్యతీర్థజలేస్నాతం రాజానం సముపోషితం । ప్రాఙ్ముఖం చోప విశ్యాగ్రేన త్వా శివపదాంబుజం । తన్మస్తకే కరంన్యస్య దదౌమంత్రం శివాత్మకం॥ "అని యనగా పుణ్యతీర్థమందు స్నానముజేసి యుపవసించి తూర్పుమొగమైగూర్చు న్న రాజునెదుటఁ గూర్చుండి యతని శిరస్సుపై దనహస్తముంచి శివుని పాదా రవిందములు ధ్యానించి నమస్కరించి శివస్వరూపమైన పంచాక్షరమంత్రము ను పదేశించె నని యర్థము - అనగా నట్లుపదేశింపవలెనని తాత్పర్యము- అట్లు స్మృతికౌముది యందు వారాహవచనము "బ్రాహ్మణక్షత్రియవిశాంపంచ రా త్రంవిధీయతే । శూద్రాదీనాంచ తచ్ఛ్రోత్రపదవీ ముపయాస్యతి॥" అనియనగా బ్రహ్మక్షత్రవైశ్యులకు పాంచరాత్రము విధింపఁబడినది శూద్రాదులుగూడ నది

వినవచ్చును ఇక్కడ గొందరు "శూద్రాదీనాంనతచ్ఛోత్రపదవీ"మనిపఠించిశూద్రునకధికారములేదంద్రు - అధికారమున్నందుననే ముందుచెప్పబడినది. "అథశూద్రస్యవక్ష్యామిగదతశ్శృణు మాధవి । దంపతీమమ భక్తౌచ మమకర్మపరాయణౌ । నమస్కార ప్రియోనిత్యం మమచింతావ్యవస్థితః । శుద్ధకర్మాణి వై దేవి యోనిత్యంతు సమాచరేత్ । త్యక్త్వా ఋషిసహస్రాణి శూద్రమేవతు యామ్యహం॥" అనియనగా ఇక శూద్రునకు దీక్ష జెప్పెదను, వినుమో పార్వతీ! భార్యయు దానును శూద్రుడు నాయందు భక్తిగలిగి నన్ను నుద్దేశించివ్రతములు చేయుచు నెల్లపుడు నన్నుధ్యానించి నమస్కరింపుచు శౌచాచారపరుఁడై యుండె నేని వేలకొలది ఋషులుకనిపెట్టుకొని యున్నను వారివిడిచి శూద్రునకే సాక్షాత్కరింతునని యర్థము - మరియు నచ్చటనే "చాతుర్వర్ణ్యస్యవక్ష్యామి దీక్షా మద్యయశస్విని॥" యని యనగ నాల్గువర్ణముల వారికి దీక్షను జెప్పెదనని యుపక్రమించి ద్విజులకు దీక్షనుజెప్పి "శూద్రస్యాపి ప్రవక్ష్యామి మద్భక్తస్యవరాంగనే॥" యని మొదలుగ శూద్రునకును దీక్ష చెప్పఁబడినది - ఇట్లు వామన పురాణమందును-"తతశ్చకార భగవాం శ్చాతుర్వర్ణ్యం హరార్చనే॥"అనియనగా భగవంతుఁడా పైని చతుర్వర్ణముల నీశ్వర పూజకై సృజించెనని చెప్పివసిష్ఠపుత్రుఁడగుశక్తికి నతనిశిష్యులకును శివదీక్షను జెప్పి యౌర్ణోదరుఁడను శూద్రునకు దీక్షను జెప్పి "ఏవం స భగవాన్ బ్రహ్మా పూజనాయ శివస్యతు - కృత్వాతు చాతురా శ్రమ్యం స్వమేవభవనంగతః॥" అనిచెప్పఁబడినది అనగానిట్లు భగవంతుఁడైన బ్రహ్మ శివపూజ నొనర్చుటకు నాలుగాశ్రమముల నిర్ణయించి తన గృహమునొందెనని యుపసంహారము చేయఁబడెననుట - ఇట్లు భవిష్యమందును "బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం కులీనం శూద్రమేవచ । పురుషంవాస్త్రియంవాపి దీక్షయే త్సూర్యమండలే॥" అనియున్నది అనగా బ్రహ్మక్షత్రవైశ్యులను గాని కులీనుఁడైన శూద్రుని గాని పురుషుని స్త్రీనిసహితము సూర్య మండలమందు దీక్షచేయింపవచ్చుననుట-కాబట్టి యిట్లు విశేషవచనముండు కర్మలందు శూద్రునికధికారమున్నది. స్మృతికౌముదిలో మాత్రము మీఁదఁజెప్పిన వారాహవచనముచే పాంచరాత్రమం దధికార మున్నందున వైష్ణవశైవ సౌరశాక్తవైనాయకమంత్రములందు నధికారము చెప్పఁబడినది. ఇట్లుమంత్రదీక్షముగిసెను. ఇకశూద్రుని దేవస్థాపనము - కల్పతరువులో దేవీ పురాణవచనము - "వ

ర్ణాశ్రమ విభేదేన దేవాస్థ్సాప్యాస్తు నాన్యథా। బ్రహ్మాతు బ్రాహ్మణైస్థ్సాప్యో గాయత్రీ సహితః ప్రభుః । చతుర్వర్ణై స్తథా విష్ణుః ప్రతిష్ఠాప్య స్సుఖార్థిభిః । భైరవోపి చతుర్వర్ణై రంత్యజానాంతథామతః । మాతరస్సర్వలోకైస్తు స్థాప్యాః పూజ్యాస్సురోత్తమాః । లింగంగృహీయతి ర్వాపి సంస్థాప్యతు యజేత్సదా॥" అనియనగా వర్ణాశ్రమ భేదము బట్టి యథాయోగ్యముగ దేవ ప్రతిష్ఠజేయవలెను - ఎట్లనిన గాయత్రీమూర్తితో బ్రహ్మమూర్తిని బ్రాహ్మణుఁడే స్థాపింపవలెను విష్ణుప్రతిమను నాల్గువర్ణములవారును సుఖముగోరి ప్రతిష్ఠింపవచ్చును - భైరవప్రతిమను నాల్గువర్ణములవారును జండాలులు సహితము స్థాపింపవచ్చును - సప్తమాతృకలమూర్తులు సర్వలోకులు బ్రతిష్ఠింపవచ్చును పూజింపనువచ్చును - బాణలింగమును గృహస్థుఁడు గానిసన్న్యాసిగాని స్థాపించి పూజింపవచ్చును - త్రిస్థలీసేతువునందు పితామహచరణులు దేవప్రతిష్ఠయందు శూద్రాదుల కధికారములేదు - అట్లువచనము. "స్త్రీణామనుపనీతానాం శూద్రాణాంచ నరేశ్వర । స్థాపనేనాధికారోస్తి విష్ణోర్వాశంకరస్య చ । యశ్శూద్ర స్సంస్కృతం లింగం విష్ణుంవాపి నమేన్నరః । ఇహ వాత్యంత దుఃఖాని పశ్యత్యాముష్మికే కిము । శూద్రోవానుపనీతోవాస్త్రీయోవాపతితోపివా । కేశవం వాశివం వాపి స్పృష్ట్వానరక మశ్నుతే ॥" అనియున్నది అనగా స్త్రీలు అనుపనీతులు శూద్రులు వీరికి విష్ణుస్థాపనమందు శివస్థాపనమందునధికారములేదు - కనుకశూద్రునిచే సంస్కరింపఁబడిన లింగమును గాని విష్ణువునుగాని నమస్కరించు వాఁడు ఇహలోకమందె యతిదుఃఖము లొందును పరలోకమందు జెప్పెడిదేమి - కనుక మీఁదఁజెప్పిన స్త్రీలుమొదలగుననధికారులు విష్ణువునుగాని శివునిగాని స్పృశించినచో నరకమునొందుదురనుట- యని బృహన్నారదీయమందు స్కాంద వచనమని చెప్పిరి గాని చతుర్వర్ణైః అనుమీదివచనముచే విష్ణ్వాది ప్రతిష్ఠయందు శూద్రునికి వికల్పమనిచెప్పుట యుక్తము - కనుకనే స్పర్శనేనాధికారోస్తియని కొన్నిటిలో పాఠాంతరమున్నది. ఇట్లుదేవస్థాపనము - ఇకశూద్రునికి దేవపూజ శివసర్వస్వమందు భవిష్యవచనము "యస్తుపూజయతేలింగం దేవాదిం మాంజగత్పతిం । బ్రాహ్మణః క్షత్రియో వైశ్యశ్శూద్రోవా మత్పరాయణః । తస్యప్రీతః ప్రదాస్యామి శుభాన్లోకా ననుత్తమాన్॥" అనియనగా దేవతల కాదియు జగదధిపతియునగు నన్ను లింగరూప

మునందు పూజించువాఁడు బ్రాహ్మణుఁడు క్షత్రియుఁడు వైశ్యుఁడు శూద్రుఁడైన ను వానికి నేను బ్రీతుఁడనై శుభమైన యుత్తమలోకముల నిచ్చెదనని యున్న ది. అట్లు గౌడతిథితత్త్వములో స్కాంద వచనము-"శూద్రః కర్మాణియోనిత్యం స్వీయానికురుతే ప్రియే । తస్యాహ మర్చాంగృహ్ణామి చంద్రఖండ విభూషితే" అనియనగా స్వకీయమైన కర్మలు శ్రద్ధతో నాచరించు శూద్రుఁడుచేయుపూజను స్వీకరింతునోచంద్రఖండ భూషణము ధరించుపార్వతి!యని యీశ్వరవచనము- ఇట్లులైంగమందును"అథరుద్రోమహాదేవో మండలస్థ ఉవాచహ । పూజ్యోహం బ్రాహ్మణానాంచ క్షత్రియాణాం విశేషతః । వైశ్యానాంచైవ శూద్రాణాం శుశ్రూష్యః పూజకస్యచ । స్త్రీణాంచైవాధికారో స్తి పూజాదిషునసంశయః" అని యున్నది అనగాననంతరమందు మహాదేవుఁడగు రుద్రుఁడు మండలమందుం డియె పలుకుచున్నాఁడు నేనుబ్రహ్మక్షత్ర వైశ్యశూద్రులచేఁబూజింపఁబడుదును సర్వకులచే నర్చింపఁబడెదను స్త్రీలకుఁగూడ నాపూజాదిక మందధికారముగ లదు సంశయములేదని - ఇట్లునృసింహపురాణమందును-"బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః స్త్రియశ్శూద్రాంత్య జాతయః । సంపూజ్యతంసురశ్రేష్ఠం నరసింహ వపుర్ధరం । ముచ్యంతేచాశుభైర్భావైః జన్మకోటి సముద్భవైః" అనియన గా బ్రాహ్మణక్షత్రవైశ్యశూద్రులు నంత్య జాతులును నరసింహాకారము ధరిం చిన దేవశ్రేష్ఠుఁడైన భగవంతుని బూజించి కోటిజన్మములచే నార్జించిన పా పములఁ బోఁగొట్టుకొని ముక్తులగుదురనుట- అపిపాలుఁడనుగ్రంథకర్తయుదా హరించిన యందలివచనము- "అయాచితప్రదాతాస్యాత్కృషింవృత్త్యర్థ మాశ్రయేత్ । పురాణంశృణుయాద్విప్రాన్నరసింహస్య పూజనం॥" అని య నగా శూద్రుఁడు యాచింపకుండ నిచ్చువాఁడుగావలెను జీవనమునకై వ్యవసా యము జేయునది విప్రుని వలనబురాణము వినవలెను నరసింహమూర్తిని బూ జింపవలెననుట-సూతసంహితయందును- పంచాక్షరమంత్రముచేఁ బూజనుజెప్పి "బ్రహ్మచారీగృహస్థోవావానప్రస్థశ్చసువ్రతాః।ఏవందినేదినేదేవంపూజయేదంబి కాపతిం । నమోంతేన శివేనైవస్త్రీణాంపూజావిధీయతే।విరక్తానాంచశూద్రా ణామేవంపూజాప్రకీర్తితా॥"అనియున్నదియనగా బ్రహ్మచారియు గృహస్థుడు వానప్రస్థుడు నిట్లుప్రతిదినమందును బరమేశ్వరుని బూజించునదిఇకస్త్రీలునువిర క్తులైనశూద్రులును నమశ్శబ్దాంతమైన శివమంత్రముచే నిట్లు పూజచేయవలయు

ననుటఅనగాబంచాక్షరమంత్రము శ్రుతిలోనమశ్శబ్దాదికమై చెప్పబడినను స్త్రీశూ ద్రులకుపదేశించునపుడు నమశ్శబ్దమునంత మందుంచవలెననుట-కొందరు మొదట నట్లుండగ నంతమందు మరియొకనమ శ్శబ్దమునుంచవలెనంద్రు । "అన్యేషామపి సర్వేషాంనరాణాం మునిసత్తమాః । పూజాదేవాలయందృష్ట్వా ప్రణామ స్తస్యకీర్తితః । ఏవంపూజా కృతాయేన సఫలంతస్యజీవితం॥" అనియున్నదియనగాఁ దక్షిణహీన జాతులందైన నరులకందరకును దేవాలయముగనుపించగానే నమస్కరించుటయె పూజయగునని యిట్లుపూజచేయు వారిజన్మము సఫలము-ఇకమనుస్మృతియందు నిషేధవచనము- "జప స్తప స్తీర్థ సేవా ప్రవ్రజ్యా మంత్రసాధనం । దేవతారాధనంచైవ స్త్రీశూద్రపతనానిషట్ " అనియున్నది అనగాజపము తపమనగ కృఛ్రచాంద్రాయణాదివ్రతములు తీర్థాటనముసన్న్యాసము మంత్రపురశ్చర్యయు దేవతారాధనము నీయారును స్త్రీశూద్రులాచ రించిరేనివారికి పతితత్వము నిచ్చునని దేవపూజకు నిషేధమున్నదిగాని యదివిధింపఁబడని పూజగూడదనిగాని స్పర్శయుక్త పూజకూడదనిగాని తాత్పర్యముచే జెప్పినదని తెలియవలెను - ఇట్లు స్త్రీశూద్రులకుఁ జెప్పిన యధికారము పురాణప్రసిద్ధమైన జీర్ణ లింగములపూజ విషయమై యని తెలియునది - కనుకత్రిస్థలీసేతువులో నుదాహరించిన నారదీయనిషేధవచనములు "యశ్శూద్రేణార్చితం లింగంవిష్ణుం వాప్రణమేన్నరః। నతస్యనిష్కృతిర్దృష్టా ప్రాయశ్చిత్తాయుతైరపి। నమేద్యశ్శూద్రసంస్పృష్టం శంకరంహరిమేవవా।ససర్వయాతనాభోగీయావదాచంద్రతారకం । పాఖండపూజితంలింగం నత్వాపా ఖండతాంవ్రజేత్ । ఆభీరపూజితంలింగంనత్వా నరకమశ్నుతె । యోషిద్భిఃపూజితంలింగంవిష్ణుం వాపి నమేత్తుయః । సకోటికులసంయుక్త ఆకల్పం రౌరవంవ్రజేత్॥ " అనిమొదలగునవి-అనగా శూద్రునిచే నర్చింపఁబడిన లింగమునుగానివిష్ణువునుగాని నమస్కరించినవానికి బదివేలప్రాయశ్చిత్తములచేనైన నిష్కృతిలేదనియు నాచంద్రతారకముగ నరకయాతనల ననుభవించుననియు పాఖండులనగ వేదబాహ్యులు పూజించులింగము నమస్కరించి పాషండత్వము నొందుననియు నాభీరులనగ గొల్లలు మొదలగుశూద్రజాతిభేదమువారిచేఁబూజింపఁబడు లింగము నమస్కరించి నరకమునొందుననియు స్త్రీలచేఁ బూజితమైన లింగమునమస్కరించిన గోటికులములతో రౌరవనరకమొందునని మొదలగు నిషేధములన్నియు నూతనస్థాపిత

లింగాది విషయములని తెలియునది - ఏమనిన నాగ్రంథమునందే "యదాప్రతి
ష్ఠితంలింగం మంత్రవిద్భిర్యథావిధి। తదాప్రభృతిశూద్రశ్చ యోషిద్వాపినసంస్పృ
శేత్" అనియున్నది - అనగామంత్రవేత్తలచే లింగముయథావిధిగఁబ్రతిష్ఠింపఁబ
డినది మొదలుగ స్త్రీలునుశూద్రులును దానిముట్టఁగూడదని స్పష్టముగ నూతన
స్థాపితలింగమునకే స్త్రీశూద్రస్పర్శనిషిద్ధమైనది. మరికొందరు చెప్పినదెట్లనినలింగ
మునమస్కరించువానికి దోషముండుగాక శూద్రుఁడు పూజించినచో ఫలముండ
నే యున్నది - ఇకనూతనలింగమునర్చామూర్తియు సాలగ్రామము మొదల
గువానియందుమాత్రము స్పృశింపకుండ శూద్రాదులును పూజింపవచ్చును -
స్పర్శమాత్రమునకు నిషేధమున్నది ఎట్లనిన- "శూద్రోవానుపనీతోవా స్త్రియో
వాపతితోపివా। కేశవంవా శివంవాపి స్పృష్ట్వానరక మశ్నుతే। బ్రాహ్మణ్యాపిహ
రం విష్ణుం నస్పృశేచ్ఛ్రేయ ఇచ్ఛతీ । యాతుపూజయతేలింగంవిష్ణుంవా శి
వమేవవా । సనాథామృతనాథావా తస్యానాస్తి హినిష్కృతిః । స్త్రీణామ
నుపనీతానాం శూద్రాణాంచ జనేశ్వర। స్పర్శనే నాధికారోస్తి విష్ణోర్వా
శంకరస్యచ॥" యని స్కాందవచనము ననగా శూద్రుఁడు నుపనయనము గాని
వాడును స్త్రీయు బతితుఁడును శివలింగముగానివిష్ణువునుగానిస్పృశించిరేని నర
కమగును బ్రాహ్మణస్త్రీ సహితము శ్రేయస్సును గోరెనేని వాని స్పృశింపగూ
డదు - అట్లు స్పృశించి పూజించెనేని సువాసినియైనను విధవయైనను నిష్కృ
తిలేనిపాపమునొందును - కనుక మీదఁజెప్పిన వారికి శివవిష్ణులయొక్కస్పర్శమం
దుమాత్ర మధికారములేదని యర్థము - గనుక స్పృశింపక పూజింప వచ్చును
గనుకనే "చత్వారోబ్రాహ్మణైః పూజ్యా స్త్రయోరాజన్యజాతిభిః । వైశ్యై
ర్ద్వావేవ సంపూజ్యౌ తథైక శ్శూద్రజాతిభిః ॥" అని స్కాందవచనము అనగా
బ్రాహ్మణులు సాలగ్రామములు నాల్గును క్షత్రియులు మూడునువైశ్యులు రెం
డును శూద్రులొకటియు బూజింపవలెనని యున్నది. ఇకవారాహమందైనచో
సాలగ్రామమునకే స్పర్శనిషేధముగాని ప్రతిమాదులకు లేదని యున్నది. ఎట్లని
న "సాలగ్రామం నస్పృశేత్తు హీనవర్ణో వసుంధరే । స్త్రీశూద్రకర సంస్ప
ర్శోవ్రజస్పర్శాధికోమతః । మోహాద్యస్సంస్పృశేచ్ఛూద్రో యోషిద్వాపి క
దాచన । సపతేన్నరకేఘోరే యావదాభూతసంప్లవం । యదిభక్తిర్భవే
త్తస్యాం స్త్రీణాంవాపి వసుంధరే । దూరాదేవాస్పృశన్పూజాంకారయే

త్సు సమాహితః । సర్వవర్ణైస్తు సంపూజ్యాః ప్రతిమాస్సర్వదేవతాః।లింగా న్యపితుపూజ్యాని మణిభిః కల్పితానితు” అనియనగా నోభూదేవి!హీనజాతులు సాలగ్రామమును ముట్టగూడదు స్త్రీశూద్రుల హస్తస్పర్శము పిడుగునకంటె నధికమైనది కనుక నజ్ఞానముచే వారుముట్టిరేని ప్రలయ పర్యంతము ఘోరమైన నరకపాతము వారికిగల్గును ఒకవేళసాలగ్రామపూజయందు వారికిభక్తిగల్గెనే ని జాగరూకులై దూరమునుండి పూజింపవచ్చును. ఇకప్రతిమలందైనచో సర్వ దేవతలను సర్వవర్ణములవారును బూజింపవచ్చును - లింగములు మణులచే నిర్మించినవి పూజింపవచ్చును.ఇట్లువిష్ణుపురాణమందును“బ్రాహ్మణః క్షత్రియో వైశ్యశ్శూద్రశ్చపృథివీపతే। స్వధర్మతత్పరోవిష్ణు మారాధ యతినాన్యథా॥” అనియున్నది అనగా బ్రహ్మక్షత్ర వైశ్యశూద్రులు స్వధర్మను నాచరింపుచువి ష్ణుపూజజేయునది లేనిచో గూడదనుట - ఇకప్రయోగ పారిజాతములో నుదా హరించిన విష్ణుధర్మోత్తరవచనము “సాలగ్రామశిలాంవాపి చక్రాంకితశిలాంత థా। బ్రాహ్మణః పూజయేన్నిత్యం క్షత్రియాదిర్నపూజయేత్” అనియనగా సా లగ్రామమును ద్వారకా చక్రశిలను బ్రాహ్మణుడె పూజింపవలెను క్షత్రియాదు లు పూజింపగూడదని యున్నదిగాని - అదిస్పర్శ సహితపూజా విషయమని తెలియునది - దీక్షలేనివారికి నిషేధమని కొందరు - తక్కినవిశేషము నేజేసిన పూర్తకమలాకరమందును నిర్ణయ సింధువునందును దెలియునది. ఇట్లుపా ర్థివలింగపూజయందును శూద్రున కధికారము గలదు - ఎట్లనిన “మృద్భస్మ గోశకృత్పిష్ట తామ్రకాంస్యమయంతు వా।కృత్వా లింగం సకృత్పూజ్యవసేత్క ల్పాయుతందివి॥” యనితిథితత్వమందు భవిష్యవచనము - అనగా మృత్తికభస్మ ము గోమయము పిండి రాగి కంచు మొదలగువానిలో నొకదానిచే లింగము జేసి యొకమారైనను బూజించెనేని బదివేల కల్పములు స్వర్గ మందుండునని సర్వ సాధారణముగ విధియున్నది మరియును వేదమంత్రము లక్కరలేకయే పూజా విధానము చెప్పబడినది, ఎట్లనిన - తిథితత్వమందె స్కాందవచనము “మృదా హరణసంఘట్ట ప్రతిష్ఠాహ్వానమేవచ । స్థాపనం పూజనంచైవ విసర్జనమతః పరం । హరోమహేశ్వరశ్చైవ శూలపాణిః పినాకధృత్ । పశుపతి శ్శివశ్చై వ మహాదేవ ఇతిక్రమః॥” అనియనగా మృత్తిక దెచ్చుట మర్దించుట లింగము జేయుట యాహ్వానము స్థాపించుట యనగా ధ్యానించి లింగమందు బ్రవేశింప

జేయుటపూజించుట విసర్జించుటయునను నీయేడుక్రియలు హరుడనునది మొదలు
గ శ్లోకమందు జెప్పిన యేడునామములు క్రమమున నుచ్చరింపుచు జేయవలెనను
ట-మరియును భవిష్యపురాణమందు "శర్వాయ క్షితిమూర్తయేనమః భవాయజ
లమూర్తయేనమః రుద్రాయాగ్ని మూర్తయేనమఃఉగ్రాయవాయు మూర్త
యేనమఃభీమాయాకాశమూర్తయేనమః పశుపతయె యజమానమూర్తయేన
మః మహాదేవాయ సోమమూర్తయేనమఃఈశానాయసూర్య మూర్తయేనమః
మూర్తయోష్టౌ భవస్యైతాః పూజ్యాః పూర్వాదితఃక్రమాత్।ఆగ్నేయాంతం
ప్రపూజ్యాస్తు వేద్యాంలింగే శివంయజేత్॥" అనియున్నవి అనగా నిందు జెప్పిన
ట్లు నామములెనిమిదినుచ్చరింపుచు లింగమునకు చుట్టునున్న వేదికయందు నీశ్వ
రు నెనిమిది మూర్తులను దూర్పు మొదలుకొని యాగ్నేయ దిక్కున కు స
మాప్తిగ బూజించి లింగమందు బరమేశ్వరుని బూజించునది । ఇక్కడతూ
రుపనగా "నప్రాచీమగ్రతశ్శంభోః" అనిరుద్ర యామలమందు నిషేధవచన ము
న్నందున బూజ్యపూజకుల మధ్యము గ్రహింపగూడదు - మరియేమనిన బ్రసిద్ధ
మైన యెప్పటితూర్పునె గ్రహింపవలెను - అట్లు నవరాత్రమందు దేవీపూ
జాదికమందు నధికారముగలదు- ఎట్లనిన "ఏవంచ వింధ్యవాసిన్యాం నవరాత్రో
పవాసతః" । అనియుపక్రమించి "వైశ్యైశ్శూద్రై ర్భక్తియుక్తై ర్మ్లేచ్ఛైర
న్యైశ్చమానవైః" అనిహేమాద్రిలో భవిష్య వచనమున్నది అనగా నవరాత్రి
మందుపవసించి వైశ్యులు శూద్రులు భక్తిగల మ్లేచ్ఛులు మొదలగువారిచే స
హితము పూజింపబడుననుట - మరియును రూప నారాయణీయమందు భవి
ష్యవచనము "ఏవంనానామ్లేచ్ఛగణైః పూజ్యతెసర్వదస్యుభిః।వినామంత్రైస్తామ
సీస్యాత్కిరాతానాంతు సమ్మతా॥" అనియనగా నిట్లునానావిధమైన మ్లేచ్ఛగణ
ములచేతను దొంగలచేతగూడ దేవి పూజింపబడును నిట్లుకిరాతులకు సహిత
ము మంత్రములు లేకుండగ దామసపూజ విధింపబడినదనుట - అట్లువ్రతోపవా
సాదులందును శూద్రునకధికారము గలదు - శ్రవణవిధిచే సిద్ధమైనజ్ఞానముండు
టవలనను వైదికమంత్రము లక్కరలేక పోవుటవలన నని తెలియునది - ప్రాచీను
లు మాత్రము వైశ్యశూద్రులకు రెండు రాత్రులకంటె నెక్కుడుదినము లుపవాస
ము నంగీకరింపరు - ఏమనిన : వైశ్యాశ్శూద్రాశ్చయే మోహాదుపవాసంప్ర

కుర్వతే। త్రిరాత్రంపంచరాత్రం వా తేషాంవ్యుష్టి ర్నవిద్యతే" అనిహేమాద్రిలో
భవిష్యవచనమున్నదిఅనగా వైశ్యులుగానిశూద్రులుగాని మూడురాత్రులైననునై
దురాత్రులైన నుపవాసముజేసిరేని వారికి బాపనిష్కృతిలేదని యున్నదంద్రు-కా
ని - యథార్థమాలోచించినచో ప్రకరణమును బట్టి యానిషేధముమహా తప
స్సులకని తెలియునది - నవరాత్రమం దుపవాసము తప్పదు-"నవరాత్రోపవా
సతః"అనియుపక్రమించి"బ్రాహ్మణైః క్షత్రియైర్వైశ్యైశ్శూద్రైరన్యైశ్చమాన
వైః। స్త్రీభిశ్చకురు శార్దూలతద్విధాన మిదంశృణు॥" అనిభవిష్య మందు శూ
ద్రునకును విధింపబడినది ఇట్లుప్రాయశ్చిత్తము శూద్రునకు జపహోమాదులు
లేకుండగ విధింపవలెను - అట్లువచనము "తస్మాచ్ఛూద్రం సమాసాద్యసదాధ
ర్మపథేస్థితం। ప్రాయశ్చిత్తం ప్రదాతవ్యంజపహోమ వివర్జితం॥" అనిమితా
క్షరలో నాంగిరస వచనము - ఇక్కడ జపహోమములులేని ప్రాయశ్చిత్తము
దానతీర్థయాత్రాదుల నుద్దేశించి శూద్రసంబంధము విధింపబడిన దనగూడదు
హావిరుభయత్వమువలె విశిష్టము నుద్దేశించినచోవాక్యభేదదోష మగును మరియు
ను ద్విజులకది సిద్ధింపకయే పోవును - కనుక శూద్రసంబంధిప్రాయశ్చిత్తమును
ద్దేశించి జపహోమాదులు లేకుండుటను విధించినచోలాఘవముగూడ సంభవిం
చును - ఇక్కడ గొందరు ప్రధానమైన జపహోమములకే నిషేధముగానియం
గమైన వానికిగా దంద్రు కనుకనే మహార్ణవ మందు స్త్రీశూద్రులకు ప్రాయ
శ్చిత్తాంగమైన వ్యాహృతి హోమము లౌకికాగ్ని యందు విప్రునిచే జేయిం
పవచ్చునని యున్నదనిరి- ఆయిన నది చింత్యము ఏమనిన "ఆరంభే సర్వకృ
చ్ఛ్రాణాం సమాప్తౌచ విశేషతః। అజ్యైనైవచ శాలాగ్నౌజుహుయా ద్వ్యా
హృతీః పృథక్ । శ్రాద్ధంకుర్యాద్వ్రతాంతేతు గోహిరణ్యాదిదక్షిణం । స్త్రీ
ణాంహోమోన కర్తవ్యః పంచగవ్యం తథైవచ ॥ " అని యనగా సర్వకృ
చ్ఛ్రములకు నారంభ మందును సమాప్తియందు నాజ్యముచే గృహ్యాగ్నియం
దె వ్యాహృతులచే వేర్వేరుగ నాహుతులీవలెను మరియు వ్రతాంత మందు
గోహిరణ్యాది దక్షిణలతో శ్రాద్ధముజేయునది - స్త్రీలకైనచో హోమముపం
చగవ్యమును గూడదని జాబాలివచనముచే గృహ్యాగ్ని నియమింపబడినది అగ్ని
కి ప్రతినిధిలేదని నవమాధ్యాయమందున్నది లౌకికాగ్ని విధించు వచన మెక్కడ
నుగానరాదు గనుక విని గమకము లేనందున రెండిటికిని నిషేధము - ఇకశూ

ద్రునకు పదునొకండు సంస్కారములనియు స్త్రీలకారనియు నమోమంత్రమ
నియు మదనపారిజాతము మొదలగు సర్వగ్రంథములు చెప్పుచున్నవి - కనుక
నే మహాదానములందు నధికారము - హిరణ్యగర్భదానమందు మాత్స్యవచ
నము - "స్త్రీణాంకుండాని విప్రేంద్ర యోన్యాకారాణి కారయేత్॥" అని య
నగా స్త్రీలకు దానాంగహోమమునకు కుండము ముక్కోణముగ నుండవలెన
ని. ఇట్లు శారదాతిలక మందును - "వైశ్యానా మర్ధచంద్రాభం శూద్రా
ణాంచత్రికోణకం" అనియనగా వైశ్యులకు నర్ధచంద్రాకారముగను శూద్రుల
కు ముక్కోణముగను నగ్నికుండముండ వలెననుట - స్త్రీ (శూద్రు)లకు సమాన
ధర్మత్వమునుండియు నట్లనే యగును - కనుకనే మాత్స్యమందుహిరణ్యగర్భ
దానమందు "నరోవాయదివానారీసర్వం బ్రహ్మాత్మ సంభవం । యఃకరోతిమ
హాపుణ్యం శృణుతస్యాపి తత్ఫలం॥" అనియనగా పురుషుడు గాని స్త్రీగానిస
ర్వము బ్రహ్మాత్మనుండి పుట్టునది గనుక నెవ్వరీదానము జేతురో వారికాఫల
ము తప్పదు - అనియర్థము - ఇట్లు కామధేనుదాన మందాగ్నేయవచనము-
"బ్రహ్మవిట్ క్షత్ర శూద్రాణాం కర్తవ్యా యత్నతోనృప॥" అనియనగా నాల్గు
వర్ణముల వారును యత్నముచే జేయవలెననుట ఇట్లు భవిష్యోత్తరమందుహా
లపఙ్క్తి దానమందును "ప్రయత్నేన మహీపాల దానమేతన్నృపోత్తమ । దా
తవ్యంభక్తి యుక్తేన స్త్రియావాపురుషేణవా॥" అనియున్నది-అనగా స్త్రీగా
నిపురుషుడు గాని భక్తితో నీదానము ప్రయత్నముచే జేయవలెననుట. బ్రహ్మాం
డమందు సప్తద్వీపదానమునందు - "సప్తద్వీపాహ్వాయం దాన మేవంకృత్వా
తు మానవః । నారీవా పురుషోవాపి వైరించం లోకమాప్నుయాత్॥"అనియు
న్నది అనగా స్త్రీగాని పురుషుడుగాని సప్తద్వీపదానమిట్లు చేసిరేని బ్రహ్మ
లోకము నొందుదురనుట-మరియు ధాన్యపర్వతదానమందును"దివ్యంవిమాన మా
రుహ్యానారీవాపురుషోపివా"యనియు నట్లుకార్పాసాచల దానమందు "ఇత్యు
చ్చార్యనరోదద్యా న్నారీవావిధిపూర్వకం॥"అనియు తిలపర్వతదానమందు"పుణ్యా
క్షయాదిహాగత్య రాజాభవతి ధార్మికః । నారీవాతస్య పత్నీచ సుభగారూ
పసంయుతా॥"అనియునున్నది యనగా మీదజెప్పిన ధాన్యపర్వతాది దానములం
దధికారము స్త్రీకిని పురుషునికి నున్నదనియు దిలపర్వత దానముజేసెనేని బహు
కాలము స్వర్గమనుభవించితిరుగభూలోకమున రాజై పుట్టుననియు స్త్రీ యైనచో

నట్టి చక్రవర్తికి భార్యయు బహుసౌందర్యవతియునగు ననుట - అట్లు "మాంధాత్రా యువనాశ్వేన కార్తవీర్యేణ చైవహి । దానమేతత్పురాదత్తంతత్పత్నీభి స్తథైవచ॥" అని యనగా పూర్వమందు మాంధాత యువనాశ్వుఁడు గార్తవీర్యుఁడు మొదలగు చక్రవర్తులు వారిభార్యలు నీదానము జేసిరనుట- అయిననిట్లు వచనమున్నందున నంతమాత్రమందే యధికారము సిద్ధించు ననగూడదు - అనువాదమగుటచే ఫలార్థమట్లు చెప్పఁబడినది - మరియేమనిన విచారించినచో "నరోవాయది వానారీత్యాది; సామాన్యశాస్త్రమువిద్వద్విషయముగాక తప్పదు గనుక ద్విజపరమనుటయే తగును అయినను గొన్నిటిలో జతుర్వర్ణగ్రహణమున్నందున కొన్నిటిలో శూద్రునకుఁ గొన్నిటిలో స్త్రీకిని బరామర్శయున్నదని తెలియునది - స్త్రీశూద్రులకు సమానధర్మ ముండుట చేతను శ్రవణవిధిచే సిద్ధమైన విద్యగలుగుటను ఫలకామిత్వముండుట చేతను శూద్రునకుఁ గూడ నధికారము - అందువచనము "అధికారీ భవేచ్ఛూద్రః పూర్తధర్మేన వైదికే॥" అని యనగా ముందుచెప్పెడు పూర్తధర్మములందు శూద్రుడధికారి యగును వేదోక్తకర్మలందు గాడనుట అట్లుమోక్షధర్మమందునువచనము - "మంత్రవర్జం నదుష్యంతి కుర్వాణాః పౌష్టికీం క్రియాం ॥" అనియనగా పౌష్టికకర్మలనుగూడ శూద్రులు మంత్రహీనముగ జేసిరేని దోషము లేదనుట - ఇక స్త్రీలకు బంచగవ్యమం దధికారము వైకల్పికము అట్లుపరాశరవచనము "స్త్రీశూద్రస్య విశుద్ధ్యర్థం ప్రాజాపత్యం సమాదిశేత్ । పంచగవ్యం తు కుర్వీత స్నాత్వా పీత్వా శుచిర్భవేత్॥" అని యనగా స్త్రీశూద్రులకుప్రాయశ్చిత్తముగ బ్రాజాపత్యకృచ్ఛ్రము విధింపవలసినది - పంచగవ్యముచేసి దానిచే స్నానముపానము చేసెనేని శుద్ధియగునని విధియు మీఁద జెప్పిన నిషేధమునున్నందున స్త్రీకి వికల్పము శూద్రునకు నిషేధమేలేదుగాని యత్రిమునివచనమొకటి యున్నది - ఎట్లనిన "పంచగవ్యంపిబేచ్ఛూద్రో బ్రాహ్మణస్తు సురాంపిబేత్ । ఉభౌతౌ తుల్యకర్మాణౌ పుమాఖ్యే నరకేవసేత్॥" అనియనగాపంచగవ్యముద్రావినశూద్రుడునుకల్లుద్రావిన బ్రాహ్మణుఁడునుసమానపాపముగలవారు పున్నామనరక మందు వసింతురని నిషేధమున్నదిగాని యది ప్రాయశ్చిత్తార్థముగాని చోనని తెలియునది - తక్కినవిశేషము ప్రాయశ్చిత్తరత్నమందుదెలియునది ఇట్లు "అధికారీ భవేచ్ఛూద్రః పూర్తధర్మే నవైదికే॥" యనివ్యా

సజాతూకర్ణ్యవచనములచేఁదటాకప్రతిష్ఠయుదేవప్రతిష్ఠయుమొదలగుపూర్తక
ర్మలందునధికారము గలదు-పూర్తకర్మ లేదనినహేమాద్రిమదనరత్నములలో
జాతూకర్ణ్యవచనము "వాపీకూపతటాకాది దేవతా యతనానిచ । అన్నప్రదా
నమారామః పూర్తమిత్యభిధీయతే ॥" అనియనగా బావి నూయి చెరువు
మొదలగు వాని ప్రతిష్ఠయు దేవప్రతిష్ఠయు నన్నసత్రముతోఁటవేయుటయుబూ
ర్తము లనబడుననుట మరియు నచ్చటనే నారదవచనము "గ్రహోపరాగే
యద్దానం సూర్యసంక్రమణేషుచ । ద్వాదశ్యాదౌచ యద్దానం తదేతత్పూర్త
ముచ్యతే॥" అని యనగా గ్రహణకాలమందును సంక్రాంతియందును ద్వాదశి
మొదలగు పుణ్యదినములందు నిచ్చుదానము గూడ బూర్తమనబడుననుట - మరి
యుశంఖవచనము "రోగిణాం పరిచర్యాచ పూర్తమిత్యభిధీయతే॥" అనియన
గా రోగవంతులకు నుపచారము జేయుటయు బూర్తమేయన బడుననుట- మ
రియు స్మృత్యంతరము- "గ్రహోపరాగె యద్దానం సూర్యసంక్రమణేషుచ। బ
హిర్వేద్యాంచయద్దానం తత్పౌర్తిక ముదాహృతం ॥" అని యనగా గ్రహణ
సంక్రాంతులందిచ్చుదానము యజ్ఞమందు వేదికకు వెలపలనిచ్చు భూరిదానము
ను పూర్తమునబడును - కనుక కర్మవిపాకమందలి దానాదులందు నధికార
ము-అట్లుమనువచనము- "దానంధర్మంనిషేవేత నిత్యమైష్టికపౌర్తికం । శ్రౌ
తస్మార్తాదికర్మాంగం దానమిష్టంతుపౌర్తికం॥" అనియనగా దానము ధ
ర్మము నిష్టాపూర్తముల సంబంధించినవి నిత్యముజేయవలెను శ్రౌత స్మార్తక
ర్మలకంగమైనదానము పూర్తము - మరియు వ్యాస వచనము "వర్ణానా
మాశ్రమాణాంచ చాతుర్వర్ణ్యేయు ధిష్ఠిర । దానంధర్మం ప్రవక్ష్యామి య
థావ్యాసేనభాషితం ॥" అని యనగా వర్ణములు నాల్గింటికి నాశ్రమములు
నాల్గింటికి వ్యాసమనగ వేర్వేరుగ జెప్పఁబడిన దానమును ధర్మమును జెప్పెద
ననుట - తక్కిన విశేషమునేజేసిన దానకమలాకరమందు దెలియునది-ఇక్కడ
నిట్లు వచనములచే మహాదానము జలాశయప్రతిష్ఠ మొదలగు వేదమంత్రయుక్తమై
నకర్మలందు గూడ రథకారుని కాధానము మొదలగు వాని యందు వలె శూ
ద్రున కధికారము చెప్పబడినది- అక్కడ రెండు పక్షములున్నవి - ఎట్లనిన- వై
దికమంత్ర హీనముగ విప్రులచే జేయింపవలెనని యొకపక్షము ఏమనిన "మంత్ర
వర్జం నదుష్యంతికుర్వాణాః పౌష్టికీంక్రియాం॥" అని మోక్ష ధర్మమందు

వ్యాసవచనమున్నది - ఇట్లు మనువచనము "ధర్మేప్సవస్తు ధర్మజ్ఞా స్సతాం ధర్మ మనువ్రతాః । మంత్రవర్జంనదుష్యంతి ప్రశంసాం ప్రాప్నువంతిచ" అని యనగా ధర్మము గోరి ధర్మముదెలిసి సజ్జనులాచరించుధర్మముననుసరించు చు శూద్రులు మంత్రహీనముగ ధర్మమాచరించిరేని దోషము నొందరుసరిమేక దా స్తుతిపాత్రతనుగూడ నొందుదురనుట- ఇక్కడమేధాతిథివ్యాఖ్యానమెట్లనిన- మంత్రమక్కరలేని వ్రతోపవాసాదులు చేయుచుండిరేని శూద్రులకు దోషము లేదని యర్థముగాని మంత్రయుక్తమైన కర్మలనుగూడ మంత్రహీనముగ జేసి రేని దోషములేదని యర్థముగాదు ఏమనిన మంత్రయుక్త కర్మలుశూద్రు ను ద్దేశించి విధింపనందునమంత్రహీనముగ నవియాచరించుట యప్రామాణిక మైన యనుష్ఠానమై పోవునని యున్నదిగాని యదిసంగతముగాదు ఏమనిన స్థపతీష్టియం దువలె శృంగగ్రాహికాన్యాయముచే విధానమందు మంత్రవర్జ్యత్వము విధిం పబడినది అట్లుగానిచో మంత్రహీనవ్రతోపవాసాదికమందనధికారప్రసక్తిచే విధి వై యర్థ్యము వచ్చును - కనుకనిది సన్నిధానము నిమిత్తమేయని తెలియవలె ను - మరికొందరంద్రు - విప్రులు వైదికమంత్రములచేతనే హోమాదికము చేయవలెను అట్లు పరాశర వచనము ముందువ్రాయబడును మాధవీయమందుని ట్లనేయున్నది ఆచార్యకర్తృకములందు పౌరాణమంత్రములకు పాఠమే అట్లుయ జమాను డుచ్చరించు పౌరాణమంత్రములుగూడ బఠింపవచ్చునని కల్పతరుప్మా ర్తగౌడాదులు చెప్పుదురు అందుయుక్తమేదనిన శ్రవణవిధి యున్నది గనుక శూద్రులకు శ్రవణమాత్రమే యుక్తము మీదజెప్పిన యుక్తులచే శ్రవణజన్యజ్ఞా నమేవారికి గర్మాంగ మగునుగదా ! ఇకయాజమానము వైదికమంత్రము ప్రస క్తించినచో నమస్కారమాత్రమే అట్లు "అనుమతోస్య నమస్కారోమంత్రః" అ ని గౌతమవచనము మీదవ్రాయబడినది గౌడులు మైథిలులు నిట్లనె యంద్రు ఇ ట్లుభయతోముఖీ దానమందు నమోమంత్రముచే హోమము "యజ్ఞోవైనమః" అ నిశ్రుతి గూడనున్నది మరియుగౌతమవచనమందు అస్యయని శ్రుతమగు చున్న షష్ఠి యజమానస్య యాజ్యా అనుదాని యందువలె శూద్ర సంబంధము దెలుపు చున్నది- ఇకపౌరాణమంత్రము విప్రునకే ఏమనిన "అమంత్రస్యతుశూద్రస్య వి ప్రో మంత్రేణ గృహ్యతే" యని వారాహవచనము మీదవ్రాయబడినది - ఇకనే మనిన శుద్ధి వివేకమందు రుద్రధరుడను గ్రంథకర్త మాత్రము సమంత్రక

హోమము దత్తకుని ప్రతిగ్రహించుట కంగము గనుక మంత్రపాఠ మందు స్త్రీశూద్రుల కధికారములేనందున వారికిదత్తకుడు సంభవింపడని చెప్పెనుగాని యదిచింత్యము ఏమనిన భర్త్రనుజ్ఞచే స్త్రీకి ప్రతిగ్రహము విధింపబడినది - అట్లు వసిష్ఠవచనము "నస్త్రీపుత్రందద్యాత్ప్రతిగృహ్ణీయాద్వాన్యత్రానుజ్ఞానాద్భర్తుః॥" అనియనగా భర్తయనుమతి లేకుండగ స్త్రీస్వయముగ పుత్రుని వ్వనుగూడదు ప్రతిగ్రహింపను గూడదనుట ఇదియు భర్తజీవించి యున్నపుడే లేనిచో స్వాతంత్ర్యముండును గనుక ననుజ్ఞయక్కరలేదు - ఇక్కడ మేధాతిథి భార్యాత్వమువలె దత్తకత్వముగూడ నదృష్టరూపము హోమసాధ్యమని చెప్పెను స్త్రీకిహోమము సంభవింపదు గదా అయినను వ్రతాదులందు వలె విప్రద్వారముగహోమాదులు చేయింప వలెనని హరినాథాదులంద్రు-గౌడనిబంధతత్త్వమందు నిట్లనే యున్నది. ఇట్లు శూద్రునకద్భుత రోగశాంతికర్మవిపాకతులాదులందును "స్త్రీశూద్రాశ్చసధర్మాణః॥" అని స్మృతివలన నధికారమని తెలియునది. కనుకనే శూద్రుడుచేయు హోమమువిప్రద్వారముగ జేయవలెనని పరాశరవచనము - ఎట్లనిన - "దక్షిణార్థంతు యోవిప్ర శ్శూద్రస్య జుహుయాద్ధవిః । బ్రాహ్మణస్తుభవేచ్ఛూద్ర శ్శూద్రస్తు బ్రాహ్మణోభవేత్॥" అనిదీనికి మాధవాచార్యునివ్యాఖ్యాన మెట్లనిన విప్రుడు దక్షిణకై శూద్రుని హవిస్సును శాంతిపుష్ట్యాదులకు వైదికమంత్రములచే వ్రేల్చిన యెడ విప్రునికే దోషము - శూద్రుడు హోమఫలము దప్పకపొందునని - ఇదినిర్ణయసింధువునందు సవిస్తరముగ జెప్పఁబడినది. కాబట్టి శూద్రులకు వైదికమంత్ర హోమమందంతటను రెండుపక్షములు - మంత్రముతోగూడ విప్రద్వారముగ జేయుటయొకటి లేదామంత్రహీనముగ నామచే జేయుట రెండవదియని సిద్ధించినది.

ఇక శూద్రునికి సంస్కారములు - అందు యమస్మృతి వచనము "శూద్రోప్యేవంవిధః కార్యో వినామంత్రేణ సంస్కృతః । నకేనచిత్సమ సృజచ్ఛందసాతంప్రజాపతిః॥" అని యనగా శూద్రుఁడుగూడ నిట్లు సంస్కరింపబడవలెను గాని మంత్రములేకుండగ సంస్కారముగావలెను ఏమనిన వానినే వేదమున కైన నర్హునిగా బ్రహ్మసృజింపలేదు - ఇట్లువ్యాసవచనము గూడగలదు-"గర్భాధానంపుంసవనం సీమంతో జాతకర్మచ । నామక్రియానిష్క్రమోన్న ప్రాశనం వపనక్రియా । కర్ణవేధోవ్రతాదేశో వేదారంభక్రియావిధిః । కేశాంత

స్నాన ముద్వాహో వివాహాగ్ని పరిగ్రహః । త్రేతాగ్నిసంగ్రహ శ్చైవ సం
స్కారాష్షోడశ స్మృతాః॥" అనియనగా నీపదియారును సంస్కారము లనబడు
నని చెప్పి "నవై తాః కర్ణవేధాంతా మంత్రవర్జం క్రియాః స్త్రియః। వివాహో
మంత్రత స్తస్యా శ్శూద్రస్యా మంత్రతోదశ॥" యనియున్నది అనగానందు గ
ర్ణవేధపర్యంతమైన తొమ్మిదిక్రియలును మంత్రములేకుండగ స్త్రీలకును జేయవ
చ్చును - వివాహము మాత్రము స్త్రీకైనను మంత్రపూర్వముగనే చేయవలెను-
ఇకశూద్రునకు మంత్రములేకుండగ నీపదిసంస్కారములు గావలయుననుట- ఇక
నేమనిన స్మృతికౌముదిలో మదనపాలుడు బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు గర్భా
ధానసీమంతజాతకర్మ నామకరణాన్న ప్రాశన చూడోపనయనవ్రత చర్యాధ్య
యన సమావర్తనవివాహయజ్ఞదానములు మూడువర్ణములవారికే సమానము
లనియు శూద్రునికి వివాహముమాత్రమే సుమంతువచనములో ద్విజులకేయనియు
న్నందునను "వివాహమాత్రం సంస్కారం శూద్రోపిలభతాంసదా॥" యని బ్రహ్మపు
రాణవచనమున్నందునను నని తెలియవలెనుకనుకశూద్రునికి జాత కర్మాదికములేదు
అట్లుచూడాకర్మమును లేదు-ఏమనిన "చూడాకర్మద్విజాతీనాంస ర్వేషామేవధర్మతః"
అని మనువచనము అనగాచూడాకర్మము ద్విజులకందరకేయనుట యనిచెప్పెనుగా
ని యదిచింత్యము-ఏమనిన సుమంతువచన ముపనయనాదిసామ్యముకొరకు జెప్పబ
డినది అట్లుగాక ద్విజులకేయని నియమము కొరకైనయెడలదానమందు నధికార
ముశూద్రునకు లేకపోవునుఇకమనువచనమునందు "ధర్మతః" అనియున్నందునశూ
ద్రునకు హోమాదికము నిషిద్ధముగనుక మంత్రయుక్తమైనది ద్విజులకేయనవచ్చు
ను అట్లు మనువచనము "బైజికై ర్గార్భికైర్హోమై శ్చూడామౌంజీ నిబంధ
నైః । బైజికం గార్భికంచైనోద్విజానామప మృజ్యతే॥" యనిఅనగాబీజము
ను గర్భమునుద్దేశించిన చూడామౌంజీహోమములచే బీజగర్భజన్యదోషముద్వి
జులకు నివర్తించుననుట - కనుకనట్టిహోమయుక్త సంస్కారములు ద్విజులకే
దగుననుట - కనుకనే మదనరత్నమందు హిరణ్యగర్భదాన ప్రస్తావములో "గ
ర్భాధానం పుంసవనం సీమంతోన్నయనంతథా । కుర్యుర్హిరణ్యగర్భస్యతతస్తే
ద్విజపుంగవాః" అనియనగా హిరణ్యగర్భసాలగ్రామమునకు గర్భాధానపుంస
వనసీమంతోన్నయనములు చేయుదురని చెప్పి "జాతకర్మాదికాః కుర్యాత్క్రి
యాష్షోడశచాపరాః॥" అనిజాతకర్మాది షోడశక్రియలు చేయవలెనను స్థలమం

దు మాత్స్యమందు స్త్రీకి జాతకర్మ నామకర్మ నిష్క్రమణాన్నప్రాశనచూడా వివాహములారు సంస్కారములు శూద్రులకైనచో నీయారును పంచమహాయజ్ఞములును గలసి పదునొకండని చెప్పబడినది-ఇట్లురూప నారాయణ హరిహరభాష్యములందుగూడ నున్నది - శూద్రుని కుపనయనము తప్ప గర్భాధానముమొదలుగ వివాహపర్యంతమైన సంస్కారములు తొమ్మిదనివిజయపాలుడు చెప్పెను-ఇకశార్ఙ్గధరుడైన చో "ద్విజానాంషోడశైవస్యుశ్శూద్రాణాం ద్వాదశైవహి। పంచైవ మిశ్రజాతీనాం సంస్కారాః కులధర్మతః । వేదవ్రతోపనయన మహానామ్నీ మహావ్రతం । వినా ద్వాదశ సంస్కారా శ్శూద్రాణాం నామమంత్రతః॥" అనియనగా ద్విజులకుపదారు సంస్కారములు శూద్రులకు బండ్రెండు సంకరజాతులకైదును గులధర్మము చొప్పున సంస్కారము లనియు నందు వేదవ్రతము లుపనయనము మహానామ్నీవ్రతము మహావ్రతము నీనాల్గుతప్పదక్కిన పండ్రెండును శూద్రునకని చెప్పెను - అపరార్కుడైనచో "గర్భాధాన మృతౌపుంసః" అనుస్థలమునందు ఇదిచాతుర్వర్ణ్య పరముగాని ద్విజాతిమాత్ర పరముగాదు అట్లైనయెడ నుపనయనము విధించియాపైని జెప్పవలసియుండునని చెప్పెను - కనుక నతనిమతమందు గర్భాధానపుంసవనసీమంత జాతకర్మ నామకరణ నిష్క్రమణాన్నప్రాశనచౌలములను నెనిమిదియగును- కల్పతరువునందు "వివాహమాత్రం సంస్కారం శూద్రోపిలభతాం సదా" యను బ్రాహ్మవచనము వలన వివాహమాత్రమని యున్నది - ఇట్లుమతభేదములున్నను సచ్ఛూద్రులకెక్కుడు సంస్కారములు హీనశూద్రులకు దక్కువ సంస్కారములనిగాని దేశ భేదముచేతగాని వ్యవస్థ సిద్ధించునని తాత్పర్యము - ఇకమనువచనము "నశూద్రే పాతకంకించి న్నచసంస్కారమర్హతి" యనియున్నది దానికి మేధాతిథివ్యాఖ్యాన మెట్లనిన సామాన్యముగా నిషేధింపబడిన చౌర్యము నసత్యము మొదలగునవి జేసినను జెప్పినంత పాపముశూద్రునికి గలుగ దనియు ద్విజులవలె నుపనయనాది సంస్కారములకు శూద్రుడు తగడనియు తాత్పర్యమని - కనుక బూర్వోక్తయమాది స్మృతులచే సిద్ధమైన సంస్కారములు శూద్రునకును మంత్ర హీనముగ జేయవలయునని సంక్షేపము అందు చౌలమందు శూద్రులకు పంచ శిఖలుంచుట మొదలగుపక్షము లేదు - ఏమనిన నదిగోత్రచిహ్నము శూద్రునకుం

గోత్రములేదు గదా - ఇక "తస్మాదాహుస్సర్వాః ప్రజాః కాశ్యప్యః" అనుశతప థశ్రుతివలనను ననగా కశ్యపసంతతి యగుటచే సర్వప్రజలు కాశ్యపులన బడుదు రనుటను "గోత్రనాశేతుకాశ్యపః॥" అని యనగా గోత్ర మెరుగనిచో గాశ్యపగో త్ర ముచ్చరింపవలెనని హేమాద్రిలో నుదాహరించిన వ్యాఘ్రపాద వచనము వ లనను గాశ్యపగోత్రమున్నది కనుకనే "పిండాది నిర్వపేద్వీర నామతో గోత్రతోపి చ॥" యని యనగా పిండదానము మొదలగునది నామముచేతను గోత్రముచేత ను గావలెనని హేమాద్రిలో శూద్రశ్రాద్ధమునందు భవిష్యవచన మున్నది- ఐ నను నది శ్రాద్ధ మందే యుపయోగించును - ప్రవరప్రాప్తికి ప్రమాణమేమి యుగానరాదు ఋషిసంతతి గాదు గదా - కనుకనే మనువు ద్విజులకే వైది క ధర్మణయుక్తమని చెప్పెను శూద్రున కధార్ణత్సిద్ధమైన కేశక్షౌరము మాత్ర ము నివారింపఁబడదని మేధాతిథి చెప్పెను - అందు చాలమందు శూద్రులకు ముండమైనను సిగధరించుటమై నను వికల్పముగ నగును అట్లు వసిష్ఠ వచనము "శూద్రస్యానియతాః కేశ వేశాః ॥" అనియున్నది.కనుకనేహారీతస్మృతిలో "స్త్రీ శూద్రౌతుశిఖాంఛిత్వా క్రోధాద్వైరాగ్యతో పివా । ప్రాజాపత్యం ప్రకు ర్యాతాం నిష్కృతి ర్ణాన్యథాభవేత్॥" అని యనగా స్త్రీశూద్రులు కోపము చేనైనను వైరాగ్యముచే నైనను శిఖనుఛేదించుకొనిన యెడ ప్రాజాపత్యకృచ్ఛ ము ప్రాయశ్చిత్తము గానిచో నిష్కృతిలేదని యున్నది కనుకనే గౌడస్త్రీలలో విధవలకు గేశక్షౌరములేదు - ఇక పాద్మవచనము - "నశిఖీనోపవీతీస్యాన్నో చ్చరేత్సం స్కృతాంగిరం । మధ్యపత్రే నభుంజీత బ్రహ్మవృక్షస్యభామిని॥" అని యనగా శూద్రుఁడు శిఖనుధరింప గూడదు ఉపవీతము వేసుకొనగూడదు సం స్కృతవాక్కు నుచ్చరింప గూడదు బ్రహ్మమేడి చెట్టు రేకులు మూడిటిలో మ ధ్యదళమందు భుజింపఁగూడదని శిఖానిషేధమున్నదిగాని - అదిముండనపక్షమం దని తెలియునది - తక్కినవిశేషము నిర్ణయసింధువునందు దెలియవలెను-అట్లు శూద్రులకుఁ బంచమహాయజ్ఞములునున్నవి - అట్లు యాజ్ఞవల్క్య వచనము - "భార్యారత శ్శుచి భృత్యభర్తాశ్రాద్ధ క్రియా రతః । నమస్కారేణ మం త్రేణ పంచయజ్ఞాన్ నహాపయేత్॥" అని యనగా శూద్రుఁడు భార్యయందాత త్పరుడై శుద్ధిగలిగి భృత్యుల బోషించుచు శ్రాద్ధక్రియ యందాసక్తుఁడై నమస్కా రమంత్రముచే బంచయజ్ఞను లాచరింపవలె ననుట . అట్లుభారతమందు రాజ

ధర్మములలో "తస్మాచ్ఛూద్రః పాకయజ్ఞై ర్యజేతావ్రతవాన్ స్వయం । దక్షిణా పాకయజ్ఞానాం హిరణ్యంతువిధీయతే॥" అని యనగా గనుక శూద్రుఁడు తాను నియమవంతుఁడు గాకున్నను పాకయజ్ఞము లాచరింపవలెను పాకయజ్ఞములకు హిరణ్యము దక్షిణగా విధింపఁబడినది - అవియు వాజస నేయిశాఖచే జేయవలెను- ఏమనిన - "శూద్రావాజసనేయినః॥" అని దక్షస్మృతి గౌడనిబంధనమం దుదాహరింపఁబడినది - హరిహరభాష్యమందు వివాహప్రకరణమందు నిట్లు చెప్పఁబడినది - తక్కినది ప్రయోగమందు స్పష్టపడునని సంక్షేపము —✿ఇట్లు జగద్గురు నారాయణభట్టసూరికి బుత్రుఁడగు రామకృష్ణ భట్టుని తనయుఁడగు కమలాకరభట్టునిచేరచియింపఁబడిన శూద్రధర్మమందుశూద్రసంస్కారప్రకరణము✿— ఇకశూద్రశ్రాద్ధనిర్ణయము- "అందుశ్రాద్ధక్రియారతః॥" అని మీఁద జెప్పిన వచనముచే నిత్యనైమిత్తిక కామ్యశ్రాద్ధములం దధికారము సిద్ధించినది - ఇట్లు స్త్రీలకునగును అట్లువచనము "స్వభర్తృప్రభృతిత్రిభ్యస్స్వపితృభ్యస్తథైవచ । విధవాకారయేత్ శ్రాద్ధం యథాకాల మతంద్రితా॥" యని యనగా విధవయగు స్త్రీతన భర్త మొదలుగ ముగ్గుర నుద్దేశించియు దనపిత్రాదుల నుద్దేశించియు శ్రాద్ధము యథాకాలముగ జేయవలెనని స్మృతి రత్నావళిలో వృద్ధమను వచనము - అట్టిశ్రాద్ధము స్త్రీశూద్రులకు మంత్రహీనముగ నగును - అట్లు హేమాద్రిలో మరీచి వచనము - "స్త్రీణామమంత్రకం శ్రాద్ధంతథాశూద్రాసుతస్యచ । ప్రాగ్ద్విజాశ్చ వ్రతాదేశా త్తేచకుర్యు స్తథైవచ॥" యని యనగా స్త్రీయు శూద్రుఁడు ననుప నీతద్విజుఁడును జేయు శ్రాద్ధమమంత్రకముగ గావలెననుట - మరియును "అయమేవవిధిఃప్రోక్త శ్శూద్రాణామంత్రవర్జితః । అమంత్రస్యతు శూద్రస్య విప్రోమంత్రేణ గృహ్యతే॥" అనిపాద్మవచనము అనగా దీని విచారముమీద జేయబడినది-ఇది శ్రాద్ధప్రకరణమైననుసంకేతమగుటచే శూద్రునికి స్నానదానాది సర్వకర్మలందును విప్రుడె మంత్రపాఠముచేయవలెను అదియును పౌరాణ మంత్రమునకే యని తెలియునది ఇట్లు స్త్రీకినని శూలపాణిగ్రంథమందున్నది - ఇక ననుపనీతద్విజుఁడనగ చూడా కర్మలేకుండమూఁడువర్షములకు లోపువయసుగలవాఁడని తాత్పర్యము అట్లు సుమంతువచనము - "అనుపేతోపి కుర్వీతమంత్రవత్పితృ మేధికం । యద్యసౌకృతచూడస్స్యా ద్యదిస్యాచ్చ త్రివత్సరః॥" అని యనగా ననుపనీతుఁడైనను చూడా

కర్మ జరిగినచో బితృకర్మ ను మంత్రయుక్తముగ జేయవచ్చును లేదా మూడు వత్సరములవయస్సు పూర్ణమైనను నట్లనే చేయవచ్చుననుట - స్మృత్యర్థసార మందు మాత్రమనుపనీతులు స్త్రీశూద్రులును శ్రాద్ధమును మరియొక విప్రునిచే మంత్రయుక్తముగ జేయించవలెను లేదా మంత్రహీనముగ స్వయముగానైన జేయవచ్చునని యున్నది - ప్రయోగపారిజాతమందైనచో ద్విజస్త్రీలు మాత్ర ము సంకల్పము స్వయముగజేసి తక్కినశ్రాద్ధ ప్రయోగమంతయు వైదిక మంత్ర ముతో బ్రాహ్మణద్వారముగ జేయింపవచ్చునని యున్నది - కనుకనే హేమా ద్రిలో స్త్రీ ణామమంత్రకమను నది యవివాహిత స్త్రీలకని యున్నది- అనుప నీతుడైనయెడ వైదికమంత్రముతో సర్వము స్వయముగనే చేయవచ్చును- తక్కి న విశేషము నిర్ణయసింధువునందు దెలియునది - శూద్రునికెపుడునామ శ్రాద్ధ మే అట్లు సుమంతువచనము - "సదా చైవతుశూద్రాణామామశ్రాద్ధం విధీయ తే॥" అనియున్నది - మరియు పృథ్వీ చంద్రోదయమందు మాత్స్యవచనము - "ఏవం శూద్రోపి సామాన్యం వృద్ధిశ్రాద్ధంచ సర్వదా। నమస్కారేణ మంత్రే ణకుర్యాదామాన్న వత్సదా॥" యని అనగా నిట్లు శూద్రుడును సామాన్య శ్రాద్ధమును వృద్ధిశ్రాద్ధమునుగూడ నమస్కారమంత్రముతో నామద్రవ్యముచేతనే చేయవలెననుట- మరియునందులో వృద్ధ పరాశరవచనము - "ఆమాన్నేనతు శూద్రస్యతూష్ణీంతు ద్విజ పూజనం। ఆమశ్రాద్ధంతు నిర్వాప్య సజాతీన్ప్రా శయేదథ॥" యనిఅనగా శూద్రున కామాన్నము చేతనే శ్రాద్ధము అపు డుమంత్రహీనముగ బ్రాహ్మణ పూజనము ఇట్లామశ్రాద్ధముజేసి స్వజాతికన్నను పెట్టవలెననుట- మరియును "ఆమం శూద్రస్య పక్వాన్నం పక్వముచ్ఛిష్ట ముచ్య తె" యనియనగా శూద్రునకామాన్నమే పక్వాన్నమనబడును పక్వాన్న ముచ్ఛిష్ట మనబడునని యున్నది కనుకనే శూద్రగృహమందు బక్వాన్నహోమముగూడదం డ్రు - మరియు హేమాద్రియందు భవిష్యవచనము "ధర్మేప్సవస్తుధర్మజ్ఞాయ ది శూద్రాః ప్రకుర్వతే । అగ్నౌకరణమంత్రశ్చ నమస్కారో విధీయతే" అని యనగా ధర్మముగోరి ధర్మజ్ఞులైన శూద్రులు శ్రాద్ధము జేయునెడ నగ్నౌక రణమంత్రము నమస్కారమని యనగా- "అగ్నయేకవ్యవాహనాయనమః । సో మాయ పితృ మతేనమః॥" అనిమంత్రమనుట - మరియును "ఆవాహనాదికర్తవ్యం యథాశూద్రేణ తచ్ఛృణు । దేవానాం దేవనామ్నాతు పితౄణాంనా

మగోత్రతః । పిండాని నిర్వాపే ద్దీరనామతో గోత్రత స్తథా శూద్రాణాం కాశ్యపంగోత్రం" అని హేమాద్రి - అనగా శూద్రశ్రాద్ధమందావాహనాదిక మెట్లు చేయవలె ననిన - దేవనామముచే దేవతలకును నామగోత్రములచే బితృదేవతలకును నావాహనము శూద్రులకు గోత్రమనగ కాశ్యపగోత్రమని హేమాద్రిలో నున్నది- ఇట్లుతర్పణాదిక మందును దెలియునది - కనుక ఋషిసంతతిగానందున గోత్రమేలేదనువారు మూర్ఖులేయని తెలియునది- ఇకపిండ దానమునకు హేమాద్రిలో భవిష్యవచనము "శూద్రస్తు గృహపాకేన తత్పిండాన్నిర్వపే త్తథా। సక్తుమూలం ఫలంతస్య పాయసం వాభవేత్ స్మృతం॥" అనియనగా శూద్రుడు గృహపక్వాన్నముచే పిండము లీవచ్చును అట్లు సక్తుపిండి ఫలమూలములు పాయసము వీనిచే నైనను జేయవచ్చునని యున్నది - కనుక "పక్వము చ్ఛిష్టముచ్యతే॥" యనునది విహితము గాని యన్నమునకని తెలియునది-శ్రాద్ధము పక్వాన్నముతో గూడదనియైనను గావచ్చును శూద్రుడుచేయు వైశ్వదేవమునకని స్మార్త గౌడులండ్రు - అట్లు గానిచో ననగా నంతటను శూద్రునియన్నముచ్ఛిష్టమే నైనచో శ్రాద్ధమందామము స్వయముగ సిద్ధించును గనుక నామవిధి వ్యర్థమేయగును - కనుకనట్టివిధిచే శ్రాద్ధమందంతట నామము ప్రాప్తించుచుండగ బ్రతిప్రసవముగ బిండదానమునకు పాయసాదికము విధింపబడినది - ఇక "దేవతాభ్యః పితృభ్యశ్చ" యని మొదలగునదియైనమస్కారమంత్రమని విజ్ఞానేశ్వర మదనపాలాదులండ్రు- హేమాద్రి మాత్రము "శూద్రో ప్యమంత్రవత్కుర్యాద నేన విధినాబుధః " అనిమంత్రమునకు నిషేధ మున్నందున నామమంత్రముచేత నేయనిచెప్పెను- ఇకపృథ్వీచంద్రోదయమందుస్కాందవచనము "రాజకార్యనియుక్తస్య బంధ నిగ్రహవర్తినః । వ్యసనేషుచ సర్వేషు శ్రాద్ధం విప్రేణకారయేత్॥" అనిఅనగా రాజకార్య వ్యగ్రుడై యున్నను కైదులోనున్నను మరియేవిధమైనవ్యసనములో నున్నను శ్రాద్ధము విప్రునిచే జేయింప వలెనని ద్విజులకు జెప్పి యున్నది అదిశూద్రులకును దుల్యమే - మరియేమనిన శూద్రునకుబ్రతినిధి మాత్రము విప్రుడు గూడదు అట్లువచనము "బ్రాహ్మణో హీనవర్ణస్య నకుర్యా దౌర్ధ్వదైహికం । శూద్రోపివా బ్రాహ్మణస్య వినా పారశవాత్క్వచిత్ ॥ " అనియనగా హీనవర్ణునికి బ్రాహ్మణుడు ప్రతినిధియై శ్రాద్ధము జేయగూడదు-శూద్రుడైనను బ్రాహ్మణునికి బ్రతినిధిగా గూడదు మరియేమనిన - పారశవుడన

గ బ్రాహ్మణుడు వివాహమాడిన శూద్రస్త్రీకి బుట్టినవాడుమాత్రము పతితి నిధి గావచ్చును - అనిపృథ్వీచంద్రోదయమందె పరాశరవచనము - ఇకవిష్ణుపురాణమందు "దానంచదద్యాచ్ఛూద్రోపి పాకయజ్ఞైర్యజేతవా।పిత్ర్యాదికంచ యత్సర్వం శూద్రః కుర్వీత తేనవై॥" అనియున్నది అనగా శూద్రుడును దానము లీవచ్చును పాకయజ్ఞము లాచరింపవచ్చును అట్టి పక్వాన్నముచేతనే పితృకర్మలాచరింప వచ్చునని అదియుగాంతరవిషయ మని స్మార్తగౌడులు - ఇక భారతమందు రాజధర్మములలో "యవనాః కిరాతా గాంధారాశ్చీనాః శబరబర్బరాః। శకాస్తుషారాః కంకాశ్చ పహ్లవాశ్చాంధ్రమద్రకాః" అని యీజాతుల నుద్దేశించి "బ్రహ్మక్షత్రప్రసూతాశ్చ వైశ్యాశ్శూద్రాశ్చ మానవాః। కథంధర్మాంశ్చరిష్యంతి సర్వేవిషయవాసినః॥" అనియనగా బ్రహ్మక్షత్రవైశ్యశూద్రులును మీదజెప్పిన సంకరజాతులు నెట్లుధర్మ మాచరింపవలెనని ప్రశ్నముజేసి "వేదధర్మక్రియాశ్చైవ తేషాం ధర్మోవిధీయతే।పితృయజ్ఞాస్తథాకూపాః ప్రపాశ్చ శయనానివా । దానాని చయథాకాలం ద్విజేభ్యో విసృజేత్సదా । దక్షిణాసర్వయజ్ఞానాం దాతవ్యాభూతి మిచ్ఛతా। పాకయజ్ఞా మహార్హాశ్చ కర్తవ్యా స్సర్వదస్యుభిః॥" అనియున్నది అనగావేదోక్తధర్మక్రియలు గూడ వారికి ధర్మముగ విధింపబడినవి మరియు కూపప్రపాశయ్యాది దానములును పితృయజ్ఞములును యథాకాలముగ ద్విజులకు నీవలెను సర్వయజ్ఞములకు దక్షిణ విధింపబడినందున పూజ్యములగు పాకయజ్ఞములు గూడ నందరు సంకరజాతులు చేయవలెనని - శ్రాద్ధమువిధింపబడినది- అదియు సజాతీయులకు భోజనమిచ్చుట ద్రవ్యమిచ్చుట మొదలగు తాత్పర్యమునని తెలియవలెను - అట్లు విష్ణుస్మృతి యాశనసస్మృతియు "నపక్వంభోజయేద్విద్వాన్ సచ్ఛూద్రోపి కదాచన । భోజయన్ ప్రత్యవాయీస్యాన్న చతస్య ఫలంలభేత్॥" అని యనగా సచ్ఛూద్రుడైనను బక్వాన్నముచే శ్రాద్ధమెపుడును జేయగూడదు అట్లు భుజింపజేసెనేని ప్రత్యవాయము గల్గును శ్రాద్ధమువ్యర్థమునగుననుట - కనుక నామశ్రాద్ధ మేచేయువలెనని తాత్పర్యము - ఇకద్విజులకు పాకనియమము విధించు శ్రాద్ధము లందును శూద్రునకామమే గావలెను అవి యేవనిన లఘుహారీత వచనము. "ఏకోద్దిష్టంతు కర్తవ్యం పాకేనైవ సదాస్వయం॥" అని యనగానేకోద్దిష్ట శ్రాద్ధమెపుడును పాకముచేతనే చేయవ

లెననుట మఱియు స్మృతిదర్పణమందు గాలవవచనము- "మృతాహంచ సపిం
డంచ గయాశ్రాద్ధం మహాలయం । ఆపన్నోపి నకుర్వీత శ్రాద్ధమామేన కర్హి
చిత్॥" అని యనగా ప్రత్యాబ్దికము సపిండీకరణము గయాశ్రాద్ధము మహాలయ
ము నీశ్రాద్ధముల నాపదగల్గు నప్పుడును నామముచేఁ జేయఁగూడదు పాకముచే
తనే చేయవలెననుట - అనియిట్లున్ననుశూద్రునకక్కఱలేదు- ఏమనిన "సదా
చైవతు శూద్రాణా మామశ్రాద్ధం విధీయతే॥" యని సుమంతు వచనము విధిం
పుచున్నది- ఇకశూద్రునకు దశపిండాదిక మామముచేతనేయని హాలాయుధుఁడు
చెప్పినది యుక్తముగాదు మీఁదజెప్పినట్లు పాయసాదికము గూడ ప్రతిప్రసవము
గ విధింపఁబడినది - అట్లు శూద్రుఁడు చేయునామశ్రాద్ధము నపరాహ్ణ మందే
కావలెను ద్విజులకు వలె పూర్వాహ్ణమందు గూడదు - "మధ్యాహ్నాత్పరతో
యస్తు కుతుపస్సముదాహృతః । ఆమశ్రాద్ధంతు తత్రైవ పితౄణాంద త్తమ
క్షయం॥" అని సుమంతువచనముఅనగా మధ్యాహ్నము దాటినపైని దినము ప
దునైదు ముహూర్తములలో నెనిమిదవదికుతుపమనబడును అదియామశ్రాద్ధము
నకు విహితము అపుడిచ్చునది పితృదేవతల కక్షయము - అనునది హేమాద్రి
యందు నపరార్కమందు నుదాహరింపఁబడినది - పుత్రజన్మయందు హిరణ్య
శ్రాద్ధమే అట్లుహేమాద్రిలో సంవర్తవచనము - "పుత్రజన్మని కుర్వీతశ్రాద్ధం
హేమ్నైవ బుద్ధిమాన్ । నపక్వేననచామేన కల్యాణాన్యభికామయన్ ॥"అని
యనగా పుత్రుఁడు పుట్టినపుడు బుద్ధిమంతుడగువాడు కల్యాణము గోరెనేనిహి
రణ్యశ్రాద్ధమె చేయవలెను పక్వాన్నముచేగాని యామాన్నముచేగాని కూడదని
ఆమహేమశ్రాద్ధాదికమందు విశేషము నిర్ణయసింధువులోఁ దెలియవలెను ఇకక్రి
యానిబంధనునుగ్రంథమునవ్యాసవచనము-"హిరణ్యమామ శ్రాద్ధీయంలబ్ధంయత్క్ష
త్రియాదితః।యథేష్టంవినియోజ్యంస్యాద్భుంజీయా ద్బ్రాహ్మణాత్స్వయం॥"అని
యనగా హిరణ్యముగానియామద్రవ్యముగానిశ్రాద్ధమందు దొరికినది క్షత్రియాదు
లవలననైనచో యథేష్టముగవినియోగము జేయవలెను బ్రాహ్మణుని వలననైన
చో స్వయముగాభుజింపవలెననుట - అనగా నెవ్వరిచ్చిననునాద్రవ్యముచే శ్రా
ద్ధవైశ్వదేవాదికముచేయగూడదనుట - కనుకనే దేవోద్దేశముచే నిచ్చినది దేవ
తాంతరమున కెట్లీగూడునని దేవయాజ్ఞికుఁడు చెప్పెను - శూద్రుడిచ్చిన దాని
విషయమై యక్కడనే చెప్పఁబడినది - షట్త్రింశన్మతము- "ఆమం శూద్రస్య

యత్కించి చ్ఛ్రాద్ధికం ప్రతిగృహ్యాతె । తత్సర్వంభోజనాయాలం నిత్య నైమి
కె నతు" అనియనగా శూద్రుని శ్రాద్ధమందు నొకించుక యామద్రవ్యమెద్ది ప్ర
తిగ్రహించినను అదియంతయు భోజనమునకు సరిపడియుండవలెను నిత్యనైమిత్తి
కములకు గూడదనుట - గౌడశుద్ధి తత్త్వమం దంగిరోవచనము -"శూద్రవేశ్మ
నివిప్రేణక్షీరం వాయది వాదధి । నివృత్తెన నభోక్తవ్యం శూద్రాన్నంతదపిస్మృ
తం । శూద్రాద్విప్ర గృహెష్వన్నంప్ర విష్టంతు సదాశుచి॥" అనిఅనగా శూ
ద్రగృహమందు పాలుగాని పెరుగుగాని నియమస్థుడు భుజింప గూడదు అదియు
ను శూద్రాన్నమే యనబడును శూద్రునివలన విప్రగృహమందు బ్రవేశించిన య
న్నము సదాశుచియె యగును-మరియు పరాశరుడు "తావద్భవతి శూద్రాన్నం
యావన్నస్పృశతి ద్విజః । ద్విజాతికరసం స్పృష్టం సర్వంతన్నవిరుధ్యతె॥" అ
నిచెప్పెను అనగా ద్విజుడు స్పృశింపకున్నంతవరకె శూద్రాన్న మనబడును ద్వి
జుడుముట్టినచో సర్వము శుద్ధమగుననుట-అట్లువిష్ణు పురాణమందును "సంప్రోక్ష
యిత్వాగృహ్ణీయాచ్ఛూద్రాన్నం గృహమాగతం॥" అనియనగా గృహమునకు
దెచ్చిన శూద్రాన్నమును బ్రోక్షించి గ్రహింపవచ్చుననుట - అట్లంగిరో వచన
ము "పాత్రాంతరగతం గ్రాహ్యం దుగ్ధం స్వగృహమాగతం॥" అనియనగా ద
నగృహమునకు దెచ్చిన దుగ్ధమునుపాత్రాంతరముచే గ్రహింపవచ్చునని - అట్లె
నుపనీత స్త్రీశూద్రాదుల కుత్తరీయము చేతనే సవ్యాపసవ్యములని తెలియవ
లెను. అట్టి యుత్తరీయము వస్త్రములేనిచో రెండుమూడు నాలుగంగులము
ల వెడలుపుగల గుడ్డ పరిమండల మైనను గావచ్చును - "షణ్ణవత్యంగులం దీ
ర్ఘం" మని జాతూకర్ణ్య వచనముచే దొంబది యారంగులముల పొడవుండ
వలసినది - అదిలేనిచో నుపవస్త్రమె యగునని బ్రహ్మవచనము "అపసవ్యంక్రి
యాద్వస్త్రం కృత్వాకశ్చిత్స గోత్రజః॥" అనియున్నదని మైథిల వాచస్పతిచెప్పె
ను స్మృతి కౌముది యందుబౌధాయనుడు - శూద్రాణామని యుపక్రమించి
ఉపనీతం వస్త్రవిన్యాసాత్ అనిచెప్పెను. శంఖవచనము "చతుర్భిర్దర్భ ఫుంజీ
లై బ్రాహ్మణస్య పవిత్రకం।ఏకైకన్యూనముద్దిష్టం వర్ణేవర్ణేయథాక్రమం॥"
అనియనగా నాలుగుదర్భ దలములతో గట్టినపవిత్రము బ్రాహ్మణుడు ధరింప
వలెను - అందొక్కొక్క దలము తక్కువగా దర్భలతో గట్టిన పవిత్ర ములను
క్రమముగ క్షత్రియవైశ్య శూద్రులు ధరింపవలెననుట - మండలాద్యర్చనమం

దు"శూద్రస్యాభ్యుక్షణంమత"మని మొదలుగనిర్ణయసింధువునందు దెలియవలెను. శూద్రునికి తిలకవిధి పరాశర పురాణమందున్నది - "ఊర్ధ్వపుండ్రం త్రిపుండ్రం చవర్తులంచతురశ్రకం । అర్ధచంద్రాదికం లింగం వేదనిష్ఠోనధారయేత్॥ అనియనగా నుదుట మీదికి రేఖదీయుట యూర్ధ్వపుండ్రము - అడ్డముగ మూడుదీర్ఘరేఖలు త్రిపుండ్రము- వర్తులము చతురశ్రముప్రసిద్ధములే-యిట్లు నాల్గు విధములు తిలకములు ఇకనర్ధ చంద్రాద్యాకార తిలకములు వేదనిష్ఠుడు ధరింపగూడదనుట . ఇక్కడ వేదనిష్ఠుడనుటచే శూద్రాదుల కనుజ్ఞయీబడినది- మదన పారిజాతమందు బ్రాహ్మవచనము - ఊర్ధ్వ పుండ్రం ద్విజఃకుర్యాత్ క్షత్రియస్తుత్రిపుండ్రకం । అర్ధచంద్రంతు వైశ్యస్య వర్తులం శూద్రజాతిషు॥" అనియున్నది అనగా నూర్ధ్వపుండ్రము విప్రుడును త్రిపుండ్రము క్షత్రియుడును నర్ధచంద్రము వైశ్యుడును వర్తులతిలకము శూద్రుడును ధరింపవలె ననుట- విష్ణువు నాశ్వలాయనుడును "శంఖచక్రాద్యంకనంచ గీతనృత్యాదికం తథా।ఏకజాతేరయం ధర్మోన జాతుస్యాద్ద్విజన్మనః॥" అనిచెప్పిరి అనగా శంఖచక్రాదిచిహ్నములు ధరించుటగీత నృత్యాదులు నేర్చుటయివి శూద్రునివి ధర్మములు ద్విజులకివి గూడదనుట - పురుషార్థ ప్రబోధము శివసర్వ స్వము మొదలగువానిలో మాత్రము స్త్రీశూద్రులకు విభూతి ధారణముగూడ జెప్పబడినది - ఇట్లు రామకృష్ణ భట్టాత్మజుడగు కమలాకర భట్టునిచే రచింపబడిన శూద్రధర్మమందు శూద్రశ్రాద్ధనిర్ణయము ముగిసెను.

ఇకశూద్రులకు విహిత నిషిద్ధ ధర్మములు - అందులఘుపరాశర వచనము "విక్రీణన్మద్యమాంసాది త్వభక్ష్యస్యచ భక్షణాత్ । కుర్వన్నగమ్యాగమనం శూద్రః పతతితత్క్షణాత్। కపిలాక్షీర పానేన బ్రాహ్మణీ గమనేనచ । వేదాక్షరవిచారేణ శూద్ర శ్చండాల తాంవ్రజేత్॥"అనియనగా మద్య మాంసాదులమ్మినను నభక్ష్యవస్తువులు భక్షించినను అగమ్యస్త్రీలతో సంగము చేసినను పతితుడగును - మరియు గపిలగోవుపాలు ద్రాగినను బ్రాహ్మణ స్త్రీసంగముచేసినను వేదాక్షరముల జదివినను శూద్రులకు చండాలత్వము వచ్చునని యర్థము. మరియు నొకవచనమతనిదే యున్నది యెట్లనిన"లవణం మధుమద్యంచ దధితక్రం ఘృతంపయః । నదుష్యే చ్ఛూద్రజాతీనాం కుర్యాత్సర్వేషు విక్రయం॥" అనియనగా,నుప్పు, తేనె,మద్యము, పెరుగు,చల్ల, నేయి,పాలునివియన్నియు శూద్రులమ్మ

వచ్చును దోషములేదని యున్నదిగాని అది యాపత్కాలమందని తెలియునది. స్మృతి కౌముదిలో నసచ్ఛూద్రులకని యున్నది - ఇట్లుహీన శూద్రులకు మద్య మాంస భక్షణమందును దోషములేదు నిషిద్ధమాంసము దినకూడదు కనుకసురా పానముజేయు శూద్రునిసంసర్గముదోషముగాదు-పతితసంసర్గముగదా దోషము- అట్టిశూద్రుడు పతితుడుగాడు. ద్విజులకదినిషిద్ధముగనుక పతితత్వముగల్గునుఅట్టిద్విజసంసర్గముశూద్రునకుదోషమె-ఇకశూద్రుడదివిడిచెనేనిమహాఫలము-అట్లు మనువచనము "నమాంసభక్షణేదోషోనమద్యేనచమైథునే। ప్రవృత్తిరేషాభూతానాంనివృత్తిస్తుమహాఫలా॥" అనియనగామాంసభక్షణమందునుమద్య పానమందును మైథునమందునుదోషములేదుఏమనినజంతుమాత్రమున కిదిరాగ ప్రాప్తముగుప్రవృత్తి - అదివిడిచినచో మహాఫలమగు ననుట - సచ్ఛూద్రులకది నిషిద్ధమే. ఇట్లు కాళికాపురాణమందు "విక్రయంసర్వ వస్తూనాం కుర్వన్ శూద్రోన దోషభాక్ । మధుచర్మసురాంలాక్షాం భుక్త్వా మాంసంచ పంచమం॥" అనియనగా శూద్రుడు సర్వవస్తువుల నమ్మినను దోషములేదు మధువును చర్మమును సురను లత్తుకను మాంసమునీ నైదిటిని భక్షించినచో దోషియగును అని యాపదలేనపుడు నిషేధమని కల్పతరువు - పరాశరపురాణమందును - "పిణ్యాకమాసవస్తైలం గవ్యం తక్రాదికంతథా । శూద్రాదేవతు సంగ్రాహ్యం నద్విజేభ్యః కదాచన" అనియనగా తెలకపిండియు పుష్పాసవమునూనెయునావుచల్ల మొదలగునదియు శూద్రునియొద్దనె కొనవలెను ద్విజులయొద్దకొనగూడదనుట స్కాందము ప్రభాసఖండమందు - "నదర్భానుద్ధరేచ్ఛూద్రోనపిబేత్కపిలంపయః। మధ్యపత్రేనభుంజీత బ్రహ్మవృక్షస్యభామిని। నోచ్చరేత్ప్రణవం మంత్రం పురోడాశంనభక్షయేత్ । నశిఖీనోపవీతీస్యాన్నోచ్చరేత్సంస్కృతాంగిరం । నపఠేద్వేదవచనం త్రిషవంనహిసేవయేత్ । నమస్కారేణమంత్రేణ క్రియాసిద్ధిర్భవేద్ధ్రువం । నిషిద్ధాచరణంకుర్వన్ పితృభిస్సహమజ్జతి॥" అనియున్నదిఅనగాశూద్రుడు దర్భగోయ గూడదు కపిలగోవుపాలు ద్రాగగూడదు - బ్రహ్మమేడి దళములు మూడిటిలోమధ్యదళమందు భుజింపగూడదు ప్రణవమంత్రమునుచ్చరింపగూడదు పురోడాశము భక్షింపగూడదు శిఖను ధరింప గూడదు ఉపవీతము వేసుకొన గూడదు సంస్కృతవాణి నుచ్చరింపగూడదు వేదముజదువగూడదు

త్రిషవణస్నానముచేయగూడదు - మరియేమనిన నమస్కారమంత్రముచేతనే య
తనికి సర్వక్రియలుసిద్ధించును - కనుక నిషిద్ధక్రియలాచరించెనేని పితృదేవతలతో
నరకమందు మునుగుననుట- మరియును మాత్స్యమందు గలిధర్మములలో-"తతః
ప్రభృత్యయం లోకస్సర్వో వ్యాపత్స్యతేభృశం॥" అనియనగా నదిమొదలుగ నీ
లోకమంతయు జెడుననియుపక్రమించి "బ్రాహ్మణాశ్శూద్రయోనిస్థాశ్శూద్రా
వై మంత్రయోనయః । ఉపస్థాస్యంతి తాన్విప్రాః వేదార్థమభిలిప్సవః॥" అని
చెప్పబడినది అనగా బ్రాహ్మణులు శూద్రజాతిలో గలియుదురు శూద్రులును
బ్రాహ్మణజాతిలో గలసి వేదార్థ విచారము జేతురనుట - ఇట్లులైంగమం
దును "శూద్రాణాం మంత్రయోనిశ్చ సంబంధో బ్రాహ్మణైస్సహ । భవతీహ
కలౌతస్మిన్శయనాసన భోజనైః । రాజాన శ్శూద్రభూయిష్ఠా బ్రాహ్మణా
న్ బాధయంతితే। శూద్రాశ్చ బ్రాహ్మణాచారాశ్శూద్రాచారాశ్చ బ్రాహ్మ
ణాః । అక్షత్రియాశ్చరాజానో విప్రాశ్శూద్రోపజీవినః । శూద్రాభివాదినస్స
ర్వేబ్రాహ్మణైరభివందితాః । ఆసనస్థా ద్విజాన్దృష్ట్వా నచలంత్యల్పచేతసః।
తాడయంతి ద్విజేంద్రాంశ్చ శూద్రా వైస్వల్ప బుద్ధయః।ఆస్యేనిధాయ వై
హస్తం కర్ణేశూద్రస్య వైద్విజాః । నీచస్య చతదావాక్యం వదంతి వినయే
నతు । అధీయతే తథావేదాన్ శూద్రాధర్మార్థ కోవిదాః । యజంతే
చాశ్వమేధేన రాజానశ్శూద్రయోనయః । తస్మాదాయుర్బలం రూపం కలిం
ప్రాప్య ప్రహీయతే । తదాత్వల్పేన కాలేన సిద్ధిం గచ్ఛంతి మానవాః। ధన్యా
ధర్మం చరిష్యంతి యుగాంతె సముపస్థితే । త్రేతాయాం వార్షికో ధ
ర్మ స్తదహ్నా ప్రాప్యతే కలౌ॥" అని యనగా శూద్రులకు మంత్రయోనియగు
సనగ గలియుగమందు బ్రాహ్మణులతో శయనాసన భోజనములచేసర్వదాసం
బంధమగును - తరుచుగ శూద్రులే ప్రభువులై బ్రాహ్మణుల బాధింతురు- శూ
ద్రులు బ్రాహ్మణాచారమును బ్రాహ్మణులు శూద్రాచారమును జేయుదురు -
క్షత్రియులకంటె నితరులు రాజులగుదురు బ్రాహ్మణులు శూద్రులనాశ్రయించి
జీవింతురు - శూద్రులకు నమస్కరింతురు ఇట్లు నమస్కరింపఁబడి యున్నతా
సనమునందు గూరుచుండి యల్పబుద్ధులు గనుక ద్విజులను జూచియు లేవరు సరి
యేకదా బ్రాహ్మణోత్తముల దండింతురు - కనుక బ్రాహ్మణులు శూద్రుని
యొద్ద వినయముతో నిలువబడి చేతితో నోరుచాటుజేసుకొని మనవిజేసుకొన వ

లసివచ్చును - శూద్రులు వేదాధ్యయనము జేతురు ధర్మార్థముల బండితు
లగుదురు ఇట్లు శూద్రజాతిలో గలసి రాజులశ్వమేధము జేతురు దానిచే నాయు
ర్బల రూపములు నశించును - అట్టియుగాంత సమయమందును గొందరు ధ
న్యులు ధర్మమాచరింతురు వారికి స్వల్పకాలముచేతనే ధర్మసిద్ధియగును ఎట్ల
నిన త్రేతాయుగమందుసంవత్సరమాచరించిన ఫలముకలియుగమం దొకదినము
ననే సిద్ధించునని ఇట్లు కూర్మపురాణమందు నున్నది.మరియును గౌర్మమందే
"శుక్లదండాజినాఖ్యాశ్చముండాః కాషాయ వాససః । శూద్రా ధర్మంచ రి
ష్యంతి యుగాంతె సముపస్థితె । తాడయంతి ద్విజేంద్రాంశ్చ శూద్రా రాజో
పజీవినః । ఉచ్చాసనస్థాన్ శూద్రాంశ్చ ద్విజమధ్యే పరంతప। పుష్పైశ్చభూ
షణై శ్చైవ తథాన్యై ర్మండనై ర్ద్విజాః। వాహనస్థాన్ సమావృత్య శూ
ద్రాన్ శూద్రోపి జీవినః । సేవంతె బ్రాహ్మణాస్తాంస్తు స్తువంతి స్తుతిభిః క
లౌ । అధ్యాపయంతివై వేదాన్ శూద్రాన్ శూద్రోపి జీవినః । పఠంతి వై
దికాన్ మంత్రా న్నాస్తిక్యం ఘోరమాశ్రితాః॥" అని యున్నది అనగా జైన
మతముగ్రహించి ముండనము జేసుకొని కాషాయవస్త్రములు ధరించి తెల్లనిదం
డములు గలిగి శూద్రులట్టి యుగాంతమున బైరాగి ధర్మమాచరింతురు - మ
రియును రాజభటులైనశూద్రులు బ్రాహ్మణోత్తములగొట్టుదురు బ్రాహ్మణులు
ద్విజమధ్యమందు నున్నతాసనముపై గూరుచున్న శూద్రులను పుష్పవస్త్ర భూ
షణాదులచే బూజింతురు మరియు శూద్రులు వాహనములపై నుండగ జుట్టును
నిలచి సేవింపుచు స్తోత్రములచే స్తుతిజేతురు మరియును శూద్రులకు వేదము
జెప్పుచు నందువలన జీవింతురు శూద్రులును నాస్తికత్వము నవలంబించి వేద
మంత్రములు పఠింతురని. ఇట్లు కలిధర్మములం దంతట నిట్లు చేయగూడదని ని
షేధ మూహించునది - మరియును స్కాంద కౌర్మములలోగలిధర్మములం
దు - "యతోపిమాయానరో వక్తా సంవాదో నారదస్యతు । తత్రిబౌద్ధంచజై
నంచ శాక్తంశైవంచ వైష్ణవం । యోగజ్ఞానమతం భ్రాంతం విరుద్ధం వేదశా
స్త్రతః । పఠిష్యంతె కలౌ బ్రహ్మన్ తన్మతేన ద్విజాతయః । స్త్రీయశ్చ
శుశ్రూషణం పత్యుర్వాప్రాణాం శూద్రజాతయః । పిత్రోః పుత్రాః పరిత్యజ్యాజ
పహోమాది సాధనం । కుర్వతె కామ్యకర్మాణి దృష్టార్థాని పఠంత్యధః।
లౌకికై ర్నామభిర్గీతైః దేవతారాధనంతుయత్ । శూద్రాదీనామయంధ

మోఽ నద్విజానాం కదాచన । శూద్రాణాం కృతకైర్గీతైర్దేవతానాం
కలౌయుగే । నృత్యంకుర్వంతి విప్రాద్యా అవజ్ఞాయ శ్రుతీరితం । గాయంతి
విధవాగీతం శ్రోతౄణామపి పాపదాః॥" అనియున్నది - అనగా నుమాదేవికి
నరనారదులసంవాదమందు బౌద్ధజైన శాక్తశైవవైష్ణవమతములును వేదశాస్త్ర
విరుద్ధమగుటచే భ్రాంతమైన యోగజ్ఞానమతమును గల్గినది - కలియుగ మందు
ద్విజులందరు నామతమున బ్రవర్తింతురు స్త్రీలు పతిశుశ్రూషయు శూద్రులు
ద్విజశుశ్రూషయు బుత్రులు పితృశుశ్రూషయు జపహోమాదిశ్రౌత సాధనము
విడిచి దృష్టార్థమైనకామ్యకర్మలు చేయుచు నధోగతి నొందుదురు - లౌకిక
మైననామములచేతను పాటలచేతను దేవతల నారాధించుట శూద్రుల ధర్మ
ము ద్విజులకుగాదు అట్లు శూద్రధర్మమైనపాటలు పాడుచు బ్రాహ్మణాదు
లు సహితము వేదధర్మము నవమానించి కలిలో నాట్యము జేయుదురు విధవ
లుసహితము వినువారికి బాపము గల్గునట్లు పాటలు పాడుచు భజనజేతురు
అని - విష్ణుపురాణమందును - "అపహాయ నిజంకర్మ కృష్ణకృష్ణేతి వాదినః ।
తేహరేర్ద్వేషిణః పాపా ధర్మార్థం జన్మయద్ధరేః॥" అని యనగా స్వకీయ
మైన వర్ణాశ్రమకర్మను విడచి కృష్ణ కృష్ణయని భజింపుచుండువారు హరికిద్వే
షులు - కనుక పాపిష్ఠులు- ఏమనిన భగవంతుని యవతారము ధర్మసంస్థాప
నమునకు గదా. మరియు నచ్చటనే " ద్విజశుశ్రూషయైవైష పాకయజ్ఞాధికార
వాన్ । నిజాన్యాతి చవై లోకాన్ శూద్రోధన్యతర స్తతః॥" అనియున్నది-అ
నగా శూద్రుడు పాకయజ్ఞాధికారము గలిగి ద్విజశుశ్రూష జేయుట చేతనే
తనకు నియతమైన లోకముల నొందును - కనుక నితరులకంటె శూద్రుడు ధ
న్యతరుడనుట - మరియును "దానంచ దద్యాచ్ఛూద్రోఽపి పాకయజ్ఞైర్యజేత
చ । పిత్ర్యాదికంచ వైసర్వం శూద్రః కుర్వీత వైనరః॥" అని యనగా శూ
ద్రుడు దానమీవచ్చును పాకయజ్ఞములాచరింపవచ్చును పిత్ర్యాదికర్మలుస
ర్వము జేయవచ్చు ననుట - ఇక్కడ పాకయజ్ఞములనగ బంచమహా యజ్ఞము
లు ఏమనిన పాకశబ్దము "తంపాకేనమనసా"యను నట్లు ప్రశస్తార్థకము - లే
దా "యోస్మత్పాకతరః"అనునట్లు అల్పార్థకమైనను గావచ్చును - మదనపా
రిజాతమందు బృహస్పతివచనము - "శౌచం బ్రాహ్మణశుశ్రూషా సత్యమక్రో
ధఏవచ । శూద్రకర్మ తథామంత్రో. నమస్కారోస్య చోదితః ॥" అని అన

గా శుచిత్వము బ్రాహ్మణ శుశ్రూషయు సత్యముక్రోధవర్జనమునను నియమ
ములె శూద్రునికి కర్మయనబడును నమస్కారమే మంత్రమగును - సంక్షిప్త
మనుట. అట్లు భారతమున నానుశాసనిక పర్వమందును - "దృష్ట్వాపితా మహః
శ్శూద్ర మభిభూతంతు తామసైః । ద్విజశుశ్రూషణం ధర్మం శూద్రాణాం
తుప్రయుక్తవాన్ । నశ్యంతితామసాభావా శూద్రస్య ద్విజభక్తితః । ద్విజ
శుశ్రూషయాశూద్రః పరంశ్రేయోధిగచ్ఛతి । అహింసక శ్శుభాచారో దేవ
తాద్విజపూజకః । శూద్రోధర్మ ఫలైరిష్టై స్స్వధర్మేణైవ యుజ్యతే।స్వా
హాకార నమస్కారౌ మంత్రౌ శూద్రోపిధీయతాం । తాభ్యాం శూద్రః పాక
యజ్ఞైర్యజేత బ్రహ్మవాన్స్వయం । సంచయాంశ్చ నకుర్వీతజాతుశూద్రః క
థంచన । పాపీయాన్హిధనం లబ్ధ్వా బాధేతాపిగరీయసః । రాజ్ఞావాస మ
నుజ్ఞాతః కామంకుర్వీత ధర్మతః॥" అని యున్నది అనగా సృష్టికర్త తామస
భావములచేనిండియున్నశూద్రునిజూచి దయచే శూద్రునకు ద్విజశుశ్రూషణమేధ
ర్మమని నిర్ణయించెనుఅట్లు ద్విజభక్తిచే తామసభావములునశించును-ఇంతియే
కాక ద్విజశుశ్రూషచే నుత్తమశ్రేయస్సునొందును - హింసజేయకశుభమైనయా
చరణము గల్గి దేవబ్రాహ్మణపూజయొనర్చునేని దనధర్మముచేతనే యిష్ట ధ
ర్మఫలములొందును - మరియును స్వాహాకార నమస్కారములను మంత్రము
లు శూద్రునకు విధింపబడినవి- వానిచేతనే మంత్రయుక్తుండైపాకయజ్ఞములా
చరింపవలెను - శూద్రుండు ధనాది సంగ్రహముల జేయగూడదు - అట్లుచేసె
నేని నొకవేళ పాపబుద్ధిచేనుత్తములబాధించునేమో - లేదా రాజాజ్ఞచేధర్మ
మార్గమున సంగ్రహము జేసినను జేయవచ్చును - అట్లాపస్తంబవచనము "శు
శ్రూషాశూద్రస్యేతరేషాంవర్ణానాంపూర్వస్మిన్ పూర్వస్మిన్ నిశ్రేయసంభూ
యః॥" అనియనగా శూద్రునకితరవర్ణముల సేవధర్మము అందుబూర్వపూర్వ వ
ర్ణములందు సేవమిక్కిలి శ్రేయస్కరమని - అట్లు బౌధాయనవచనము "శూ
ద్రాణామార్యాధిష్ఠితానాంమాసిమాసి వపనమాచమనకల్ప ఉపవీతం వస్త్రవి
న్యాసాది॥" అని అనగా - "అర్యస్స్వామివైశ్యయోః॥" అనుపాణిని సూత్ర
ముచే వైశ్యులర్యులు వారి శుశ్రూషజేయు శూద్రులకు ప్రతిమాసమందువపన
మును ఆచమనకల్పమనగా ముమ్మారాచమనము నాశౌచశుద్ధియు వైశ్యులకువ
లెనగును వస్త్రముచే నుపవీతకృత్యమనగ సవ్యాప సవ్యకరణము నగునని- అట్లు

మనువచనము - "శూద్రాణాంమాసికంకార్యం వపనంన్యాయవర్తినాం । వై
శ్యవచ్ఛౌచకల్పశ్చద్విజోచ్ఛిష్టంచభోజనం।శౌచమాచమనంసూతసూతకంచైవవై
శ్యవత్॥" అనియనగా న్యాయవర్తులైన శూద్రులకు మాసక్షౌరము వైశ్యు
లకువలె నాశౌచమనగపదునైదుదినము లాశౌచముమూడుమారులాచమనముద్వి
జభుక్త శేషము భుజించుటయువిహితకృత్యములనుట ఇకనేమనిన యాజ్ఞవల్క్య
వచనము "శుద్ధ్యేరన్ స్త్రీచ శూద్రాశ్చసకృత్ స్పృష్టాభి రంతతః॥"అని యనగా
స్త్రీశూద్రులుదవడలను మాత్రము స్పృశించు నుదకములచే నొకమారాచ
మించిశుద్ధులగుదురు-అంతియేకానియోష్ఠమార్జనముఘ్రాణస్పర్శనము మొదలగున
దియక్కరలేదనియున్నదిగానిఅదిహీనశూద్రులకనిమదనపాలుడు "త్రిఃప్రాశ్యాపో
ద్విరున్మృజ్యభాన్యద్భిస్సముపస్పృశేత్॥" అనియాజ్ఞవల్క్యునిచే మువ్మారాచ
మించిరెండుమారులుపెదవులదుడిచిజలముతోనింద్రియములు స్పృశింపవలెనని త్రి
రాచమనమందేయాక్రియలు విధింపఁబడినవని కొందరు - ఇతరులు ఉపలక్షణ
ముగనుక స్త్రీశూద్రులకును గావచ్చుననిరి- కనుకనే స్త్రీచశూద్రాశ్చయని శూ
ద్రునకు విశేషమాత్రము చెప్పబడె నంద్రు - ఇకద్విజభుక్తశేషమనగ పాకపా
త్రలో మిగిలినదిగాని భోజనపాత్రస్థముగాదు - దానికి నిషేధవచనము "నశూ
ద్రాయ మతిం దద్యాన్నోచ్ఛిష్టం నహవిఃష్కృతం"అనిమీదవ్రాయబడినది- మరికొం
దరు యథాశ్రుతముగ సకృజ్జలపానమెయనిరి - ఇట్లుగౌతమవచనము "శూద్రశ్చ
తుర్థోవర్ణ ఏకజాతిస్తస్య సత్యమక్రోధశ్శౌచమాచమనార్థే పాదప్రక్షాల
నమేవైకే శ్రాద్ధకర్మభృత్య భరణం స్వదార వృత్తి రనుజ్ఞాతోస్య నమస్కా
రోమంత్రః పాకయజ్ఞైస్స్వయంయజేతేత్యేకే" అనియనగా శూద్రుడు నాల్గ
వ వర్ణమునొకమారు జననమనగ సంస్కార జన్మము లేదనుట అతనికి సత్యము
క్రోధవర్జనము శుచిత్వము నాచమనము నిమిత్తము పాదప్రక్షాలనము మాత్ర
మని కొందరు శ్రాద్ధముజేయుట భృత్యుల బోషించుట స్వభార్య యందె సం
గము నివిధకర్మములు మంత్రము నమస్కారమే పాకయజ్ఞములచే స్వయము
గనేయాగముచేయవలెనని కొందరు ఇక్కడ పాకయజ్ఞములనగ నష్టకాది శ్రా
ద్ధములనియు స్వయముగాజేయుట యనగ ఋత్విగాదులచే గూడదనియు నా
సూత్ర భాష్యమందున్నది స్వయమనునది పత్న్యాదులతో గూడదనుటకని లక్ష్మీ
ధరుడు - ఇక కొందరనిరనిచెప్పుటచే విప్రద్వారముగను గావచ్చునని ప్రతిష్ఠా

దులలో జెప్పఁబడినది - శక్తుఁడైనచో స్వయముగను గానిచో విప్రద్వారముగ
ను గావచ్చును. సచ్ఛూద్రుఁడు స్వయముగను హీనశూద్రుఁడు విప్రద్వారముగనని
జయపాలుఁడు - ఇక హేమాద్రిలో భారతవచనము - "శ్రాద్ధకర్మణయశ్చై
వ సత్యమ క్రోధ ఏవచ। స్వేషు దారేషు సంతోషశ్శౌచం నిత్యానసూయతా।
ఆత్మజ్ఞానంతితిక్షాచ ధర్మస్సాధారణోనృప॥" అనియనగా శ్రాద్ధకర్మయునీ
తియు సత్యము క్రోధవర్జనము స్వదార తుష్టిశుచిత్వము నసూయ లేకుండుటఆ
త్మజ్ఞానము క్షమయునను నివినాల్గువర్ణములకు సాధారణములు - శూద్రుల
కుబురాణశ్రవణముచేనాత్మజ్ఞానము-ఇక "వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థా" య
నియు"తంత్వౌపనిషద"మనియునున్నందునశ్రోతవ్యయనుశ్రవణని"యమవిధియుపని
షత్తులచేత నేయనినియమింపబడినను అది ద్విజులకె యనివ్రత హేమాద్రిలోనున్నది-క
నుకనే భగవద్గీతా వచనము- "మాముపాశ్రిత్యకౌంతేయ యేపిస్యుః పాపయోన
యః। స్త్రియోవైశ్యాశ్చశూద్రాశ్చ తేపియాంతిపరాంగతిం" అనియనగానోయర్జును
డాహీనజన్ములైన స్త్రీలు వైశ్యులుశూద్రులు సహితముననునాశ్రయించి రేనియు
త్కృష్టమైన మోక్షగతినొందుదురని-కనుకనే బ్రహ్మసూత్రభాష్యమందునుశూద్రాధి
కరణములో శూద్రునికి "వేదపూర్వస్తునాస్త్యధికారః" అనిపురాణశ్రవణముచేనా
త్మజ్ఞానాధికారమును మతింపబడినది-మరియు హేమాద్రిలో విష్ణుస్మృతి। "క్షమా
శౌచందమోదాన మింద్రియం సత్యసంయమా। అహింసా గురుశుశ్రూషాతీ
ర్థానుసరణందయా। ఆర్జవం లోభశూన్యత్వం దేవబ్రాహ్మణ పూజనం।
అనభ్యసూయాచతథా ధర్మస్సామాన్య ఉచ్యతే॥" అనియనగా క్షమయు
శుచిత్వము దమము దానము నింద్రియ నిగ్రహము సత్యము అహింసయుగురుశు
శ్రూషయు తీర్థాటనము భూతదయ ఋజుత్వము లోభవర్జనము దేవబ్రా
హ్మణుల బూజించుట అసూయ లేకుండుటయు నివిసర్వవర్ణములకు సాధా
రణ ధర్మములని మనుపరాశరులు శూద్రునికి వృత్తిజెప్పిరి "శుశ్రూషైవతుశూ
ద్రస్య ధర్మేనిశ్రేయసః పరః। శుచిరుత్కృష్టశుశ్రూషుర్మృదు వాగనహం
కృతః। బ్రాహ్మణోపాశ్రయో నిత్యముత్కృష్టాం జాతిమశ్నుతే। శూద్రస్తు
వృత్తిమాకాంక్షన్ క్షత్ర మారాధయేద్యది। ధనినం వాప్యుపారాధ్యవైశ్యం
శూద్రో జిజీవిషేత్। స్వర్గార్థము భయార్థంవా బ్రాహ్మణానేవరాధయే
త్। విప్రసేవైవశూద్రస్య విశిష్టం కర్మకీర్త్యతే। యదతోన్యద్ధికురుతే తద్భవ

త్యస్యనిష్ఫలం॥" అనియనగా- శూద్రునికి విధింపబడిన ధర్మములలో ద్విజశుశ్రూ
షయే మిక్కిలి శ్రేయస్కరము కనుక శుచియై ద్విజసేవ జేయుచు మృదువచనములు
పలుకుచు నహంకారమువిడిచి బ్రాహ్మణు నాశ్రయించి జీవించెనేని యుత్కృష్ట
జాతిలోపుట్టును - శూద్రుడు జీవనార్థము క్షత్రియునిగాని ధనికుడైన వైశ్యు
నిగాని సేవింపవచ్చును స్వర్గార్థమైనను లేదా యుభయలోకార్థమైనను బ్రాహ్మ
ణులనే సేవింపవలయును విప్రసేవయే శూద్రునకు ప్రశస్త కర్మ యనబడును
దానివిడిచి తక్కినస్నానదానాది కర్మలెన్ని జేసినను నిష్ఫలములే యని. శూద్రు
నిచే సేవింపబడువారి ధర్మము- "ప్రకల్ప్యా తస్యతైర్వృత్తిః స్వకుటుంబా
ద్యథార్హతః । శక్తించావేక్ష్యదాక్ష్యంచ భృత్యానాం పరిసంగ్రహే । తై
ర్ద్విజైః పుత్రవదసౌ పాలనీయః॥" అనియనగా నట్లు సేవింపుచున్న శూద్రునికి
ద్విజులు తమకుటుంబమునుండి జీవనము యథార్హముగ గల్పించవలెను - భృ
త్యసంగ్రహమందు శక్తినిదక్షతనునాలోచించి పుత్రునివలె పాలింపదగునని - మే
ధాతిథి - మరియును- "ఉచ్ఛిష్టమన్నందాతవ్యం జీర్ణానివసనానిచ । పూ
లకాశ్చైవధాన్యానాం జీర్ణాశ్చైవపరిచ్ఛదాః॥" అనియనగా నతనికి నుచ్ఛి
ష్టమనగా దాము భుజింపగ బాకపాత్రమందు మిగిలిన యన్నమును జీర్ణములన
గగట్టివిడిచిన బట్టలు ధాన్యముపంటలో లేకియు నిట్లు తాము వాడివిడిచినయుపక
రణము లన్నియు దాసుని కీవలెననుట - మరియు గౌతమసూత్రము- "తేభ్యో
వృత్తిం విలిప్సేతజీర్ణాన్యుపానచ్ఛత్రవాసః కూర్చాదీన్యుచ్ఛిష్టాశనంశిల్పంవృ
త్తిశ్చ యద్యద్యమాశ్రయేద్భర్తవ్యస్తేనక్షీణోపిశూద్రేణచోత్తర స్తదర్థోస్యని
చయస్స్యాత్" అని అనగా శూద్రుడు ద్విజులవలనజీవన మపేక్షించి యాశ్రయిం
చి వారిచ్చు శేషాన్నము భుజించి వారిచ్చినబట్టలు చెప్పులు గొడుగు కంబళి మొ
దలగు వానిననుభవింపుచు బనిచేయుటయె వృత్తిగనుండునది మరియును వృత్తిచే
హీనుడైవైశ్యు నాశ్రయించెనేని నతడును వానిభరించి పోషింపవలెను - ఒకవేళ
వైశ్యుడు క్షీణవృత్తియైనచో శూద్రుడును వాని బోషించునది యందులకే సం
గ్రహము శూద్రునికి విధింపబడినది - ఇక్కడనుచ్ఛిష్టదానముదాసుని కని తెలి
యవలెను - కొందరు - "ఉచ్ఛిష్టమన్నందాతవ్యం శూద్రాయ గృహమేధినే।
గృహస్థాయతు దాతవ్య మన్నమేవదినేదినే॥" అనివ్యాఘ్రవచనమనగా దమగృ
హమందే కనిపెట్టియుండి పని జేయు శూద్రునికి భుక్తశేషాన్నమీవలెను వేరుగృ

హోమందు గుటుంబముతోనున్న శూద్రునకు దగునంతకర్మానకీవలెనని యున్నం
దుననుచ్ఛిష్టదాన నిషేధము గృహస్థుడగుశూద్రుని విషయమని యంద్రు- అట్లుమ
దన రత్నమందును "తపశ్శూద్రస్య సేవనం" అనియనగాశూద్రునకు దపస్సుద్విజ
శుశ్రూషయేయని - మరియు యాజ్ఞవల్క్య వచనము "శూద్రస్య ద్విజశుశ్రూ
షాతయా జీవన్ వణిగ్భవేత్ । శిల్పైర్వావివిధై ర్జీవేద్ద్విజాతిహితమాచరన్॥"
అనియనగా ద్విజశుశ్రూషచేత జీవించెనేని శూద్రుడు వైశ్యజన్మ మెత్తును లే
దానానావిధమైన శిల్పములు పనిముట్లుచేయుచు ద్విజులకు హితముగ జీవింపవ
చ్చునని - అట్లునృసింహ పురాణమందు "అయాచిత ప్రదాతాస్యాత్కృషిం
వృత్త్యర్థ మాశ్రయేత్ । పురాణంశృణుయా న్నిత్యం నరసింహస్యపూజనం॥"
అనియనగా శూద్రుడు అయాచితముగ నిచ్చువాడును జీవనమునకై కృషిజేయు
వాడును గావలెను నిత్యము పురాణశ్రవణము జేయునది నృసింహమూర్తి పూ
జయు జేయవలెనని- ఔశనసస్మృతియు "శూద్రస్య ద్విజశుశ్రూషాసర్వశిల్పా
ని చాప్యథ । విక్రయస్సర్వపణ్యానాం శూద్రధర్మ ఉదాహృతః॥" అని అన
గాశూద్రునికి ద్విజసేవయు గృహనిర్మాణము మొదలగు శిల్పములు సమస్తవ
స్తువులనమ్ముటయు ధర్మములనుట - దేవలస్మృతి "శూద్రధర్మ స్త్రివర్ణ
శుశ్రూషాకళత్రాది పోషణం కర్షణభారోద్వహన పణ్యవ్యవహార చిత్రకర్మ
నృత్య గీత వేణు మృదంగవాదనానీతి॥" అనగాద్విజశుశ్రూషయుగుటుంబ పోషణ
ము భూమిదున్నుట భారము మోయుట వస్తువులనమ్ముట రంగులువేయుటనృత్య
ముగానము వేణుమృదంగాదుల మ్రోయించుటయు నివి శూద్రులకు ధర్మముల
ని-మనుస్మృతి "అశక్నువంస్తు శుశ్రూషాం శూద్రః కర్తుం ద్విజన్మనాం ।
పుత్రదారాత్యయం ప్రాప్తో జీవేత్కారుక కర్మభిః । యైఃకర్మభిః ప్రచరి
తైః శ్శుశ్రూష్యంతే ద్విజాతయః । తానికారుక కర్మాణి శిల్పాని వివిధాని
చ॥" అనియనగా శూద్రుడు ద్విజులకు సాక్షాత్తుగా సేవజేసి పుత్ర దారా
దుల బోషింపలేనియెడ కారుకర్మలచే జీవింపవలెను. అవియేవనిన పరంప
రచే ద్విజశుశ్రూషకు నుపయోగించు పనులును నానా విధమైన వస్తు రచన
లు నని నృసింహ పురాణమందు "దూరాచ్ఛూద్రేణోపచార్యో బ్రాహ్మ
ణోగ్ని రివజ్వలన్ ॥ " అని యనగా శూద్రుఁడు జ్వలించు నగ్నివలె బ్రా
హ్మణుని దూరముననుండియే యుపచారములచే సేవింపవలెను - ఇట్లు ధర్మ

మాచరించు శూద్రునకు లోకముపై తీనసిస్మృతిలో చెప్పఁబడినది- "గాంధర్వం శూద్రస్యస్థానం॥" అని అనగా శూద్రునికి గంధర్వలోకప్రాప్తి యగునని - ఇట్లు రామకృష్ణ భట్టాత్మజుఁడైన కమలాకరభట్టునిచే రచింపఁబడిన శూద్ర ధర్మమందు శూద్రులవిహితప్రతిషిద్ధధర్మములు ముగిసెను.

—(*) ఇకశూద్రులకుసంస్కారప్రయోగము. (*)—

అందు సర్వకర్మల కంగమగుటచే నాచారము ననుసరించి పుణ్యాహవాచనము మొదట నిరూపింపఁబడును - వ్యాసవచనము "సంపూజ్యగంధమాల్యాద్యైర్బ్రాహ్మణాన్స్వస్తి వాచయేత్ । కామ్యకర్మణి మాంగల్యే సంగ్రామాద్భుత దర్శనే॥" అని అనగా గామ్యవ్రతాదులందును శుభకర్మలందును యుద్ధారంభమందును నుత్పాతములు చూచునపుడును గంధమాల్యాదులచే బ్రాహ్మణుల బూజించి స్వస్తిపుణ్యాహవాచనము జేయింప వలెననుట - మరియు యమవచనము - "సోంకారం బ్రాహ్మణే కుర్యాన్నిరోంకారం మహీపతౌ। ఉపాంశుచ తథావైశ్యేస్వస్తి శూద్రే ప్రకీర్తయేత్॥" అని యనగా నోంకారయుక్తముగ బ్రాహ్మణునకును నోంకారహీనముగ క్షత్రియునకును నుపాంశువనగ మనసునందె సూక్ష్మోచ్చారణమట్లు వైశ్యునకును శూద్రునకును స్వస్తి పుణ్యాహమును పఠింపవలెననుట - కర్తయాచమనముజేసి "సుముఖశ్చైకదంతశ్చ కపిలో గజకర్ణకః॥" అని మొదలుగ ద్వాదశనామము లుచ్చరించి వినిమైనను దేశకాలముల గీర్తించి "అముకకర్మ కరిష్యేతదంగతయాగణపతి పూజనం పుణ్యాహవాచనంచకరిష్యే" యని సంకల్పించి గణేశపూజను జేయవలెను. అట్లు "హేహేరంబ త్వమేహ్యేహి అంబికాత్ర్యంబకాత్మజ । సిద్ధిబుద్ధియుతత్ర్యక్ష సర్వలోక పితఃపితః । నాగాస్య నాగహారత్వం గణనాథ చతుర్భుజ । భూషితస్స్వాయుధైర్దివ్యైః పాశాంకుశ పరశ్వథైః । ఆవాహయామిపూజార్థంరక్షార్థంచ మమక్రతోః । ఇహాగత్య గృహాణత్వం పూజాం రక్షచమేక్రతుం॥" అని పఠించి యావాహనముజేసి షోడశోప చారములచే బూజించి యొకపాత్రలోఫలముతో నర్ఘ్యమునకు జలముగ్రహించి "రక్షరక్షగణాధ్యక్ష త్ర్యక్షత్రైలోక్యరక్షక । భక్తానామభయం కర్తా త్రాతా భవమహార్ణవాత్ । ద్వైమాతుర కృపాసింధో దేవషాణ్మాతు రాగ్రజ । వరదస్త్వం వరందేహి వాంఛితార్థప్రదోభవ। అనేన ఫలదానేన ఫలదోమే భవ

ప్రభో॥" అని యుచ్చరింపుచు నర్ఘ్యమిచ్చి "వక్రతుండమహాకాయ కోటిసూర్య సమప్రభ । నిర్విఘ్నం కురుమే దేవ సర్వకార్యేషు సర్వదా॥" అని యనగా మహోన్నతమైన శరీరము కోటి సూర్యులవలె తేజస్సునుగల యో విఘ్నేశుడా సర్వ కార్యములందు నెపుడును విఘ్నములు లేకుండ జేయుమని ప్రార్థించునది - లేదా - "విఘ్నేశ్వరాయ వరదాయ గణేశ్వరాయ సర్వేశ్వరాయ శుభదాయ సురేశ్వరాయ। విద్యాధరాయ వికటాయచవామనాయ భక్తప్రసన్న వరదాయ నమోనమస్తే ॥ భక్తార్తినాశన పరాయసురప్రియాయ లంబోదరాయ సకలాయ జగద్ధితాయ।నాగాననాయసితసర్ప విభూషితాయ గౌరీసుతాయ గణనాథ నమోనమస్తే॥ "నమస్తే బ్రహ్మరూపాయ విష్ణురూపాయ తేనమః । నమస్తే రుద్రరూపాయ కరిరూపాయ తేనమః॥" అని యనగా నో గణనాథుడ నీవు విఘ్నముల నిగ్రహించువాడవు వరములిచ్చువాడవు ప్రమథగణముల కధిపతివి సర్వేశ్వరుడవు శుభమిచ్చువాడవు సురలకధీశ్వరుడవు విద్యలకు స్థానము వికటము పొట్టియునైన యాకృతిగల్గువాడవు భక్తులందు ప్రసాదముజేయువాడవు నిట్టి నీకునమస్కారము మరియు భక్తులపీడ దొలగించువాడవు దేవతలకు బ్రియుడవు పెద్దకడుపు గలిగి సకలస్వరూపుడవై జగత్తునకు హితముజేయువాడవు గజాననుడవు సర్పములచే భూషితుడవు గౌరీసుతుడవు నిట్టి నీకు నమస్కారము మరియు బ్రహ్మవిష్ణు రుద్రస్వరూపములచే సృష్ట్యాదులు చేయునీకొరకు నమస్కారమని ప్రార్థించవలెను - ఆపైని దనయెదుట ధాన్యపుప్రోవులపై రెండుకలశములుంచి యందు గంధము దూర్వలు పంచపల్లవములు ఫలములు బంగారును పంచరత్నములు వేసి ధాన్యములతో నింపిన పూర్ణపాత్రద్వయమునుంచి యందు "పాశహస్తంచ వరుణమర్ణసాంపతిమీశ్వరం । ఆవాహయామి యజ్ఞేస్మిన్ పూజేయం ప్రతిగృహ్యతాం ॥ " అనివరుణునావాహించి పూజించి "కలశస్యముఖేవిష్ణుః॥"అని మొదలగు వానిచే బ్రార్థించి " మాతృదేవోభవపితృదేవోభవ ఆచార్యదేవోభవ అతిథిదేవోభవ ఆశిషః ప్రార్థయంతె ఏతాస్సత్యా ఆశిషస్సంతు ॥ " అనినపైని భూమియందు జానువులుమోపి తామరమొగ్గవలె నుండు దోసిలి శిరస్సుపై నుంచుకొని కుడిహస్తము సువర్ణపూర్ణకలశము దీసుకొని " దీర్ఘానాగానద్యోగిరయస్త్రీణివిష్ణు పదానిచ । తేనాయుః ప్రమాణేన పుణ్యాహం దీర్ఘమాయురస్తు శి

వా ఆపస్సంతు సౌమనస్యమస్తు అక్షతం చారిష్టంచాస్తు - గంధాః పాంతుసుమం
గల్యంచాస్తు అక్షతాః పాంత్వాయుష్యమస్తు పుష్పాణి పాంతు సౌశ్రియ మస్తు
తాంబూలాని పాంత్వైశ్వర్యమస్తు దక్షిణాః పాంతు బహుదేయంచాస్తు" అనివి
ప్రహస్తమందునిచ్చి "యంకృత్వా సర్వవేదయజ్ఞక్రియాకరణ కర్మారంభాశ్శు
భాశ్శోభనాః ప్రవర్తంతే తమహంన త్వాభవద్భిరనుజ్ఞాతఃపుణ్యంపుణ్యాహం
వాచయిష్యే" యనియుచ్చరించి "వాచ్యతాం" అనివారనినపైని "మావిఘ్నంమాచ
మేపాపం మాసంతు పరిపంథినః । సౌమ్యాభవంతు సుఖినస్సర్వేలోకాస్సుఖా
వహాః॥" అనికర్తయుచ్చరింపవలెను-విప్రులు "తథాస్తు" అనిపలికి- "కరోతుస్వస్తి
తేబ్రహ్మాస్వస్తివాపిద్విజాతయః।సరీసృపాశ్చయేశ్రేష్ఠా స్తేభ్యస్తే స్వస్తి సర్వదా।
యయాతిర్నహుషశ్చైవ ధుంధుమారో భగీరథః । తుభ్యంరాజర్షయస్సర్వే
స్వస్తికుర్వంతు నిత్యశః । స్వస్తితేస్తు ద్విపాదేభ్య శ్చతుష్పాదేభ్యఏవచ । స్వ
స్త్యస్త్వపాదకేభ్యశ్చ సర్వేభ్యస్స్వస్తిసర్వదా । స్వాహాస్వధా శచీచైవ
స్వస్తికుర్వంతు తేసదా । లక్ష్మీరరుంధతీ చైవ కురుతాం స్వస్తితేనఘ । అసి
తో దేవలశ్చైవ విశ్వామిత్ర స్తథాంగిరాః । స్వస్తితేద్యప్రయచ్ఛంతు కార్తి
కేయశ్చషణ్ముఖః । వివస్వాన్ భగవాన్స్వస్తి కరోతు తవ సర్వశః । దిగ్గ
జాశ్చైవ చత్వారః క్షితిశ్చగగనం గ్రహాః । అధస్తాద్ధరణీంయోసౌ నాగోధా
రయతేసదా । శేషశ్చ పన్నగశ్రేష్ఠ స్స్వస్తితుభ్యం ప్రయచ్ఛతు॥" అని పలు
కవలెను. అటుపైనికర్త - "బ్రాహ్మణామనస్సమాధీయతాం॥" అనిపలుకగా
"సమాహితమనసస్స్మః" అనివారు పలుకవలెను,అట్లు "ప్రసీదంతు భవంతః" అని
పలుకగా "ప్రసన్నాస్స్మః" అనివారుపలికినపైని గలశమునుండి జలమువంచుచుని
ట్లుచ్చరించవలెను - "శాంతిరస్తు-పుష్టిరస్తు తుష్టిరస్తు-వృద్ధిరస్తు-అవిఘ్నమస్తు - ఆ
యుష్యమస్తు - ఆరోగ్యమస్తు - శివంకర్మాస్తు - కర్మసమృద్ధిరస్తు - పు
త్రసమృద్ధిరస్తు - ధనధాన్యసమృద్ధిరస్తు - ఇష్టసంపదస్తు - అరిష్ట నిరసనమ
స్తు - యత్పాపంతత్ప్రతిహతమస్తు - యచ్ఛ్రేయస్తదస్తు-ఉత్తరేకర్మణ్యవిఘ్నమ
స్తు- ఉత్తరోత్తరమహరహరభివృద్ధిరస్తు- ఉత్తరోత్తరాః క్రియాశ్శుభాశ్శోభనా
స్సంపద్యంతాం-తిథికరణముహూర్తనక్షత్రసంపదః...తిథికరణముహూర్తనక్ష
త్రగ్రహలగ్నాధి దేవతాః ప్రీయంతాం. దుర్గాపాంచాల్యౌ ప్రీయేతాం అ
గ్నిపురోగావిశ్వేదేవాః ప్రీయంతాం. ఇంద్రపురోగా మరుద్గణాః ప్రీయంతాం

బ్రహ్మపురోగాస్సర్వేదేవాః వసిష్ఠపురోగాఋషిగణాఃప్రీ...అరుంధతీ పురోగాఏకపత్న్యఃప్రీ.బ్రహ్మబ్రాహ్మణాశ్చప్రీశ్రీసరస్వత్యౌప్రీయేతాం శ్రద్ధామేధేప్రీ.. భగవతీ కాత్యాయనీ ప్రీయతాం - భగవతీమాహేశ్వరీ ప్రీయతాం-భగవతీపుష్టికరీప్రీయతాం - భగవతీతుష్టికరీ ప్రీయతాం- భగవతీవృద్ధికరీప్రీ...భగవతీ బుద్ధికరీప్రీ... భగవంతౌ విఘ్నవినాయకౌ ప్రీయేతాం...భగవాన్స్వామీ మహాసేనస్సపత్నీకస్ససుతస్సపార్షదస్సర్వస్థానగతః ప్రీయతాం- హరిహరహిరణ్యగర్భాః- ప్రీయంతాం-సర్వగ్రామదేవతాఃప్రీ...సర్వాఃకులదేవతాఃప్రీ...సర్వా ఇష్టదేవతాః ప్రీ—— హతాబ్రహ్మద్విషః -హతాఃపరిపంథినః - హతాఅస్యకర్మణో విఘ్నకర్తారః - శత్రవః పరాభవంయాంతు - శామ్యంతుఘోరాణి- శామ్యంతు పాపాని-శామ్యంత్వీతయః - శుభానివర్తంతాం - శివాఆపస్సంతు- శివాఋతవస్సంతు-శివాఅగ్నయస్సంతు- శివాఓషధయస్సంతు - శివావనస్పతయస్సంతు- శివాఅతిథయస్సంతు- అహోరాత్రేశివేస్యాతాం- శుక్రాంగారకబుధబృహస్పతి శనైశ్చరరాహుకేతు సోమసహితా ఆదిత్యపురోగాస్సర్వేగ్రహాః ప్రీయంతాం - భగవాన్నారాయణఃప్రీయతాం-భగవాన్పర్జన్యఃప్రీయతాం-భగవాన్స్వామీమహాసేనః ప్రీయతాం" అనిపలికి "పుణ్యాహకాలాన్వాచయిష్యే" యనియడుగగా "వాచ్యతాం" అనివారు పలికినపైని. "బ్రాహ్మంపుణ్యమహర్యచ్చసృష్ట్యుత్పాదన కారకం । వేదవృక్షోద్భవం నిత్యం తత్పుణ్యాహం బ్రువంతునః । దీయంతెయత్రదానాని పూజ్యంతె చ ద్విజాతయః । దృశ్యతే యత్రమాంగల్యం తత్పుణ్యాహం సదాస్తుమే । మమగృహేస్యకర్మణఃపుణ్యాహంభవంతో బ్రువంతు॥" అని కర్త ప్రార్థింపగ "స్వస్తిపుణ్యాహ" మనిముమ్మారు విప్రులుపలుకునది - అటుపైని "స్వస్తిర్యాచావినాశాఖ్యాపుణ్యకల్యాణవృద్ధిదా । వినాయకప్రియానిత్యం తాంస్వస్తింభోబ్రువంతునః । మమగృహే స్వస్తిభవంతోబ్రువంతు॥" అని ప్రార్థింపగ విప్రులు "ఆయుష్మతె స్వస్తి" యనునది - ఆపైని "సాగరస్యతు యాశుద్ధి మహాలక్ష్మ్యాదిభిః కృతా । సంపూర్ణాపూర్ణచంద్రేయా తామృద్ధిం భోబ్రువంతునః । మమగృహేఋద్ధింభవంతోబ్రువంతు॥" అని ప్రార్థింపగవిప్రులు "ఋధ్యతాం" అని ముమ్మారుపలుకవలెను- "పృథివ్యాముద్ధృతాయాంతుయత్కల్యాణం పురాకృతం । ఋషిభిస్సిద్ధగంధర్వైస్తత్కల్యాణంబ్రువంతునః । మమగృహేకల్యాణంభవంతోబ్రువంతు" అని

యాచింపగవిప్రులు "కల్యాణమస్తు" అనిపలికినపైని "క్షీరోదధి సముద్భూతా మధ్య మానేమహాదధా । విష్ణోశ్చైవ ప్రియానిత్యం తాంశ్రియంభోబ్రువంతునః। మమగృహేశ్రీ రస్త్వితిభవంతోబ్రువంతు॥" అని యడుగగా "అస్తుశ్రీః" అనిపలికిన పైని "వర్షశతంపూర్ణమస్తు శివమస్తు వంశాభివృద్ధిరస్తు ప్రజా పతిః ప్రీయ తాం" అని విప్రులు "సురాస్త్వామభిషించంతు బ్రహ్మవిష్ణుమహేశ్వరాః । వాసు దేవోజగన్నాథ స్తథాసంకర్షణోవిభుః । ప్రద్యుమ్నశ్చా నిరుద్ధశ్చ భవంతు విజయాయతె । ఆఖండలోగ్ని భగవాన్ యమో వై నిర్‌ృతిస్తథా । వరుణః పవనశ్చైవ ధనాధ్యక్షు స్తథాశివః । బ్రహ్మణాసహితాస్సర్వే దిక్పా లాః । కీర్తిర్లక్ష్మీర్ధృతిర్మేధాపుష్టిశ్శ్రద్ధా క్రియారతిః । బుద్ధిర్లజ్జావపు శ్శాంతిః కాంతిస్తుష్టిశ్చమాతరః । ఏతాస్త్వామభిషించంతు దేవపత్న్యస్సమాగ తాః । ఆదిత్యశ్చంద్రమాభౌమో బుధజీవసితార్కజాః । గ్రహాస్త్వామభిషిం చంతురాహుః కేతుశ్చతర్పితాః । దేవదానవగంధర్వా యక్షరాక్షస పన్న గాః। ఋషయోమునయోగావో దేవమాతరఏవచ । దేవపత్న్యోద్రుమానాగా దైత్యాశ్చాప్సరసాంగనాః । అస్త్రాణిసర్వశస్త్రాణి రాజానోవాహనానిచ । ఔషధానిచరత్నాని కాలస్యావయవాశ్చయె । సరితస్సాగరాశ్శైలా స్తీర్థాని జలదానదాః । ఏతేత్వామభిషించంతు సర్వకామార్థ సిద్ధయే॥" అనిమొదలు గపూర్వోక్తములైవ శ్లోకములుచ్చరింపుచు గర్తకు విప్రులభిషేకము చేయవలె ను - అపుడుపత్నివామ భాగమదుండవలెనుఆపైని "కరోతుస్వస్తితేబ్రహ్మా" యని మొదలగు మీదజెప్పిన శ్లోకములచే యజమానునికి నీరాజనము తిలకము నీవలెను- అక్షతాశీర్వాదమును ఇట్లు సర్వత్రపుణ్యాహవాచనము - ఇట్లుకమలాకర భట్టుని చే రచింపబడిన శూద్రధర్మమందు శూద్రుని పుణ్యాహవాచనము.

ఆపైనికర్తబియ్యపుప్రోవులందు "గౌరీపద్మాశచీమేధాసావిత్రీవిజయాజయా। దేవసేనాస్వధా స్వాహామాతరో లోకమాతరః।ధృతిఃపుష్టి స్తథాతుష్టి రాత్మ నః కులదేవతాః । గణేశేనాధికాహ్యేతావృద్ధౌపూజ్యాస్తుషోడశ।బ్రాహ్మీమా హేశ్వరీచైవ కౌమారీ వైష్ణవీతథా । వారాహీచతథేంద్రాణీచాముండాసప్త మాతరః॥" అనిగణేశుడు మొదలుగ గౌర్యాదికులదేవతాంతముగ బదియారుగు రినిబ్రాహ్మీ మొదలగు సప్తమాతలను నావాహనము జేసిగోడపై ఘృతముచేనై దుగానియేడుగాని ధారలుచేసి "వసుధారాభ్యైనమః" అని యావాహించిషోడ

శోపచారములచే బూజించి నాందీశ్రాద్ధము జేయునది. ఎట్లనిన- సర్వ క్రియలు సవ్యముగనే దేవతీర్థముచేతనే యవలచేతనే పిత్ర్యమందును "మాత్రాదిత్రయ పిత్రాదిత్రయ మాతా మహాదిత్రయ సంబంధినాం దీముఖ సత్యవసుసంజ్ఞకవిశ్వేదేవస్థానే భవద్భ్యాంక్షణః కర్తవ్యః ప్రాప్నుతాం భవంతౌ॥" అనికర్తృప్రార్థింపగ "ప్రాప్నవావ" యనియిద్దరు విప్రులుగాని దర్భవటువులుగాని దైవస్థానమందుంచి "మాతృపితామహీ ప్రపితామహీనామముకదేవీనాందాసీనాం" అనిచెప్పవలెనని యాచార్యచూడామణి చెప్పెను "నాందీముఖానాంస్థానే" యని మొదలగువాక్యమున నిద్దరను "పితృపితామహ ప్రపితా మహానాంనాందీముఖానాం స్థానే" యని మొదలగు వాక్యముచేనిద్దరను "మాతామహప్రమాతామహవృద్ధ ప్రమాతా మహానాం నాందీముఖానాం స్థానే" యను వాక్యముచే నిద్దరను విప్రులను మంత్రించునది - కోకిల మతము ననుసరించినవారు మాత్రము "మాతృమాతామహప్రమాతామహ" యని మాతామహునితోడనె మాతృశ్రాద్ధము చేయుదురు - అపుడు పార్వణద్వయమే - ఈశ్రాద్ధమందు నామగోత్రములులేవు అందు వచనము నిర్ణయసింధువునందు దెలియునది - ఆపైని "సత్యవసు సంజ్ఞికావిశ్వేదేవా ఇదంవః పాద్యం - ఏషవోర్ఘ్యః॥" అనిదేవస్థానమందును అట్లు "మాత్రాదయః పిత్రాదయః మాతామహాదయశ్చ ఇదంవః పాద్యం॥" అనిమాత్రాదులకును పాద్యమును అటుపై "విశ్వేదేవా ఇదమాసన మాస్యతాం నమః॥" అనిదేవులకు- నిట్లుమాత్రాదులందును - అర్ఘ్యస్థానమందు "సంకల్ప సిద్ధిరస్తు॥" అనియు, "విశ్వేదేవాఎషవోగంధః॥" అనిదేవులకు నిట్లుమాత్రాదులకు అట్లు "ఇమానిపుష్పాణి-ధూపః-దీపః- ఆచ్ఛాదనం॥" అనియిచ్చి "ఏతేఅముకేభ్యః గంధపుష్పధూపదీపాచ్ఛాదనాంతాస్సర్వే ఉపచారాస్సంపూర్ణాభవంతు" అనిపలికి యథర్చచంద్రమండలమైనను ప్రోక్షణమైనను జేసి పాత్రలందామాన్నముల ద్విగుణముగనైనను లేదా సమముగ నైనను వడ్డించి ప్రోక్షించి పాత్రము ముట్టుకొనియవలజల్లి యన్నమందంగుష్ఠమిచ్చి "సత్యవసు సంజ్ఞికా విశ్వే దేవానాందీముఖాఇదంవః యుగ్మ బ్రాహ్మణ భోజనపర్యాప్తం ద్విగుణంవాఆమంసోపస్కరం ఆమమూల్య భూతం హేమవా సంప్రదదేస్వాహానమః॥" అనియీయవలెను. ఇట్లుమాతృపితామహీప్రపితామహ్యః నాందీముఖ్యః ఇదంవః యుగ్మబ్రాహ్మణ" యని మొదలుగమీదివాక్యము నుచ్చరించియు "పితృపితామహప్రపితామహ

నాందీముఖాఇదంవఃయుగ్మబ్రాహ్మణ" యనిమొదలుగనుచ్చరించియునిట్లు "మాతా
మహాప్రమాతామహావృద్ధప్రమాతామహాత్మపత్నీకానాందీముఖాఇదంవ" ఇత్యా
దివాక్యముచ్చరించియునీవలెను—ఇందుపిండదానమువైకల్పికము- చేయుపక్షమం
దువేదికజేసి యందుపూర్వదిక్కున కగ్రములుగ మూడురేఖలుగీసిదర్భలు పరచి
"మాతర్నాందీముఖిఅవనేనిక్ష్వ" యని జలమువిడిచి ఇట్లు "పితామహీప్రపితామ
హీ" యనియునట్లు "పితః నాందీముఖ" యని మొదలుగనుచ్చరించిజలమిచ్చి సత్తుపిం
డిచేగాని బెల్లముచేగాని పెరుగు రేగుపళ్లుయవలుగలిపిపిండములుచేసి "ఏతత్తేమా
తర్నాందీముఖిఏషతేపిండః-ఇదమన్నం వాస్వాహానమః॥" అనియొకపిండమిచ్చి రెం
డవది యూరకయెయిచ్చి ఇట్లుఒకొక్కరికి రెండేసి పిండములిచ్చి "పునఃప్రత్యవ
నేనిక్ష్వ" యని ప్రత్యవనేజనమనగజలమును పూర్వము వలెనిచ్చియభ్యంజనము
అంజనమును వాసస్సులనిచ్చి శ్రాద్ధశేషము నాఘ్రాణించి పాత్రలోజలముంచి ప
రిషేచనము జేసి "శివాఆపస్సంతు" అనిమొదలుగ జేసి "ఏతన్నాందీ శ్రాద్ధకర్మణః
స్సాంగతా సిద్ధ్యర్థంద్రాక్షామలకయవాః తన్నిష్క్రియద్రవ్యంవా దక్షిణాం
తుభ్యమహంసంప్రదదే స్వాహానమః॥" అనిప్రత్యేకముగ దక్షిణలిచ్చి "అనేననాం
దీ శ్రాద్ధేననాందీముఖదేవతాః ప్రీయంతాం మాతాపితామహీచైవతథైవప్రపి
తామహీ । పితాపితామహశ్చైవ తథైవప్రపితామహః । మాతామహస్త
త్పితాచప్రమాతామహకాదయః । ఏతేభవంతుమేప్రీతాః ప్రయచ్ఛంతు చమం
గలం ॥" అనిప్రార్థించి పిండముల విసర్జింపవలెను—ఇట్లువృద్ధి శ్రాద్ధ ప్ర
యోగము ఇదియంతయు సర్వసంస్కారములలో సమానము - ఒకవేళ గ్రహ
యజ్ఞ తులాదానాదులలో ఋత్విక్కుల వరించుట ప్రసక్తించునపుడు - ఆచా
రముబట్టి మూకుడులో "ఆపఃక్షీరం కుశాగ్రాణి దధిదూర్వాక్షతాం స్తథా । స
ర్షపాః కుంకుమంచేతి అర్ఘ్యోష్టాంగః ప్రకీర్తితః॥" అనునట్లు ఉదకముమొ
దలగు నెనిమిదివస్తువులతో నర్ఘ్యము సిద్ధముజేసి యూసి "స్వాగతంభో ద్విజ
శ్రేష్ఠా మదనుగ్రహ కారకాః । ఇదమర్ఘ్య మిదం పాద్యంభవద్భిః ప్రతిగృహ్య
తాం॥" అని పాదముల కర్ఘ్యమాచారమువలనజేసి యాచార్యుని బ్రహ్మను ఋ
త్విక్కులను వరించి బ్రాహ్మణుల నిట్లుప్రార్థింప వలెను -"బ్రాహ్మణాస్సంతు
మెశస్తాః పాపాత్పాంతు సమాహితాః । వేదానాంచైవదాతారఃపాతారస్స
ర్వ దేహినాం। జపయజ్ఞైస్తథాహోమైర్దానైశ్చ వివిధైః పునః। దేవా

నాం చపితౄణాంచతృప్త్యర్థం యాజకాఃకృతాః। యేషాందేహేస్థితావేదాః పావయంతి జగత్త్రయం।రక్షంతు సతతంతే మాంజపయజ్ఞైర్వ్యవస్థితాః । బ్రాహ్మణాజంగమంతీర్థం త్రిషులోకేషువిశ్రుతం।యేషాంవాక్యోదకేనైవశుద్ధ్యంతిమలినాజనాః । పావనాస్సర్వవర్ణానాంబ్రాహ్మణాబ్రహ్మరూపిణః । సర్వకర్మరతానిత్యం వేదశాస్త్రార్థకోవిదాః । శ్రోత్రియాస్సత్యవాచశ్చ దేవధ్యానరతాస్సదా । యద్వాక్యామృతసంసిక్తాఋద్ధిం యాంతి నరద్రుమాః । అంగీకుర్వంతుకర్మైతత్కల్పద్రుమ సమాశిషః । యథోక్తనియమైర్యుక్తామంత్రార్థేస్థిరబుద్ధయః । యత్కృపాలోచనాత్సర్వా బుద్ధయో వృద్ధిమాప్నుయుః।మమయజ్ఞైజపే పూజ్యాస్సంతు మేనియమాన్వితాః । అక్రోధనాశ్శౌచ పరాస్సతతం బ్రహ్మచారిణః । దేవధ్యానరతానిత్యం ప్రసన్నమనసస్సదా । అదుష్టభాషిణస్సంతు మాసంతు పరనిందకాః । మమాపినియమాహ్యేతే భవంతు భవతామపి॥" అనియనగా బ్రాహ్మణులునాచే స్తుతింపబడి సమాధానము నొందిన చిత్తముతో నన్నుపాప బాధనుండి రక్షింతురుగాక ఏమనినవారు వేదములకాధారమై సర్వదేహ ధారుల రక్షించు వారుఎట్లనిన జపములచేతను యజ్ఞములచేతను స్వధాకారములచేతను హోమములచేతను నానావిధ దానములచేతను దేవతలకుపితృదేవతలకును తృప్తిచేయుటకు యాజకులై వారు సృజింపబడిరి. మరియును వారియందు వేదములుండి జగత్తుల పవిత్రముజేయుచున్నవి- అట్టిబ్రాహ్మణులుజపయజ్ఞమందు వరింప బడినన్ను రక్షింతురుగాక - బ్రాహ్మణులు మనుష్యాకారము ధరించిన గంగాది పుణ్యతీర్థములె - కనుకనె వారివాక్యమనుజలము ప్రోక్షించిన మావంటి మలినులు శుద్ధులగుదురు. ఇట్లుసర్వవర్ణముల పవిత్రము జేయుటచే బ్రహ్మ రూపులన బడుదురు. సర్వకర్మలు నిత్యము యథావిధిగ నాచరింపుదురు . వేదముల తత్వార్థము నిశ్చయింప గలరు అనూచానముగ దండ్రితాతలనుండి వేదాధ్యయనము జేయువారు సత్యవాక్కులు దేవతాధ్యాన మెపుడు జేయువారు వారివాక్యామృతముచే దడిసిన మనుష్యులు వృక్షముల వలెపెరుగుదురు-వారియాశీర్వాదముకల్పవృక్షమువలెనన్నికోరిక లిచ్చును వారునేజేయుకర్మనంగీకరింతురుగాకవారికృపాయుక్తమైనధ్యానముచేసమస్తసంపదలుగల్గును వారునాకర్మయందు వరింపబడియథోక్తనియమములతోబూజింప బడుదురుగాక-నియమము లేవియనిన క్రోధవర్జనము శుద్ధియందాసక్తి

యు బ్రహ్మవిచారము చిత్తమునైర్మల్యము దుష్టసంభాషణ పరనిందలు విడు చుటయు నివిమొదలగు నియమములు వారికినాకునుగూడ సిద్ధించును గాకయనిప్రా ర్థింపవలెను-ఇట్లుప్రసంగముచే స్మరించిన కృత్యము చెప్పుట చాలును—ప్రస్తు తమైన సంస్కారములునిరూపింపబడును. అందుగర్భాధానము. అపుడుమొ దటి రజోదర్శనమందు దుష్టవారము దుష్టనక్షత్రము మొదలగువానియందు నేజే సిన శాంతిరత్నమందు జెప్పినట్లుశాంతిజేసి మొదలిటినాల్గుదినములు విడిచి సమ రాత్రులందు నిర్ణయసింధూక్త కాలమునందు జేయవలెను - అపుడు కర్త భార్యతో దేశకాలముల స్మరించి"అస్యాంమమభార్యాయాం జనిష్యమాణగర్భా ణాం బీజగర్భసముద్భవైనోని బర్హణద్వారాశ్రీ పరమేశ్వరప్రీత్యర్థంగర్భా ధానం కరిష్యే"యని సంకల్పించి తదంగముగా గణేశ పూజనపుణ్యాహవాచన మాతృకా పూజానాందీశ్రాద్ధములు మీదజెప్పిన రీతిని జేసి యలంకరించుకొనినూ తన వస్త్రముధరించి యశ్వగంధయన పిల్లివేంద్రము దానిరసమును దూర్వల రసమును భార్యయొక్క ముక్కు కుడిచెరమలో గొంచెము పిడువవలెను- నీరాజ నమిచ్చినపైని సూర్యునకు నమస్కరింపవలెను - ఆపైనిరాత్రియందు శయ్యపై ని"విష్ణవేనమః త్వష్ట్రేనమః ప్రజాపతయేనమః ధాత్రేనమఃసినీవాల్యైనమః స రస్వత్యైనమః అశ్విభ్యాంనమః పర్జన్యాయనమః" అని స్త్రీయోనిని స్పృశిం చి సంగమించి ఋతువునందు స్నానము చేయునది - స్త్రీకి స్నానమక్కర లేదు - ఋతువుగానిచో మూత్రత్యాగమందువలె శౌచమునాచమనముచేయున ది - ఇట్లుగర్భాధానము— ఇకపుంసవనము - రెండుమూడునాల్గు మాస ములలో నొకమాసమందు పురుషనక్షత్రమందు భర్తయభ్యంగస్నానముజేసి దే శకాలములస్మరించి "అస్యాంమమభార్యాయాం జనిష్యమాణగర్భస్య పుంరూప తాప్రాప్త్యర్థం బీజగర్భసముద్భవైనోని బర్హణార్థం పరమేశ్వర ప్రీత్య ర్థం పుంసవనం కరిష్యే"యని సంకల్పించి గణేశపూజా పుణ్యాహవాచనమా తృకాపూజానాందీ శ్రాద్ధములజేసి - దూడకు దనకు నంతట సమానమైన రం గుగల గోవుయొక్క పెరుగు భార్యకుడిహస్తమందిచ్చి దాని మధ్యమందు దూ పుర్ణనకగ్రముగయవబీజమును దానికినిరుప్రక్కలను రెండుమినుపగింజలనుంచి"కిం పిబసి"యనిముమ్మారుముట్టి"పుంసవనంపుంసవన"మనిముమ్మారుపలికి పత్నిభక్షిం ప వలెను - ఇట్లుముమ్మారు చేయవలెను-ఇదిపుంసవనము— ఇక సీమంతము-

నాల్గు ఆరు యెనిమిది దీనిలో నొకమాసమందుగాని ప్రసవమునకు ముందుగా
ని పుంనక్షత్రమందు భర్తదేశకాలముల గీర్తించి "మమాస్యాంభార్యాయాంజ
నిష్యమాణసర్వగర్భాణాంబీజగర్భసముద్భవైనోనిబర్హణద్వారాప్రతిగర్భం
సంస్కారాతిశయద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం సీమంతోన్నయనంకరిష్యే"
యని సంకల్పించి తదంగముగ గణేశపూజన పుణ్యాహవాచన మాతృకాపూజా
నాందీ శ్రాద్ధములజేసి యలంకరించుకొని నూతనవస్త్రము ధరించి దూర్వలరస
మును భార్యకుడిముక్కులో వేయునపుడు "అగ్నయేనమః రాజ్ఞేవరుణాయనమః"
అని యుచ్చరింపవలెను - ఆపైని దెల్లనియేదు పందిముల్లు మూడుదర్భలతో
ను బొడ్డపళ్లగుత్తితోను గలపి పట్టుకొని పత్ని వెనుక నిలిచి "ప్రజాపతయేనమః"
అని భ్రూమధ్యమునుండి శిరస్సునందు కొప్పు రెండు భాగములుగజేయుచు మూ
డుపాపటలు దీర్చవలెను ఇట్లు ముమ్మారు చేయునది - అనంతరమంటునీరా
జనమిచ్చి భార్యతొడపై ఫలము లడ్డుకములు మొదలగు మంగళద్రవ్యము లుంచి
విప్రులకు బదుగురికి భోజన సామగ్రిని దక్షిణనీవలెను - ఇట్లు నారద వచనము
"విప్రక్షత్రియయోః కుర్యాద్ద్విధా సీమంతకర్మను । వైశ్యశూద్రక యోస్త్వే
తద్ద్వావాత్రీనితి కేనచ॥" యని యనగా బ్రహ్మక్షత్రస్త్రీలకు సీమంతములు రెం
డనియు వైశ్యశూద్రస్త్రీలకు రెండుగానిమూడుగాని చేయవలెనని యర్థము-
తక్కిన విశేషము గర్భిణీ తత్పతి ధర్మములును నిర్ణయసింధువున దెలియున
ది - ఇట్లు సీమంతము—— ఇక జాతకర్మ నిరూపింపఁబడును - పృథ్వీచంద్రో
దయమందుగార్ష్ణాజిని స్మృతి । "ప్రాదుర్భావె పుత్రపుత్ర్యోశ్చం ద్రసూర్యగ్ర
హేతథా । స్నాత్వానంతరమాత్మీయాన్ పితౄన్ శ్రాద్ధేన తర్పయేత్॥" అ
ని యనగా పుత్రుఁడుగాని పుత్రికగాని పుట్టునపుడును చంద్రసూర్య గ్రహణము
ములందును స్నానముజేసి తన పితృదేవతలను శ్రాద్ధముచే దృప్తినొందింపవలె
నని - పుత్రుడుగల్గినచో నాభిచ్ఛేదమునకు మున్నుతండ్రి సచేలస్నానముజేసిదే
శకాలముల గీర్తించి "అస్యకుమారస్యగర్భాంబుపాన జనితదోష పరిహారద్వా
రాబీజగర్భసముద్భవైనోనిబర్హణద్వారాబలాయుర్వర్చోభివృద్ధ్యర్థం
శ్రీపరమేశ్వరప్రీత్యర్థంజాతకర్మకరిష్యే"యని సంకల్పించిగణేశపూజాపుణ్యా
హవాచనమాతృకా పూజనములును హిరణ్యముచే నాందీశ్రాద్ధమును జేసినేయి
యు దేనెయు సువర్ణముచే గలపి సువర్ణముచేదినిపించి కర్ణములం దుంచి

"దేవాయసవిత్రేనమః సరస్వత్యైనమఃఅశ్విభ్యాంనమః" అనిపలికిభుజములుస్పృ
శించి "ఇంద్రాయనమః॥" అనిపలికివిప్రులబూజించునదిఇట్లుజాతకర్మ— ఇక
షష్ఠీపూజ - మితాక్షరలో మార్కండేయవచనము - "రక్షణీయా స్తథాషష్ఠీ ని
శాతత్రవిశేషతః । రాత్రౌజాగరణం కార్యం జన్మదానాం తథాబలిః । పు
రుషాశ్శస్త్రహస్తాశ్చ నృత్యగీతైశ్చ యోషితః। రాత్రౌజాగరణంకుర్యాద్దశమ్యాం
చైవ సూతకే॥" అని యనగా పురిటిలో నన్నిరాత్రులు రక్షింపవలసినవే- అం
దు నారవది మిక్కిలిరక్షింపవలెను. ఎట్లనిన పురుషులు శస్త్రముల ధరించియు
స్త్రీలునృత్యమాడియు గీతములుపాడియు రాత్రియావత్తును జాగరణము చేయు
నది జన్మదాయనుదేవతలకు బలిదానముచేయునది ఇట్లు పదియవ దినమందును
జేయవలెను - మరియు వ్యాసవచనము "సూతికావాసనిలయా జన్మదానామ
దేవతాః । తాసాం యాగనిమిత్తంతు శుద్ధిర్జన్మని కీర్తితా॥" అనియనగా
పురుటింటిలో జన్మదలను దేవతలుందురు వారియాగమనగ పూజజేయుటకు
మాత్రము పురిటిశుద్ధియగును "ప్రథమే దివసేషష్ఠే దశమే చైవసర్వదా।త్రిష్వే
తేషునకుర్వీతసూతకం పుత్రజన్మని" అనగా మొదటిదినము నారవది పదియవది
యీమూడుదినములందును జాతాశౌచమునకు శుద్ధియనుట॥ అపరార్కమందు
బ్రాహ్మవచనము - "కన్యాశ్చత స్రోరాకాద్యావాతఘ్నీ చైవపంచమీ। క్రీడ
నార్థాచ బాలానాంషష్ఠీచ శిశురక్షిణీ।ఖడ్గేతు పూజనీయావై వైశ్య ప్రాత్యై
ద్విజాతిభిః॥" రాకాఅనుమతిసినీవాలీకుహూఅనినల్గురు కన్యలు వాతఘ్నియను
నైదవదియుబాలుర రక్షించునదియు క్రీడార్థమై యుండుషష్ఠీదేవియు పూజింప
బడుదురనుట - వైశ్యులు శూద్రాదులు ద్విజులును ఖడ్గమందా వాహనాదుల
చేబూజించునది—ఎట్లనిన తండ్రిదేశకాలముల స్మరించి"మమాస్యశిశోస్సర్వారి
ష్ట శాంత్యాయురారోగ్య సిద్ధ్యర్థంగణేశ జన్మదా జీవంతి కా రాకాదీనాం
పూజనంకరిష్యే"యని సంకల్పించి కలశమును స్థాపించియందు బూర్ణపాత్ర
మందు వస్త్రముపైని గణేశుని జన్మదాదేవతను జీవంతి కనుస్కందు నిరాకను
ననుమతిని సినీవాలినికుహువును వాతఘ్నిని ప్రతిమలందావాహించి ఖడ్గమందు
శిశురక్షిణిని కుడ్యమందు వ్రాయబడిన షష్ఠీదేవిని నావాహించి షోడశోపచార
ములచే బూజించి మినుపపులగము మొదలగునది బలియీవలెను - అపైనిబ్రా
ర్థింపవలెను - "గౌరీపుత్రోయథాస్కంద శ్శిశుత్వేరక్షితః పురా । తథామ

మాప్యయంబాల షష్ఠికే రక్ష్యతాంనమః॥" అనియనగానో షష్ఠీదేవి గౌరీపుత్రు
డైన స్కందునిపూర్వమందెట్లు రక్షించితివో యట్లనే నాబాలునిగూడ రక్షింపు
మని - ఇట్లు షష్ఠీపూజ—ఇక దత్తపుత్రుని గ్రహించువిధి - అందు వ్యాహృ
త్యాదిహోమము పుత్రస్వీకారమున కంగము గనుక స్త్రీశూద్రులకు హోమా
ధికారములేనందున దత్తస్వీకారము సంభవింపదని రుద్రధరాదులు - విప్రద్వా
రముగ హోమాదులు చేయింపవచ్చునని వర్ధమానుడు హరినాథుడు మొదల
గుగౌడులు- సంబంధతత్వమనుగ్రంథమందు నిట్లున్నది - ప్రయోగ పారిజాత
మందు శౌనక వచనము - "అపుత్రోమృతపుత్రోవా పుత్రార్థం సముపోష్యచ।
వాససీకుండలేదత్వా ఉష్ణీషంచాంగు ళీయకం । బంధూనన్నేన సంభోజ్య బ్రా
హ్మణాంశ్చ విశేషతః । అన్వాధానాది యత్తంత్రం కృత్వాజ్యోత్పవ నాంత
కం । దాతుస్సమక్షం గత్వాతు పుత్రందేహీతి యాచయేత్ । దేవ స్యత్వేతి
మంత్రేణ హస్తాభ్యాం పరిగృహ్యాచ । అంగాదంగేత్యృచం జప్త్వా ఆఘ్రాయ
శిశుమూర్ధని । గృహమధ్యేత మాధాయ చరుంహుత్వా విధానతః । య
స్త్వాహృదేత్యృచాచైవ తుభ్యమగ్రేఋచైకయా । సోమోదదదిత్యేతాభిః ప్ర
త్యృచంపంచ భిస్తథా । స్విష్టకృదాదిహోమంచ కృత్వాశేషం సమాపయే
త్॥"అనగా పుత్రోత్పత్తిలేనివాడుగాని మృతినొందినపుత్రులుగలవాడుగాని యు
పవాసము జేసి వస్త్రములు కుండలములు పాగాయుంగరము నిచ్చి బంధువుల
కన్నముబెట్టి బ్రాహ్మణులబూజించి అన్వాధానము మొదలుగ నాజ్య సంస్కా
రపర్యంతముజేసి పుత్రదాత సమీపమునకువెళ్లి పుత్రునిమ్మనియాచింపవలెను- "దే
వస్యత్వా"యను మంత్రముచే బ్రతిగ్రహించి "అంగాదంగాత్॥"అను ఋక్కును
జపించి శిశువు శిరస్సును మూర్కొనిగృహమధ్యమునకుదెచ్చి "యస్త్వాహృదాతు
భ్యమగ్రే...సోమోదదత్"అనుఋక్కులచే బ్రతిఋక్కునకై దేసి మారులచా
ప్పున యథావిధి హోమముజేసి స్విష్టకృదాదిహోమ శేషము సమాప్తి చేయవ
లెనుట - మితాక్షరాదులలో వసిష్ఠునిచే నేతితో వ్యాహృతిహోమముచెప్పబ
డినది - అది విప్రద్వారముగజేయించునది - తక్కినవిశేషము నిర్ణయ సింధు
వునందు దెలియునది - అట్టి దత్తకుడైదు సంవత్సరములలోపు వయస్సుగలవా
డు గావలెను - "ఊర్ధ్వంతుపంచమాద్వర్షా న్నదత్తాద్యాస్సుతాన్నృప॥"య
ని కాళికాపురాణము అనగా నైదు వత్సరములకుపై వయస్సుగలవాని దత్తునిగ

జేయగూడదనుట - ఒకవేళ నట్టిపుత్రుడు తన్ను నిచ్చుటకు గోరినచోనగును-అట్లు హేమాద్రిలోవ్యాసవచనము "విక్రయంచైవదానంచ ననేయాస్స్యురనిచ్ఛవః । దారాః పుత్రాశ్చ సర్వస్వ మాత్మనైవతు యోజయేత్॥" అని యనగా దారయు పుత్రులును నంగీకరింపనపుడు వారివిక్రయముగాని దానముగాని చెల్లనేరదు - వారుతమకుదాము విక్రయింపవచ్చును దానమీవచ్చును- ఇకయాజ్ఞవల్క్యవచనము "స్వకుటుంబావిరోధేన దేయందార సుతాదృతే॥" యని యనగా దారసుతులను దప్పతక్కిన ధనమైనను స్వకుటుంబమునకు విరోధములేకుండగ నీవలెను దారను సుతునినీగూడదను నిషేధమున్నది గాని యదివారంగీకరింపనిచోగూడదని యర్థము తెలియునది - ఇట్లుదత్తకవిధి—ఇకసూతికాస్నానము - జ్యోతిశ్శాస్త్రమందు "కరేంద్రభాగ్యానిలవాసవాంత్య మైత్రేందవాశ్విధ్రువభేష్విపుంసాం । తిథావరిక్తేశుభమాహుమనంతి ప్రసూతికా స్నానవిధిం మునీంద్రాః॥" అనగా హస్త-జ్యేష్ఠ-పుబ్బ-స్వాతి-ధనిష్ఠ - రేవతి- అనూరాధ-మృగశిర-అశ్విని - ధ్రువనక్షత్రములనగ స్థిరములురోహిణి ఉత్తర ఉత్తరాభాద్ర - ఈనక్షత్రములందు రిక్తతిథి తప్పదక్కినతిథిలో పగటియందు సూతికకు స్నానముపురుషులకుమంచిది - ఇకనామకరణము— మదన రత్నమందుబృహస్పతివచనము - "ద్వాదశేదశమేవాపి జన్మతోపిత్రయోదశే । షోడశేవింశతౌచైవ ద్వాత్రింశే వర్ణతఃక్రమాత్॥" అని అనగా జన్మదినము మొదలుగ ద్వాదశదినమందుగాని దశమదినమందుగాని నామకరణములేదా బ్రాహ్మణాది వర్ణక్రమముచే పదుమూడు పదారు నిరువది ముప్పదిరెండు నను దినములందును జేయవచ్చును - నారదీయవచనము " సూతకాంతేనామకర్మ విధేయం స్వకులోచితం । నామపూర్వంతుబాలస్య మంగలం సుసమాక్షరైః॥" అనియనగా పురుడు శుద్ధియైనపైని స్వకులానుసారముగ నామకర్మజేయునది-అపుడు సమాక్షరములతో మంగలమైన పూర్వప్రసిద్ధమైన నామము బాలుని కుంచవలెను అచ్చటనే గార్గ్యవచనము "మాసనామగురోర్నామదద్యా ద్బాలస్యవై పితా। కృష్ణోనంతో చ్యుతశ్చక్రీ వైకుంఠోథజనార్దనః । ఉపేంద్రోయజ్ఞపురుషో వాసుదేవస్తథా హరిః । యోగీశః పుండరీకాక్షో మాసనామా న్యనుక్రమాత్॥" అని యనగా నిట్లు పండ్రెండుమాసములనామములలో బాలుని జన్మమాస

కొని క్రమమని మదనరత్నమందున్నది - అట్లునక్షత్ర నామముగూడ నుంచవలె
ను - అట్లుశంఖవచనము "కులదేవతానక్షత్ర సంబద్ధం పితానామ కుర్యాత్॥" అ
ని - మరియు పరిశిష్టమందును- "తదక్షరాదికం నామయస్మిన్ ధిష్ణ్యేయ దక్ష
రం॥" అనియున్నది యనగా జన్మనక్షత్రమునకు మొదటి యక్షరమును బ్రారం
భించు నామముంచవలె ననుట - మరియు మనువచనము- "శూద్రస్య ప్రేష్యసం
యుక్తం॥" అనిఅనగా శూద్రునికి దాసపదమంతమందు నుండునట్లు నామముం
చవలె ననుట - కాబట్టి త్రంద్రితనయా శౌచాంతమందు గాని ముప్పదియవదిన
మందుగాని దేశకాలముల స్మరించి "అస్యకుమారస్య బీజగర్భ సముద్భవైనోని బ
హణద్వారానామ వ్యవహార సిద్ధి ద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థంనామ కర
ణం కరిష్యే॥" యని సంకల్పించి గణేశపూజాపుణ్యాహవాచన మాతృకా పూజా
నాందీశ్రాద్ధముల జేసికంచు రాగిమొదలగుపళ్లెమునందుబియ్యమునింపిసువర్ణముచే
మొదటగణేశనామమునాపైనికులదేవతానామమునటుపైమాసనామమునాపైనా
క్షత్రనామముననంతరమున వ్యావహారికనామము అనగాశివదాసుడనిమొదలగునది
వ్రాసినామదేవతలపూజించిశిశువుకుడిచెవులో "అముకభక్తోసిఅముకోసి" యనియు
చ్చరించిమీదుగాదోసి లెత్తికులదేవతానామచే "అముకదాసోభవతస్సర్వాన్బ్రా
హ్మణానభివాదయతే॥" యనిప్రార్థింపగ-విప్రులు "ఆయుష్మాన్భవాముకదాస॥"
యని పలుకవలెను - ఇట్లుమాసనామము చేతను నాక్షత్ర నామముచేతను పలు
క వలెను...అటుపైని నూగురికిగాని పదుగురికిగాని భోజనముసామగ్రి నిచ్చి
యాశీర్వాదము పుచ్చుకొనవలెను - ఇట్లునామకరణము—— ఇకనుయ్యాలలోనుం
చుట - పారిజాతమందు బృహస్పతి వచనము - "ఖట్వారో హస్తుకర్తవ్యోద
శమె ద్వాదశేపివా॥" అనిఅనగా పదియవదినమందుగాని పండ్రెండవదినమందు
గాని మంచపు నుయ్యాలపై శిశువును పండుకొన బెట్టవలెను - జ్యోతిర్నిబంధమం
దు "ఆందోళశయనే పుంసో ద్వాదశో దివసశ్శుభః। త్రయోదశస్తు కన్యాయా
న నక్షత్రవిచారణా॥" అనియనగా మొగశిశువు నుయ్యాలనుంచుటకు బండ్రెండవ
దినము మంచిదికన్యకకు బదుమూడవ దినము మంచిది అపుడునక్షత్రమువిచారిం
ప నక్కరలేదు అపైని జేయునెడ "కరత్రయె వైష్ణవరేవతీ ష్వదితిద్వయెచాశ్విన
క ద్విభేషు। కుర్యాచ్ఛిశూనాం నృపతెశ్చ తద్వదాందోళ నంవై సుఖినో భ
వంతి॥" అనగా హస్తచిత్రస్వాతి శ్రవణము రేవతి పునర్వసు పుష్యమి అశ్వి

ని రోహిణి మృగశిర వీనియందు శిశువులకు నృపులకు నాందోలన మెక్కుట శుభము.

ఇకకర్ణ వేధమనగా చెవులు కుట్టుట- జ్యోతిర్నిబంధమందు గర్గవచనము - "మాసె షష్ఠెస ప్తమె వాప్యష్టమె మాసివత్సరె । కర్ణవేధం ప్రశంసంతి పుణ్యాయుశ్శ్రీవివృద్ధయె॥" అనియనగా నారునేడు నెన్మిది మాసములలోగాని వత్సరాంతమందుగాని పుణ్యాయుస్సంపత్తుల వృద్ధికై కర్ణవేధను ప్రశస్తముగ జెప్పుదురు - మదనరత్నమందు వసిష్ఠుడు - "మాసెషష్ఠెస ప్తమె వాష్టమె వావేధ్యౌ కర్ణౌద్వాదశె షోడశెహ్ని॥" అనియనగా బంన్డ్రెండు పదియారుదినములందుగాని యారునేడునెనిమిది మాసములందుగాని చెవులుగుట్టవలెనని చెప్పెను - హేమాద్రిలో వ్యాసవచనము -"కార్తికె పౌషమాసెవాచైత్రెవా ఫాల్గునెపివా । కర్ణవేధం ప్రశంసంతి శుక్లపక్షేశుభేదినే॥" అనియనగా కార్తీక పుష్యఫాల్గునచైత్రమాసములందు శుక్లపక్షమున శుభదినమందు గర్ణవేధము జేయునది - అదియును మృగశీర్ష-ఆర్ద్ర-హస్త- చిత్ర - పునర్వసు-పుష్యము- శ్రవణము- ధనిష్ఠ- రేవతి- యీనక్షత్రములందు రిక్తతిథిపర్వతిథియు దప్ప తక్కినతిథియందు చేయవలెను. మదనరత్నమందు - "సౌవర్ణీ రాజ పుత్రస్య రాజతీ విప్రవైశ్యయోః । శూద్రస్య చాయసీ సూచీమధ్యమా ష్టాంగులాత్మికా॥" అనియున్నది అనగా రాజపుత్రునికి బంగారుతీగెచేతను విప్రవైశ్యపుత్రులకు వెండితీగెచేతను శూద్రుని కినుపతీగెచేతను చెవులుగుట్ట వలయును అట్టి తీగెమధ్యమాంగుళిచెనెనిమిదివ్రేసిళులుండవలెను - చండేశ్వరుడు। "సార్ధమాసద్వయేదద్యాత్తాంబూలం ప్రథమంశిశోః॥" అనియనగా రెండు మాసములు నరవైనపైని శిశువునకు బ్రథమతాంబూలమీవచ్చునని చెప్పెను—— ఇకనిష్క్రమణము- జ్యోతిర్నిబంధమంచు యమవచనము- "తృతీయెవాచతుర్థే వామాసి నిష్క్రమణం భవేత్॥" అనియనగా మూడవ మాసమందుగాని నాల్గవ మాసమందుగాని శిశువు నిల్లు బయలు దేరింపవలెను - అల్లుమనువచనము - "మాసె చతుర్థే కర్తవ్యం శిశోర్నిష్క్రమణం గృహాత్ । షష్ఠెన్నప్రాశనం మాసి యచ్చేష్టం మంగలంకులె॥" అనియనగా నాల్గవమాసము నందిల్లు బయలుదేరించుటయు నారవమాసమందన్న ప్రాశనమును శిశువునకు జేయవలెను కులాచారము చొప్పున మంగలకార్యమును జేయువచ్చును ఇక్కడ శిశువని సామాన్యముగ

జెప్పినందున శూద్రునకు ననిమేధా తిథివ్యాఖ్యానము- మదనరత్నమందుబృహస్ప
తి వచనము- “అన్నప్రాశన కాలే వాకుర్యాన్నిష్క్రమణ క్రియాం” అనగాన
న్నము ముట్టించు సమయమునందైనను నిష్క్రమణము జరిగింప వచ్చునని-విష్ణుధ
ర్మోత్తరమందు “దిగీశానాందినే తత్ర తథాచంద్రార్కయోర్ద్విజ। పూజనం
వాసుదేవస్య గగనస్య చకారయేత్ । బహిర్నిష్క్రమయేద్గేహా చ్ఛంఖ పు
ణ్యాహ నిస్వనైః॥” అని అనగానాదినమందు దిక్పాలకులకును సూర్యచంద్రుల
కును వాసుదేవునికిని గగనమునకును బూజజేసి శంఖధ్వనులు పుణ్యాహ ఘోష
ము వీనితో శిశువు నిల్లుబయలు దేరించునది యనుట - కాబట్టి తండ్రి దేశకాల
ముల స్మరించి “అస్యశిశోర్బీజగర్భసము ద్భవైనోని బర్హణ ద్వారాబలాయు
ర్వర్చోభి వృద్ధ్యర్థం నిష్క్రమణం కరిష్యే” యనిసంకల్పించి గణేశ పూజాపు
ణ్యాహవాచన మాతృకా పూజానాందీ శ్రాద్ధములజేసి ప్రతిమల యందుగాని
యక్షతలందుగాని యింద్రాది దశదిక్పాలకులను వాసుదేవుని గగనమును నామ
మంత్రములచే బూజించి శంఖతూర్య మంగల ధ్వనులతో సూర్యచంద్ర ధేనువు
ల దర్శనము జేయించి యిట్లుపఠించునది - “చంద్రార్కయోర్దిగీశానాంది
శాంచగగనస్యచ । నిక్షేపార్థమిదందద్మితత్త్వాం రక్షంతు సర్వదా । అప్ర
మత్తంప్రమత్తం వాదివారాత్ర మథాపివా । రక్షంతు సతతంసర్వే దేవాశ్శక్ర
పురోగమాః॥” అనియనగా సూర్యచంద్రులకు దిక్పాలురకు దిక్కులకు గగనము
నకును నిక్షేపముగనిన్ను సమర్పించితిని గనుక జాగ్రదవస్థలో నుప్రమాదమునొం
దు నపుడును పగలుగాని రాత్రిగాని దేవతలందరు నిన్నురక్షింతురుగాక - యని
ప్రార్థించిన పైని విప్రులు “కరోతుస్వస్తితే బ్రహ్మ” యనిమొదలుగనాశీర్వాద
మీవలెను—ఇకనుపవేశనము. ప్రయోగపారిజాతమందు పాద్మవచనము - పంచ
మేచతథా మాసిభూమావుపవేశయేత్ । తత్రసర్వేగ్రహాశ్శస్తా భౌమోప్య
తివిశేషతః॥” అనియనగా నైదవమాసమందు శిశువును భూమియందు గూర్చుం
డబెట్టవలెను - అపుడన్ని గ్రహములు శుభస్థానము లందుండవలెను- అంగారకు
డు మిక్కిలిశుభముగా నుండవలెను- విష్ణుధర్మోత్తరమందు- “వారాహంపూ
జయేద్దేవం పృథ్వీంచైవ తథాద్విజం॥” అనియున్నది అనగా నపుడువరాహమూ
ర్తిని భూమిని బ్రాహ్మణుని పూజింపవలెననుట - కనుకతండ్రి దేశకాలములగీ
ర్తించి “అస్యకుమారస్య సర్వారిష్టశాంత్యా ఆయురారోగ్యక్షేమార్థముపవే

శనం కరిష్యే"యని సంకల్పించి గణేశపూజనుపుణ్యాహవాచనముజేసి పీఠమందు గాని ప్రతిమయందుగాని వరాహమూర్తిని భూమిని నామమంత్రముచే షోడ శోపచారముల బూజించి వారియెదుట నైదుగాని యేడుగాని ధాన్యపు ప్రోవు లనుబోసివాని మధ్య భూమియందు"కరోతుస్వస్తితె బ్రహ్మే"యను నాశీర్వచన ములతో వాద్యఘోషములతోను శిశువును గూర్చుండబెట్టి మృత్యుంజయునిస్మ రించి భస్మచే రక్షబెట్టి పఠింపవలెను - "రక్షైనంవసుధే దేవిసదాసర్వగతంశు భె । ఆయుః ప్రమాణం సకలం నిక్షిపస్వ హరిప్రియే । అచిరాదా యుష స్త్వస్యయే కేచిత్పరిపంథినః । జీవితారోగ్య విత్తేషు నిర్దహ స్వాచిరేణ తాన్ । ధారిణ్యశేష భూతానాం మాతాత్వమసి కామధుక్ । అజరా చాప్రమేయాచ సర్వభూత నమస్కృతా। చరాచరాణాంభూతానాంప్రతిష్ఠా చావ్యయాహ్యసి । కుమారంపాహిమాత స్త్వం బ్రహ్మతదనుమన్యతాం॥" అ నిఅనగా నోభూదేవి యీశిశువు తిరిగిన చోటుల నంతటను సదారక్షింపుము ఆ యుః ప్రమాణమంతయు నితనికిసంరక్షింపుము - ఇతని యాయుష్య మునకును జీవితమునకును నారోగ్యమునకును విత్తమునకును విరోధించు దుష్టభూతముల ను శీఘ్రముగ దహింపుము - సమస్తభూతముల ధరించి కామధేనువు వలె బోషించు తల్లివినీవుజర మొదలగువికారములులేకనిత్యురాలవు తెలియ శక్యముగాని మహిమగలదానవుసర్వభూతములకునాధారమై పూజింపబడుదువుకనుకనీశిశువు నురక్షింపుముబ్రహ్మదానినంగీకరించునుగాకయని-అప్పుడొకటిసూత్రముగట్టవలెను శిష్టులన్నప్రాశనదినమందె నిష్క్రమణముపవేశనమును జేయుదురు——ఇకనన్న ప్రాశనము- మదనరత్నమందు నారదవచనము "షష్ఠేవాప్యష్టమేమాసి పుంసాం స్త్రీణాంతు పంచమే । సప్తమే మాసివా కార్యం నవాన్న ప్రాశనం శుభం॥" అని యనగా నారునెనిమిది మాసములందుమగశిశువులకును నైదునేడుమాసము లందు గన్యలకును నన్నప్రాశనము శుభము - లోగాక్షివచనము "షష్ఠేన్న ప్రాశనం జాతేషు దంతేషువా॥" యని యనగా నారవమాసమందైనను దంత ములు పుట్టినపై నైనను నన్నప్రాశనము జేయునది - విష్ణుధర్మోత్తరమందు "బ్రహ్మాణంశంకరం విష్ణుం చంద్రార్కౌచ దిగీశ్వరాన్ । భువందిశశ్చ సం పూజ్య హుత్వావహ్నౌ తథాచరుం । దేవతాపురత స్తస్య ధాత్ర్యుత్సంగగ తస్యచ । అలంకృతస్య దాతవ్య మన్నపాత్రం సకాంచనం । మధ్వాజ్య దధి

సంయుక్తం ప్రాశయేత్పాయ సంతువా॥" అని యనగా బ్రహ్మవిష్ణు మహేశ్వరులను సూర్యచంద్రులను దిక్పాలురను భూమిని బూజించి చరుహోమముజేసి దేవతా సన్నిధిని పెంపుడు తల్లిదొడపైనున్న యలంకరించిన బాలునికి సువర్ణముతోగూడిన యన్నపాత్రమీవలెను లేదా తేనె నేయి పెరుగు గలపిన పాయసమును దినిపించవలెను - అంతటను మూలవచనములు విశేషములును నిర్ణయసింధువునందు దెలియునది - కనుక దండ్రి దేశకాలముల స్మరించి "అస్యశిశోర్బీజగర్భ సముద్భవైనోనిబర్హణద్వారా బలాయుర్వర్చోవివృద్ధ్యర్థం అన్నప్రాశనం కరిష్యే॥" యని సంకల్పించి గణేశపూజా పుణ్యాహవాచన మాతృకాపూజన నాందీ శ్రాద్ధముల జేసి బ్రహ్మాదులను ప్రతిమలందుగాని యక్షతలందుగాని పూజించి వారినామలచే చరుహోమముజేసి నేయి పెరుగు తేనెతో గలపిన యన్నముగాని పాయసముగాని తినిపించి తాంబూలమిచ్చి రత్నములు సువర్ణము మణిపాత్రలు మొదలగునవి యెదుటనుంచి దేని బాలుడు ముట్టునో యది యతనికి జీవికయగునని పరీక్షింపవలెను - ఇట్లన్నప్రాశనము—ఇక నబ్దపూర్తియనగ బుట్టుదినమం దుత్సవము ఇది యేవర్ధంతియనబడును - గౌడ వ్యవహారనిర్ణయమందు - "నవాంబర ధరో భూత్వా పూజయేచ్చిరాయుషం। మార్కండేయం నరో భక్త్యా పూజయేత్ప్రయతస్తథా । తతో దీర్ఘాయుషం వ్యాసం రామం ద్రౌణిం కృపం బలిం । ప్రహ్లాదంచ హనూమంతం విభీషణమథార్చయేత్ । స్వనక్షత్రం జన్మతిథిం ప్రాప్య సంపూజయేన్నరః । షష్ఠీంచ దధిభక్తేన వర్షేవర్షే పునఃపునః॥" అనియున్నది అనగా జన్మనక్షత్రము జన్మతిథిగలసిన దినమందు నూతనవస్త్రముల ధరించి చిరాయువగు మార్కండేయమునిని దీర్ఘాయుష్మంతులైన వ్యాసపరశురాములను నశ్వత్థామ కృపాచార్యులను బలిచక్రవర్తిని ప్రహ్లాదుని హనూమంతుని విభీషణుని గ్రమముగ బూజింపవలెను షష్ఠీదేవిని దధ్యన్నముచే బ్రతిసంవత్సరము బూజించునదియని - తిథితత్వమందు శిశునామముచే దిలహోమము గూడ జెప్పబడినది - ఆదిత్యపురాణమందును - "సర్వైర్వ్యశ్చ జన్మదివసే స్నాతైర్మంగలవారిభిః । గురుదేవాగ్ని విప్రాశ్చ పూజనీయాః ప్రయత్నతః । స్వనక్షత్రంచ పితర స్తథా దేవః ప్రజాపతిః । ప్రతిసంవత్సరం యత్నాత్కర్తవ్యశ్చ మహోత్సవః ॥" అనియనగా ప్రతిసంవత్సరమందును జన్మదినమందు మంగళోదకములచే స్నానముజేసియంద

ఋను గురువును దేవతల నగ్నులను బ్రాహ్మణులను బూజించునది మరియు జ
న్మనక్షత్రమును బితృదేవతలను బ్రజాపతిదేవతను బూజించునది మహోత్సవ
ముజేయునది - కృత్యచింతామణిలో "గుడదుగ్ధతిలాన్ దద్యా ద్ధస్తే గ్రంథౌ చబం
ధయేత్ । గుగ్గులుం నింబసిద్ధార్థం దూర్వాగోరోచ నాదికం । సంపూజ్య
భాను విఘ్నేశౌ మహర్షిం ప్రార్థయేదిదం॥" అని యున్నది అనగా బెల్ల
ము పాలు తిలలు నీవలెను గుగ్గిలము వేము నావాలు దూర్వలు గోరోచనము
మొదలగునవి ముడివేసి హస్తమునందు గట్టవలెను - సూర్యుని విఘ్నేశునిబూ
జించి మార్కండేయుని ప్రార్థించునదియని - జన్మతిథి యుదయవ్యాపిని గ్ర
హింపవలెను - అట్లువచనము కృత్యతత్త్వార్ణవమందు స్కాందము - "యు
గాద్యావర్షవృద్ధిశ్చ సప్తమీపార్వతీ ప్రియా । రవేరుదయ మీక్షంతే నతత్రతి
థియుగ్మతా॥" యని యనగా యుగాదియు జన్మతిథియు పార్వతికి బ్రియమైన
సప్తమియు నీతిథులు సూర్యోదయవ్యాప్తినపేక్షించునుగనుక తిథిద్వయవిచారమ
క్కరలేదు- కనుక దండ్రి బాలునితో నభ్యంగస్నానముజేసి నూతనవస్త్రముల ధ
రించి దేశకాలముల గీర్తించి "అస్యశిశోర్దీర్ఘాయు రారోగ్యార్థంవర్షదిన
కృత్యంకరిష్యే" యని సంకల్పించి ప్రతిమలందుగాని యక్షతపుంజములందుగానిగ
ణేశుని సూర్యుని మార్కండేయుని వ్యాసునిపరశురాముని నశ్వత్థామను కృపా
చార్యుని బలిని ప్రహ్లాదుని హనుమంతుని విభీషణుని షష్ఠీదేవిని స్వనక్షత్రము
ను తల్లిదండ్రులను ప్రజాపతిని గురుని నగ్నిని బూజించి వారినామములచే దిల
హోమము వికల్పముగజేసి గుగ్గిలము వేము నావాలు దూర్వలుగోరోచనము బె
ల్లము నివి పొట్లముగట్టి హస్తమున బంధించి మార్కండేయుని ప్రార్థించున
ది - "చిరంజీవీయథాత్వంభో భవిష్యామి తథామునే । రూపవాన్విత్తవాం
శ్చైవ శ్రియాయుక్తశ్చ సర్వదా । మార్కండేయనమస్తేస్తు సప్తకల్పాంత జీ
వన । ఆయురారోగ్య సిద్ధ్యర్థం ప్రసీద భగవన్మునే । చిరజీవీయథాత్వం
తు మునీనాం ప్రవరద్విజ । కురుష్వమునిశార్దూల తథామాంచిర జీవినం ।
మార్కండేయ మహాభాగ సప్తకల్పాంత జీవన । ఆయురారోగ్య సిద్ధ్యర్థ
మస్మాకం వరదోభవ॥" అని యనగానో మార్కండేయముని నీవలెచిరంజీవినై
రూపము ధనము తేజస్సును గల్గి నీప్రసాదముననే నుండుదును గాక నీకునమస్కా
రము సప్తకల్పాంతరములు జీవించు నీవునాయందు గృపజేసియాయురారోగ్య

శ్వర్యములిచ్చి నాకువరదుడవుగమ్మని ప్రార్థించునది-తండ్రి ప్రార్థించునపు "దే నం చిరజీవినం" అని పఠింపవలెను - అటుపైని గుడము తిలలు గలిపిన చేరెడు పాలు గ్రహించి "సతిలంగుడసంమిశ్ర మంజల్యర్ధమితం పయః । మార్కండేయాద్వరం లబ్ధ్వా పిబామ్యాయుర్వి వృద్ధయే॥" యని పఠింపుచు ద్రాగి గురు దేవబ్రాహ్మణుల బూజింపవలెను- గౌడతిథితత్వమందుస్కాందవచనము- "ఖండనం నఖకేశానాం మైథునాధ్వగమౌతథా । ఆమిషంకలహంహింసాం వర్ష వృద్ధౌవి వర్జయేత్॥" అని యనగా నఖములు కేశములు ఖండించుటయు స్త్రీ సంగము ప్రయాణము మాంసభక్షణముకలహము హింసయు వర్ధంతిదినము న జేయగూడదు - మరియును "కృతాంతకుజయోర్వారే యస్యజన్మతిథీ భవేత్ । అన్యక్షయోగ సంప్రాప్తౌవిఘ్నస్తస్యపదేపదే॥" అని యున్నది అనగా శనివారమందుగాని మంగళవారమందుగాని జన్మతిథియయ్యేనేని నపుడు జన్మనక్షత్రయోగమున్నచో దోషములేదు లేనిచో ప్రతికార్యమందతనికి విఘ్నమగును- కాబట్టి యపుడతడు సర్వౌషధులచే స్నానము గురుదేవాగ్నిపూజయును జేయవలెనని- విశేషము నిర్ణయసింధువునందు దెలియునది - ఇక హేమాద్రిలోవర్ధాపనకర్మయందు విశేషము భవిష్యవచనము "దేవదేవమహాభాగ బాలానాంహితకామ్యయా।వర్ధాపన విధిం బ్రూహిరాజ్ఞామపి విశేషతః॥" అనిధర్మరాజడుగగా ననగా దేవదేవుడవు పూజ్యుడవునైన యో శ్రీకృష్ణుడా బాలురకు రాజులకును హితమగువర్ధంతి విధిని చెప్పుమని యడిగిన శ్రీకృష్ణుడును ప్రయాగమందు వ్యాసుడడిగిన సనత్కుమారుడును జెప్పెను ఎట్లనిన "మాసి ప్రవిష్టే ప్రథమే బాలవర్ధాపనం బుధైః । రాజ్ఞాంవాత స్మునిశ్రేష్ఠసమాంతేచ విధీయతే । కుముదామాధవీ గౌరీ రుద్రాణీ పార్వతీఉమా । కాళీసరస్వతీ చైవ స్వావిత్రీ బ్రహ్మణః ప్రియా । సతీసంజ్ఞా తథామేధా పుష్టితుష్టిసమన్వితా। నృపడింభ పరిత్రాణా జీవంతీ నామషోడశీ । పూజనీయాః ప్రయత్నేన సూర్యమధ్యే విలిఖ్యతు । రాజనీపిష్టతోవాపిలిఖేద్వా కుంకుమేనతు। గంధపుష్పై స్సుగంధైశ్చ దీపవస్త్ర నివేదనైః । పూజనీయాస్తుసంస్థాప్య కుముదాద్యాఃపృథక్ పృథక్।నామభిఃపూజనీయాస్తాః పూజయిత్వాతు బాలకం।భూపతించమునే వా థసర్వాలం కారభూషితం । పూజయేన్మాతృ పితరౌ బాలవర్ధాపనేసతి। పురోధాః పూజయేద్బ్రహ్మన్ రాజవర్ధాప నావిధౌ । కుముదాద్యా స్స

ముద్దిశ్య వంశపాత్రాణి కల్పయేత్। ఏకైకస్యాధనాఢ్యస్తుదద్యాత్ షోడశ షోడశ।తదర్ధానితదర్ధానిద్వేచైకైకమథాపివా। బహుపక్వాన్నయుక్తానిబహుపుష్ప ఫలానితు । సువాసినీభ్యాంవిప్రాణాం దద్యాద్భక్తిపురస్సరం । ప్రీయంతాంకుముదాద్యామెబాలకాయుర్వివర్ధనాః।బలేన యశసాతుష్ట్యా బాలమ్మే వర్ధయంతువై । ప్రయచ్ఛంతు సదారోగ్యం సౌఖ్యం సౌభాగ్యమేవచ । శ్రీశ్చతే తిచమంత్రేణ హ్యర్ఘ్యంతాభ్యః ప్రదాపయేత్ । వస్త్రతాంబూలపుష్పాది దినేతస్మిన్ ప్రకల్పయేత్ । సువాసినీనాందేయంతు కుముదా ప్రీయతామితి॥" అని యనగా బాలురకు ప్రతిమాసమందును రాజులకు ప్రతిసంవత్సరమును వర్ధాపనోత్సవము చేయవలెను - అందుబాలురకు జేయునపుడువాని తలిదండ్రులును రాజులకు జేయునపుడు పురోహితుడును బూజింపవలెను ఎట్లనిన కుముదాదేవి మొదలుగజీవంతీ పర్యంతముచెప్పిన పదార్గురు దేవతలను వలయాకారమగు మండలముజేసి దానిలో రాజనపుపిండిచేగాని కుంకుమముచేగాని యాదేవతలలిఖించి యానామములచేతనే గంధపుష్పదీపవస్త్రనివేదనములిచ్చి వేర్వేరుగ పూజించి బాలకునిగాని భూపతినిగాని యలంకరించి పూజింపవలెను - ఆపైని ప్రతిదేవతకు బహుపక్వాన్నములతోఫలపుష్పాదులతోనింపినచేటలు పదారేసిగాని యెనిమిదేసిగాని నాలుగేసిగాని రెండేసిగాని యొక్కొక్కటియైనను యథాశక్తిగనర్పించి యవిసువాసినులకు బ్రాహ్మణులకు భక్తితో నీవలెను - అపుడు "ప్రీయంతాంకుముదాద్యామె" యనుశ్లోకములుపఠింప వలెను ఆపైని "శ్రీశ్చతే" యనుమంత్రముచే నర్ఘ్యమాదేవతలకీవలెను-మరియు సువాసినీలకు వస్త్రతాంబూలాదులిచ్చి "కుముదాప్రీయతాం॥" అనియుచ్చరింపవలెను- అక్కడనే స్కాందవచనము - "ఏవంవర్ధాపనంవత్సరాంతేవై జన్మవాసరే। వ్యతీతేషుచ మాసేషు బాలానాంబలవృద్ధయె ॥ నబాలరోగాః పరిభవంతితస్య నస్కంద రోగానతుశాకినీభ్యః। భయంభవేన్నైవజలాగ్నిదిగ్భ్యో బాలస్యభూతాది విశేషతశ్చ । సంప్రాప్యరాజ్యం నృపతిస్సమాంతె కుర్యాదిమంశాంతిమహోత్సవంచ। గ్రహాంస్తథాపూజ్యవినాయకంచదుర్గాంచ భక్త్యాకుముదాదిదేవీః । యఃపూజయెద్భక్తి పురస్సరంహిససర్వపూర్ణోబలవృద్ధియుక్తః॥ అనియనగా నిట్లురాజులకు వత్సరాంతమందును బాలునికి ప్రతిమాస మందును వర్ధాపనవిధిజేసినచో బాలురకు బాలరోగములును భూతప్రేతడపిశాచశాకినీ

భయములును రానేరవుగనుక రాజ్యాభిషిక్తుడగు రాజుగూడ గృహములనువినా యకుని దుర్గానుభక్తిచే బూజించి మీదజెప్పిన కుముచాది దేవతలను బూజించి నచో సంపత్తియు బలము నధికమగును - గోపథబ్రాహ్మణమందు విశేషము - రాజునకు నాయుష్యము వర్చస్సు తేజస్సు విజయము ప్రసిద్ధియు గలుగునట్లువ ర్ధాపన విధిజేయు నపుడు మంగళోదకముల స్నానముచేయించి యలంకరించి మంహేంద్ర దేవతాకమైన హవిస్సును నిరూపించిదిక్పాలురకును హవిశ్శ్రపణము జేసి"మహాంఇంద్రోయెఓజసా॥"యనిలోకపాలురకునురాజునుస్పృశింపుచు"నేద్రే ద్యౌఅర్వాంచ మింద్రంధాతారమింద్రం వర్ధయే॥"యనుమూడింటిచేరక్షను జేసి 'గురుణాస ఆసతే॥"యనుమంత్రముచే గోరోచనాతిలకముంచునది"ప్రజాపైతం తుం" అనుసూక్తము సంపాతయుక్తముగజేసి "ధాతాతేయ॥"మనియు"నభివర్ధ స్వ" యని చెప్పవలెను- ఇట్లుకమలాకరమందు శూద్రవర్ధాపనవిధి—— ఇకచౌల ము - అందుబృహస్పతి వచనము "పాపగ్రహాణాం వారాదౌ విప్రాణాం శుభ దం భవేత్ । క్షత్రియాణాం క్షమాసూ నోవిట్ శూద్రాణాంశనాశుభం॥"అ ని యనగా విప్రులకు బాపగ్రహములయొక్క వారముమొదలగు దానియందుచూ డాకర్మ శుభము. క్షత్రియులకు మంగళవారమున శుభము వైశ్య శూద్రుల కు శనివారమున శుభము - అందుగాల నిర్ణయమును దల్లికి గర్భమురజో ద ర్శనమైనను నిషిద్ధమనియు మొదలగునవి నిర్ణయసింధువునందు దెలియునది—— శూద్రునికి విశేషమాత్రము చెప్పబడును - ఒకటిరెండుమూడు నైదువత్సరముల లో నొకదానియందు గులాచారము చొప్పున జెప్పినకాలమందు దండ్రి దేశకాల ములగీర్తించి"అస్యశిశోర్బీజ గర్భసము ద్భవదోషవినాశ ద్వారాబలాయుర్వ ర్చోభివృద్ధ్యర్థం చూడాకర్మకరిష్యే॥"యనిసంకల్పించి గణేశపూజా పుణ్యా హవాచనమాతృకా పూజావసోర్ధారానాందీ శ్రాద్ధములజేసి భద్రపీఠమందు శిశువును గూర్చుండబెట్టి యొకశిఖనుగానికేశపఙ్క్తినిగాని విడిచిగాని లేదాయా వత్తునుగాని కులాచారము చొప్పున క్షౌరము జేయించునది- ఆపైనినీరాజనాది క మీవలెను - ఇట్లు చౌలము—— ఇకవిద్యారంభము - మదనరత్నమందునృసిం హవచనము - "అక్షరస్వీకృతిం కుర్యాత్ప్రాప్తే పంచమహాయనే । ఉత్తరాయ ణగేసూర్యే కుంభమాసం వివర్జయేత్॥" అనియనగా బాలుని కైదవ వత్సర మురాగానే యక్షరగ్రహణము కుంభమాసము తప్ప దక్షిణయుత్తరాయణమం

దు శుభదినమున జేయవలెను - ఇకధనుర్విద్యా దీపికయందు - "అదితిగురుయ
మౌర్క-స్వాతిచిత్రాగ్ని పిత్ర్యధ్రువహరివసు మూలెష్వందుభాగాంత్యభేషు। శని
శశి బుధవారే విష్ణుబోధేపి పౌషెను సమయతిధియోగె చాపవిద్యాప్రదానం॥"
అనియున్నది యనగా గార్తికపౌషమాసములలో శనిసోమబుధ వారములందు
పునర్వసు-పుష్యము-భరణి-హస్త-స్వాతి-చిత్ర-కృత్తిక-మఘ-రోహిణి- ఉత్తరా
త్రియము- శ్రవణము- ధనిష్ఠ-మూల-మృగశిర-పుబ్బ- రేవతి- ఈనక్షత్రములందు ధ
నుర్విద్య చెప్పుట శుభమగును. అట్టివిద్యారంభములక్ష్మీనారాయణులను సరస్వతి
ని బూజించి చేయవలెను "సర్వాయుధ మహామాత్ర సర్వదేవారిసూదన। చాప
మాంసమరేరక్షసాకంశరవర్రైరహ । ధృతం కృష్ణేనరక్షార్థం సంహారాయహ
రేణ చ।త్రయీమూర్తిగతందేవం ధనురస్త్రంనమామ్యహం॥" అనుశ్లోక మంత్ర
ముచే బూజించి నమస్కరించి యొకబాణమును దూర్పుగవైచి విప్రులబూజిం
చునది—— ఇకఛురికాబంధనమనగా బిల్లసూరకత్తి ధరించుట జ్యోతిర్నిబంధమం
దు - నారదవచనము - "ఛురికా బంధనంవక్ష్యె నృపాణాం ప్రాక్కరగ్రహా
త్। వివాహొక్తేషు మాసేషు శుక్లపక్షేప్యనస్తగె । జీవేశుక్రేచ భూపుత్రె
చంద్రతారా బలాన్వితె । మౌంజీబంధ ర్క్ష తిథిషు కుజవర్జిత వాసరె॥" అ
నియనగా రాజులకు చురకత్తి ధరించుట వివాహముగాకమున్నువివాహ యోగ్య
ములైన మాసములందు శుక్లపక్షమునగురు శుక్రుల కస్తమయము లేనపుడుఅం
గారకుడు నట్లుండగ జంద్ర తారా బలయుక్తమై యుపనయనమునకు జెప్పిన న
క్షత్రములలో నొకదానియందు మంగలవారముతప్ప దక్కినవారములందు జేయ
వచ్చుననుట - సంగ్రహమందు "శూద్రాణాం రాజపుత్రాణాం మౌంజ్యా భావే
స్త్ర బంధనం । మౌంజీబంధోక్తతి థ్యాదౌకార్యంభౌమదినం వినా॥" అనియు
న్నది యనగా శూద్రులకును రాజపుత్రులకును మౌంజీబంధనమనగ నుపనయన
ముగాక మున్నుదానికి జెప్పిన తిథివారనక్షత్రములందు శస్త్రబంధముచేయునది-
మంగలవారముమాత్రము నిషిద్ధము. విష్ణు ధర్మమందు "పూజయిత్వాహరిం ల
క్ష్మీంతథాదేవీం సరస్వతీం । స్వవిద్యా సూత్రకారాంశ్చస్వాంచవిద్యాం విశే
షతః । ఎతేషామేవ దేవానాం నామ్నాతు జుహుయాద్ఘృతం । దక్షిణాభి
ద్విజేంద్రాణాం కర్తవ్యం చాత్రపూజనం॥" అనియనగా లక్ష్మీనారాయణుల
ను సరస్వతీదేవిని స్వవిద్యయొక్క సూత్రకారులను విద్యను బూజించి యాదేవ

తల నామములచేతనే ఘృతహోమముజేసి దక్షిణలచే ద్విజులను బూజించునది-
మంత్రము- "సర్వాయుధానాం ప్రథమం నిర్మితాసి పినాకినా। శూలాయుధాద్వి
నిష్కృష్యకృత్వాముష్టి గ్రహంశుభం । చండికాయాః ప్రదత్తాసి సర్వదుష్టనిబ
ర్హణీ । తయావిస్తారితాచాసి దేవానాం ప్రతిపాదితా। సర్వసత్వాంగభూ
తాసిసర్వా శుభనిబర్హణీ । ఛురికేరక్షమాం నిత్యంశాంతిం యచ్ఛ నమోస్తు
తే॥" అనియనగా సర్వాయుధములు పుట్టక మున్ను పరమేశ్వరునిచే శూలాయు
ధమునుండి గట్టిగాపిడికిలిబట్టియాకర్షించి తీయబడియో చురకత్తి సర్వదుష్టులహ
రించుటకుమొదటచండికాదేవికీబడితివియటుపైనాదేవిచేవిస్తరింపబడిసర్వసత్వము
లకు నంగమై యశుభములన్నియు హరింపుచుంటివినన్నునిత్యమురక్షింపుము శాం
తి నిమ్ము నీకునమస్కారమని యర్థముగలశ్లోకమంత్రముచేఛురికను బూజించికు
డిపార్శ్వమున నడుమున గట్టుకొనవలెను - అపరార్కమందు వృద్ధశాతాత
పవచనము "శిశోరభ్యుక్షణంప్రోక్తం బాలస్యాచమనంస్మృతం । జలస్థలాది
సంస్పర్శే స్నానమేవకుమారకే। ప్రాక్చూడాకరణాద్బాలః ప్రాగన్నప్రా
శనాచ్ఛిశుః ।। కుమారస్సతువిజ్ఞేయో యావన్మౌంజీని బధ్యతే । బాలస్య
పంచమాద్వర్షాద్రక్షార్థం శౌచమాదిశేత్॥"అనియనగా శిశువునకుననిన నన్న
ప్రాశనముకాకమున్ను శిశువునకు ప్రోక్షించుటయె శౌచము చూడాకర్మకుము
న్ను బాలుడనబడు నతనికినాచమనముచేశుద్ధి - ఉపనయన పర్యంతము కు
మారుడనబడు నతనికి జలస్థలాది దుష్ట స్పర్శయందు స్నానముచే శుద్ధిబాలుని
కైదవవత్సరము మొదలుగ శౌచాచార ముపదేశింపవలెనని మొదలగు విశేషము
నిర్ణయ సింధువునందు దెలియునది.

ఇకవివాహము-అందుశూద్రులకంతటనుద్విజులకువలెనే సాపిండ్యము ఏమనిన-
కూటస్థునియవయము లనువర్తించుట సమానమెకదా-యనివిజ్ఞానేశ్వరుడుచెప్పె
ను- అదినిర్ణయసింధువులో నిరూపించితిని గనుక నిక్కడ చెప్పలేదు - బ్రాహ్మ
మునార్షముదైవము ప్రాజాపత్యము గాంధర్వ మాసురము రాక్షసము పైశా
చమునని యెనిమిది వివాహభేదములు - వానిలక్షణములు యాజ్ఞవల్క్యముని
చెప్పెను - "బ్రాహ్మోవివాహ ఆహూయ దీయతేశక్త్యలంకృతా । యజ్ఞ
స్థఋత్విజేదైవ ఆదాయార్షస్తు గోద్వయం । ఇత్యుక్త్వాచరతాం ధర్మం స
హయాదీయతేర్థినే । సకాయః పావయేత్తజ్జఃషట్షట్వంశ్యాన్సహాత్మనా।

ఆసురోద్రవిణాదానాద్గాంధర్వ స్సమయా న్మిథః। రాక్షసోయుద్ధహరణాత్పై శాచఃకన్యకాఛలాత్॥" అనియనగా వరుని బిలిచి సత్కరించి యథాశక్తిగ క న్యకనలంకరించి దానముజేయుట బ్రాహ్మవివాహము - యజ్ఞముదాను జేయు చుఋత్విజునిగా వరించిన బ్రహ్మచారికి దనకన్యక నిచ్చుట దైవవివాహము- వ రునివలన రెండుగోవుల బుచ్చుకొని కన్యకనిచ్చిన నార్షవివాహము - మీరిద్ద రుగూడి ధర్మమాచరింపుడని పలికి కన్యకనిచ్చిన ప్రాజాపత్యము- అట్టి వివాహ మునందు బుట్టిన సంతతి యాగుణ రేసి వంశ్యులతో దన్నుద్దరింపజేయును - ధన ముపుచ్చుకొని కన్యకనిచ్చెనేని యాసురవివాహము-దంపతు లిద్దరు పరస్పర మొ కరినొకరు విడువకుండగ శపథమున స్వయముగానే వివాహమగుట గాంధర్వ ము - యుద్ధమందు గన్యాబంధువుల పైవారిని జయించి కన్యను హరించుట రాక్షసము - కపటముచేత గన్య నపహరించుట పైశాచ వివాహము . వీని లో ప్రాజాపత్య వివాహముశూద్రులకు ముఖ్యము - ఆసుర గాంధర్వములు మ ధ్యమములు రాక్షసపైశాచములు గనిష్ఠములు - అట్లు మనువచనము- "ఆసు రంవైశ్య శూద్రయోః । షడానుపూర్వ్యా విప్రస్యక్షత్రస్య చతురోఽవ రాన్ । విట్ శూద్రయోస్తుతానేవ విద్యాద్ధర్మ్యాన రాక్షసాన్ ॥" అ ని యనగా వైశ్య శూద్రులకె యాసురము విప్రులకు క్రమముగా నారిటి ప ర్యంతమనగ బ్రాహ్మదైవార్ష ప్రాజాపత్య గాంధర్వా సురములలో బూ ర్వపూర్వము సంభవింపనిచో నుత్తరోత్తరమగును - క్షత్రియులకు చివరనా ల్గుననగ గాంధర్వాసుర రాక్షసపై శాచములనుట. వైశ్యశూద్రులకు నవి యే రాక్షసము దప్పదక్కిన మూడును ధర్మ్యములనుట - కల్పతరువునందు బ్రా హ్మవివాహము జెప్పి " బ్రాహ్మణానాం సతామేషధర్మః ॥ " అని య నగా నిది బ్రాహ్మణులకు ధర్మమని విశేషించిచెప్పినందునను దైవముయజ్ఞసం బంధముగల్గిన ఋత్విజునకుజెప్పినందునను నారెండు దప్పదక్కినవి మూడువర్ణ ములవారికి సమానమేయని చెప్పబడినది - హేమాద్రిలో పైఠీనసి వచనము- "పైశాచః ప్రతిలోమానాం॥" అని యనగా సంకరజాతులకు బైశాచము ధ ర్మ్యమని యున్నది - ఇకనాసురవివాహనిషేధము-కాశ్యప వచనము - "శు ల్కేనయే ప్రయచ్ఛంతి స్వసుతాంలోభ మోహితాః । ఆత్మ విక్రయిణః పా పా మహాకిల్బిషకారిణః । పతంతినరకేఘోరే ఘ్నంతిచాస ప్తమంకులం ॥ "అని

యనగా ధనలోభముచే మోహితులై శుల్కముగా ధనముగ్రహించి కన్యక ని
చ్చువారు తనశరీరమాంసమమ్మినవారనబడుదురు అట్టిమహాపాపులు ఘోరన
రకమందుబడుదురుసరియెకదాస ప్తమపురుషునిపర్యంతముగులమును జెరుపుదురని-
అయిన నదిశూద్రులకు ధర్మ్యవివాహముగ విధింపబడినందున నాసురత్వముసి
ద్ధించుటకు గొంచెముసంతోషముతో గన్యకకిచ్చి వివాహమాడినచో దోషములే
దు - కనుకనే గాంధర్వాసురములకు సమముగ నుత్తమలోకఫలమునాదిత్యపు
రాణము చెప్పినది - "గాంధర్వేణవివాహేన యస్తుకన్యాం ప్రయచ్ఛతి। గంధ
ర్వలోకం వ్రజతి గంధర్వైః పూజ్యతేచసః । శుల్కేన దద్యాద్యః కన్యాంవ
రాయ సదృశాయచ । కిన్నరై రుపగీయేత గాంధర్వం లోకమేతిచ॥" అనియ
నగా గాంధర్వవివాహవిధిచే గన్యకనిచ్చువాడు గంధర్వలోకమున బూజింపఁబ
డును ఇక శుల్కము బుచ్చుకొనినమైనను దగినవరునికి గన్యకనిచ్చెనేని యతడు
ను గిన్నరులచే స్తుతింపబడును గంధర్వలోకము నొందునని.హారీతవచనము. "ఏ
షామన్య తమేనోఢాం ధర్మపత్నీంపరే ప్రాహుః॥" అని యనగా నీయెనిమిదిం
టిలో నొకదానిచే వివాహమాడిన స్త్రీని ధర్మపత్నియందురు - విశేషముమే
ధాతిథియందును గల్పతరువునందును దెలియునది - అందుగాంధర్వరాక్షసపై
శాచములందు దప్పదక్కిన వివాహములందంతట నుదకపూర్వముగ దానము ని
యతము - వసిష్ఠవచనము - "నోదకేననవాచాచకన్యాయాః పతిరుచ్యతే। పా
ణిగ్రహణ సంస్కారా త్పతిత్వం సప్తమేపదే॥" అనగా నుదక దానముచే వా
గ్దానముచేతను బతిత్వము సిద్ధింపదు మరియేమనిన పాణిగ్రహణమైనపైని సప్త
పదముల ద్రొక్కినచో బతియనబడుననుట - గాంధర్వాదులందును హోమా
దికము చేయవలెను. అట్లువచనమపరార్కమందు వసిష్ఠుడు - "గాంధర్వాసుర
పైశాచా వివాహా రాక్షసశ్చయః । పూర్వం పరిగ్రహస్తేషు పశ్చాద్ధోమో
విధీయతే॥" అనియనగా గాంధర్వాసురపైశాచరాక్షసవివాహములందు ముం
దె పాణిగ్రహణము అనంతరమున హోమమని - కనుకనే హోమాదులుజరు
గనిచో గన్యనుమరియొకనికీవచ్చునని యపరార్కమందు వసిష్ఠబోధాయనులవచ
నము - "బలాదపహృతాకన్యామంత్రైర్యదిన సంస్కృతా । అన్యస్మై విధి
వద్దేయా యథాకన్యా తథైవసా॥" అని యనగా బలాత్కారమున నపహరిం
పబడిన కన్యకు మంత్రసంస్కారములు జరుగనియెడ మరియొకనికి యథావిధిగ

నీవచ్చును అనగా కన్యాస్వత్వము పోలేదని. ఇక్కడ బలాత్కార మనియున్నందు
నరాక్షసపై శౌచములందిట్లని తెలియునది - శూద్రునకు నమోమంత్రమేయని
మీద జెప్పబడినది. అట్లుమనుస్మృతియందు "పాణిగ్రహణికా మంత్రా నియతం
దారలక్షణం । తేషాంనిష్ఠాతు విజ్ఞేయా విద్వద్భిస్సప్త మేపదే॥" అని యున్న
ది అనగా పాణిగ్రహణమంత్రములే భార్యయగుట కావశ్యకమైన లక్షణము-
వానికి బరిసమాప్తి సప్తపదములు ద్రొక్కినచో నని విద్వాంసులు తెలియునది-
అట్టు పాణిగ్రహణము సర్వవర్ణములకు సమానము "పాణిగ్రాహ్యా స్సర్వవ
ర్ణానాం॥" అనిభేదము లేకుండగ యాజ్ఞవల్క్యవచనమున్నది - ఉదక పూర్వము
గ కన్యాదానము జేయుట శూద్రులందు వైకల్పికము. అట్లుస్మృతికౌముదియం
దు బ్రాహ్మవచనము "యుక్తంతుపాణి గ్రహణంసర్వవర్ణేషుసర్వశః।జలపూ
ర్వంతు విప్రాణామన్యేషామపి కామ్యయా॥" అని యనగా సమస్తవర్ణములం
దు పాణిగ్రహణము తప్పనిది - అది విప్రులకు జలదానపూర్వముగ గావలెను-
ఇతరులకుజలదాన మైచ్ఛికము అనగా నిచ్ఛయుండెనేని జేయవచ్చుననుట-కొంద
రుజలపూర్వకముగ గన్యాదానము బ్రాహ్మవివాహమందే యంద్రు. అట్లాశ్వలా
యనవచనము-"అలంకృత్యకన్యాముదకపూర్వందద్యాదేష బ్రాహ్మోవివాహః॥"
అని. తక్కిన విశేషములు నిర్ణయ సింధువునందు దెలియునది - స్మృతికౌము
దియందు బ్రాహ్మవచనము - "ఇష్టింవై నాయకీం కృత్వా శచీయాగంచ శోభ
నం । నాందీముఖేభ్య శ్శ్రాద్ధంచ పితృభ్యః కార్యసిద్ధయే॥" అని అనగా వి
ఘ్నేశపూజను శచీపూజనుచేసి నాందీశ్రాద్ధము జేసినయెడ నిర్విఘ్నముగ వివా
హసిద్ధియగును - వారాహసంహితయందు - "గృహేస్థితాంవై పురుహూ
తపత్నీం ప్రాఙ్మధ్యసంధ్యా స్తమయేషుకన్యా। స్రగ్గంధధూపైః ప్రతిపూజ యె
త్తు పాణిగ్రహేయాసము పాగతేతి॥" అని యనగా కన్యకు వివాహముసమీపిం
చు నపుడు గృహమందు శచీదేవిని ప్రాతఃకాలమందును మధ్యాహ్నమందును
సాయంకాలమందును గంధపుష్పాదులతోగన్యక పూజింపవలెననుట—— ఇక వి
వాహవిధిప్రయోగము - శూద్రస్త్రీకిశూద్రునితో వివాహమగునపుడు. మంత్రర
హితముగ గ్రియమాత్రము చేయవలెనని హరిహరభాష్యమందు జెప్పబడినది- క
నుక కాతీయసూత్రప్రకారమున కర్మ చెప్పబడును - అపుడువివాహమునకు జె
ప్పిన ముహూర్తమందు గన్యకతండ్రిగాని భ్రాతగాని యన్యుడుగాని కన్యబం

ధువుడు వరునిగృహమునకు వెళ్లియాచమనముజేసి దేశకాలముల గీర్తించి "కరి
ష్యమాణవివాహాంగత్వేన వాగ్దానంకరిష్యే॥" యనిసంకల్పించి గణేశుని వరుణు
ని బూజించి పాదప్రక్షాలన గంధపుష్పాదులచే వరునిబూజించి తాంబూల
ము నారికేళఫలము కుంకుమాదులంటించిన నూతనవస్త్రముగ్రహించి "అముక
ప్రపౌత్రాయాముక పౌత్రాయాముక పుత్రాయాముకదాసాయ వరాయాముక
ప్రపౌత్రీమముకపౌత్రీ మముకపుత్రీ మముకనామ్నీం కన్యాంతుభ్యం జ్యోతిర్విదు
క్తేముహూర్తేదాస్యే" యనియుచ్చరించవలెను అన్యులు బంధువులు "అవ్యంగే
ఽపతితేఽక్లీబె దశదోషవివర్జితే। తత్కాలోపస్థితే కన్యాం పితాతుభ్యంప్రదా
స్యతి॥" యని పలుకవలెనుతండ్రియైనచో "అహందాస్యామ్యసంశయ" మని పఠింప
వలెను "స్నాతేస్నాతామరోగిణీం॥" అని పాఠాంతరము - కొందరు కన్యా
గృహమునకు వరబంధువెళ్లినపైనికన్యనుపూజించి "అవ్యంగేఽపతితేఽక్లీబేదశదో
షవివర్జితే । ఇమాంకన్యాంప్రదాస్యామి దేవాగ్ని ద్విజసన్నిధౌ॥" అని యన
గానంగవికారములేనివాడును జాతి భ్రష్టుడుగాని వాడును నపుంసకుడుగానివా
డును ఇట్లు పదిదోషములులేని మీచిన్న వానికి దేవాగ్నిద్విజులు సాక్షిగనీకన్యక
నిచ్చెదనని కన్యకతండ్రి పలికి వరబంధువులహస్తమందు బ్రతిననిచ్చి "వాచాదత్తా
మయాకన్యావరార్థంస్వీకృతాత్వయా । కన్యావలోకనవిధౌ నిశ్చి తస్త్వం
సుఖీభవ॥" యని యనగా నిపుడు నావాక్కుచే గన్యయీబడ్డది వరునికొరకునీ
చేప్రతిగ్రహింపబడినది గనుకకన్యనుజూచు విధియందు నిశ్చయించుకొని సుఖివి
గమ్మని పలుకగావరునితండ్రియు "వాచాదత్తాత్వయాకన్యా వరార్థం స్వీకృ
తామయా । వరావలోకనవిధౌ నిశ్చితస్త్వం సుఖీభవ ॥" యనియనగా ని
ట్లుకన్యనీచేత నీబడినది నాచేవరునికై ప్రతిగ్రహింపబడినది వరునిజూచువిధియం
దు నిశ్చితుడవు గమ్మని యూహచేశ్లోకము నుచ్చరింప వలెనంద్రు - ఆపైనివ
ధూవరులబంధువులు పరస్పరమునర్చించుటయు విప్రపూజయు జేయునది- ఆ
చారమును బట్టి యదియనగా బసుపుకుంకుమగంధము మొదలగువానిచే నర్చిం
చుట- వివాహమునకు జెప్పిన ముహూర్తమునందుగావలయును - ఇట్లు వా
గ్దానము——అటుపైని బూర్వదినమందుగాని వివాహదినమందుగాని ప్రాతఃకా
లమున కన్యావరులతండ్రి యభ్యంగస్నానముచేసి గ్రహవినాయకశాంత్యాదుల
చేసినపైని దేశకాలముల గీర్తించి "అముకస్యవివాహాంగతయాగణేశపూజా పు

ణ్యాహవాచనమాతృకాపూజా వసోర్ధారాశచీపూజా నాందీముఖాని శ్రా ద్ధానికరిష్యే" యని సంకల్పించి మీదజెప్పి నట్లువిచేసి బియ్యముచేనింపిన కలశద్వ యమందు నిర్విఘ్నతకై వంశపాత్రమనగవెదురుపేళ్లజంగెడచేట మొదలగుదా నిలో శాఖలందు నందిని- నలిని- మైత్రి-ఉమ - పశువర్ధిని- యను దేవతలను శస్త్రనుందుభగవతిని మాతృకలసన్నిధియందు స్థాపించి నాల్గవదినమందు మం డపదేవతల పూజింపవలెను-పచ్చనిదారముచే గంకణముగట్టి కన్యయొక్క-మూ రచే నైదుగాని యేడుగాని మూరలు పరిమితిగలదియు నైదుగాని యేడుగా ని సోపానములుగలదియునగు వేదికను జేయునది - నాల్గుహస్తముల పరిమితి యేయని హరిహరుడు చెప్పెను - అపైని వరునికి గ్రామసీమాంతమందు బూ జజేసి గృహమునకుదెచ్చి సత్కారముతో గూర్చుండ బెట్టవలెను - అటుపైని పురోహితుడు వివాహవేదికయందు హస్తపరిమాణముగల స్థండిలమందు దర్భ లచేదుడిచి గోమయముచే నలికి యజ్ఞార్హమైన మోదుగు మొదలగు కర్రచే దూర్పున క్రమములుగ మూడురేఖలుగీసి ముమ్మారు మృత్తికనెత్తి ప్రోక్షించి యగ్నిని బ్రతిష్ఠించి తూర్పుమొగమైయున్న వరునికి మధుపర్కపూజను జేయ వలెను - ఎట్లనిన కన్యకతండ్రియాసనమిచ్చి దానికి వెనుకనున్నవరునితో"సాధు భవానాస్తామర్చయిష్యామో భవంతం॥" అనిపలుకగ-"అర్చయ"-యనివ రుడుచ్చరించునది - ఆపైని "విష్టరో"అనియన్యుడు ముమ్మారుపలుకగదాత ప శ్చిమాభి ముఖుడై నిలచి "ప్రతిగృహ్యతాం" అనిపలికి యిరువదేను దర్భలచేన ల్లిన కూర్చనీవలెను - వరుడునాసనము వెనుక నిలచి దానిగ్రహించి"విష్టరా యనమః" అనిపలికి యాసనమందాకూర్చము నిచ్చి గూర్చుండవలెను- ఆపై న న్యునిచేముమ్మారు పాద్యమని చెప్పబడగా గంధదూర్వాక్షతలతోగూడినపా ద్యమును"ప్రతిగృహ్యతాం" అనిపలికి దాతయీవలెను - ఆయుదకముచేవరుడు ను మొదట నెడమ పాదము నాపైగుడి పాదమును గడగికొన వలెను - ఆపై నిట్లు మరియొకనిచే ముమ్మారు విష్టరమని తెలుపబడి దాతమరియొక యాసన ము గ్రహించి వరునిపాదముల క్రిందనుంచ వలెను- ఆపైనట్లు ముమ్మారర్ఘ్య మని చెప్పినపైని గంధపుష్పాక్షత కుశతిల సర్షపదధి దూర్వలతో గూడిన య ర్ఘ్యమును "ప్రతిగృహ్యతాం"అనివరునికీవలెను - వరుడును"అర్ఘ్యోనమః"అని పలుకుచుదోసిలిచేదాని ప్రతిగ్రహించి శిరస్సుచే నమస్కరించి భూమియందు

విడువవలెను అటుపైనన్యుడు ముమ్మారు ఆచమనీయమని పలుకగ దాతయాచ
మనోదకమిచ్చిన బ్రతిగ్రహించి వరుడొకమారు త్రాగి యాచమించునది.

ఆపై నన్యుడు "మధుపర్కః" అనిముమ్మారుపలుకగా దాతపట్టుకొనిన కం
చుపాత్రచేమూసిన కంచుపాత్రలోనున్న పెరుగు-తేనె-నేయిగాని వరుడు దా
తహస్తములోనుండగనె మూతదీసి "సవిత్రేనమః" అనిచూచి "సవిత్రేనమః॥" అని
ప్రతిగ్రహించి యెడమ భాగమందుంచి "మధుపర్కాయనమః" అనిపలుకుచు న
నామికాంగుళిచే గలపి యనామికాంగుష్ఠములచే బైకిజిమ్మియిట్లుమరి రెండుమా
రులు చేసి యాత్రవేళ్లచేతనె ముమ్మారుభక్షింపవలెను - మధుపర్కాయనమః॥"
అని యుచ్చరింపుచునైనను భక్షించునది - స్మృతియందు మాత్రము అనామి
కాంగుష్ఠములచే ద్వితీయము మధ్యమాంగుష్ఠములచే దృతీయమని యున్నది -
అది చింత్యము అటుపైని మిగిలినదియసంచర స్థలమందు విడిచి రెండుమారు
లాచరించి తిరుగ నాచమించి " వాచేనమః ॥ " అనిముఖమందును "ప్రా
ణాయనమః॥" అనిముక్కుచెరమలందును "చక్షుభ్యాంనమః" అని నేత్రములందును
"శ్రోత్రాభ్యాంనమః" యనికర్ణములందును "బలాయనమః॥" యనిబాహువులందు
ను "ఓజసేనమః॥" అనితొడలందును "అంగేభ్యోనమః" అనియంగములందును" న్యసిం
పవలెను-అటుపైని ముమ్మారు "గౌః" అనిపలుకగ దాతయిచ్చినప్రతిగ్రహించి "రు
ద్రాణాం మాత్రేవసూనాందుహిత్రె ఆదిత్యస్వస్రెగవెనమః మమాచర్ణకస్య చ
పాప్మాఽపహతః "అనిమెల్లనగానుచ్చరించి "ఉత్సృజతతృణాన్యత్తు" అనిబిగ్గనగా
నుచ్చరించునది-ఆపైని దాత వస్త్రాలంకార గంధాదులచే వరుని బూజించున
ది - ఆపైని బ్రశస్తలగ్నమందు మధ్యమున తెరవేసి వధూవరులకు ముఖదర్శన
ము చేయించునది. కొందరు లగ్నసమయమందు పాణిగ్రహణమని చెప్పుదురు -
ఆపైని "నంతఃపట॥" మనగ తెరనుదీసి వరుడు వధూముఖమును జూడవలెను. లేదా
యగ్నిబ్రతిష్ఠించి యగ్నికి వెనుక గడ్డిగానిఫలముగాని కటమనగ చాపగానియుం
చికన్యా దాతయిచ్చిన నాల్గువస్త్రములలో రెంటిని "ఆయుష్మతీదం వాసః పరి
ధత్స్వ॥" యని రెండుమారు లుచ్చరింపుచు నీవలెను-ఆకన్యయు "వాససేనమః" అ
ని రెండుమారు లుచ్చరింపుచు నావస్త్రముల గ్రహించికట్టుకొనవలెను-అటుపై
నిదాత "వధూ ముఖమీక్షస్వ॥" యని యుచ్చరింపగ వరుడు వధువును జూచునదిఅ
టుపైని కన్యాదానమని హరిహరుడు చెప్పెను - ఇతరులు కన్యాదానమైన పైని

వస్త్రములనిచెప్పిరి - ఆపైని "కరోతుస్వస్తితేబ్రహ్మా॥" యనిమొదలగువానిచే నాశీర్వాదాక్షతలు చల్లినపైనిక నాదాత యుత్తరాభిముఖుడై కుడివైపునభార్యను గూర్చుండనియమించి దర్భలు ధరించియాచమించి దేశకాలముల గీర్తించి "మమసమస్తపితౄణాం నిరతిశయసానందబ్రహ్మలోకావాప్త్యాదికన్యాదాన కల్పోక్తఫలావాప్తయేఽనేనవరేణాస్యాంకన్యాయాముత్పాద యిష్యమాణసంతత్యాబ్రాహ్మపక్షేద్వాదశావరాన్ద్వాదశపరాన్ ప్రాజాపత్యపక్షేఽష్టావరానష్టాపరాన్ పురుషాన్పవిత్రీకర్తుమాత్మనశ్చలక్ష్మీనారాయణప్రీతయే బ్రాహ్మవివాహవిధినాప్రాజాపత్యవిధినావాఽలంకృత్యకన్యా దానమహం కరిష్యే" యనిసంకల్పించి యిట్లు పఠించునది "కన్యాంకనక సంపన్నాం కనకాభరణైర్యుతాం। దాస్యామి విష్ణవెతుభ్యం బ్రహ్మలోక జిగీషయా । విశ్వంభరస్సర్వభూతాస్సాక్షిణ్యస్సర్వదేవతాః । ఇమాంకన్యాం ప్రదాస్యామిపితౄణాం తారణాయచ॥" అని యనగా యథాశక్తిగ గన్య నలంకరించి బ్రహ్మలోక సిద్ధికై విష్ణుస్వరూపుడవైన నీకిచ్చెదను విశ్వంభరుడైన యీశ్వరుడును సమస్తభూతములు సర్వదేవతలును సాక్షులుగా సమస్తమైన నాపితృదేవతలు తరించుటకు నీకుగన్యాదానము జేసెదనని యుచ్చరించి యటుపైని గంచుపాత్రలో వరునిచేతిపై వధూహస్తము దానిపై దనహస్తమునుంచి "వరునిహస్తేను ప్రోక్షితమస్తు శివాఆపస్సంతు సౌమనస్యమస్తు" అనిపలికి "కన్యాతారయతుపుణ్యం వర్ధతాంశాంతిః పుష్టిస్తుష్టిశ్చాస్తు తిథికరణ ముహూర్తనక్షత్ర సంపదస్తు పుణ్యాహం భవంతోబ్రువంతు" అని ప్రార్థింపగ పుణ్యాహమని విప్రులుపలికినపైని "స్వస్తిభవంతోబ్రువంతు బుద్ధిం భవంతో బ్రువంతు శ్రీరస్త్వితి భవంతోబ్రువంతు అనిక్రమముగ ప్రతి వచనములొంది "అముకదాసోహం మమసమస్తపితౄణా" మనిమొదలుగ "లక్ష్మీనారాయణ ప్రీతయె" అనుదాని పర్యంతము మీదజెప్పి నట్లుచ్చరించి "కాశ్యపగోత్రస్యబ్రహ్మదాసస్య ప్రపౌత్రాయవిష్ణుదాసస్యపౌత్రాయశివదాసస్యపుత్రాయకాశ్యపగోత్రాయదేవదత్తదాసాయవరాయకాశ్యపగోత్రాంచైత్రదాసస్య ప్రపౌత్రీం మైత్రదాసస్యపౌత్రీంభోజదాసస్యమమపుత్రీంఅముకప్రేష్యాంనామ్నీంవాకన్యాం ప్రజాపతిదైవత్యాంయథాశక్త్యలంకృతాం" అనిమువ్మారుచ్చరించి "శతజ్యోతిష్టోమాతిరాత్రఫలసమఫలకామఃప్రజోత్పాదనార్థంసహధర్మచరణార్థం" అనియుప్రాజాపత్యమైనచో "సహధర్మం చరతం" అనియు నుచ్చరించి "భార్యాత్వేనతుభ్యం మ

హాం సంప్రదదే" అని యుచ్చరింపుచు దర్భలుయవలుగలసిన జలమును గన్యాహస్తమును వరునిహస్తమందు విడువవలెను. "మయాపిదత్తా" యని తల్లికూడ బలుకవలెనని కొందరు - గోత్రముచ్చరించుట లేదని కొందరు - ఆపైనివరుడు "ప్రతిగృహ్ణామిస్వస్తి" యనిపలికి భూమినిస్పృశింపవలెను - "గౌరీంకన్యామిమాంభో త్వంయథా శక్తి విభూషితాం। గోత్రాయచైవదాసాయతుభ్యం దత్తాంసమాశ్రియ । కన్యేమదగ్రతో భూయాః కన్యేమె దేవిపార్శ్వయోః । కన్యేమె పృష్ఠతోభూయాస్త్వద్దానాత్స్వర్గమాప్నుయాం। మమవంశకులె జాతా పాలితా వత్సరాష్టకం। తుభ్యందాసమయాదత్తా పుత్రపౌత్రప్రవర్ధినీ" యనిపఠింపవలెను అనగానావంశమందు బుట్టి యెనిమిది వత్సరములు పోషింపబడిన యీ గౌరీకన్యను యథాశక్తిగ నలంకరించి కాశ్యపగోత్రుడవు భగవద్దాసుడవైననీకు దానముజేసితిని గనుక ధర్మాచరణమునకుదీని స్వీకరింపుము పుత్రపౌత్రులచే వంశవృద్ధిజేయుము. ఓకన్యాదేవి నీవునాయెదుటను పార్శ్వములందును వెనుకను నన్నిదిక్కులనుండి రక్షింపుము నీదానమున స్వర్గమునొందెదనని యర్థము. అటుపైని "కన్యాదాన ప్రతిష్ఠార్థమిదం సువర్ణంగోమిథునంచ దక్షిణాంతుభ్యమహాంసంప్రదదే" యని గోవును వృషభమును సువర్ణమును దక్షిణగా నీవలెను ఆపైని శక్తుడైనచో తామ్రపాత్రము కాంస్యపాత్రము గోవునశ్వమునుదాసీదాసాదులను దానముచేయవలెను - కన్యాబంధువులు కన్యకకు యౌతకమనగగట్నము నీవలెను. వరుడువానితండ్రి మొదలగువారును గట్నము నీవలెనని కొందరు హోమాంతమందు యౌతకమని కొందరు - ఆపైని నాల్గుచుట్టులుగాని యైదుగాని వధూవరులకు దారము చుట్టిమీదజుట్టిన దారము క్రిందికిని క్రిందజుట్టినదారముమీదినుండియు తీసిపసపురాసిముప్పిరిగాజేసిక్రిందిసూత్రము వరహస్తమందును మీదిసూత్రము వధూహస్తమందునుగంకణముగట్టవలెను- అపుడుమంత్రము - "యెనబద్ధోబలీరాజాదాన వేంద్రోమహాబలః । తెనత్వామపిబధ్నామి రక్షమాచలమాచల" యని - అనగాపూర్వమందు భగవంతుడు రక్షాబంధనముగ బలి చక్రవర్తిని గట్టినాడుగనుక నిపుడును నిన్నురక్షకొరకే బంధింపుచున్నాను చలింపకుమనుట - ఆపైని వధూవరులచే పరస్పరముదుద్ధార్ద్రమగు నక్షతలు వేయించుట - అందుముందు వధువుచే దలబ్రాలువేయించి యనంతరమందు వరునిచే జేయింపవలెను అపుడు మంత్రములు "భగాయనమః - యజ్ఞాయనమః -

శ్రీప్రైమైనమః-ధమార్ణాయనమః- ప్రజాపతైమైనమః-యశసేనమః-' అని తెలియునది అ
టుపైని తూర్పుమొగముగ గూరుచుండికన్యకువస్త్రములీవలెను కన్యయు"వాసో
భ్యాంసమ"యని వానిగట్టుకొనవలెను- ఆపైనివరుడు"మాంగల్యతంతునానేన భ
ర్తృజీవన హేతునా।కంఠేబధ్నామి సుభగేసాజీవశరదాంశతం॥" అనియుచ్చ
రింపుచు సౌభాగ్యతంతువుననగా పుస్తెతో గూడిన మంగళసూత్రమును వధూకం
ఠమందు గట్టవలయును-అనంతరమున"విశ్వేదేవాయు మాతవిశ్వధాతృభ్యోనమ"
యని పలుకుచు వధువునుజూడవలెను- ఇక్కడకుసుంభసూత్రముచేగంకణ బంధ
ముచేయవలెననికొందరు-ఆపైనివేదికయందుప్రాఙ్ముఖులైయగ్నికివెనుకభాగమం
దు బరచిన తేజనావీరణతృణములచేనిర్మించినచాపలో గూరుచుండి వధూవరు
లుండగా దక్షిణమందుగాని యీశానదిక్కునగానిమంగలకలశమును భుజముపై
నుంచుకొని యొకరు నిలచియుండవలెను.ఉత్తరమందేడడుగులదూరమున సన్నెక
ల్లుపైత్తరమునలంకరించి యుంచవలెను - వరుడు కన్య నామము జెప్పగూడదని
యాచారము- ఆపైని గన్యాదాత పరస్పరమును జూడుడని చెప్పగావధూవరుల
ట్లుచేయవలెను అట్లుచూచునపుడు " అఘోరచక్షు రపతిఘ్నీశివాచసుమనా స్త
థాసువర్చాః పుత్రిసూ దేవకామాచసుఖదాభవ॥ " అనివరుడుపలుకవలె
ను అనగాసౌమ్య దృష్టిగలదానవుపతికిహాని చేయనిదానవు మంగలమైనదానవు
మంచిమనసుగలదానవుగొప్పయాచార తేజస్సుగలదానవు పుత్రులగను దానవు
దేవభక్తిగలదానవు సుఖమిచ్చుదానవుగమ్మనియర్థముమరియు"సోమగంధర్వా
గ్నిపూషభ్యోనమః"అనియునుచ్చరింపవలెను.

ఇక్కడ శూద్రులకు గృహ్యసూత్రాధ్యయనము లేనందున సూత్రో
క్తమైన హోమాంగక్రియలు తెలియవు ప్రయోగించు శక్తియులేదు గనుక వి
వాహమందు హోమమేలేదని మదనపాలుడు చెప్పెను అన్యులుప్రధానమం
దధికారము సిద్ధించుచుండగస్థపతికిష్టియందువలె నంగమునందును శ్రవణముచేను
పదేశముచేతను కర్మజ్ఞానము సంభవింప వచ్చును గనుకహోమము గావచ్చు
నంద్రు అదియెట్లనిన ఆచార్యుడు దక్షిణ భాగమందు బ్రహ్మకాసనమిచ్చి కూ
ర్చుండబెట్టిమృన్మయ పాత్రయందు జలమునింపికుశలనుంచియుత్తరమందుదర్భల
పైనగ్నినుంచిదర్భలచేచూర్పుమొదలుగబరిస్తరణముజేసి పాత్రాసాదనముజేయు
నదియెట్లనిన"త్రీణితృణానిద్వేపవిత్రేప్రోక్షణీమాజ్యస్థాలీంచరుస్థాలీంసం మార్జనకు

శాఃతిస్రస్సమిధఃస్రువంఆజ్యంతండులాఃలాజాఃశూర్పంసంస్రవపాత్రం అశ్మాఅనడు
హంచర్మగౌదక్షిణా॥" అని పాత్రలమర్చవలెను ఆపైని ప్రాదేశమాత్రమైనపవి
త్రములు త్రుంచి ప్రోక్షణపాత్రను సంస్కరించి పవిత్రములచే నుత్పవనము జేసి
యక్కడనవియుంచి దక్షిణముచే సవ్యములజేసియు దిగనముజేసి అనగా వెతికి
లవ్రేసి పాత్రలప్రోక్షించియుంచి యాజ్యమునుస్థాలియందు నిరూపించి యగ్ని
యందు దక్షిణభాగమున నధిశ్రయణముజేసి కొనసగాల్చినదర్భలచే లాజలు నా
జ్యముచుట్టుద్రిప్పి స్రువమునుగాచి కుశలచేతుడిచి ప్రోక్షణోదకములచే బ్రో
క్షించి తిరుగగాచి దక్షిణమందుంచి యాజ్యమున కుద్వాసనము నుత్పవనముజేసి
చూచి శూకము నిరసించి తిరుగప్రోక్షణుల కుత్పవనముజేసిచూచి యుపయమన
కుశలదీసుకొనిలేచి యగ్నియందు మూడుసమిధలనుంచి ప్రోక్షణులచే జుట్టును
ప్రోక్షించి వరుడు తన్నుస్పృశించియుండగ నాచార్యుడు కుడిజానువు మడిచిబ్ర
హ్మకుడిచేతితో దన్నుస్పృశించియుండ స్రువముచే హోమము జేయునది "ప్ర
జాపతయేనమః ఇంద్రాయనమః॥" అని యాఘారసమిధలు - ఇదంప్రజాపత
యేనమమయని మొదలుగ వరుడు త్యాగము జెప్పునది "అగ్నయేనమః సోమా
యనమః॥" అని యాజ్యభాగములు"అగ్నయేనమః— వాయవేనమః- సూర్యా
యనమః-అగ్నీవరుణాభ్యాంనమః - ద్విఃఅనగా రెండుమారులు . అగ్నయే న
మః వరుణసవితృవిష్ణువిశ్వేదేవమరుత్స్వర్కేభ్యోనమః॥"అని "వరుణాయాదిత్యా
యాదితయెప్రజాపతయేనమః॥" అనునది వైకల్పికము- ఆపైనిముమ్మారు "అగ్న
యేనమఃమృత్యవేనమః॥" అనునది వైకల్పికము- అటుపైని గన్యక దోసిలియందు
ప స్తరణముజేసి వధూభ్రాతగాని యన్యుడుగాని జమ్మిపత్రములతోగలసి చేట
లోనున్న పేలాలను తనదోసిలిచే రెండుమారులుంచినపైని యభిఘరించి నిలచి
యుండి కన్యక "అగ్నయేనమః॥" అనివరుడు పలుకుచుండగ ముమ్మారు హో
మము చేయునది- ఆపైని వరుడు వధువుకుడిహస్తము వెతికిలవ్రేసి వెతికిల వ్రే
సిన తనహస్తముతో బట్టుకొనవలెను. అపుడుమంత్రము - "భాగార్యమసవితృ
భ్యోనమః । విత్తసౌమ్యగుణైర్యుక్తా వీరసూజీవసూభవ । కులేవధీమె
సమ్రాజ్ఞీ మచ్చిత్తానుగతాసదా॥" అని యనగా సంపత్తితో మంచిగుణములతో
గూడి నాకులమందు మహారాజ్ఞివై వీరులైన దీర్ఘాయుష్మంతులగనుము నామ
నసునకనుకూలముగ వర్తింపుమనుట - ఆపైనట్లు పట్టుకొని యుండియెవధువు

నుత్తరమునుండి యగ్నికి దక్షిణముగ నడిపించవలెను "కన్యాయైనమః॥" అని-యాపైని "సరస్వత్యైనమః" అని గాథనుగానముజేయవలెను అటుపైని "అగ్నయే నమః॥" అనియగ్ని ప్రదక్షిణముచేసి కూరుచుండి బ్రహ్మదన్నుస్పృశించియుండగ "ప్రజాపతయేనమః॥" అని హోమముజేసి యుత్తరముననుత్తర సమాప్తిగనేడు తండులపుంజములు పోసి వధువును కుడిపాదముచే వరుడు "విష్ణవేనమః" అని పలుకుచు నేడడుగులు త్రొక్కింపవలెను- అపుడు "ఇషెనమః విష్ణవేనమః॥" అనియంతటనుచ్చరించునది "ఊర్జేనమః-రాయస్పోషాయ - మాయో భవ్యాయ - ప్రజాభ్యో - పాతుభ్యో - సఖిభ్యోనమః॥" అని వీనిచేజేయవలె నని కొందరు - అనంతరమందు సప్తమపదమందు నాచార్యుడు వధూవరుల శిరస్సులయొద్దజేరి పూర్వముంచిన కలశోదకమును మామిడిచిగురుచే నభిషేకించవలెను వరుని సూర్యునిజూడుమని చెప్పగ సూర్యునిజూడవలెను - "మమతవ చిత్తవాగ్భ్యోనమః॥" అని వధువు కుడిభుజముపైకి హస్తమునొందించి హృదయము ముట్టి యుత్తరమున వధువును గూర్చుండబెట్టి "వధ్వైనమః॥" అని యభిమంత్రించి వధువుపాపటయందు సిందూరముంచి వరుడుగాని యన్యుడుగాని కన్యను లేవనెత్తి "గోశ్వపురుషేభ్యోనమః॥" అని యానడుమరక్తచర్మమనగ నెఱ్ఱని యెద్దుతోలుపై వధువును గూర్చుండబెట్టి "అగ్నయేస్విష్టకృతేనమః॥" అని హోమముజేసి సంస్రవప్రాశనముజేయవలెను - ప్రణీతాపాత్రలకు రెండుపవిత్రములచే మార్జనము - ఆపవిత్రములగ్నియందు వేయవలెను - అటుపైనాచార్యునికి గోదానమిచ్చుట ప్రణీతను విసర్జించుట బ్రహ్మకు పూర్ణపాత్రమనగ కట్నము విప్రుల కామాన్నమిచ్చుటకుసంకల్పము- ఇట్లు పగలిటివివాహము రాత్రియందైనచో ధ్రువమీక్షస్వయనివరునిచేబంపబడివధువు ధ్రువాయనమయనిధ్రువునిజూడవలెను - అటుపైని వత్సరముగాని పండ్రెండు రాత్రులుగాని యారుగాని మూడుగాని రాత్రులు కారములవణము వర్జించి భుజింపుచు దంపతులు బ్రహ్మచారులై యలంకృతులైయధశ్శయనము జేయవలెను - తైలాక్షత చందనాదికము యథాచారముగ జేయవలెను - నాల్గవదినమందు తెల్లవారుజామునన్నైదు భూసంస్కారములజేసి వివాహాగ్ని బ్రతిష్ఠించి బర్హిప్రవేశనము మొదలగు సమిదాధానము పర్యంతము మునుపటివలె జేయవలెను - అపుడాజ్యము నిరూపించి స్థాలియందు నాల్గుపిడికిళులు బియ్యము నిరూపించి అట్లనే మూడు

మూరులు ప్రోక్షించి మూడుమారులు గడగి యగ్నియందు వండి సమిదాధానము జేసి యగ్నిచుట్టును బర్యుక్షణము జేసి యాఘారాజ్యభాగములైన పైని "అగ్నయే ప్రాయశ్చిత్తాయనమః" ఇట్లు "వాయవె... సూర్యాయ... చంద్రాయ... గంధర్వాయ..." అని వ్రేల్చిన నాహుత్యంతమున "ప్రజాపతయే నమః" - అని చరుహోమము జేసి యుదకుంభమునుండి సంస్రవములదీసి అగ్ని వాయు సూర్య చంద్ర నక్షత్ర గంధర్వ ప్రజాపతిభ్యోనమయని వధూశిరస్సుపైనుంచి "మమవ్రతానుసారిణీభవ" యని పలికి యగ్నికుత్తరముగ చరుశేషమును "ప్రాణేభ్యోనమః - అస్థిభ్యో... మాంసేభ్యో... త్వచేనమయని - వధువుచే దినిపించి- యాచమనము జేసి యగ్నయె స్విష్టకృతేనమయని యాజ్యముచే వ్రేల్చి అగ్ని మొదలుగ బ్రజాపతియంతమగు నవాహుతులు వ్రేల్చి ప్రాశనమునకై భిన్నపాత్రమందు సంస్రవములుపట్టి సంస్రవప్రాశనము మార్జనము పవిత్రప్రతిపత్తియు గురునకు దక్షిణయు బ్రహ్మకు పూర్ణపాత్రము విప్రులకు నామాన్నదానమునని- స్మృతికౌముదిలో శూద్రునకు హోమమెద్దియు లేదని యున్నది - యదితగదు ఏమనిన "సామ్యతాపిహితేనైక్యం గతామంత్రాహుతివ్రతైః॥" అని యనగా నామెమ్మృతినొందియు మంత్రాహుతివ్రతముచే వానితోనైక్యమొందెనని యర్థముగల వాక్యము శూద్రునకును సమానమై యున్నది-ఆపైని వరునికి వానిబంధువులకును బూజయును వరునితల్లికి మూసివాయనము నీవలెను - కన్యాపితకుననికొందరు - పదారుచిన్నచేటలతో గూడిన వంశపాత్రమనగ జంగెడదాగర మొదలగువానిలో నుమామహేశ్వరుల బూజించి ప్రార్థింపవలెను - "ఐరిణీత్వ ముమాదేవీ మహేశోగిరిజాపతిః । అతస్త్వాం పూజయిష్యామి ఐరిణీం సర్వకామదాం । సవస్త్రాంచస దీపాంచ శూర్పైష్షోడశభిర్యుతాం । వరమాత్రే ప్రదాస్యామి కన్యాదానస్య సిద్ధయె॥" అని యనగా మీదజెప్పిన వంశపాత్రమైరిణియనబడును - అట్టియోయైరిణీని నీవుసాక్షాత్పార్వతీ పరమేశ్వర స్వరూపిణివికనుక సర్వకామముల నిచ్చు నిన్నుబూజించి వస్త్రముదీపము శూర్పములతో గూడవరుని తల్లికి కన్యాదాన సిద్ధికై దానము జేసెదనని - "కృతస్యకన్యాదానస్య పూర్ణఫలప్రాప్త్యర్థమిదం వంశపాత్రం వరమాత్రే సంప్రదదే" యని నమమయని పలికి యిట్లుపఠింపవలెను "వంశోవంశకరశ్శ్రేష్ఠో వంశోవంశవివర్ధనః । అనేన వంశదానేన తుష్టోవృద్ధింకరోతుమె । వంశపాత్రమిదంపుణ్యాం వంశజాత సముద్భవం । దానానాముత్తమం దాన మత

శ్శాంతిం ప్రయచ్ఛమే॥" యని యనగా వంశవృక్షము సంతతి వృద్ధిజేయునది గ నుక వంశపాత్రదానము శ్రేష్ఠము దీనిజేయుటవలన నాకు వృద్ధియగుగాకయను ట-ఈవంశపాత్రదానము గొందరుజేయరు - అటుపైని గన్యకతండ్రి "అష్ట వ ర్షాత్వియంకన్యా పుత్రవత్పాలితామయా । ఇదానీంతుమ యాతుభ్యం దత్తా స్నేహేన పాల్యతాం॥" అని యనగా నెనిమిది సంవత్సరములీకన్యపుత్రుడువలె రక్షింపబడియిపుడు నీకు దానముచేయబడినది దీనిస్నేహముచేబరిపాలింపుమనివ ధువును వరునితొడపై గూరుచుండబెట్టవలెను - ఆపైని వరుడు వధువుతోయాన మెక్కి గృహమునకు వచ్చి యక్కడ శ్రీదేవినిబూజించి మున్ను స్థాపించిన మా తృకలకుమండపదేవతలకును బూజజేసి వస్త్రగ్రంధిని విప్పి కంకణములును విస ర్జించి విప్రులబూజించునది - వధూగృహప్రవేశమునకును మండపోద్వాసన మునకును శుభముహూర్తముమొదలగు విశేషము నిర్ణయసింధువునందు దెలి యునది - ఇట్లు గర్భాధానముమొదలగు సంస్కారములన్నియు సచ్ఛూద్రుల కని తెలియునది. ఇట్లు ముందుచెప్పెడు నాహ్నికముగూడ సచ్ఛూద్రులకే నిత్య మనియెరుంగునది - అసచ్ఛూద్రులకు వివాహమాత్రమెసంస్కారము.

ఇట్లు శ్రీమన్నారాయణభట్టసూనుడగు కమలాకరభట్టునిచే రచింపబడి న శూద్రధర్మమందు శూద్రసంస్కారములు ముగిసెను.

ఇక శూద్రునకాహ్నికము చెప్పబడును - అందువిష్ణుస్మృతి "బ్రాహ్మే ముహూర్తఉత్థాయ॥" యని యనగా నాల్గుగడియలు రాత్రియుండగలేచి-య నుట-మరియు విష్ణుధర్మోత్తరమందు - "శయనాదుత్థితో యస్తుకీర్తయేన్మధు సూదనం-కీర్తనాత్తస్యపాపానినాశమాయాంత్యశేషతః॥" అనియున్నది య నగా శయ్యనుండి లేవగానె భగవంతుని గీర్తించినచో నతనిపాపములు యావ త్తును నశించుననుట - కనుకనపుడాచమించి తలిదండ్రులకు నిష్టదైవమునకునమ స్కరించి యిట్లు స్మరించునది- "ప్రాతస్స్మరామి భవభీతిమహార్తి శాంత్యై నారాయణంగరుడవాహన మబ్జనాభం । గ్రాహాభిభూత వరవారణ ముక్తి హేతుం చక్రాయుధం తరుణవారిజ పత్రనేత్రం । ప్రాతర్నమామి మనసావ చసాచ మూర్ధ్నాపాదార విందయుగళం పరమస్యపుంసః। నారాయణస్యన రకార్ణవతారణస్యపారాయణప్రవణ విప్రపరాయణస్య । ప్రాతర్భజామి భజతామభయంకరంతంప్రాక్సర్వజన్మకృతపాప భయాపహత్యై। యోగ్రాహ

వక్త్రపతితాంఘ్రిగజేంద్ర ఘోరశోకప్రణాశమకరోద్ధృతశంఖ చక్రః । శ్లో
కత్రయమిదం పుణ్యం ప్రాతఃప్రాతస్తుయః పఠేత్ । లోకత్రయ గురుస్తస్మైద
ద్యాదాత్మపదంహరిః॥" అనియనగా గరుడునిపైన ధిష్ఠించువాడునుపద్మము నా
భియందు గలవాడును నవుడె వికసించిన తామరరేకుల వంటి నేత్రములు గలవా
డును చక్రాయుధము ధరించినవాడై మొసలిచే నాక్రమింపబడిన గజేంద్రునిమో
క్షణము జేసి రక్షించినవాడునగు శ్రీమన్నారాయణుని సంసారభయపీడశాంతిం
చుటకు ప్రొద్దుననె భజించెదను - మరియు నామకీర్తనము జేయువిప్రుల నను
గ్రహించిన వాడై నరకసముద్రము దరింపజేయు పురుషోత్తముడైనశ్రీమన్నారా
యణుని పాదపద్మద్వంద్వమును నీప్రాతః కాలమున మనోవాక్కాయములచే న
మస్కరించెదను - మరియును భజించువారికెల్ల నభయ మిచ్చువాడు గనుకనే
శంఖచక్రధారియై మొసలిచే గరువబడిన పాదముగలిగిఘోరశోకమొందినగజేం
ద్రుని రక్షించెను అట్టిశ్రీమన్నారాయణుని పూర్వజన్మముల నేజేసిన పాపమున
శింపజేయుటకు నీప్రాతఃకాలమున భజించెదననియర్థముగల యీ శ్లోకత్రయ
మును భక్తితో ప్రాతఃకాలమునపఠించు వానికి శ్రీహరి తనలోకమిచ్చునని తాత్ప
ర్యము॥ ఇట్లు "ప్రాతస్స్మరామిశివమేకమనేకరూపం" అనిమొదలుగదన వాసనాను
సారముగ పఠించి "పుణ్యశ్లోకోనలో రాజా పుణ్యశ్లోకోయుధిష్ఠిరః। పుణ్యశ్లోకాచ
వైదేహీ పుణ్యశ్లోకోజనార్దనః॥" అనియనగానలచక్రవర్తియుధర్మరాజును సీ
తయు జనార్దనుడును వీరినామకీర్తనము పుణ్యమనుటఇట్లుస్మరించిభూమికినమ
స్కరించి "అంతర్ధాయ తృణైర్భూమిం శిరఃప్రావృత్యవాససా। వాచంనియమ్య
యత్నేననిష్ఠీవోచ్ఛ్వాసవర్జితః । కుర్యాన్మూత్రపురీషేతుశుచౌదేశే సమా
హితః॥" అనియంగిరసుడు చెప్పిన విధిచే ననగా గృహమునకు దూరమైన శుద్ధ
ప్రదేశమందుగడ్డిచేభూమిగప్పిశిరస్సునువస్త్రముచేగప్పుకొనిమూత్రపురీషములువి
డువవలెనని చెప్పిన రీతిని "దివాసంధ్యాసూదఙ్ముఖః । కుర్యాన్మూత్రపురీషేతు
రాత్రౌచే ద్దక్షిణాముఖః । గ్రామాత్పదశతం గచ్ఛే న్నగరాచ్చ చతుర్గుణం"
అనియాజ్ఞవల్క్యవచన ప్రకారమున ననగా గ్రామమునకు నూరడుగులును న
గరమునకు నాల్గునూరడుగులును దూరమువెళ్లి యచ్చటపగలు సంధ్యయునైన
చోనుత్తరాభిముఖుడును రాత్రియైనచో దక్షిణాభిముఖుడునై మూత్రపురీషము

లువిసర్జించి "అపకృష్యచ విణ్మూత్రం కాష్ఠలోష్టతృణాదినా" యని భరద్వాజవచనముచే నెడమచేతితో మంటిగెడ్డ మొదలగువానిచే మలమూత్రద్వారముల దుడిచికొని "గృహీతశిశ్నశ్చోత్థాయ మృద్భిరభ్యుద్ధృతైర్జలైః। గంధలేపక్షయకరం శౌచం కుర్యాదతంద్రితః॥" అనియాజ్ఞవల్క్యవచనముచే ననగా నటుపైని గదలకుండగ శిశ్నము హస్తముతో బట్టుకొని నిలచి గంధములేపము పోవునంతకు మృత్తుజలమునంటింపుచు పైనిజెప్పెడురీతిని శుద్ధిజేసుకొనవలెను - అందు మూత్రమునకు శాతాతపవచనము "ఏకాలింగేకరేసవ్యేత్రిస్రోద్వే హస్తయోద్వయోః। మూత్రేశౌచం సమాఖ్యాతంశుక్రే తద్ద్విగుణంభవేత్॥" అనియనగా లింగమునకొకమాఱు మృత్తు బూసికడుగుట యెడమచేతి కట్లుముమ్మారు రెండుహస్తములగలపి గడుగుట రెండు మాఱులుచేయునది స్త్రీసంగముజేసినపైనియీ శుద్ధినేరెండు రెట్లుచేయవలెను - పురిషీమందు దక్షయమవచనము - "ద్వేలింగేమృత్తికేదేయేగుదే పంచకరేదశ। ఉభయోస్సప్తదాతవ్యా మృదశ్శౌచోపపాదికాః॥" అనియనగా లింగమందురెండు మాఱులు గుదమందు నైదుమారులునెడమచేతికి బదిమాఱులు రెండుచేతులు గలపి యేడుమాఱులును మృజ్జలములచేగడుగవలెననుట - శంఖవచనము "మేహనేమృత్తికాస్సప్తలింగే ద్వేపరికీర్తితే। ఏకస్మిన్వింశతిహస్తే ద్వయోర్జ్ఞేయాశ్చతుర్దశ। తిస్రస్తు మృత్తికాదేయాః కర్తుఃంవైనఖశోధనం। తిస్రస్తుపాదయోర్జ్ఞేయా శ్శౌచకామస్యసర్వదా॥" యనియనగా మేహనమున కేడుమాఱులును లింగమునకురెండు మాఱులు నెడుమచేతికినిరువదిమాఱులు రెండుచేతులు గలపి పదునాల్గుమారులును మృజ్జలములచేగడుగవలెననుట ఆపైనిగోరుల శుద్ధికై మూడుమారులును పాదములకు ముమ్మారును గడుగుట గావలెనని - విష్ణుపురాణమందును - "ఏకాలింగేగుదేతిస్రోదశవామకరేతథా। ఉభయోస్సప్తదాతవ్యా మృదశ్శౌచోప పాదికాః॥" అని అనగా లింగమందొకమాఱునుగుదమందు ముమ్మారును నెడమచేతికి బదిమారులును మృజ్జలములచే గడుగుటయని - యిట్లువివిధముగా జెప్పుటకు గంధలేపములయెచ్చుతగ్గులనుబట్టిగాని గృహస్థునికి స్వల్పము యతికధికమనిగాని వ్యవస్థ గల్పించుకొనవలెను- మూత్రశుద్ధికి మృత్తికయెంతెంతగావలెనోయనిన దక్షుడుచెప్పెను "లింగేతు మృత్సమాఖ్యాతా త్రిపర్వాం పూర్యతే యయా॥" అని యనగా మూత్రశుద్ధికి మూడుపర్వములనగ వ్రేళ్లగుంపులు మూడునిండునంత గావలె

ను ॥ పురీషమందు మనువచనము - "అర్ధప్రసృతి మాత్రాతు ప్రథమా మృత్తికా స్మృతా । ద్వితీయాచ తృతీయాచ తదర్ధార్ధా ప్రకీర్తితా ॥" అనియనగా గుదము శుద్ధి జేసుకొనుటకు మొదటిమారు చేరెడులో సగముగా వలెను రెండవమారందులో సగమును మూడవమారాసగములో సగమును గావలెనని. ఆదిత్యపురాణమందు "స్త్రీశూద్రయోరర్ధమానంశౌచంప్రోక్తంమనీషిభిః॥" అనియున్నది అనగా స్త్రీకిని శూద్రునికిని మీదజెప్పిన శుద్ధిలోసగముచే శుద్ధియగునని- ఇట్లుశుద్ధిజేసుకొనినను గంధలేపక్షయము గానిచో దేవలుడు చెప్పెను. "యావత్సాధ్వితిమన్యేత తావచ్ఛౌచంవిధీయతే ॥" అనియనగా గంధములేపము పోవునంతవరకుశుద్ధిచేసు కొనవలెననుట-మరియు దక్షుడు "యద్దివావిహితం శౌచంతదర్ధంతు నిశిస్మృతం । తదర్ధ మాతురేప్రోక్తమాతురస్యార్ధ మధ్వని" అనిచెప్పెను అనగాపగలిటియందుమీద జెప్పినట్లు శుద్ధిపూర్ణముగ జేయునది రాత్రియైనచోనందుసగము రోగియైనచో సగములోసగము మార్గస్థుడైనయెడ రోగికి జెప్పిన దానిలోసగము జేయువలయుననుట - మరియువృద్ధపరాశరవచనము - "ఉపవిశ్యతు విణ్మూత్రంకర్తుం య స్తన్నవిందతి। సకుర్యాదర్ధశౌచంతు స్వస్యశౌచస్య సర్వదా॥" అనియనగా మలమూత్రములు విసర్జించుటకు గూరుచుండ సామర్థ్యములేనిచో శౌచము సగమే చేయునదియనుట - బాలునికి ననుపనీతునికి గంధలేపములు పోవునంతకె శౌచము - అట్లుబ్రాహ్మవచనము "నయావదుపనీయేత విప్రశూద్ర స్తథాంగనా । గంధలేపక్షయకరం శౌచంతేషాం విధీయతే। ప్రమాణంశౌచ సంఖ్యావాన శిష్టై రుపపాదితా॥" అనియనగా నుపనయనము లేకున్నంతవరకు విప్రునికి శూద్రునకు స్త్రీకిని గంధలేపములు పోవుపర్యంతమె శౌచము విధింప బడినది- ఏమనినపరిమాణము శౌచసంఖ్యయు శిష్టులంగీకరింపరనుట- శూద్రునకు వివాహముగాకమున్ననగా బండ్రెండుగాని పదారుగాని వత్సరముల పర్యంతమె యిట్లనితెలియునది యాపైని సర్వధర్మములు నిత్యములేయనిముందు జెప్పబడును భోజనకాలమందు మల ద్వారముస్రవించెనేని "భుంజానస్యతు విప్రస్యకదాచిత్ప్రస్రవేద్గుదం । పూర్వంకృత్వాతు శౌచంతు తతఃపశ్చాదుపస్పృశేత్॥" అనియనగా భుజింపుచుండగ విప్రునకట్లయ్యేనేని మున్ను మృత్తికాశౌచము జేసుకొనియాపైని గండూషము చేయునది "తతఃకృత్వోపవాసంచ పంచగవ్యేనశుద్ధ్యతి॥" అనగానపుడు చేయు

మాత్రము గడిగికొని శౌచము చేసికొని గండూషముజేసి యుపవసించి పంచగ
వ్యప్రాశనము జేసినచో శుద్ధియగుననుట-ఇక్కడవిప్రున కనునదియుపలక్షణము-
ఇట్లుశూద్రకమలాకరమందుశూద్రశౌచవిధి——ఇకనాచమనము - శుద్ధమైన దేశ
మందు దూర్పుమొగముగనైనను నుత్తరాభిముఖముగ నైనను గూరుచుండి ము
ణుకులమధ్యమందు చేయుంచుకొని గోవుచెవివలె నంగుష్ఠతర్జనులు మాత్రము
ముడిచిన హస్తముచేజలము గ్రహించి దవడలకు మాత్రమంటెడు జలము నొక
మారుద్రాగవలె-నదియెయాచమనము- మూడుమారులైన గావచ్చుననిస్మృతికౌ
ముదియందున్నది - అంగుష్ఠము మాత్రమె స్పృశింపవలెనని భట్టమతము-ఆపై
నంగుష్ఠమూలముచే రెండుమారులు పెదవులొత్తి యంగుష్ఠతర్జనులు గలపి ము
క్కుచెరమలు స్పృశించి యంగుష్ఠ మధ్యములుగలపి నేత్రములముట్టి యంగుష్ఠా
నామికలచే శ్రోత్రములు ముట్టియంగుష్ఠ కనిష్ఠికలచేనాభిని నరచేతిచే హృద
యమును నన్నివ్రేళ్లచేశిరసును భుజములను నంటవలెను—ఇకదంతధావనము-రేఁ
గు- బొడ్డు-దుచ్చెన-పనస-కడిమి-మామిడి-జాజి - మారేడు - ప్రియంగువనగ ఫ
లినీ వృక్షము- వీనిలోనొక దాని పుల్ల గావలెను “ద్వాదశాంగులకంవిప్రే కాష్ఠమా
హుర్మనీషిణః। క్షత్రవిట్ఛూద్రజాతీనాం నవషట్చతురంగులం॥” అనియనగావిప్రు
లకు బన్రెండంగులముల పొడవుగలది క్షత్రియులకు దొమ్మిదివ్రేళులు వైశ్యు
లకు నారుశూద్రులకు నాలుగు నంగుళముల పొడవుగలది దంతకాష్ఠమని పారి
జాతమందు విష్ణువచనము - మరియునట్టిదంతకాష్ఠముచిటికెనవ్రేలు కొన-పా
టినలమునుదాని గుంపులోసగము పాటికుంచయు గల దంతకాష్ఠము గడగి “ఆ
యుర్బలం యశోవర్చః ప్రజాః పశువసూనిచ బ్రహ్మప్రజ్ఞాంచ మేధాంచత్వం
నో దేహివనస్పతే॥” యనియనగా నాయుష్యముబలముకీర్తి తేజస్సుసంతతి ప
శువులువసువులు బ్రహ్మజ్ఞానము సూక్ష్మ బుద్ధియుమాకిమ్మని యర్థముగల మం
త్రిముచే ప్రాఙ్ముఖుడై గానియుత్తరాభిముఖుడైగాని దంతకాష్ఠము నమిలి దంత
శుద్ధిజేసుకొని నాలుకగీసుకొని తనకెదురుగ బారవైచి పదారుగాని పండ్రెండు
గాని గండూషములనగ పుక్కిలింతలు జలముచే జేయునది- ఇట్లుదంతధావనము
ప్రతిపద-నవమి-షష్ఠి- అమావాస్య - పౌర్ణమాసి-చతుర్దశి-అష్టమి-సంక్రాం
తి-శ్రాద్ధ-వ్రత- రవివార దినములు-వీనియందు జేయగూడదు- మరియేమనినబండ్రెం
డుమారులు గండూషముమాత్రము జేయునది అటుపైని గేశసంస్కారము జేసు

కొని స్నానముజేయునది - అట్లుఛందోగ పరిశిష్టవచనము "యథాహానితథా నిత్యం ప్రాతస్స్నాయాదనాతురః । దంతాన్ప్రక్షాళ్యనద్యాదౌ గృహేచేత్తదమంత్రవత్॥" అనియనగా దంతధావనమైనపైనిరోగి గానియెడ నిత్యముమధ్యాహ్నమందువలె ప్రాతఃకాలమందును స్నానముజేయునది - యదినదియందైనచో మంత్రయుక్తముగను గృహమందైనయెడ మంత్రహీనముగను గావలెనుస్మృతి కౌముదిలో యోగయాజ్ఞవల్క్యవచనము - "మృత్తిలాన్ గోమయందర్భాన్ పుష్పాణి సురభీణిచ । ఆహరేత్స్నానకాలేతుస్నానార్థం ప్రయతశ్శుచిః । గంగోదకాంతం గత్వాతుసంస్థాప్యైతత్పృథక్ క్షితౌ । త్రిధాకృత్వా మృదం తాంతు గోమయంచవిచక్షణః । అధమోత్తమ మధ్యానా మంగానాంక్షాళనంతువై । భాగైః పృథక్పృథ కుర్యాత్ క్షాలనేమృద సంకరః । అద్భిర్మృద్భిశ్చ చరణౌ ప్రక్షాళ్యా చమ్యవైశుచిః । అద్భిర్మృద్భిశ్చ గాత్రాణి క్రమశస్త్వవనేజయేత్ । ఏకయాశిరః ప్రక్షాళ్యద్వాభ్యాంనాభే స్తథోపరి। కటి వస్త్యూరుజంఘేచ చరణౌ చత్రిభిస్త్రిభిః । ప్రక్షాళ్యహస్తావాచమ్య నమస్కృత్య జలంతుతత్ । యత్కించేదంతు మంత్రేణ నమస్యేత్ప్రియతాం జలిః ॥" అని యనగా స్నానకాలమందు నియమముతో శుచియై స్నానము నిమిత్తముగ మృత్తికయుతిలలు గోమయము దర్భలుమంచిపుష్పములు తెచ్చి గంగోదకసమీపము నొందగనె వేరుగ భూమియందలి యుంచిమృత్తికను గోమయమును మూడేసి భాగములుచేసి వానిచే నధమోత్తమ మధ్యమాంగముల క్రమముగ జలముతో గడగవలెను కడుగునపుడు మృద్భాగములకుపరస్పరము సంకరముగాకుండ గడగవలెను - ఎట్లనిన మొదటపాదముల మృజ్జలములతో గడగి యాచమనము జేసి శుచియై పైపైయంగములనట్లు గడుగవలెను - మూడుభాగములలోనొకభాగముచేశిరస్సును రెండవభాగముచే నాభికిపైదేహమును మూడవభాగముచే గటియుపొత్తికడుపును దొడలు పిక్కలును పాదములును గడుగునది - ఆపైని హస్తముల గడిగికొని యాచమించి"యత్కించేదం" అను మంత్రముచే జలమును చేతులుజోడించి నమస్కరించవలెనని చెప్పి కాతీయసూత్రవిధిచేస్నానము జెప్పి "బ్రహ్మక్షత్రవిశాం త్వేవంమంత్రవత్స్నానమిష్యతే।తూష్ణీ మేవతుశూద్రస్యసనమస్కారకంమతం॥"అనిచెప్పబడినది అనగానిట్లుబ్రహ్మక్షత్రవైశ్యులకు మంత్రయుక్తముగ స్నానముచెప్పబడినదిశూద్రునికైనచో మంత్ర

ములేకుండగ నమస్కారయుక్తముగ నీవిధిచేతనె స్నానమని చెప్పినందున శూ
ద్రులకు కాతీయసూత్రవిధిచేతనే మంత్రరహిత స్నానవిధియని తెలియునది- మై
థిల శ్రీదత్తుడుమాత్రము పాద్మోక్తవిధిచే స్నానము సర్వవర్ణసాధారణమని చె
ప్పెను - ఎట్లనిన - "అనుద్ధృతైరుద్ధృతైర్వాజలైస్స్నానంసమాచరేత్ । తీ
ర్థంప్రకల్ప యేద్విద్వాన్మూలమంత్రేణ మంత్రవిత్ । నమో నారాయణా
యేతి మూలమంత్ర ఉదాహృతః । దర్భపాణిస్తు విధినా హ్యాచాంతః ప్రయ
తశ్శుచిః । చతుర్హస్త సమాయుక్తం చతురశ్రం సమంతతః । ప్రకల్ప్యా
వాహయేద్గంగామేభిర్మంత్రైర్విచక్షణః । విష్ణోఃపాద ప్రసూతాసి వైష్ణవీ
విష్ణుపూజితా । పాహినస్త్వేనస స్తస్మా దాజన్మమరణాంతికాత్ । తిస్రః
కోట్యర్థకోటీచ తీర్థానాం వాయురబ్రవీత్ । దివిభువ్యంతరిక్షేచ తానితె
సంతిజాహ్నవి । నందినీత్యేవతే నామ దేవేషు నళినీతిచ । బృందాపృథ్వీచ సు
భగా విశ్వకాయాశివాసితా । విద్యాధరీ సుప్రసన్నా తథాలోకప్రసాదినీ। వే
ణ్యాచజాహ్నవీచైవ శాంతాశాంతి ప్రదాయినీ । ఏతానిపుణ్యనామాని స్నాన
కాలె ప్రకీర్తయేత్ । భవేత్సన్నిహితా తత్ర గంగాత్రిపథగామినీ । సప్త
వారాభి జప్తేన కరసంపుటయోజితం । మూర్ధ్నికుర్యాజ్జలం భూయ స్త్రిశ్చ
తుః పంచసప్తవా । స్నానంకుర్యాన్మృదాపశ్చా దామంత్ర్యచవిధానతః। అ
శ్వక్రాంతె రథక్రాంతె విష్ణుక్రాంతె వసుంధరె । శిరసాధార యిష్యామి రక్ష
స్వమాంపదేపదే । ఉద్ధృతాసివరాహేణ కృష్ణేనశతబాహునా । మృత్తికే
హరమేపాపం యన్మయా దుష్కృతం కృతం । నమస్తే సర్వలోకానాం ప్రభ
వారణి సువ్రతె॥" అనిఅనగా - జలాశయము నుండిపాత్రతో బైకిదీసినదిగాని
తీయనిదిగానిజలమునస్నానము చేయవలెనుఅపుడు "నమోనారాయణాయ" య
నుమూలమంత్రముచే దీర్థము గల్పించవలెను - ఎట్లనిన దర్భలు ధరించియాచ
మనముజేసి నియమముతో శుచియై నాల్గుమూరలు పరిమితిగా చతురశ్రమండ
లము గల్పించి యచట "విష్ణోః పాదప్రసూతాసి" యని మొదలుగ "ఏతాని పుణ్య
నామాని" యను నంతమగు మంత్రములచే గంగాదేవినావాహనముజేసినచో గం
గాసాన్నిధ్యముగల్గును అటుపైని మీదజెప్పిన మూలమంత్రముచేనేడుమారు లభి
మంత్రించి దోసిలితో జలమును మూడునాలుగైదునేడు మారులు శిరసుపైజల్లు
కొని యాపైని మృత్తికను విధిచొప్పున నామంత్రించి యనగా "నశ్వక్రాంతె" య

ని మొదలగు మంత్రములచే నామంత్రించి పూసుకొని స్నానముచేయునది-యని యిట్లు పాద్మోక్త విధియందు పురాణమంత్రపాఠము చెప్పియున్నది అందుశూద్రునకధికారములేకుండుట చేతను మీదజెప్పిన స్మృతికౌముదీ విధియందు శూద్రునకని విశేషము చెప్పియున్నందునను పాద్మోక్తవిధియె యనుట చింత్యము-అయినను ఒకవేళ నిది యందరకునంగీకరించినను మీదజెప్పిన విధితో దీనికి సముచ్చయమని తెలియునది - నృసింహపురాణమందు "నద్యాంస్రవత్సుచ స్నాయాత్ప్రతిస్రోతస్థితోద్విజః । తటాకాదిషు తోయేషు ప్రత్యర్కంస్నానమాచరేత్॥" అనియున్నది అనగా నదులందును గొండకాలువలందును ప్రవాహమునకెదురుగనిలచి ద్విజుడు స్నానము జేయునది సరస్సులు చెరువులు మొదలగువాని యందు సూర్యునికెదురుగ నిలచి చేయవలెనని - కాతీయులకు మాత్రము నదియందు సహితము సూర్యునికెదురుగనె స్నానము - బ్రహ్మాండ పురాణమందు - "ఊర్ధ్వపుండ్రంద్విజః కుర్యాత్ క్షత్రియస్తు త్రిపుండ్రకం । అర్ధచంద్రంతు వైశ్యస్య వర్తులం శూద్రజాతిషు॥" అనియున్నది అనగా బ్రాహ్మణుల కూర్ధ్వపుండ్రము క్షత్రియులకు త్రిపుండ్రము వైశ్యుల కర్ధచంద్రము శూద్రులకువర్తులము తిలకమనిచెప్పి నందున లలాట శిరఃకంఠబాహుహృదయ నాభిపృష్ఠపార్శ్వములందు దిలకముంచుకొని దర్భాసనముపైగూరుచుండిన మోనముయనిముమ్మారుజపించవలెను——ఇకతర్పణము - అందువ్యాసవచనము- "ఏకైక మంజలిందేవా ద్వౌద్వౌతు సనకాదయః । అర్హంతి పితరస్త్రీంస్త్రీం స్త్రియస్త్వేకైక మంజలిం॥" అని యనగా దేవతలకు నొక్కొక దోసిలియు సనకాదిఋషులకు రెండేసిదోసిళులును పితృదేవతలకుమూడేసిదోసిళులును స్త్రీలకొక్కొక దోసిలియు తర్పణోదకమీవలెననుట - మాతృవర్గమందు మూడేసి దోసిళు లీవలెను - విష్ణుపురాణమందు - "త్రిరధఃప్రీణనార్థాయ దేవానామపి నిర్వపేత్॥" అని దేవతర్పణముగూడ మూడేసి దోసిళులీవలెనని యున్నది - పాద్మమందు - "దేవాన్బ్రహ్మఋషీన్సర్వాం స్తర్పయేతాక్షతోదకైః । తర్పయెత్తుపితౄన్భక్త్యాసతిలోదకచందనైః॥" అనియున్నది- అనగా దేవబ్రహ్మఋషుల తర్పణము నక్షతలతోగూడిన జలముచేతను పితృతర్పణము తిలలుచందనము గలపిన యుదకముచేతను గావలెననుట - శంఖవచనము "సౌవర్ణేన రాజతేనౌదుంబరేణ శృంగపాత్రేణకుశేన వాప్యుదకంపితృతీర్థం

స్పృశన్దద్యాత్॥" అని యనగా బంగారు వెండి బొడ్డకర్ర ఖడ్గమృగము కొమ్ము
వీనిలో నొకదానిచే నిర్మించిన పాత్రచే గాని కుశలచే గాని పితృతీర్థమనగనం
గుష్ఠతర్జనుల మధ్యమును స్పృశించుజలముచే పితృతర్పణము జేయవలెననుట.
యోగయాజ్ఞవల్క్యవచనము- "తిలానామప్యలాభేతు సువర్ణరజతాన్వితం। తద
భావేనిషించేత్తు దర్భైర్మంత్రేణ వాప్యథ। తృప్యత్విత్విసముచ్చార్య తృప్యతామి
త్యథాపివా। విధిజ్ఞోనిక్షిపేత్తోయం దేవాదీనామశేషతః। సవ్యంజాను తతో
వాచ్యసలిలం దక్షిణాముఖః॥" అని యనగా తిలలు దొరకని యెడ సువర్ణము ర
జతము ధరించిగాని లేఁచో దర్భలచే మంత్రముచే గాని దేవాది తర్పణము
"తృప్యతు" అనియైనను "తృప్యతాం" అనియైనను ఉచ్చరింపుచు నీవలెను పితృ తర్పణ
ము దక్షిణాభిముఖుఁడై యెడమకాలు మణచి యీవలెనని చెప్పినందున దేవాది
తర్పణమందు గుడికాలు మణుచుట సిద్ధించును - యమస్మృతి "ద్వాహస్తా
యుగ్మతః కృత్వా పూరయేదుదకాంజలిం। గోశృంగ మాత్రిముద్ధృత్యజలమ
ధ్యేజలంక్షిపేత్॥" అనియనగా రెండుహస్తములు జోడించి దోసిలి జలముచే నింపి
గోవుకొమ్ము పొడవున నెత్తి జలమధ్యమందు విడువవలెను - దక్షవచనము- అ
గ్రైస్తు తర్పయేద్దేవాన్ మనుష్యాన్ కుశమధ్యతః। పితౄంస్తు కుశమూలా
గ్రైర్విధిఃకౌశోయథాక్రమం॥" అనియనగా దేవతర్పణము దర్భాగ్రములచే
తను మనుష్యతర్పణము దర్భలమధ్యముచేతను పితృతర్పణము దర్భల మొ
దళ్లచేతను జేయవలెననుట - మదనపారిజాతమందు యోగయాజ్ఞవల్క్యవచ
నము - "బ్రహ్మాణం తర్పయేత్పూర్వం విష్ణుంరుద్రం ప్రజాపతిం। దేవాన్
ఛందాంసివేదాంశ్చ ఋషీంశ్చైవ సనాతనాన్। ఆచార్యాంశ్చైవగంధర్వానా
చార్యతనయాంస్తథా। సంవత్సరం సావయవం దేవీశ్చాప్సరసస్తథా। త
థాదేవానుగాన్నాగాన్ సాగరాన్ పర్వతానపి। సరితోథమనుష్యాంశ్చ య
క్షాన్ రక్షాంసిచైవహీ। పిశాచాంశ్చ సుపర్ణాంశ్చ భూతాన్యథపశూంస్త
థా। వనస్పతీనోషధీశ్చ భూతగ్రామం చతుర్విధం॥" అని యనగా బ్రహ్మను
విష్ణును రుద్రుని ప్రజాపతిని దేవతలను ఛందస్సులను వేదములను ఋషులను ఆ
చార్యులను గంధర్వులను నాచార్యపుత్రులను సంవత్సరములను ఋతువులు మొ
దలగుదాని యంగములను నప్సరసలను దేవానుచరులను నాగులను సాగరము
లను పర్వతములను నదులను మనుష్యులను యక్షులను రక్షస్సులను పిశాచులను

సుపర్ణులనగ గరుడులను భూతములను పశువులను వనస్పతులను నోషధుల
ను జరాయు జాండజస్వేదజోద్భిజ్జములను నాల్గువిధముల భూతములను నుద్దే
శించి తర్పణముచేయునది- విష్ణుస్మృతి "తతః కృత్వా నివీతంతు యజ్ఞసూత్ర
మతంద్రితః । ప్రాజాపత్యేనతీర్థేన మనుష్యాం స్తర్పయేత్పృథక్॥" అని య
నగానటుపైని యజ్ఞసూత్రముకంఠమున వ్రేలాడగధరించి చిటికెనవ్రేలు మొద
లునుండి జారెడు జలముచేమనుష్యతర్పణమువేరుగ జేయవలెననుట ఎట్లనిన-కా
ష్ణాజినిస్మృతి "సనకస్సనందనశ్చ తృతీయశ్చ సనాతనః । కపిలశ్చాసురిశ్చైవ
వోఢుఃపంచ శిఖస్తథా॥" అని యనగా సనకుడు సనందనుడు సనాతనుడు కపి
లుడు నాసురియు వోఢుడు పంచశిఖుడు ననువారికిని మరీచియత్రియు నంగిర
సుడు పులస్త్యుడు పులహుడు క్రతువు ప్రాచేతసుడువసిష్ఠుడు భృగువునారదుడు
నని పాద్మమందు జెప్పిన వారికిని దర్పణముజేయవలెననుట - యోగయాజ్ఞవ
ల్క్యవచనము - "అపసవ్యంతతః కృత్వాభూత్వాచ పితృదిఙ్ముఖః। పితౄన్ ది
వ్యానదివ్యాంశ్చ పితృతీర్థేన తర్పయేత్॥" అటుపై నపసవ్యముజేసుకొని దక్షి
ణాభిముఖుడై దివ్యులు నితరులునగు పితరుల నుద్దేశించి తర్పణముజేయునది - అ
నగాదివ్యాంబర ధరుడుధ్రువుడు మొదలగువసువులు అజైకపాదుడు మొదలగు
రుద్రులు ఇంద్రుడు ధాతమొదలగు నాదిత్యులును వీరిని వేర్వేరుగగాని సముదా
యములుగ గాని యుద్దేశింపవలెను మరియును "కవ్యవాలం నలంసోమంయమ
మర్యమణంతథా । అగ్నిష్వాత్తా స్సోమపాశ్చ తథాబర్హిషదోపిచ । య
దిస్యాజ్జీవపితృక ఏతాన్విద్యాత్పితౄం స్తథా॥" అనియనగాజీవించినతండ్రి గల్గు
వాడైనచో వాడుతర్పణమందు కవ్యవాలుడు నలుడు సోముడు యముడు నర్య
ముడు నగ్నిష్వాత్తులు సోమపులుబర్హిషదులను పితృగణములు వీరలనుద్దేశింపవ
లెననుట- స్మృతికౌముదిలో మాత్రము తర్పణమున కనేకవిధములు చెప్ప బడిన
ది అయిననుగాత్యాయనసూత్రమం దిట్లున్నందునను"శూద్రావాజసనేయినః"అ
నిగౌడనిబంధములోనుదాహరించిన దక్షవచనమువలనను ననగా శూద్రులు యా
జ్ఞవల్క్య శాఖీయు లనుట స్నానాదికమందట్టి విధియెకానుపించి నందునసుయా
జ్ఞ వల్క్యోక్తమైన యుట్టి విధియె శూద్రులకని తెలియునది-ఇట్లువైశ్వ దేవా
దికముగూడగాతీయసమ్మతమెయని యెరుంగునది- ఇకప్రయోగమెట్లనిన మృత్తిక
గోమయము తిలలు కుశయుపుష్పము లక్షతలును బట్టుకొని నదిమొదలగువానిదరి

కివెళ్లి కాలుసేతులు గడగికొని యొక్కొక్కదర్భ రేకుచేనిర్మించిన రెండు పవి
త్రిములను రెండుచేతుల ననామికలందు ధరించి జుట్టు ముడివేయవలెను అపుడు
మంత్రము "ఊర్ధ్వకేశివిరూపాక్షి మాంసశోణిత భోజనే।తిష్ఠదేవి శిఖాబద్ధే చా
ముండేహ్యాపరాజితే॥" అనియనగా మీదికినిలచు కొప్పుగలదానా విషమనేత్రము
లనగ మూడునేత్రములు గల్గుదాన మాంసము రక్తముభుజించుదాన జయింపశ
క్యముగాని యోచాముండాదేవి నాశిఖయందు గట్టబడి యుండుము - అనిశిఖము
డివేసి యాచమించి దేశకాలముల స్మరించి "మమసర్వపాప క్షయద్వారా శ్రీపర
మేశ్వర ప్రీత్యర్థం ప్రాతస్స్నానమహంకరిష్యే" యనిసంకల్పించి తీర్థము నిట్లు
ప్రార్థింపవలెను- "సాగరస్వననిర్ఘోషదండహస్తా సురాంతక।జగత్స్రష్టో జ
గన్మర్దిన్న మామిత్వాం సురేశ్వర । తీక్ష్ణదంష్ట్రమహాకాయ కల్పాంత దహ
నోపమ। భైరవాయనమస్తుభ్యమనుజ్ఞాం దాతుమర్హసి॥" అనియనగా సముద్ర
ఘోషమువంటి సింహనాదముతో దండధరుడవై యసురులజంపి జగముల బెంప
జంపసమర్థుడవగు నోదేవేశ్వరుడ నీకునమస్కారము తీక్ష్ణమైన కోరలతోప్రల
యాగ్నివలె భయంకరుడవగునో భైరవుడనీకు నమస్కారము స్నానమున కనుజ్ఞ
నిమ్మని ప్రార్థించివరుణాయనమ యని జలముస్పృశించి యామంత్రముతో జల
ముత్రిప్పి దోసిలితో గ్రహించి "నమోదద్భ్యమమపాపంయాతు" అనియొడ్డుపైజల్లి
"అముకతీర్థాయనమ"యని చేతులజోడించి మృత్తికదీసి కటి మొదలుగ బాద
ములవరకు ముమ్మారుపూసి కడగి యొకపాదము జలములోను నొకపాదము స్థ
లమందునుంచి "విష్ణవేనమ"యని సర్వాంగమునృత్తుచేబూసి సూర్యాభిముఖుడై
రెండుమూడుమారులుగాని పండ్రెండుమారులుగాని మునిగి "అద్భ్యోనమ"యని
తోముకొని తిరుగమునిగిలేచి యాచమించి యట్లనే "రుద్రాయనమ"యనిగోమయ
ముదీసి పూసుకొని స్నానముజేసి యాచమించి దర్భలచే మార్జనము జేసుకో
నవలెను- "వరుణాయనమ"యని యెనిమిదిమారులును "పరమాత్మనేనమః అగ్న
యేనమః వాయవేనమః సూర్యాయనమః సవిత్రేనమః యజ్ఞాయనమ" యనిముని
గి "అద్భ్యోనమ"యని యిరువదిరెండుమారులుమార్జనములేదా "అగ్నయేనమ"
యనిముమ్మారు "జాతవేదసే-సవిత్రే.చిత్ప్రత్యాదిభ్యోనమ" యని "సవిత్రే"యనువీ
నిచేనాభిపర్యంతము దర్భలచేపవిత్రముజేసుకొని "పరమాత్మనే... సవిత్రేనమః"
అనునంతకునుచ్చరించి తిరుగ బవిత్రముజేసిలేక "నమః"అనిమూడుమారులు "పర

మాత్మనేనమ"యనినైమెననఘమర్షణస్నానముజేసి"విష్ణవేనమ"యనిస్మరించి"బ్రహ్మాదిదేవతాస్తృప్యంతాం"అనిగాని"నమ"యనిగాని దేవతీర్థముచే ముమ్మారు సవ్యముగ దేవతలకును నివీతినై"కృష్ణద్వైపాయనాది ఋషయస్తృప్యంతాం" అని రెండేసి మారులు ఋషులకును నపసవ్యముగా"సోమపితృమదాది పితరస్తృప్యంతాం"అనిమూడేసిదోసిళులుముమ్మారిచ్చిమడిబట్టలుకట్టుకొనిమృత్తుచేగరములగడుగుకొనియాచమించివెదురాకువలెగానియర్ధచంద్రునివలెగాని వర్తులముగ గానితిలకముంచుకొనిముద్రలుమొదలగునవిచేసిగానిలేకధరించిగాని'నమోబ్రహ్మణెవిష్ణవె-సవిత్రే-మిత్రాయ-వరుణాయ-దిగ్భ్యః-దిగ్దేవతాభ్యః" అనిప్రత్యేకముగ జలపుష్పాంజలియీవలెననియాచార్యచూడామణి-అటుపైనుదయించిన సూర్యునినష్టదళపద్మమందు రక్తచందనాక్షతలుపుష్పములువీనిచేబూజించివీనితోగూడినయర్ఘ్యమును"వివస్వతెతుభ్యంభాస్వతే విష్ణుతేజసేనమః సవిత్రేశుచయేసవిత్రేకర్మదాయినే"యని యర్ఘ్యమీవలెనని కల్పతరువు నందున్నది- ఆపైని "సూర్యమండలస్థాయ పరమాత్మనేనమ"యని తిరుగనర్ఘ్యమిచ్చి "బ్రహ్మవిష్ణు రుద్రేభ్యో నమ"యనిగానివిష్ణుశివనామాదికముగాని యథాశక్తిగజపించి..."నమస్సవిత్రేజగదేకచక్షుషె జగత్ప్రసూతిస్థితి నాశహేతవే।త్రయీమయాయత్రిగుణాత్మధారిణె విరించి నారాయణ శంకరాత్మనే। నమ"యనియనగా సత్వరజస్తమోగుణము లుపాధిగా బ్రహ్మవిష్ణు రుద్రస్వరూపుడై జగత్తుయొక్క సృష్టిస్థితి లయముల జేయుచు సూర్యరూపమున జగత్తునకు దృష్టినిచ్చెడు సూర్యునికి నమస్కారమనిచేతులు జోడించవలెను ఇట్లుమధ్యాహ్నమందుగూడ స్నాన మాచరించునది-అశక్తిలో మధ్యాహ్నమందైనను జేయునది గృహమందుష్ణోదకముచే స్నానమునిటులనేచేయవలెను-రోగినై స్నానముజేయశక్తిలేనియెడదర్భలచేమార్జనముగానిభస్మస్నానముగానిగోధూళిస్నానముగానితడిబట్టచే నంగము దుడుచుకొనుటగానిజేయునది-జాబాలివచనము "అశిరస్కంభవేత్స్నానంస్నానాశక్తౌతుకర్మిణాం।ఆర్ద్రేణవాససావాపిమార్జనందైహికంవిదుః।విద్వత్సరస్వతీప్రాప్తంస్నానంసారస్వతంవిదుః॥" అనియనగాసశిరస్స్నానమందశక్తుడైనచోగంఠస్నానములేదా తడిబట్టచే దుడుచు కొనుటగాని మార్జనముగాని చేసుకొనవలెనుఅదిదైహిక స్నానమనబడును లేదామానసిక స్నానము జేయవచ్చును - ఎట్లనిన - "ధ్యాయే దాదిత్య సంకాశం వాసుదేవంచతుర్భుజం। శంఖచక్రగదాపద్మ వన

మాలావిరాజితం । తత్పాదోదకజాం ధారాం నిపతంతీం స్వమూర్ధని।చింత యేత్ బ్రహ్మరంధ్రేణ ప్రవిశంతీం స్వకాంతనుం । తయాసంక్షాలయేత్సర్వ మంత ర్దేహాగతం మలం॥" అనిఅనగా శంఖచక్ర గదాపద్మవనమాలాదులచే నలంకృ తుడై నాల్గుభుజములతో సూర్యు నతిక్రమించిన తేజస్సుగల వాసుదేవ మూర్తి ని ధ్యానించి యాయన పాదములనుండి స్రవించు గాంగధారనుతనశిరసుపైబడి బ్రహ్మరంధ్రము వెంబడి హృదయము బ్రవేశించినదానిగ జింతించి దానిచేలో పలి మాలిన్యమంతయు గడగి కొనవలెను - అట్లనే "అపవిత్రః పవిత్రోవాసర్వా వస్థాంగతోపివా । యస్స్మరేత్పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరశ్శుచిః॥" అనియ నగా శుచియైగాని యశుచియైగాని యెట్టియవస్థతో నున్నను బుండరీకాక్షునిస్మ రించెనేని బాహ్యాభ్యంతరములందు శుద్ధుడగునని - అటుపైని గంచు పాత్రలో నే యివోసియందు దననీడజూచి యదివిప్రునికీవలెను అపుడుమంత్రము-"ఆజ్యంతే జస్సముద్దిష్టమాజ్యం పాపహరంస్మృతం। ఆజ్యంసురాణామాహార మాజ్యేలో కాఃప్రతిష్ఠితాః । కామధేనుషుసంభూతం సర్వక్రతుషు సంస్థితం । దేవానా మాజ్యమాహారమతశ్శాంతిం ప్రయచ్ఛమే॥" యనియనగా నాజ్యమే తేజస్సు పా పముహరించునదియునని చెప్పబడినది దేవతలకు యజ్ఞద్వారముగ నాహారమైన ది కనుకసర్వలోకములు నాజ్యమందు వశమై యున్నవి మరియునాజ్యమునకు బు ట్టువు కామధేనుసంతతియందు - వినియోగమాయజ్ఞములందు - దానిఫలమా స ర్వదేవతా తృప్తియేమి చెప్పను కాబట్టియట్టియాజ్యదానమున నాకుబాప శాం తియగుగాకయని దక్షిణతో దానముచేయవలెను - ఇదివిష్ణు ధర్మోత్తరమందు స్పష్టముగ నున్నది- ఆపైనిమధ్యాహ్నమందు స్నానముజేసిబ్రహ్మయజ్ఞముచేయు నది-అందు"యద్బ్రాహ్మణానీతి హాసాన్ పురాణానికల్పాన్" అనుశ్రుతివలనను "వేదాథర్వ పురాణానిసేతి హాసానిశక్తితః । జపయజ్ఞప్రసిద్ధ్యర్థం విద్యాం చాధ్యాత్మికీంజపేత్॥" అనియనగా వేదత్రయమునథర్వశ్రుతియు నితి హాసము లుపురాణములు యథాశక్తిగ నధ్యాత్మవిద్యను బ్రహ్మయజ్ఞసిద్ధికై పఠింప వలె ననియాజ్ఞవల్క్యవచనమున్నందునను పురాణభారతాదుల పాఠమునపుడు విధిం చియున్నను శూద్రునికి బాఠాధి కారములేనందున శ్రవణమేయతనికి గమాం గముగనుక బురాణశ్రవణమే యతనికి బ్రహ్మయజ్ఞమని కొందరంద్రు - అదియు క్తముగాదు ఏమనిన "నమస్కారేణమంత్రేణ పంచయజ్ఞాన్నహాపయేత్॥" అని

యనగా నమస్కారమంత్రముచే బంచయజ్ఞములు చేయవలెను విడువగూడదని యాజ్ఞవల్క్యవచనముచే నతనికి విశేష విధియున్నందునను "యోనమసాస్వధ్వరః" అనుశ్రుతినమోమంత్రముచే యాగము సుష్ఠుకృతమని చెప్పుటచేతను "యజ్ఞో వై నమఇతిహి బ్రాహ్మణంభవతి॥" యని యనగా నమో మంత్రము యజ్ఞమే యని బ్రాహ్మణశ్రుతి యను నర్థముగలవచనమున్నందునను "నమోనమః" అని ముమ్మారుచ్చరింపవలెనని స్మృతిలో జెప్పబడినది-యథార్థమును విచారించినచో వేదాదులయర్థమునకు బాధకలుగునపుడుస్వరూపమాత్రమే గ్రహింప బడుట వలననునమశ్శ్రుతికినమోంతమని యర్థముసంభవింపవచ్చును గనుకను నమోంతములైననామములచే జేయవలెను-ప్రయోగమెట్లనిన దర్భాసనమందు గూర్చుండి యాచమించి "పరమేశ్వరప్రీత్యర్థం బ్రహ్మయజ్ఞంకరిష్యే॥" యని సంకల్పించి యుపస్థముజేసియనగ గుడిపాదముచే నెడమపాదముద్రొక్కుచుదర్భలుమధ్యమం దుండునటుల బ్రహ్మాంజలిజేసి యనగ గుడికాలుపై వెతికిలించియుంచిన యెడమచేతిపైదర్భలతో గుడిహస్తముబోరిగిలించి "నమోనమోనమః" అని జపించునది-లేదా యపుడు "ఋగ్వేదాయనమః-యజుర్వేదాయనమః - సామవేదాయనమః- అథర్వవేదాయనమః - శిక్షాయైనమః - కల్పాయనమః - వ్యాకరణాయనమః- నిరుక్తాయనమః - జ్యోతిషాయనమః - ఛందోవిచ్ఛిత్యైనమః - అధ్యాత్మ విద్యాయైనమః - ఇతిహాసపురాణేభ్యోనమః - తర్కవిద్యాయైనమః- పూర్వమీమాంసాయైనమః-ఉత్తరమీమాంసాయైనమః" అనిజపించి "దేవతాభ్యఃపితృభ్యశ్చ మహాయోగిభ్యఏవచ।నమస్స్వధాయై స్వాహాయై నిత్యమేవ నమోనమః" అని ముమ్మారు జపించి "విద్యాధ్వరతపోయోనిరయోని ర్విష్ణురీడితః । వాగ్యజ్ఞే నార్చితో దేవః ప్రీయతాం మేజనార్దనః॥" అని యుచ్చరించి జలము స్పృశింప వలెను - ఇకతర్పణము - అది బ్రహ్మణేనమః అని నమశ్శబ్దమునంతమందుంచిన మంత్రములచే జేయవలెను శూద్రునకు నమశ్శబ్దము విధింపబడె గదా యని కొందరంద్రు - ఇతరులు తృప్యతామిత్యోంకారపూర్వమని కాతీయసూత్రమందున్న "తృప్యతాం॥" అనుపదము విడుచుటకు బ్రమాణములేనందున నాశబ్దము నంతమందుంచి యేచేయవలెనంద్రు - కనుక విధియెట్లనిన - ఆసనమందు కుడిమోకాలు వంచి సమదర్భలు నక్షతలుధరించిన రెండుహస్తములతో వ్రేళ్ల కొనలనుండి జారెడు జలము దేవతీర్థముచానిచే దేవతర్పణము - అదిమదన పారి

జాతమందలి యోగియాజ్ఞవల్క్యకాతీయ సూత్రానుసారముగ జెప్పబడును- ఎ ట్లనిన - "బ్రహ్మాతృప్యతాంవిష్ణుస్తృప్యతాం-రుద్రః - ప్రజాపతిః - దేవాః ఛం దాంసి - వేదాః - ఋషయః - పురాణాచార్యాః-గంధర్వాః - ఇతరాచా ర్యాః - సంవత్సరస్సావయవః - దేవ్యః- అప్సరసః - దేవానుగాః-నాగాః సాగరాః - పర్వతాః - సరితః-మనుష్యాః-యక్షాః-రక్షాంసి-పిశాచాః - సుప ర్ణాః - భూతాని - పశవః-వనస్పతయః - ఓషధయః-భూతగ్రామ శ్చతు ర్విధస్తృప్యతాం॥" అని చేయునది మరియు నాచార్య చూడామణి మతమందు "ప్రజాపతిస్తృప్యతాం" అనినపైని "దేవాయక్షాస్తథానాగా గంధర్వాప్సరసోసు రాః క్రూరాస్సర్పాస్సుపర్ణాశ్చ తరవోజంభకాః ఖగాః। విద్యాధరాజలాధా రాస్తథైవాకాశ గామినః।నిరాహారాశ్చయేజీవాః పాపేధర్మేరతాశ్చయే। తే షామాప్యాయనాయైతద్దీయతే సలిలం మయా॥" యని నూతోస్త్యక్త ప్రకార మున దర్పణమని యున్నది - ఇకఋషితర్పణము నివీతముజేసుకొని యుత్త రాభిముఖుమైన దర్భలలోనుండి చిటికెనవ్రేలు మూలమునుండి జారెడు ప్రాజా పత్యతీర్థముచేజేయవలెను - అనగా రెండేసి దోసిళులీవలెను-ఎట్లనిన- "సనక స్తృప్యతాం-సనందనః...సనాతనః...కపిలః...ఆసురిః...వోఢః...పంచశిఖః" ఇకపితృతర్పణము - దక్షిణాభిముఖుడై యెడమకాలు మణిచివంచి ప్రాచీనా వీతిగా పితృతీర్థమనగ నంగుష్ఠతర్జనులమధ్యమునుండి ద్విగుణదర్భలతోదిలమి శ్రమైనజలము మూడేసిదోసిళులీవలెను- వసవస్తృప్యంతాం-రుద్రాః-ఆదిత్యాః- మరుతః-అశ్వినౌతృప్యేతాం - కవ్యవాలనలస్తృప్యతాం - సోమః-యమః- అ ర్యమా - అగ్నిష్వాత్తాస్తృప్యంతాం-సోమపాః - బర్హిషదః- ధర్మరాజ స్తృప్యతాం - మృత్యుః - అంతకః-వైవస్వతః - కాలః- సర్వభూతక్షయః- ఔదుంబరః-దధ్నః - నీలః - పరమేష్ఠీ వృకోదరః - చిత్రః-చిత్రగుప్తః" అని జీవత్పితృకుడు సహితమింతవరకు నుద్దేశించునది- అటుపైని స్వపితృ తర్పణము "పితృభ్యోనమ" యని యావాహించి "కాశ్యపగోత్రోస్మత్పితా అముకదాసస్తృ ప్యతాం" అనిముమ్మారు - ఇట్లుపితామహునికి ప్రపితామహునికి నీవలెను- తిరు గ "పితృభ్యోనమ" యని యారుమారులుగానిమూడుమారులుగాని మధుశబ్దముచే నైనను దోసిలి విడువవలెను - "అస్మన్మాతా కాశ్యపగోత్రాఅముకదేవీదాతృప్య తాం" ఇట్లు "పితామహీ - ప్రపితామహీ-సాపత్న్యమాతా" - ఇట్లు "పితృ

భ్యోనమః” అని యావాహించి “మాతామహః-ప్రమాతామహః- వృద్ధ ప్రమా
తామహః” - ఇట్లు “మాతామహీ-ప్రమాతామహీ- వృద్ధప్రమాతామహీ”ఇ
ట్లు“స్వభార్యా-పుత్రః-కన్యా-పితృవ్యః - మాతులః-స్వభ్రాతా-తత్పత్న్యః-పితృ
ష్వసా-మాతృష్వసా - స్వభగినీ - సాపత్న్యభగినీ-సభర్తృకా” అని ముగ్గు
రియందును - “శ్వశురః-గురుః-సఖా-మిత్రభ్రాతః - ”అనియుచ్చరించునది- లే
క “ఆబ్రహ్మస్తంబపర్యంతం దేవర్షి పితృమానవాః । తృప్యంతు పితరస్సర్వే
మాతృమాతామహాదయః । అతీతకులకోటీనాం సప్తద్వీప నివాసినాం । ఆబ్ర
హ్మభవనాల్లోకాది దమస్తుతిలోదకం॥” అని తర్పణముజేయవలెను - ఇక మ
దనపారిజాతమందు హారీతవచనము - “వసిత్వావసనం శుక్లంస్థలేని స్త్రీర్ణబ
ర్హిణి । విధిజ్ఞస్తర్పణం కుర్యాన్నతుపాత్రే కదాచన॥” యని యనగా శు
ద్ధవస్త్రము ధరించి దర్భలుపరచిన భూమియందు విధిప్రకారమున దర్పణము
జేయవలెను గాని పాత్రమందు జేయగూడదనియున్నది గాని యదియనుద్ధృతజ
లముచే దర్పణమట్లు చేయవలెనని తాత్పర్యముచే జెప్పినది కనుకనే ఉద్ధృతజ
లమందు మరియొకవచనమచ్చటనేయున్నది - “పాత్రాద్వాజలమాదాయ స్వ
యంపాత్రాంతరేక్షిపేత్ । జలపూర్ణేథవాగర్తే నస్థలేనతు బర్హిషి॥”
అని యనగా నొకపాత్రనుండి జలముదీసి మరియొక పాత్రలో విడువవలెను లే
దా జలపూర్ణమైన గోతిలో విడువవలెను స్థలమందుగాని దర్భలపైగాని వి
డువగూడదని - యోగయాజ్ఞవల్క్యవచనము “యద్యుద్ధృతేనసించేత తిలాన్
సంమిశ్రయేజ్జలే । అతోన్యథాతు సవ్యేన తిలాగ్రాహ్యావిచక్షణైః॥” అని యన
గా జలాశయమునుండి కలశముతో బైకితెచ్చినజలముచే దర్పణముచేయు నెడ
నుదకమందు తిలలుగలుపవలెను నద్యాదులలో నుదకముచేతనే జేయుచోదిలల
నెడమచేతిలోనుంచుకొనవలెననుట - తిలతర్పణము బుత్రవంతుడు గృహామం
దుజేయగూడదు - అట్లుమరీచివచనము “సప్తమ్యాంరవివారేచ గృహేజన్మది
నేతథా । భృత్యపుత్రకలత్రార్థీ నకుర్యాత్తిల తర్పణం॥” అని యనగా స
ప్తమియందును భానువారమందును గృహమందును జన్మదినమందును బుత్రభృ
త్యకలత్రాదులక్షేమము గోరువాడు తిలతర్పణము జేయగూడదనుట - ఆపై
ని “యేకేచాస్మత్కులేజాతా అపుత్రా గోత్రిణోమృతాః । తేగృహ్ణంతు మ
యాదత్తం వస్త్రనిష్పీడనోదకం॥” అని తీరమందు స్థలమందు వస్త్రము దడిపి

యదివిపిడువవలెను- ఆచార్యచూడామణియందు "యేఽబాంధవాబాంధవా వాయే
న్యజన్మనిబాంధవాః । తేతృప్తిమఖిలాయాంతుయే వాస్మత్తోభికాంక్షిణః॥నమో
నమః-"అనియుచ్చరింపుచు బట్ట బిడువవలెననియున్నది - అటుపైని సవ్యముచేవి
ష్ణుపురాణోక్త తర్పణము జేయునది "దేవాసురా స్తథా నాగా యక్షగంధర్వ
రాక్షసాః । పిశాచాగుహ్యకాస్సిద్ధాః కూశ్మాండా స్తరవఃఖగాః । జలే చరా
భూమిలయా వాయ్వాధారాశ్చ జంతవః । తృప్తిమే తేన యాంత్వాశు మద్దత్తే
నాంబు నాఖిలాః । నరకేషు సమస్తేషు యాత నాసుచ యేస్థితాః । తేషా
మాప్యాయ నాయై తద్దీయతేసలిలం మయా।యేఽబాంధవాబాంధవా వాయే
న్యజన్మని బాంధవాః । తేసర్వేతృప్తిమాయాంతుమయాదత్తైస్తిలోదకైః॥"
అని యనగా "దేవాస్తృప్యంతాం" అని మొదలుగ జన్మాంతరబంధువుల వరకు
ను దర్పణమీవలెననుట - ఇకసంక్షేపముగ "ఆబ్రహ్మస్తంబపర్యంతం జగత్తృ
ప్యతు" అని యొకదోసిలి విడువవలెను - ఆపైని "బ్రహ్మణేనమః- విష్ణవేనమః-
రుద్రాయనమః - సవిత్రేనమః-మిత్రాయనమః-వరుణాయనమః॥" అని జలమం
దుబూజించి హస్తముచేవిరుగ "బ్రహ్మణేనమః - అగ్నయె-పృథివ్యై- ఓషధీ
భ్యోనమః - వాచస్పతయె-విష్ణవే-మహద్భ్యః - అద్భ్యః - అపాంపతయె-
వరుణాయనమః" యని తర్పణముజేసి ముఖము దుడుచుకొని "దేవేభ్యోనమః"
అని విసర్జింపవలెను - ఇట్లుశూద్రకమలాకరమందు శూద్రునికి స్నాన తర్ప
ణాది నిర్ణయము——ఇకదేవపూజ - అది విశ్వేశ్వరుడుమొదలగు పురాతనలిం
గములందును తానుస్థాపించినపార్థివలింగాదులందును స్పర్శరహితముగ జే
యునది - సాలగ్రామము స్ఫటికమయమైన ద్విజస్థాపితలింగముమొదలగు వాని
యందు స్పర్శరహితపూజయుదూరమునుండి చేయవలెను - అట్లునిషేధవచన
ము "యదాప్రతిష్ఠితంలింగంమంత్రవద్భిర్యథావిధి । తదాప్రభృతిశూద్రశ్చయో
షిద్వాపి నసంస్పృశేత్॥" అని యనగాలింగముప్రతిష్ఠించినది మొదలుకొని స్త్రీ
శూద్రులుముట్టగూడదని నారదీయవచనమనుట - అదియునామచేజేయవలెను-
ఇట్లుస్త్రీకూడజేయవలెను-అట్లుమదనపారిజాతమందువిధవా ధర్మములోస్కాం
దవచనము "విష్ణోస్తుపూజనంకార్యం పతిబుద్ధ్యా నచాన్యథా॥" అని యనగా వి
ష్ణునిపతిబుద్ధిచేబూజింపవచ్చునని - అచ్చటనేపాద్మవచనము - "ఆదిత్యం గణ
నాథంచ దేవేంద్రంచయథాక్రమం। నారాయణంవిశుద్ధాఖ్యమంతేచకులదేవతాం"

అనియనగా సూర్యుని గణేశుని నింద్రుని నారాయణుని బూజించి యాపైనిగుల దేవతను బూజించునది- నిగమవచనము "బ్రహ్మాణంవిష్ణుమీశంవా సూర్యమగ్నింగ ణాధిపం। దుర్గాంసరస్వతీంలక్ష్మీంగౌరీంవానిత్యమర్చయేత్॥" అనగా నీచెప్పినదే వతలలో నొకరినిత్య మర్చింపవలెను-ఇట్లువిధింపబడినందున "జప స్తప స్తీర్థ సే వాప్రవ్రజ్యామంత్రసాధనం । దేవతారాధనంచైవ (స్త్రీ)శూద్రపతనానిషట్॥" అనియనగా జపముకృఛ్రచాంద్రాయణాది తపస్సు సన్యాసము మంత్రపుర శ్చర ణము దేవపూజయు (స్త్రీ)శూద్రులకు బతనహేతువులను మనువచనము విధింపని జపాదులకని తెలియునది - మాత్స్యవచనము "సౌవర్ణీ రాజతీవాపి తామ్రీ రత్నమయీ తథా । శైలీ దారుమయీవాపి లోహసంఘమయీతథా । రీ తికాధాతు యుక్తావా తామ్రకాం స్యమయీతథా । శుభదారు మయీవాపి దేవతార్చా ప్రశస్యతే ॥ " అనియనగా బంగారు - వెండి- రాగి - రత్న ము- శిల - కఱ్ఱ - పంచలోహములు - వీనిలో నొకదానిచే నిర్మించిన దేవ ప్రతిమగావలెను అందుని త్తడి-రాగి- కంచు-శుభమైన దారువుచే జేయబడినది ప్రశస్తము - "అంగుష్ఠపర్వాదారభ్య వితస్తింయావదేవతు । గృహేషు ప్రతి మాకార్యా నాధికాశస్యతే బుధైః॥" అనగా నంగుష్ఠము గుంపు పరిమితి మొ దలుగ బండ్రెండంగులముల పరిమితి పర్యంతము గృహమం దర్చాప్రతిమజేయవ చ్చును అధికముగూడదనుట - భాగవతమందు- "వైదికస్తాంత్రికో మిశ్ర ఇతిమె త్రివిధోమఖః॥" అని యనగపూజావిధి వైదికము తాంత్రికము మిశ్రమునని మూ డు విధములుగ నున్నదనుట- శివార్చనచంద్రికలో పాద్మవచనము "వైదికోమి శ్రితోవాపివిప్రాదీనాం విధీయతే । తాంత్రికోవిప్రభక్తస్య శూద్రస్యాపి ప్రకీ ర్తితః॥" అనియనగా వైదికవిధానము మిశ్రవిధానము విప్రాదులకు విధింపబ డినది విప్రభక్తుడైన శూద్రునికి దాంత్రిక విధియని - అందుపచారము లనేక వి ధములుగ రాఘవ భట్టునిచే బదార్థ దర్శమందు జెప్పబడినవి- ఎట్లనిన- ఆ చారచింతామణిలో- "సపర్యా వివిధాఃప్రోక్తాస్తాసామేకాంసమాశ్రయేత్।గం ధాదికా నివేద్యాంతాపూజాపంచోప చారికా॥" అనియనగా పూజావిధాన ము లనేకవిధములుగ నున్నవి - అందొకరీతి నాశ్రయింపవలెను ఎట్లనిన గంధ ముమొదలునైవేద్య మంతముగ బంచోపచార పూజయనబడును ఇకదశోప చా రములు "అర్ఘ్యంపాద్యంచాచమన మధుపర్కా-స నానిచ । గంధాది పంచ

కంచేతి ఉపచారా దశోదితాః॥" అనగా నర్ఘ్యపాద్యాచమన మధుపర్కాస
నములైదును మీదజెప్పినవియును గలసిపదియుపచారములు - ఇకషోడశోపచా
రములు - "ఆసనావాహనే చార్ఘ్యం పాద్యమాచమనంతథా । మధుపర్కా
చమస్నానవసనాభరణానిచ । గంధపుష్పేధూపదీపౌ నైవేద్యంచందనంతథా"
అని- ఇకబదునెనిమిదియుపచారములు - "ఆసనావాహనే చార్ఘ్యంపాద్యమా
చమనంతథా । స్నానంవస్త్రోపవీతంచ భూషణానిచ సర్వశః । గంధపుష్పే
తథాధూపందీపం నైవేద్యమేవచ। మాల్యానులేపనేచైవ నమస్కారవిసర్జ
నే॥" అని-ఇకనిరువదారుప చారములు - "ఆసనాభ్యంజనే తద్వదుద్వర్తన వి
రూక్షణే । సంమార్జనం సర్పిరాదిస్నాప నావాహనేతతః । పాద్యమర్ఘ్యా
చమనీయంచ స్నానీయ మధుపర్కకౌ । పునరాచమనీయంచ వస్త్రయజ్ఞోపవీ
తకే । అలంకారో గంధపుష్పే ధూపదీపౌ తథైవచ । తాంబూలానిచ నై
వేద్యం పుష్పమాలాస్తథైవచ । అనులేపంచ శయ్యాచ చామరంవ్యజనంతథా।
ఆదర్శ దర్శనంఛత్రం నమస్కారో థవర్తనం । గీతవాద్యేచ దానాని స్తుతి
హోమప్రదక్షిణం । దంతకాష్ఠప్రదానంచ తతోదేవ విసర్జనం । ఉపచారా
ఇమేజ్ఞేయాష్షడ్వింశత్సుర పూజనే॥" అనియనగా నాసనముగంధతైలమంటుట
రుద్దుట మార్జనము ఘృతాదులచే స్నాపనము నాపైయావాహనాదులు ప్రసి
ద్ధము లిట్లిరువ దారును దెలియునది - ఇట్లిరువది నాల్గుప చారములుగూడదాం
త్రిక పూజయందున్నవి - ఇందులో యథావిభవముగ నొకపక్షము నవలంబిం
చునది- బహ్వృచపరిశిష్టమందు - "ఏకంవినాయకేకుర్యాద్ద్వేసూర్యే త్రీణిశంక
రే । చత్వారికేశవె దద్యాత్సప్తాశ్వత్థేప్రదక్షిణాః॥" అనియనగా గణేశునికొ
కప్రదక్షిణము సూర్యునికి రెండును శంకరునికి మూడును విష్ణునకు నాల్గును నశ్వ
త్థమునకు నేడును ప్రదక్షిణములుచేయునది-మరియొకగ్రంథమందు"ఏకాచండ్యాం
రవేస్సప్తతి స్రోదద్యాద్వినాయకే । చతస్రోవిష్ణవేదేయాశ్శివస్యార్థ ప్రదక్షి
ణా॥" యనియున్నది - అనగా చండీదేవి కొకటియురవికినేడును విఘ్నేశునికి
మూడును విష్ణునకు నాల్గును శివునికి ప్రదక్షిణలో సగమును జేయవలెననుట- అ
ర్థప్రదక్షిణయెట్లనిన "వృషంచండం వృషంచైవ సోమసూత్రం పునర్వృషం।చం
డంచ సోమసూత్రంచ పునశ్చండం పునర్వృషం॥" అనియనగా సోమసూత్రము
దాటగూడదని నిషేధమున్నందున - నీశ్వరునకెదురుగ నుండునంది యొద్దనుండి

యుత్తరమందుండు చండీశ్వరుని యొద్దకు నక్కడనుండి తిరుగనందియొద్దకు వచ్చి
దక్షిణమునుండి సోమసూత్రపర్యంతము వెళ్లి తిరుగానందియొద్దకు వచ్చి చండీశ్వ
రుని పర్యంతము నక్కడ నుండి సోమసూత్ర పర్యంతము వెళ్లి తిరి గి చండీ
శ్వరుని యొద్దకు వచ్చి నందియొద్దకు రావలెనని - "అపసవ్యం యతీనాంతు
సవ్యంతు బ్రహ్మచారిణాం । సవ్యాపసవ్యం గృహిణా మేవంశంభోః ప్రదక్షి
ణా॥" అనియనగా యతులపసవ్యముగను బ్రహ్మచారులు సవ్యముగను గృహస్థు
లు సవ్యాప సవ్యములు గలియునట్లుగను శివాలయమందు బ్రదక్షిణ జేయవలెను
అట్లాగ్నేయమందును -"ప్రదక్షిణత్రయంకుర్యాచ్ఛి వస్యాయతనే బుధః॥" అన
గాశివాలయమందు మూడుప్రదక్షిణలు చేయునదియనియున్నది - లైంగమం
దు - "సవ్యంవ్రజేత్తతో ఽసవ్యంప్రనాళంవైనలంఘయేత్॥" అనియున్నది అన
గాసవ్యమనగనెడమ భాగమందు జేసి యాపైని గుడిభాగమందు బ్రదక్షిణముసో
మసూత్రము దాటగూడదని - మరియును "ఉరసాశిరసాదృష్ట్యామనసావచసాత
థా । పద్భ్యాంకరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోష్టాంగ ఉచ్యతే ॥" అన
గా నీయెనిమిదింటిచే వంగుట యష్టాంగ ప్రణామము-పూజ దేవతీర్థముచే జే
యవలెను - అట్లుహారీతవచనము "మార్జనార్చనబలికర్మభోజనాని దేవతీ
ర్థేన"యనిమార్జనము నర్చనము బలికర్మయు భోజనమును దేవ తీర్థము
చే జేయవలెననుట - బ్రాహ్మమందు - "బ్రహ్మాంగలగ్నం విప్రేభ్యోవైష్ణవంచ
ప్రదీయతే । రుద్రాంగలగ్నమగ్నౌతు దహేత్సర్వంచతత్క్షణాత్ । శిష్టేభ్య
స్త్వథదేవేభ్యో దత్తందీనేషునిక్షిపేత్॥" అనియనగా బ్రాహ్మణ ప్రసాదమును
విష్ణుప్రసాదమును బ్రాహ్మణులకీ వచ్చును - రుద్రప్రసాదమగ్నియందుద్రేల్చ వ
లెను- మరియును శిష్టులకును దేవతలకు సమర్పించిన ద్రవ్యము వారిప్రసాదముగ
దీనులకీవలెనుగాని తానుదినగూడదు - మదన పారిజాతమందుగారుడవచనము
"ధాత్రీఫలేనయత్పుణ్యంజయంత్యా స్సముపోషణే । ఖగేంద్రసలభేన్మర్త్యస్తు
లసీ పూజనేనతత్ ॥" అనగా జయంతినుపవసించి యుసిరికెఫలము భక్షించిన
చో గల్గెడు పుణ్యమోగరుడుడ తులసీపూజచే సిద్ధించు ననుట - నృసింహపురా
ణమందు -"శతపుష్పం బిల్వపత్రంచంపకం తగరంతథా । కరవీరంతథాశ్వేతం
పలాశంకుశపుష్పకం।నవమాలాస్యశోకంచసేమంతీకుబ్జమాలతీ।త్రిసంధ్యంచతథా
శ్వేతంకుందంచశతపత్రకం।మల్లికాచైవజాతీచ సర్వపుష్పాద్విశిష్యతే॥" అనగా

నీపుష్పములు దేవపూజకు ప్రశస్తములు అనగా పెద్దసదాపచెట్టు పువ్వులు - బి ల్వము - సంపంగి - తొగరు - గన్నేరు - మోదుగు - గ్రంధిపర్ణి-నవమాల-విర జాజి - అశోకము-చేమంతి - పొట్టిజాజి-త్రిసంధిపువ్వులు- బొండుమల్లె-తామర - మల్లె- జాజి- యివి-పూజార్హములగు పత్రములునచ్చటనే చెప్పబడినవి- అపా మార్గం భృంగరాజంశమీపత్రంచఖాదిరం । దూర్వాచ కుశపత్రంచచందనం మరుకంతథా । తత్రశ్శ్రేష్ఠం బిల్వపత్రం తతశ్చ తులసీవరా । పల్లవాన్యపిచై షాంస్యుశ్శస్తాన్యర్చావిధౌహరేః । అగస్త్య వృక్షసంభూతైః కుసుమైరసితై స్సితైః । యేచర్చయిష్యంతి దేవేశంతైఃప్రాప్తం వైష్ణవంపదం । తులసీమా లయా విష్ణుః కేతక్యావాపి పూజితః । సమాస్సహస్రం సుప్రీతోభవనే మధు సూదనః॥" అని యనగా-దుచ్చెన - భృంగరాజము-జమ్మి-చండ్ర-దూర్వ- దర్భ- చందనము- మరువకము- వీనిపత్రములునుమంచివి మారేడుపత్రము మిక్కిలిమంచి ది- తులసి యంతకంటె మంచిది- వీనిచిగుళ్లుగూడ విష్ణుపూజకు శుభములు మరి యు నగిసెపువ్వులు తెల్లనివిగాని నల్లనివిగాని పూజించెనేని విష్ణులోకము దొర కును తులసీమాలచే కేతకీమాలచేగాని విష్ణునర్చించెనేని వేయువత్సరములుపూ జించిన ఫలములభించును - ఇకనీశ్వరపూజకు వర్జ్యములు "జపాబంధూక సిం దూరం తథాత్రైసంధికేప్యుభె । నదంతీకేతకీయూధీమాలతీకుట జానివా । ఘుసృణంచకుమారంచ ప్రమాదేనాపి నాచర్చయేత్ ।బర్బరీసజ పత్రాణితథా చకుముదద్వయం॥" అనగా దాసాని-మంకెన-వావిల-వీనిపువ్వులుత్రిసంధిపువ్వులు- రెండువిధములవి-నదంతిపువ్వులు మొగలిపువ్వులు-గులివిందలు-మాలతి-యంకుడు- కుంకుమపువ్వు-ఉలిమిరి-వాలింట-మద్దివీనిపత్రములును రెండువిధములగలువయు గూ డదు - విష్ణురహస్యమందు నిషేధవచనము - "జలంపర్యుషితంత్యాజ్యంపత్రాణికు సుమానిచ । తులస్యగస్త్యబిల్వానిగాంగం వారినదుష్యతి॥" అనియనగాగంగో దకము తప్పదక్కినజలమొకదినముదాటినచో బర్యుషితమనబడునదినిషిద్ధము ఇట్లు తులసి యగిసెపువ్వులుబిల్వముతప్పదక్కినపత్రపుష్పములునుతొలిదినమున దెచ్చిన వి మరునాడుపనికిరావు-తక్కినవిశేషమునిర్ణయసింధువునందునుబూర్తకమలా కరమందును దెలియునది-ఇకదీర్థమహిమ-స్కాందమందు "సాలగ్రామోద్భవోదే వోయత్రిద్వారవతీభవః।ఉభయోస్సాఙ్గతోయేనబ్రహ్మహత్యానివర్తతే॥" అన గాసాలగ్రామమునకు ద్వారకాచక్రమున కభిషేకించి యాతీర్థము గ్రహించె

నేని బ్రహ్మహత్యయైనను బోవును - హేమాద్రిలో లక్షణకాండమందు స్కాం
దవచనము "కుంకుమంచందనం పత్రం నైవేద్యం కుసుమంజలం । సాలగ్రామశి
లాలగ్నం తీర్థకోటి శతాధికం" అనియున్నది అనగా కుంకుమ చందనము పత్ర
ము నైవేద్యము పుష్పము జలమును సాలగ్రామమునందు సమర్పించినది నూరుకో
ట్లతీర్థములకంటె నెక్కుడు పవిత్రము - పాద్మమందు-సస్నాతస్సర్వతీర్థేషు
సర్వయజ్ఞేషుదీక్షితః । సాలగ్రామశిలాతోయైర్యోభిషేకంసమాచరేత్ । గంగా
గోదావరీరేవానద్యోముక్తి ప్రదాస్తుయాః । తావసంతీహ సర్వత్ర సాలగ్రా
మ శిలాజలే॥" అనియనగా సాలగ్రామతీర్థముచే నభిషేక మాడుజనుడు స
ర్వతీర్థములందు స్నానముజేయు ఫలమును సర్వయజ్ఞములను జేసిన ఫలము
నొందును ఏమనిన గంగయు గోదావరియు నర్మద మొదలగు ముక్తి ప్రద
ములగు నదులన్నియు సాలగ్రామ తీర్థమందున్నవి - గౌతమాంబరీష సంవా
దమందు - " యేషాం ధౌతాంఘ్రిగాత్రాణి హరేః పాదోదకేనవై । అం
బరీష గృహే తేషాం దాసోహంవశగస్సదా । హరే స్స్నానావశేషంతు
జలంయస్యోదరేస్థితం । అంబరీష ప్రణమ్యోచ్చైః పాదపాంసుః ప్రగృహ్య
తాం । గర్జంతి తావదన్యాని తీర్థాని భువనత్రయే । యావన్నప్రాప్యతే
తీర్థం సాలగ్రామాభిషేచనం । జన్మప్రభృతిపాపానాం ప్రాయశ్చిత్తం
యదీచ్ఛసి । సాలగ్రామశిలావారి పాపహారి నిషేవ్యతాం॥" అని అనగానో
యంబరీషమహారాజా హరిపాదోదకముచే దడిసిన గాత్రముగలవారి గృహమం
దుదాస్యముజేయుదును హరిపాదోదకము ద్రావినవారికి నమస్కరించి వారి
పాదపరాగము స్వీకరించునది - సాలగ్రామతీర్థము లభించకున్నంతకునితర స
ర్వతీర్థములు గర్వించుట ఆపైనక్కరలేదు జన్మమొదలుగ జేయుపాపములకు
ప్రాయశ్చిత్తముగోరితివేని సాలగ్రామతీర్థమును సేవింపుమనుట - నృసింహపు
రాణమందు - "గంగాప్రయాగగయపుష్కరనైమిశాని పుణ్యానియాని కురు
జాంగలయామునాని । కాలేనతీర్థసలిలంవినిహంతి తేషాంపాదోదకంభగవ
తస్తు పునాతి సద్యః॥ బ్రహ్మచారీ సవ్రతీచ ఆశ్రమీచ సదాశుచిః । విష్ణు పా
దోదకం యస్యముఖేశిరసి విగ్రహే॥" అని యనగా గంగప్రయాగము గయ పు
ష్కరము నైమిశముమొదలగు కురుజాంగలయామున క్షేత్రములందలితీర్థజల
ము చిరకాలముసేవించినచో బవిత్రముజేయును హరిపాదోదకమపుడె పవిత్రము

జేయును విష్ణుపాదోదకమును శిరసునందును ముఖమందును గ్రహించుచో బ్ర
హ్మచారికి వ్రతసాఫల్యమగు గృహస్థునికి సదాశుద్ధి గలుగు ననుట - స్మృత్యర్
థసారమునందు "దేహశ్శుద్ధ్యతిచాప్యాత్మా పీత్వాపాదోదకంహరేః॥ నిత్యేనై
మిత్తికేకామ్యే పీత్వాభుక్త్వాన దుష్యతి॥" అనగా హరిపాదోదకముద్రావినచో
దేహము నాత్మయు శుద్ధినొందును నిత్యనైమిత్తిక కామ్యకర్మలందు విష్ణుపా
దోదకము ద్రావి యనంతరమున భుజించెనేని దోషములేదు - ఇక్కడ కృత్వా
యని పాఠాంతరము అపుడు నిత్యముకామ్యమునైన యేకాదశీ వ్రతాదికమం
దును నైమిత్తికమనగ సాంవత్సరికశ్రాద్ధాదికమందును పాదోదకముద్రావికర్మ
చేసినను దోషములేదని యర్థము - మరియేమనిన - "జలస్యాపినరశ్రేష్ఠప్రా
శనాదౌషధాదృతే । నిత్యక్రియానివర్తేత కామ్యానైమిత్తికైస్సహ॥" యని కాళి
కాపురాణములో నున్నందున ననగా నౌషధము తప్పతక్కిన జలపానమైనను జే
సినచో నిత్యనైమిత్తిక కామ్యములు చెడుననియున్నందునను "అభుక్తేభుక్తవత్తో
యం॥" అని యనగ జలముద్రావినచో భుజించినట్లేయని నిషేధమున్నందునను తీ
ర్థపారణజేసి కర్మయెట్లు చేయుటయనిన సామాన్యనిషేధము విశేషవిధిచే
బాధింపబడును - మరియును రాగప్రాప్తమైన జలపానము నిషేధించుటచేనిషే
ధము సఫలమగును గనుక తీర్థపానవిధినిగూడ బాధింపజాలదుమరియును "విష్ణ్వ
ర్చాయాం శిలాధీర్గురుషునరమతిర్వైష్ణవేజాతిబుద్ధిర్విష్ణోర్వావైష్ణవానాం కలి
మలమథనేపాద తీర్థేంబు బుద్ధిః । విష్ణోస్తన్నామ్ని మంత్రేసకలకలుషహే శబ్ద
సామాన్యబుద్ధిర్విష్ణౌసర్వేశ్వరేశే తదితరసమధీర్యస్యవా నారకీసః॥" అని యన
గా భగవంతుని యర్చావిగ్రహమందు శిలాబుద్ధియుమంత్రమునుపదేశించిన గురు
వులందు మనుష్యులేయను బుద్ధియు విష్ణుభక్తునియందు జాతితారతమ్యబుద్ధియు
విష్ణుని యొక్కగాని తద్భక్తుల యొక్కగాని కలిమలము హరించుపాద తీర్థ
మందు నీళ్లనియెడు బుద్ధియు సకలపాపములు హరించుభగవంతుని నామమందు
గాని మంత్రమందుగాని శబ్దసామాన్యములో నిదియనుబుద్ధియు సర్వేశ్వరుడైన
విష్ణునందితరసామ్యబుద్ధియు గలుగువాడు నరకపాతమునందునని నిషేధమున్నం
దున తీర్థపానము జలపానమేయనిన ప్రత్యవాయముగూడ సంభవించును- ఇ
ట్లుతీర్థపారణము పూజాంతమందును గావచ్చును అదియుత్తరాంగముగదా-
కాబట్టి యుపవాసదినమందును కర్మకు బూర్వమందును తీర్థము గ్రహింపని

వారు భ్రాంతులు - "అశితాన శితాహ్యాపో జలేనైవతుపారయేత్॥" అని యనగా జలపానము భోజనాభోజనరూపము గనుక దానిచే గర్మసమాప్తి జేయవచ్చునని విధిగనబడుచున్న దని విష్ణువాజపేయులు చెప్పిరి - గారుడపురాణమందును - "జలంనయేషాంతులసీవిమిశ్రంపాదోదకం చక్రశిలాసముద్భవం।నిత్యంత్రిసంధ్యం ప్లవతేనగాత్రం ఖగేంద్రతె ధర్మబహిష్కృతానరాః॥" అనియున్నది అనగా నిత్యము మూడు సంధ్యలందును స్నానముచేయక సాలగ్రామ శిలాచక్రమందలి తులసీ మిశ్రమైనపాదోదకమును గ్రహింపనివారు ధర్మమున కనహర్హులై చెడుదురనుట - ఆహ్నికప్రదీపమందు - "సూతకేమృతకేవాపి ఆశౌచం నైవవిద్యతె । యేషాంపాదోదకంమూర్ధ్నిః ప్రాశనం యేచకుర్వతె" అనియున్నది - అనగావిష్ణుపాదోదకమును ద్రావి శిరస్సునందు ధరించువారికి జాతాశౌచమృతాశౌచములు సహితములేవు అనగా నట్టి శుద్ధిగలుగు ననుట. "అంతకాలేపి యస్యేహ దీయతె పాదయోర్జలం । సోపి సద్గతిమాప్నోతిపాపాచారో బహిష్కృతః। భుక్త్వాపీత్వాపిశుద్ధస్స్యాత్పీత్వాపాదోదకంహరేః" అనియు నున్నది అనగా పాపాచరణముచే జాతిభ్రష్టుడైనవానికినంత కాలమందైనను హరిపాదోదకము దొరికెనేని సద్గతినొందును అభక్ష్యము భక్షించియు నపేయముద్రావియు హరిపాదోదకము ద్రావెనేని శుద్ధుడగుననుట - స్కాందమందు శివవచనము - "దృష్టిపూతంతుయత్తోయంవిష్ణునాప్రభవిష్ణునా।తద్వై పాపహరం పుత్ర కింపునః పాదయోర్జలం॥" అనియనగావిష్ణునివేదింపబడియాయనదృష్టిచే బవిత్రమైన జలమేసర్వపాపముల నణచును సాక్షాత్తుగా నాతనిపాదోదకము పాపహరమని చెప్పవలెనా - యనుట-విష్ణురహస్యమందు- "విష్ణుపాదోదకంపీత్వా పశ్చాద శుచిశంకయా । యశ్చాచామతి సంమోహాః ద్బ్రహ్మహత్యాంస విందతి॥" అనియున్నది అనగా హరిపాదతీర్థముద్రావి యాచమింపనిచోనశుచినగుదు నను సంశయముచే నాచమనముజేయునజ్ఞుడు బ్రహ్మహత్య నొందుననుట - గారుడమందును - "పాదోదకంపిబేన్నిత్యం నైవేద్యం భక్షయేద్ధరేః । శేషంచ మస్తకేధార్య మితివేదాను శాసనం॥" అనియున్నది అనగా నిత్యముహరిపాదోదకము ద్రావిహరినైవేద్యము భక్షించి శేషమును శిరసునందు ధరింపవలెనని వేదముశాసించుననుట - మరియును "సాలగ్రామ శిలాతోయమపీత్వాయస్తుమస్తకె । ప్రక్షేపణం ప్రకుర్వీత బ్రహ్మహాః సనిగద్యతె। సాల

గ్రామశిలాతోయంపిబేత్సోమకరేణతు । అజ్ఞానాద్దైందవం ప్రోక్తం జ్ఞానాదబ్దం సమాచరేత్ । విష్ణోః పాదోదకం పీత్వా కోటిజన్మాఘనాశనం । తదేవాష్ట గుణంపాపం భూమౌ బిందునిపాతనాత్॥" అని యనగా సాలగ్రామతీర్థము నుద్రావకమున్ను శిరస్సునధరించెనేని బ్రహ్మహత్యాదోషము నొందును - సాలగ్రామతీర్థము నెడమ హస్తముచే గ్రహించెనేని నబుద్ధి పూర్వకమైనచో జాంద్రాయణము జ్ఞానపూర్వకమైనచో నొకవత్సరము చేయవలెను హరిపాదోదకముద్రావినచో గోటిజన్మముల పాపము నశించును - త్రాగునపుడు భూమియందొకబిందువైనబడినచో దానికెనిమిదిరెట్టులుపాపముసంభవించుననుట- భక్తిచంద్రోదయమందును - "ఆయసేచతథాకాంస్యే కాష్ఠే వాలాబుకేతథా । ఉద్ధృత్యపాదసలిలం మద్యతుల్యం వినిర్దిశేత్ । శ్రీవిష్ణోః పాదసలిలం కరే కృత్వా ముఖేక్షిపేత్ । అదత్వా పిబతేతోయం రౌరవం నరకం వ్రజేత్॥" అని యున్నది యనగానినుపపాత్రకంచుపాత్ర కర్రపాత్ర యానబగాయడొక్క వీనిలో సాలగ్రామ తీర్థముగ్రహించెనేని మద్యతుల్య మగును - కనుక హస్తమందుంచి త్రాగవలెను మరియును విష్వక్సేనాదులకు మున్నిచ్చి త్రాగవలెనుగానిచో రౌరవనరకమునొందుననుట- గ్రహణమంత్రము హలాయుధమందున్నది - "అకాలమృత్యుహరణం సర్వవ్యాధి నివారణం । విష్ణోఃపాదోదకంపీత్వాశిరసాధారయామ్యహం॥" అని మరియు హేమాద్రిలో మాధవీయములోను స్కాందవచనము "ఏకాదశ్యాముపోష్యాథ యోశ్నాతిద్వాదశీ దినే । నైవేద్యం తులసీమిశ్రం హత్యాకోటివినాశనం॥" అని యనగా నేకాదశి యందుపవసించి ద్వాదశి యందు దులసిగలసిన నైవేద్యముభక్షించెనేని కోటిహత్యలు నశించుననుట- ఇక శ్రీదత్తీయమందు జెప్పినదిమాత్రమనభిమతముఏమనిన- "హుత్వాభక్షయంతి"యనునట్లునివేదనమునకును భక్షణమునకు సమానకర్తృకత్వమనగా నివేదన జేసినవారె భుజింపవలెననియున్నది అన్యుడు నివేదనజేసినద్రవ్యమందు దనకు స్వత్వములేదుగదా - మరియును "దేవద్రవ్యం గురుద్రవ్యం యత్నేన పరి వర్జయేత్॥" అని నిషిద్ధము దేవద్రవ్య స్వీకారము మరియు "స్పృష్ట్వాదేవలకంచైవస వాసాజలమావిశేత్॥" అనియును "స్పృష్ట్వాయూపందివాకీర్తిం దేవద్రవ్యోపజీవినం । సవాసాజలమావిశ్య ఘృతం ప్రాశ్య విశుద్ధ్యతి॥" యనియు దేవార్చకుని స్పృశించుటకే నిషేధమున్నది - అనగా యూపస్తంభమును మంగలి

వానిని పూజారిని స్పృశించెనేని సచేలస్నానముజేసి ఘృతము భక్షించినచో శు
ద్ధుడగుననుట - తక్కినది శేషమునే జేసినయాచారదీపమునందు దెలియునది—
ఇకశూద్రునికి వైశ్వదేవము - అందుశంఖవచనము - "పంచయజ్ఞవిధానంతు
గృహీనిత్యం నహాపయేత్॥" అని యనగా గృహస్థుడు నిత్యము పంచయజ్ఞము
లాచరించుటవిడువగూడదనుట యమవచనము "బ్రహ్మయజ్ఞో దేవయజ్ఞః పితృ
యజ్ఞస్తథైవచ । భూతయజ్ఞోన్యయజ్ఞశ్చ పంచయజ్ఞాః ప్రకీర్తితాః ॥" అని-
అదియును లౌకికాగ్నియందు జేయునది- వివాహాగ్నియందాచారమనివిజ్ఞానేశ్వ
రుడు - కనుకనేతంత్రరత్నమందు స్థపతీష్టి లౌకికాగ్నియందుజెప్పబడినది- కనుక
లౌకికాగ్నియందైనను శూద్రునకుగాదని చెప్పువారు భ్రాంతులు - ఇట్లు విజ్ఞా
నేశ్వరు డపరార్కుడు మేధాతిథిమొదలగు వారంద్రు - అదియును పాకముజే
సిన యగ్నియందె కావలెను - "గృహ్యాగ్నౌతుపచే దన్నం లౌకికే వాపి ని
త్యశః । యస్మిన్నగ్నౌప చేదన్నం తస్మిన్ హోమోవిధీయతే॥" యనిమనువచ
నము - అనగావివాహాగ్నియందుగాని లౌకికాగ్నియందుగాని పాకముజేయునది
పాకముజేసిన యగ్నియందే హోమము జేయవలెననుట-సంభవింపనియెడ- శా
తాతప వచనము - "లౌకికేవైదికే వాపిహుత్వోత్సృష్టేజలేక్షితౌ । వైశ్వదే
వస్తు కర్తవ్యః పంచసూనాప నుత్తయే॥" అనియనగా "ఖండనీపేషణీచుల్లీ ఉద
కుంభీచ మార్జనీ"అను నైదు హింసాస్థానముల పాపము బోవుటకు లౌకికాగ్ని
యందుగాని వైదికాగ్నియందుగాని హోమముజేసి శేషముచే శుద్ధభూమియం
దు బలియిచ్చి వైశ్వదేవము చేయునది యనుట - అదియుపక్వమైన యన్నము
చే గూడ జేయవచ్చును స్థపతీష్టివలెనే అట్లుగానిచో దానికి గూడ నామాన్నమే
కావలయునని కొందరంద్రు-స్మార్తగౌడులుమాత్రము "పక్వముచ్ఛిష్టముచ్యతే"
యని నిషేధమున్నందున నామద్రవ్యముచేతనే కావలెనంద్రు - అపుడు వైశ్వ
దేవమందు నానాప్రకారములు మన్వాదులచేజెప్పబడినవి-అందు మనుస్మృతిలో
జెప్పినది యగ్నిలేని ద్విజునికని తెలియునది - అతనికి గృహ్యాగ్నిలేనందున కాతీ
యసూత్రోక్తమం దధికారములేదని స్మృతికౌముదీకారుడు చెప్పును- అదిచింత్య
ము - నిరగ్నికి శాకలమంత్రములచే హోమాదికము చెప్పబడినది - అట్లు మద
న పారిజాతమందు వసిష్ఠవచనము - "అనగ్నికస్తుయో విప్రస్సోన్నం వ్యాహృతి
భిస్స్వయం। హుత్వాశాకలమంత్రైస్తు శేషాద్భూత బలింహరేత్॥" అనియన

గా నగ్నిహీనుడైన విప్రుడు స్వయముగ నన్నము వ్యాహృతులచే వేల్చి శాకల మంత్రములచే శేషాన్నమున భూతబలినీవలెననుట - శాకల మంత్రములనగా “దేవకృతస్యైనసో” యనునారును - శూద్రునికిగూడ మీదజెప్పినట్లు కాతీయ కర్మ చెప్పబడినందున నీదేవతానామముచే హోమముగాని మనూక్తముగాదు- శూద్రునికి వేదము వినుటలేనందున నాకర్మయం దధికారములేదుకదా - కను క వైశ్వదేవము విధింపకుండెడు కఠశాఖ మొదలగుదానియందు మనూక్తమని తెలియునది - లేదా శూద్రులకు బురాణశ్రవణమం దధికారమున్నందున బురాణములో జెప్పిన వైశ్వదేవమే వారిచే జేయబడవలెను - ఎట్లనిన మార్కండేయ పురాణమందు “తతస్సంపూజ్య మేద్వహ్నిం దద్యాచ్చైవాహుతీః క్రమాత్। ప్రథమాంబ్రహ్మణేదద్యా త్ప్రజానాం పతయేతతః । తృతీయాం చైవ గృహ్యేభ్యః కశ్యపాయతథాపరాం । తతోనుమతయె దద్యాద్దద్యాద్గృహబలింతతః । పర్జన్యాంభోధరిత్రీణాం దద్యాత్తు మణికేత్రయం । వాయవేప్రతి దిగ్భ్యశ్చ దిగ్భ్యః ప్రాచ్యాదితఃక్రమాత్ । బ్రహ్మణేచాంతరిక్షాయ సూర్యాయచ యథాక్రమం । విశ్వేభ్యశ్చైవదేవేభ్యో విశ్వభూతేభ్యఏవచ । ఉషసేభూతపతయె దద్యాచ్చోత్తరత స్తతః । స్వధానమ ఇత్యుక్త్వాపితృభ్యశ్చాపిదక్షిణే । కృత్వాపసవ్యం వాయవ్యాంయక్ష్మైతత్రావనేజనం । తతస్తోయము పాదాయతేషాం నామ్నాక్షి పేద్బుధః॥” అనియనగా నటుపైని వహ్నిని బూజించి క్రమముగ నాహుతు లీవలెను ఎట్లనిన మొదట బ్రహ్మనటుపైని ప్రజాపతికి నాపై గృహ్యదేవతలకు ననంతరమున గశ్యపునికి నావెనుక ననుమతికి నీవలెను - ఆపై గృహబలినీవలెను పర్జన్యునికి జలదేవతకు భూమికిని మధ్య మందీవలెను - వాయువునకు ప్రతిదిక్కులకు దిక్కులకు ప్రాచ్యాదిక్రమముగ నీవలెను బ్రహ్మకు నంతరిక్షమునకు సూర్యునికిని విశ్వే దేవులకు విశ్వభూతములకు ఉషస్సునకు భూతపతికి నుత్తరమందును స్వధానమయని పితృదేవతలకు దక్షిణమందు నప సవ్యముతోనిచ్చి వాయవ్యమందు యక్ష్మదేవతకవనేజనము ఆపైనుదకము గ్రహించి వారినామములచే భూమియందు జల్లవలెను - విష్ణుపురాణమందు నిట్లుహోమము జెప్పి బలిలో విశేషము చెప్పబడినది “తచ్చేషంమణికే పృథ్వీపర్జన్యాద్భ్యః క్షిపేత్తతః । ద్వారేధా తుర్విధాతుశ్చమధ్యేచ బ్రహ్మణః క్షిపేత్ । ఇంద్రాయ

ధర్మరాజాయవరుణాయ తథేందవే । ప్రాచ్యాదిషు బుధోదద్యాద్ధుత శేషా
త్మకంబలిం । ప్రాగుత్తరేచదిగ్భాగే ధన్వంతరి బలింవిదుః । వాయవ్యే వాయ
వేదిక్షు సమస్తా సుతతో దిశాం । బ్రహ్మణేచాంతరిక్షాయ భానవే చక్షిపేద్బ
లిం । విశ్వేదేవాన్విశ్వభూతాం స్తతో విశ్వపతీన్పితౄన్ । యక్ష్మాణంచ స
ముద్దిశ్య బలిందద్యాన్నరేశ్వర।" అనికాతీయ సూత్రమందు నిట్లనె బలి హరణ
ము కించిన్న్యూనముగ జెప్పబడినది - కనుకశూద్రున కీవిధియే యుక్తము - అ
పుడు "స్వాహాకారోనమస్కారో మంత్రశ్శూద్రేవిధీయతే" యని భారతమందున్నం
దున హోమమందుస్వాహాశబ్దముబలియందునమశ్శబ్దమునని స్మృతికౌముదిఅదియు
క్తముగాదు "నమస్కారేణ మంత్రేణ" యనివిశేషవచనమున్నది - అట్టిబలిదా
నము గృహప్రదేశములందె చేయవలెను - లేదా అగ్నికి వెనుకభాగమందైనను
జేయవలెను - ఇకప్రయోగము - దర్భలు ధరించి యాచమించి ప్రాణాయామ
ముజేసి దేశకాలముల గీర్తించి "పంచసూనాపనుత్తయెపరమేశ్వర ప్రీత్యర్థం
వైశ్వదేవం కరిష్యే" యని సంకల్పించిస్థండిలమునలికితుడిచియంగుష్ఠానామికలచే
మృత్తికద్రవ్వి ప్రోక్షించి లౌకికాగ్ని బ్రతిష్ఠించి "అగ్నయేనమః-ముఖంయస్సర్వదే
వానాం హవ్యభుక్కవ్యభుక్తథా । పితౄణాంచ నమస్తస్మై విష్ణవే పావ
కాత్మనే" యనిపూజించి చుట్టును బ్రోక్షించియగ్నియందు చరువును వండి గాని
గృహపాకాన్నముచేగానియాజ్యముగలపినతండులములచేగానిపల్లచేగాని చేయ
వలెను-అట్టిద్రవ్యమగ్నియందుంచితీసిఘృతముగలపిహస్తముచే వ్రేల్చవలెను-ఆహు
తిపరిమాణము వ్రేళ్లపంద్రెండుగుంపులనిండననగా గోణిదెడుగానియుసిరికెకాయ
పరిమితిగాని వ్రేల్చునదిఎట్లనిన "అగ్నయేనమః-ఇదమగ్నయెనమమ" యనిత్యాగము-
ఈచొప్పున "వాయవే-సూర్యాయ-ప్రజాపతయె-అగ్నయె-బ్రహ్మణె" యిట్లారును
వ్రేల్చునది-యిదిశాకలప్రయోగము - యికబౌరాణము - "బ్రహ్మణె-ప్రజాపత
యె - గృహ్యేభ్యః - కశ్యపాయ - అనుమతయె - విశ్వేభ్యోదేవేభ్యః - అ
గ్నయెస్విష్టకృతె" - అని - ఆపైనిచుట్టునుబ్రోక్షించి- విభూతిధరించినమస్క
రించునది- విజ్ఞానేశ్వరమతమందు "దేవతాభ్యః పితృభ్యశ్చమహాయోగిభ్యఏవచ।న
మస్స్వధాయైస్వాహాయైనిత్యమేవనమోనమః॥" అనుమంత్రముచే నొకమారు
హోమము - నమః అనుమంత్రముచే నొకమారు హోమము - నమః అనుమం
త్రముచేతనే హోమమని కొందరు - మదన పారిజాతమందు పరిశిష్టవచనము.

"శాకంవా యదివాపత్రంమూలంవాయది వాఫలం । సంకల్పయేద్యదాహారేతే
నాగ్నౌజుహుయాదపి॥" అనియున్నది అనగా కూరగాని యాకుగాని మూలము
గాని ఫలముగాని తనకాహారముగ నిశ్చయించుకొన్న వస్తువును హోమము చే
యునది - యనుట - వ్యాసవచనము -"జుహుయాత్సర్పిషాభ్యక్తం తైలక్షారవివ
ర్జితం । దధ్యక్తంపయసాభ్యక్తంతదభావేంభసాపివా॥" అనియనగా నూనె
యుక్షారము లేకుండగ నేతితోనైనను పెరుగుతో పాలతోనైనను దొరకనిచో
నుదకముతోనైనగలపి హోమముజేయునది - యని - చతుర్వింశతి మతమందు -
"అలాభేయేనకేనాపిఫల శాకోదకాదిభిః। పయోదధిఘృతైఃకుర్యాద్వైశ్వదేవం
స్రువేణతు । హస్తేనాన్నాదిభిః కుర్యాదద్భిరంజలి నాజలే॥" అనగా నసంభ
వమందు ఫలము శాకముజలము మొదలగువానిలో నొకటిచే జేయవచ్చును పా
లుపెరుగు ఘృతము వీనిచే జేయునపుడుస్రువముచే వ్రేల్చవలెను - తండులము
లు మొదలగు నామద్రవ్యముచే జేయునపుడు హస్తముచే జేయవలెను - ఉద
కములనే జేయునపుడు దోసిలిచే జలమందు జేయవలెననుట - ఇట్లు దేవయజ్ఞ
ము - ఇకభూతయజ్ఞము - మధ్యమందు "పర్జన్యాయ నమః - అద్భ్యః - పృ
థివ్యై" ద్వారపార్శ్వములందు"ధాత్రేనమః-ఇదంధాత్రే-విధాత్రే-ప్రతిదిశంవా
యవేప్రతిదిశందిగ్భ్యః-ఇంద్రాయ- ధర్మరాజాయ-వరుణాయ-ఇందవే"-ఈశాన
దిక్కున-"ధన్వంతరయె"వాయవ్యదిక్కున-"వాయవే-బ్రహ్మణెఅంతరిక్షాయ-సూ
ర్యాయ-" ఉత్తరమున-"విశ్వేభ్యోదేవేభ్యోనమః । విశ్వేభ్యోభూతేభ్యోనమః।
భూతానాంపతయేనమః-" ఆపైదక్షిణమందు ప్రాచీనావీతినై - "పితృభ్యస్స్వ
ధానమః - ఇదంపితృభ్యః" జలస్పర్శము - ఇదికాతీయ పక్షము పౌరాణ
మును - స్వధాశబ్దము లేదని కొందరు - పాత్రగడగి వాయవ్యమందుయక్ష్మై
తత్తేయని యుదకము విడుచునది-ఇదంయక్ష్మణెయని త్యాగము - లేదాదేవతా
భ్యఃపితృభ్యశ్చ యనుమంత్రముననె భూమియందు బలి నీవలెను దానిచేతనే
పితృ యజ్ఞమునని కొందరు - ఆచార్య చూడామణిలో మాత్రము ఓంభూ
స్స్వాహాయని విప్రుడు పలుకుచుండ నమోనమయని తానువ్రేల్చ వలెనని- ఇ
ట్లువ్యస్తముగను సమస్తముగను వ్యాహృతి హోమము జేసి"దేవకృత స్యైన
సోవయజనమసిస్వాహా" యనివిప్రుడు పలుకగా-నమయనిహోమము - అని -
యున్నదిగాని-యుక్తము గాదు-"నమస్కారేణమంత్రేణ"యనువిశేషవిధిచేనైదిక

మంత్రమునకుబాధయగును-అగ్నయఇదంఅనిత్యాగముఇట్లారును ఆపైయమునికిస్విష్టకృత్తునకును-భూమియందు విశ్వేభ్యోదేవేభ్యోనమ స్సర్వేభ్యోభూతేభ్యోనమః అనియుదక్షిణమందు "నమఃపితృభ్యోనమ"యనియుఈశానదిక్కున"యస్మైతత్తే" యనియు పౌరాణమంత్రములచేనొకటి"చండాలాదిభ్యోవాయసేభ్య"యనిదక్షిణమందు ధర్మరాజచిత్రగుప్తులకీవలెనని యున్నది - ఆపైశేషము గ్రహించివాకిటప్రోక్షించి- ౧౮-ధన్వంతరయే-౧౦-ప్రాచ్యైదిశే-౫-విధాత్రే-౬-వాయవే-౧౩-ఉదీచ్యై-౨౨-సూర్యాయ౧౪ఇంద్రాయ౯వాయవే-౨౭-విశ్వపతయే-౨౧- అంతరిక్షాయ౪ధాత్రే-౧౭ఇందవే-౨౬భూతపతయే-౨౦బ్రహ్మణే-౧౧దక్షిణా-౧౮వాయవే-౨౫విశ్వేభ్యోభూతేభ్యః౩పృథివ్యై-౭వాయవే-౨౪-౯యక్ష్మణే-౨౩విశ్వేభ్యో-౨అన్యః౧౫ధర్మరాజ-౧౨ప్రతీచ్యై-౧౬పర్జన్యాయ-౨స్వధాపి-౮- వాయవే-పితృభ్యః-౧౫-వరుణాయ-"ద్వౌశ్వానౌశ్యామశబలౌవైవస్వతకులోద్భవౌతాభ్యాంపిండంప్రదాస్యామిస్యాతామేతావహింసకౌశ్వభ్యాంనమ"యనియిచ్చి తిరుగగ్రహించి "ఇంద్రవారుణవాయవ్యాస్సౌమ్యావైనైరృతాస్తథా। వాయసాఃప్రతిగృహ్ణంతు భూమౌపిండంమయార్పితం॥"అని కాకబలినిచ్చి"ఇదం వాయసేభ్య"యనిత్యాగముజెప్పితిరుగగ్రహించివిష్ణుపురాణోక్తమంత్రములచే బలుల నీవలెను- అట్లు-"దేవామనుష్యాఃపశవోవయాంసిసిద్ధాస్సయక్షోరగదైత్యసంఘాః।ప్రేతాఃపిశాచాస్తరవస్సమస్తాయేచాన్నమిచ్ఛంతి మయాప్రదత్తం॥"అనిదేవులుమొదలుగపిశాచులపర్యంతముబలినిచ్చి"ఇదందేవాదిభ్య"యనిత్యాగముచెప్పవలెను- "పిపీలికాఃకీటపతంగకాద్యాబుభుక్షితాఃకర్మనిబంధబద్ధాః।ప్రయాంతుతేతృప్తి మిదంమయాన్నంతేభ్యోవి సృష్టం సుఖినోభవంతు॥" అని చీమలుమొదలగు జంతువులకునిచ్చి "ఇదంపి పీలికాదిభ్యః॥" అనిత్యాగము జెప్పునది - "యేషాంనమాతానపితా నబంధుర్నైవాన్న సిద్ధిర్నతథాన్నమస్తి । తత్తృప్త యేన్నంభువిదత్తమేతత్తేయాంతు తృప్తింముదితాభవంతు॥" అని దిక్కులేనిబంధువులకునిచ్చి"ఇదమనాధబంధుభ్యః॥" అనిత్యజింపవలెను - "భూతానిసర్వాణితథాన్నమేతదహంచవిష్ణుర్నయతోన్యదస్తి। తస్మాదహంభూతనికాయ భూతమన్నం ప్రయచ్ఛామిభవాయతేషాం॥" అని యనగా విష్ణునకంటె వేరుగ సత్తగలదియొకటియు లేనందున భూతములు నన్నము నేనును విష్ణునికి వ్యతిరిక్తముగాము గనుక నట్టిదృష్టి

చే భూతములకన్నిటికి నీయన్నమిచ్చితిని వానికి దృప్తియగుగాకని యిచ్చి "ఇదం
భూతేభ్యః" యని త్యాగము జెప్పునది- "చతుర్విధో భూతగణోయ ఏషతత్రస్థి
తాయేఖిల భూతసంఘాః । తృప్త్యర్థమన్నంహిమయావిసృష్టం తేషామిదం
తేముదితా భవంతు॥" అని యనగా చతుర్విధభూతగణ మందున్న భూతగణ
ములు తృప్తినొందుట కిది యగుగాకయని - యిచ్చి "ఇదంభూతగణాదిభ్యః"
యనిత్యజించునది - "ఇత్యుచ్చార్య నరోదద్యా దన్నం శ్రద్ధాసమన్వితః । భువి
భూతోపకారాయ గృహీసర్వా శ్రయోయతః । శ్వచాండాలవిహంగానాం
భువిదద్యాత్తతోనరః । యేచాన్యేపతితాః కేచి దపుత్రాభువిమానవాః॥" అన
గాగాబట్టిగృహస్థుడుసర్వభూతములకాధారమైనందుననిట్లుచ్చరించికుక్కలు చం
డాలులు పక్షులు మొదలుగ నపుత్రులు పతితులవరకును శ్రద్ధాయుక్తముగబలిని
చ్చి వైశ్వదేవమైన పైని యతిథిప్రతీక్షణము గోవును బితుకునంతకాలము జేయ
వలెను అట్లువచనము "తతోగోదోహ మాత్రంవై కాలంతిష్ఠేద్గృహాంగణే॥"
యని-ఆపైని కృమ్యాదులకు పతితులకు పాపరోగులకు చండాలాదులకు నీవలెన
ని రాగదేవాహ్నికమందున్నది - అట్లు హరిహర భాష్యమందును-అట్టి వైశ్వ
దేవము ద్విజులకు సాయంప్రాతః కాలములందు రెండిటియందు విధింపబడినది
గాని శూద్రులకుమాత్రము పగటియందెకావలెను సాయంకాల మక్కరలేదు ఏ
మనిన పంచయజ్ఞములు మాత్రము విధింపబడినవి గనుక వైశ్వదేవవిధిలేదు-అట్లు
మదనపారిజాతమందు జమదగ్నివచనము "వైశ్వదేవంతథారాత్రౌ కుర్యాద్బలి
హృతింతథా । మహాతః పంచయజ్ఞాంస్తు దివైవేత్యాహ ధర్మవిత్॥" అని
యనగా రాత్రియందు వైశ్వదేవము బలిహరణము కావలెను పంచమహాయజ్ఞ
ములు పగటియందేయని యున్నందున పంచయజ్ఞభిన్నమైన వైశ్వదేవము శూ
ద్రునకు విధింపలేదని తాత్పర్యము - ఇకనిత్యశ్రాద్ధము- అదివేరుగజేసినను జేయ
వచ్చును - "శ్రాద్ధంవా పితృయజ్ఞస్స్యా త్పిత్ర్యో బలి రథాపివా॥" యని ఛందో
గపరిశిష్టవచనము అనగా పితృయజ్ఞమనగ నిత్యశ్రాద్ధమైనను పితృబలియైన గావ
చ్చుననుట - మనువచనము - "ఏకమప్యాశయేద్విప్రం షణ్ణామప్య న్వహం
గృహీ॥" అనగా పితృవర్గము మాతామహ వర్గము నీయారుగురి నుద్దేశించి
యొకవిప్రునికైన నిత్యముభోజనము పెట్టవలెననుట - ప్రచేతోవచనము-"నామం
త్రణం నహోమశ్చ నావాహన విసర్జనే । నపిండదానం నసురా న్నిత్యే కు

ర్యాద్ద్విజోత్తమః॥" అట్లు వ్యాసవచనము - "నావాహనంస్వధాకారఃపిండా
గ్నౌకరణాదికం । బ్రహ్మచర్యాది నియమో విశ్వేదేవా స్తథైవచ । తత్తత్ష
ట్పురుషంజ్ఞేయం దక్షిణా పిండవర్జితం॥" అని యనగా నిత్య శ్రాద్ధమందు నా
వాహనము స్వధాకారము పిండదానము నగ్నౌకరణాదులును బ్రహ్మ చర్యము
మొదలగు నియమములు నక్కరలేదు విశ్వేదేవరహితముగ నాగురు పితరుల
నుద్దేశించిచేయునది దక్షిణయిచ్చుటవైకల్పికము ఏమనిన "కించిద్దత్వావిసర్జయే
త్॥" అని ప్రచేతసువచనమున్నది - అనగా నిషేధవిధులకు పరస్పరబాధకత్వ
ములేనందున వికల్పము ఫలించుననుట - ఇకప్రయోగము - ఆచమించి దేశకా
లములస్మరించి నిత్యశ్రాద్ధంకరిష్యేయని సంకల్పించి "అస్మత్పితృపితామహ ప్రపి
తామహానాంకాశ్యప గోత్రాణాంఅముకదాసానాం మాతామహ ప్రమాతామ
హవృద్ధప్రమాతామహానాం సపత్నీకానాంస్థానేక్షణః కర్తవ్యః॥" అని క్షణమి
చ్చి "పిత్రాదయోమాతామహాదయశ్చఇదంవఃపాద్యం" అని పాదప్రక్షాలనో
దకమిచ్చి యాచమించి యుత్తరాభిముఖుడై దర్భాసనమున గూరుచుండిపితౄ
ణాం మాతామహానాంచేదమాసన మని యాసనమును పిత్ర్యేక్షణఃక్రియతాం
ప్రాప్నోతు భవాన్॥" అని ప్రాప్నవానియని విప్రుడుపలుకగా పితరో మాతా
మహాశ్చైషవో గంధః ఇమాని-పుష్పాణి - ధూపః - దీపః - ఆచ్ఛాదనంచ
యని యన్నియు నిచ్చి పూర్ణతను బలికించి ద్విగుణముగా నామద్రవ్యము వడ్డిం
చి ప్రోక్షించి పాత్రము ముట్టితిలలజల్లి యన్నమందు విప్రునంగుష్ఠముంచి "పితరఇ
దంవ ఆమాన్నం ద్విగుణంసమంవాసోపస్కరంగ మేయంభాగదాధరోవిప్రః
బ్రహ్మరూపమిదం పితృభ్యః కాశ్యపగోత్రేభ్యోఽముకదాసేభ్యోవసు రుద్రాది
త్యస్వరూపేభ్యస్తథామాతామహాదిభ్యశ్చేదమామం స్వధాసంపద్యతాం నమః।
దత్తమక్షయ్యమస్తుబ్రహ్మార్పణమస్తు-మధుమధుమధు"అనియుచ్చరించి "సుప్రోక్షి
తమస్తు శివాఆపస్సంతు సౌమనస్యమస్తు అక్షతంచారిష్టంచాస్తు దీర్ఘ మాయు
శ్శ్రేయః పితరస్స్వస్తీతి బ్రూతపితౄణాం యద్దత్తం తదక్షయ్యమస్తు"అని-ద
క్షిణవైకల్పికము ఇట్లు శ్రాద్ధముచేయలేని యెడపితృబలి చేతనే నిత్యశ్రాద్ధసిద్ధియ
గును ఇట్లునిత్యశ్రాద్ధము - ఇక మనుష్యయజ్ఞము- అందుహారీతవచనము - "స
ర్వా అస్యదేవతా గృహానాగచ్ఛంతి యస్యైవం బ్రాహ్మణోవిద్వాన్గృహ మ
ధ్యాతి తమభ్యుపతిష్ఠతః ప్రాణదేవతా ఉపశమంతి॥" అని యనగా నిట్లు వి

హ్యాంసుడను బ్రాహ్మణుఁడతిథిగవచ్చెనేని సర్వదేవతలితని గృహమందుండుదుర
నియు నతనికి బ్రహ్మస్థానాది సత్కారముజేసెనేని ప్రాణదేవతలు సుఖింతుర
నుట - బృహస్పతివచనము - "ప్రీయతే స్వాగతేనాగ్ని రాసనేన శతక్రతుః।
పితరః పాదశౌచేన భోజనేనప్రజాపతిః॥" అనియనగా నతిథికి శుభాగమనమడి
గనేని నగ్నిప్రీతియగును నాసన మిచ్చెనేని నింద్రుడును పాదప్రక్షాళనము జేసిన
పితృదేవతలును భోజనమిడినచో ప్రజాపతియును సంతుష్టులగుదురనుట- యాజ్ఞ
వల్క్యవచనము - "అధ్వనీనోతిథిర్జ్ఞేయ శ్శ్రోత్రియోవేదపారగః। మాన్యా
వేతౌ గృహస్థస్య బ్రహ్మలోకమభీప్సతః। అతిథింశ్రోత్రియం తృప్త మాసీమాం
తమనువ్రజేత్॥" అని యనగా మార్గవశముచే వచ్చిన విప్రుఁడతిథియును వేద
పారము జూచిన శ్రోత్రియుడును గృహస్థునికి బూజింపదగువారు భుజించిన పై
ని సీమాంతమువరకును దిగబెట్టవలెను అట్లు పూజించిన బ్రహ్మలోకము నొందు
ననుట - యమస్మృతి-"నపృచ్ఛేద్గోత్రచరణం దేశం నామకులం శ్రుతం। అధ్వ
నోభ్యాగతం విప్రంభోజనార్థముపస్థితం॥" అని యనగామార్గవశముచేదన
యింటికి భోజనార్థమైవచ్చి నవిప్రునికులము నామము విద్యయుగోత్రము శాఖ
యు నెద్దియునడుగగూడదుభోజనముపెట్టవలెననుట - విష్ణుపురాణము-"దివేఽ
తిథౌతువిముఖేగతేయత్పాతకం నృణాం। తదేవాష్టగుణంపుంసాం సూర్యో
ఢేవిముఖేగతే॥"అని యనగాపగటియందు వచ్చిన యతిథికి భోజనమీకున్నగలుగు
పాతకమునకు నెనిమిది రెట్టులుగా రాత్రివచ్చునతిథికి నన్నమీనిచో బాపమగున
నుట-కాబట్టియతిథినిబ్రతీక్షించిపాదములగడగిపూజించియామాన్నము సమర్పించి
కస్మైచిద్విప్రాయెదమనిగాని సనకాదిమనుష్యేభ్యఇదం అనిగాని త్యాగముచే
యునది- ఇది నిత్యశ్రాద్ధమునకుమన్నెయని హరిహరుడు - విష్ణుపురాణమందు-
"ఇష్టోవాయదివాద్వేష్యోమూర్ఖఃపండిత ఏవవా। సంప్రాప్తోవైశ్వ దేవాంతె
సోతిథిస్స్వర్గసంక్రమః॥" అనగామిత్రుడుగానిశత్రుడుగాని మూర్ఖుఁడుగాని
పండితుడుగాని వైశ్వదేవాంతసమయమున భోజనార్థమై తనయింటికి వచ్చిన
యతిథిస్వర్గమునకు సోపానమని తెలియునది - యనుట - ఆపైని గోగ్రాస
ము-మదనపారిజాతమందు ఋశ్యశృంగవచనము - "గవాంగ్రాసంచ కుర్వీత ని
త్యమేవసమాహితః। గవాంకండూయనం స్పర్శం గ్రాసమాహ్నికమేవచ"
అని యనగా నిత్యము గోవులకు గోకుట నిమురుట తృణగ్రాసముగాని యహో

రాత్రములకు దగినయాహారముగాని యీవలెననుట - గ్రాసదాన మంత్రము -
"సౌరభేయ్య స్సర్వహితాః పవిత్రాః పాపనాశనాః। ప్రతిగృహ్ణాంత్విమంగ్రా
సంగావ స్త్రైలోక్యమాతరః । సురభిత్వం జగన్మాతర్దేవి విష్ణుపదస్థితా ।
గ్రాసంగృహాణ మద్దత్తం గోమాతస్త్రాతుమర్హసి" యని- శ్రీదత్తీయములో భ
విష్యవచనము "తృణోదకేన సంయుక్తం ప్రదద్యాచ్చ గవాహ్నికం। కపిలాశ
తదానస్య ఫలంవిందే న్నసంశయః॥" అని అనగాతృణోదకములతో గలసినయా
హారము గోవున కహెూరాత్రులకు సరిపడునది యిచ్చినచో గపిలగోవుల నూరి
టిదానముజేసిన ఫలమొందుననుట - అపుడు మంత్రము- "పంచభూత శివే పు
ణ్యేపవిత్రే సూర్యసంభవే । ప్రతీచ్ఛేమంమయాదత్తం సౌరభేయినమోస్తుతే॥"
అని-ఇకభోజనము - బాలవృద్ధాతుర గర్భిణీసఖీ బాంధవాదుల భుజింపజేసికా
లుసేతులు గడిగికొని రెండుమారు లాచమించి శుద్ధప్రదేశమందు నేకాంతమున-
"చతురశ్రంత్రికోణంచ వర్తులంచార్ధచంద్రకం।కర్తవ్యమానుపూర్వ్యేణబ్రా
హ్మణాదిషు మండలం" అనివ్యాసవచనమున నర్ధచంద్రమండలమును "శూద్రస్యా
భ్యుక్షణంమతం" అనుశంఖవచనమునప్రోక్షణమైననుజేసి "పంచాశత్పలికంకాంస్యం
ద్వ్యధికం భోజనాయవై । గృహస్థైస్తుసదాకార్య మభావే హేమరూప్యయోః"
అనిహేమాద్రిలో నత్రివచనమున్నందున గంచుపళ్లెము మొదలగువానిలో వడ్డిం
చినయన్నమును ప్రాఙ్ముఖుడై గూరుచుండి మౌనము ధరించి యభిఘరించినపైని
బ్రోక్షించి "ధర్మరాజాయనమః-చిత్రాయనమః - చిత్రగుప్తాయనమః- ప్రత్తే
భ్యోనమః" అనిబలిని దక్షిణమందిచ్చి వానిపైజలమువిడిచి జలముద్రాగి దేవతీర్థ
మనగ వ్రేళ్లకొనలతో నంగుష్ఠము గలపి యోరకమైనను నమః అని యుచ్చరిం
పుచునైనను నైదుమారులన్నకబలముల భక్షించి సుఖమగునట్లు భుజింప వలె
ను-ఆదిత్యపురాణమందు "నోచ్ఛిష్టోగ్రాహయేదాజ్యం జగ్ధ్వాశిష్టంనసంత్యజేత్"
అనియనగా నెంగిలిమైభుజింపుచు రెండవహస్తమున నాజ్యమువడ్డించుకొనగూ
డదు - సగముదిని శేషమును భోజన పాత్రలోనుంచగూడదనుట - పులస్త్యవ
చనము "భోజనంతు ననిశ్శేషం కుర్యాత్ప్రాజ్ఞః కథంచన । అన్యత్ర దధిక్షీరా
జ్యక్షౌద్రసక్తుభ్యఏవచ॥" అనియనగా పెరుగు పాలు నేయి తేనె సత్తుపిండితప్ప
దక్కినవస్తువులు నిశ్శేషముగ భుజింప గూడదనుట- వృద్ధమను వచనము "నైకహ

స్తేనచజలంశూద్రేణా వర్జితం పిబేత్॥" అని యనగా నొక్కచేతితో జలము దాగవగూడదు శూద్రుడు వడ్డించినజలము ద్రావగూడదనుట - యనిమొదలగు ద్విజులనియమములు ద్విజులకువలె శూద్రునకు దెలియునది - దేవలవచనము "భుక్త్వోచ్ఛిష్టం సమాదాయ సర్వస్మాత్కించి దాచమన్।ఉచ్ఛిష్టభాగధేయేభ్యస్సో దకేనిర్వపేద్భువి॥" అనగాభోజనమైనపైని కొంచమాచమించుచు భోజన శేషమును గ్రహించి యుచ్ఛిష్టభాగులకొరకు నుదకముతో భూమిపై నుంచవలెను. భోజనాంతమందు దిరుగ జలముద్రావి శేషముభూమిపై విడువవలెనుఅపుడుమంత్రము"రౌరవేఽపుణ్యనిలయే పద్మార్బుద నివాసినాం। అర్థినాముదకందత్తమక్షయ్య ముపతిష్ఠతు" అని- ఆపైనిముఖము హస్తము పాదములుగడిగికొని రెండుమారు లాచమించి కాలిముణుకులు ముట్టుకొని తిరుగ నాచమించి-"అగస్తిరగ్ని బడబానలశ్చభుక్తం మయాన్నం జరయత్వశేషం।సుఖంమమై తత్పరిణామ సంభవంయచ్ఛత్వరోగో మమచాస్తుదేహః । అగస్త్యంకుంభకర్ణంచ శనించబడబానలం । ఆహారపరిపాకార్థం స్మరామి చవృకోదరం॥" అనియనగా నగస్త్యముని బడబాగ్నియు నేనుభుజించిన యన్నము జీర్ణింప జేయుగాక అట్టియన్నరస సుఖము లభించుగాక దేహారోగ్య మిచ్చుగాక అట్లగస్త్యుని కుంభకర్ణుని శనిని బడబాగ్నిని భీమసేనుని నాహారపరిణామమునకు స్మరించెదనని కడుపును స్పృశించునది - తాంబూలము భక్షించి పురాణశ్రవణాదులచే పగలు వెళ్లించవలెను- అటుపైని రాత్రియందనగా రవివారము సంక్రాంతివ్యతీపాతము వైధృతి శ్రాద్ధదినము తత్పూర్వదినము తప్పదక్కిన రాత్రియందు రెండవమారు భుజించి జామురాత్రిగాగా- "అగస్త్యాయనమః మాధవాయనమః - ముచికుందాయనమః - కపిలాయనమః - ఆస్తీకాయనమః-" అని నమస్కరించి తూర్పువైపునగాని దక్షిణమునగాని శిరస్సునుంచుకొని నిద్రించునది - అపుడుస్త్రీకి ఋతుకాలమైనచో మొదటి నాల్గుదినములును పదునొకండు పదుమూడుదినములుతప్పబవారుదినముల మధ్యమున చవితి షష్ఠి అష్టమి చతుర్దశి పూర్ణిమ - అమావాస్య - శ్రాద్ధదినము- తత్పూర్వదినము తప్పదక్కిన తిథులందు శనిరవిమంగళవారములువిడిచి తక్కినవారములందును భరణి - కృత్తిక-ఆర్ద్ర-మఘ-పుబ్బ - విశాఖ -జ్యేష్ఠ- మూల-పూర్వాషాఢ - పూర్వాభాద్రపద-త్రిజన్మ-సంక్రమ-వ్యతీపాత-వైధృతులును వర్జించి సమరాత్రియందుస్త్రీసంగమముజేసి మాత్రమున

కు జెప్పినశుద్ధికి మూడు రెట్టులు శుద్ధిజేసుకొని స్నానముగూడ జేయవలెను- ఇట్లు మీదజెప్పబడినది - ఋతుకాలముదాటినయెడ స్నానముతప్ప దక్కినశుద్ధిగావలెను - ఆపైని నిద్రింపవలెను - ఇట్లునిత్యము చేయునది - ఇట్లుజగద్గురు నారాయణభట్ట సూనుడగు రామకృష్ణభట్టుని పుత్రుడగు కమలాకరునిచే రచింపబడిన శూద్రధర్మమందు శూద్రాహ్నికము ముగిసెను.

శూద్రునికి పార్వణ శ్రాద్ధప్రయోగమెట్లనిన - అది యుపదేశించు గురుని వశమున శాఖాభేదముచే ననేక విధములుగ జేయబడునని మదనపాలుడు చెప్పెను- అదిచింత్యము - అనియమముగ జేయునది ధర్మమగునా - కాదు- కనుక "శూద్రావాజస నేయినః" అనిగూడ గ్రంథమందు దక్షస్మృతి యున్నందు నను హరిహరభాష్యాదులందు నట్లనేచెప్పియున్నందునను నట్లుశిష్టాచారము జరుగుటవలనను మాధ్యందినశాఖచేతనే దాని ప్రయోగము చెప్పబడును - కర్త పూర్వదినమందు మాంసాదిని షిద్ధవస్తువులవిడిచి యొకమారెభోజనముజేసి యాదినమందు ప్రదోషమునగాని మరునాడు ప్రాతఃకాలమునగాని బ్రాహ్మణగృహమునకు వెళ్లి మండలమందతని గూరుచుండబెట్టి సవ్యముతో కుడిమోణుకువంచి "శూద్రః ప్రణతిపూర్వకం" అనువచనమున నమస్కరించి దేశకాలముల స్మరించి "శ్వఃకరిష్యమాణ పార్వణశ్రాద్ధేపిత్రాది త్రయ మాతామహాదిత్రయ విశ్వేదేవార్థం త్వామహం నిమంత్రయె" యనిగాని లేకక్షణమిచ్చి "భవద్భిః క్షణప్రసాదఃకరణీయః" అనిగాని యుచ్చరించి ఫలమైనను తాంబూలమైన నిచ్చియొకనిగానియిద్దరనుగాని విప్రుల నిమంత్రించి "తథానిమంత్రితోస్మి" యనియంగీకారవచనము వారు పలికినపైని "అక్రోధనైశ్శౌచపరైస్సతతం బ్రహ్మవాదిభిః । భవితవ్యం భవద్భిశ్చమయాచ శ్రాద్ధకర్మణి" యనియును పూర్వదినమందైనచో "సర్వాయాస వినిర్ముక్తైః కామక్రోధవివర్జితైః। భవద్భిర్భవితవ్యం నశ్శ్వోభూతేశ్రాద్ధకర్మణి" యనిజపించునది లేదావరించునది - ఆపైనట్లనే యెడమకాలుమణిచి "శ్వఃకరిష్యమాణశ్రాద్ధే పితృస్థానేత్వామహం నిమంత్రయె-" యనిన "నిమంత్రితోస్మియనివిప్రుడనవలెను ఇట్లుపితామహ ప్రపితామహ స్థానములందు నూహించునది- ఇట్లుమాతామహాదిస్థానములందుముగురు-వెరసియారుగురు-విశ్వేదేవస్థానమందు నల్వురు వెరసిపదుగురువిశ్వేదేవార్థమిద్దరైనచో నెనమండ్రగుదురు లేదా-దేవార్థమొకడునుపిత్రాదులకొకడునుమాతామహాదుల కొకడుననిముగురుగావచ్చునులే

చాపితృమాతామహసోదురార్గురికినొకడును దేవార్థమొకడుననియిద్దరేకావచ్చు
నుఅపుడామాన్నము నారువిధములుగ భాగించుట - ఇకగ్రంథాంతరమందుదర్శ
శ్రాద్ధమున మాత్రాదుల మధ్యమం దుద్దేశించి తొమ్మండ్రనియును మాతామహా
దులగూడ నంతమందుద్దేశించి పండ్రెండుగురనియును పక్షభేదము లున్నవి అయి
నను వానికి దేశాచారమునుబట్టి వ్యవస్థను జేసుకొనవలెను - షడ్దైవతమనియెబ
హుగ్రంథసమ్మతము - బొత్తిగాబ్రాహ్మణులు దొరకనియెడ దర్భవటువులనుం
చి ప్రేషప్రత్యుక్తులతో శ్రాద్ధము యథావిధిగజేసి యాయామద్రవ్యమును నావెను
క విప్రునికీవచ్చును - లేదాయగ్నిలో వ్రేల్వవచ్చును- అంతటను "నిమంత్రితోస్మి"
యనియును "అక్రోధనైః" అనియు నుచ్చరించునది - అటుపైనిమరునాడు ప్రాతః
కాలమున శ్రాద్ధస్థలము నలికి సచేలస్నానముజేసి శ్రాద్ధసామగ్రినిగూర్చి పగలా
రు ముహూర్తములనగ పండ్రెండు గడియలకు ద్విజుల బిలచివారికి నిషిద్ధముగా
ని తిథియందు క్షౌరముజేయించి స్నానార్థమైన జలము నూనెయు పిండియు
మొదలగునవి పంపించి మధ్యాహ్నమందు స్నాతులైవారు రాగానేలేచి చే
తులు జోడించి శుభాగమనమె అని యడిగి వారు సుస్వాగతమని పలుకగా
రెండు మారు లాచమించి దేశకాలముల స్మరించి - "అస్మత్పితృ పితామహ
ప్రపితామహానాంకాశ్యపగోత్రాణాంఅముకదాసానాంవసురుద్రాదిత్య రూపా
ణాంపార్వణశ్రాద్ధం సదైవంసపిండంపార్వణవిధినాఽఽమాన్నేనహవిషాసద్యః
కరిష్యే" అని సంకల్పించి గోమూత్రము గోమయముగాని ద్వార సమీపమున
లాడితెడు ప్రదేశములో నుత్తర దక్షిణములందు క్రమముగ జతురశ్రమువర్తు
లమునగు మండలములు చేసి యందు మొదట దేవస్థానమున యవలు దర్భ
లును రెండవపితృస్థానమున దిలలునుంచవలెనని మదనపాలుడు చెప్పెను - ని
జమాలోచించినచో "శూద్రస్యాభ్యుక్షణంమత"మనువచనమున బ్రోక్షించియు
త్తరమండలమున విశ్వేదేవు నిలిపిసవ్యముగా " పురూరవ వార్ద్రవ సంజ్ఞికా
విశ్వేదేవా స్స్వాగతం ॥ " అని సుస్వాగతమని పలికిన పైని "సవ్యంశూద్రా
య" యనువచన మున్నందున మొదట నెడమపాదమునా పైగుడిపాదమును గం
ధపుష్పాదుల బూజించి "పురూరవార్ద్రవ సంజ్ఞికావిశ్వేదేవాఇదంవః పా
ద్యమర్ఘ్యంచ" యని జలమిచ్చి ఇట్లురెండవదేవ విప్రునకునిచ్చి పితృస్థానమంద
పసవ్యముగా "అస్మత్పితః కాశ్యపగోత్రఅముకదాసవసురూప ఇదంతేపాద్యమ

ఘ్యర్ఘంచ" యనిజలమిచ్చి యిట్లుపితామహాదులకు నీవలెను - ఆపైని రెండుమా
రులాచమనముజేసి యాచమించిన విప్రులను దేవార్థమిద్దరను ప్రాఙ్ముఖుల గా
ను "దేవేభ్యోనమ" యనియు "ఇదమాసనమాస్యతా" మనియు వామ మ...సన
ముస్పృశించి దక్షిణముగ విప్రులగూరుచుండబెట్టి ఇట్లుపిత్రాదుల నపసవ్యము
చే నుత్తరాభిముఖులుగా గూర్చుండబెట్టి వారికి తూర్పున మాతామహాదులను
బ్రవేశించ పెట్టునది "శ్రాద్ధారంభేఽవసానేచ పాదశౌచేతథార్చనే । వికిరే
పిండదానేచ ద్విరాచమన మిష్యతే॥" అనగా శ్రాద్ధము మొదటను నంతమునను
పాదక్షాళనముపైని యర్చనమైనపైని వికిరమందు బిండదానమందును రెండే
సీమారులాచమనము అటుపైనిసవ్యముచే గర్భపాత్రను జలముచే బూరించిగం
ధపుష్ప దర్భలు వేసియాజలముచే "అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపి
వా। యస్స్మరేత్పుండరీకాక్షంస బాహ్యాభ్యంతరశ్శుచిః" పుండరీకాక్షాయనమయ
ని శ్రాద్ధార్థమైన ద్రవ్యమునుబ్రోక్షించి "తిలారక్షంత్వసురాన్ దర్భా రక్షం
తు రాక్షసాన్ । పఙ్క్తింవై శ్రోత్రియోరక్షే దతిథిస్సర్వరక్షకః॥" అనియనగా
తిలలసురభయమును దర్భలు రాక్షసభయమును శ్రోత్రియుడు పఙ్క్తిలో పా
పమును నతిథిసర్వపాపమును బోగొట్టుననుట- ఇట్లుచ్చరింపుచుదిలలంతట జల్లి
ప్రతివిప్రునకొక దీపమునీవలెను - "ఆమాన్నాదీనాం పవిత్రతాస్తు" అనవలెను -
కొందరు- "సప్తవ్యాధాదశారణ్యే మృగాఃకాలాంజనేగిరౌ । చక్రవాకా శ్శర
ద్వీపే హంసాస్సరసిమానసే । తేపి జాతాః కురుక్షేత్రేబ్రాహ్మణా వేదపా
రగాః । ప్రస్థితా దీర్ఘమధ్వానంయూయంతేభ్యో వసీదథ । అమూర్తా
నాంచ మూర్తానాం పితౄణాం దీప్తతేజసాం । నమస్యామి సదా తేషాం
ధ్యాయినాం యోగచక్షుషాం । శ్రాద్ధభూమౌ గయాంధ్యాత్వాధ్యాత్వాదే
వం జనార్దనం । వస్వాదీంశ్చపితౄన్ ధ్యాత్వాతతశ్శ్రాద్ధం ప్రవర్తయే"
అనిపఠింతురు - అనగా నివి హరివంశములోశ్లోకములు - మొదటనేడుగురుద
శారణ్యమందువ్యాధులైపుట్టి యాపైనికాలాంజనగిరియందు లేళ్లై శరద్వీపమం
దు చక్రవాకపక్షులై మానస సరస్సునందు హంసలైవారే కురుక్షేత్రమందు వే
దపారము జూచిన బ్రాహ్మణులై సమాధినిష్ఠులై దీర్ఘమైన మోక్షమార్గము
నొందిరి యోపితృదేవతలారా మీరునువారిమార్గము ననుసరింపుడు-మూర్తా
మూర్తరూపులై ధ్యానారూఢతచే యోగదృష్టిగల్గిన వారికి నమస్కరించెద

ను శ్రాద్ధభూమియందుగయను ధ్యానించి జనార్దనుడనగ గదాధరుని స్మరించి వసురుద్రాదిత్యరూపులగు పితృదేవతలదలంచి శ్రాద్ధముజేసెదననుట- అటుపైని నడుముబిగించి యపసవ్యముచే "దేవతాభ్యఃపితృభ్యశ్చమహాయోగిభ్య ఏవచ। నమస్స్వధాయై స్వాహాయై నిత్యమేవనమోనమః॥" అని ముమ్మారుజపించి దేశకాలముల స్మరించి కాశ్యపగోత్రాణామస్మత్పితృ పితామహ ప్రపితామహానామముకదాసానాం తథాకాశ్యపగోత్రాణాం మాతామహ ప్రమాతామహవృద్ధ ప్రమాతామహానామముకదాసానాంసదైవ ముపక్రాంతంపార్వణ శ్రాద్ధ మహంకరిష్యే" యని యడుగగావిప్రులు"కురుష్వ"యన్నపైనికుడికాలుమణిచి"పిత్రాదిత్రయమాతామహాదిత్రయసంబంధినః పురూరవార్ద్రవసంజ్ఞికా విశ్వేదేవా ఇదమాసనంవోనమ"యని తిన్నటిదర్భదళములురెండు తూర్పున క్రమముగనాసనమందీవలెనని ధోండుపద్ధతిలోనున్నది"విశ్వేషాం దేవానా"మని షష్ఠియుక్తముగ దైవేక్షణః క్రియతాం"అనిదర్భదళమిచ్చి తథాయనివిప్రుడు వలికిన ప్రాప్నోతుభవాననగా ప్రాప్నవానియని విప్రుడు పలుకునది - ఇట్లు దేవార్థమైనద్వితీయవిప్రునికిజేసి యాపై నపసవ్యముగ నెడమకాలుమణిచి "కాశ్యపగోత్రాస్మత్పితరముకదాసవసురూపేద మాసనంతే స్వధానమః॥" యని తిలలతో రెండుమణుపుల దర్భలనిచ్చి "పిత్రేక్షణఃక్రియతాం॥" అని మీదజెప్పినట్లు జేయునది-ఇట్లుపితామహాదులందునుమాతామహాదులందును జేయునది-ఆపైనిసవ్యముచే"విశ్వాన్దేవానా వాహయిష్యే॥"యనియడిగి ఆవాహయయనియనుమతించినపైని దేవవిప్రుని హస్తమునంగుష్ఠమందు బట్టుకొని"ఆగచ్ఛంతు మహాభాగావిశ్వే దేవామహాబలాః।యెఅత్రవిహితాశ్శ్రాద్ధే సావధానాభవంతుతే॥" అనివిని "పురూరవాద్రవసంజ్ఞికవిశ్వేదేవాఆగచ్ఛత" యనిపలికిపాదముమొదలుగ శిరసువరకుతిలలుచల్లవలెనని కర్కుడుచెప్పెను- "యవైరన్వవకీర్య"యనిస్మృతియున్నందున యవలుచల్లవలెననియితరులు - ఆపైని హస్తోదకము- ఇట్లు ప్రతిపదార్థమునకు నాపై నపసవ్యముచే "గశ్యపగోత్రాన స్మత్పిత్రాదీ నముకదాసాన్ ఏవంమాతామహాదీంశ్చఆవాహయె"యనియడుగగ నావాహయయనియనుమతించిన పైనిశిరసుమొదలుగ పాదముల వరకును దిలలు చల్లి"అస్మత్పితరముకదాస కాశ్యపగోత్రవసురూపాగచ్ఛ యనియు నిట్లుపితామహరుద్రరూప ప్రపితా మహాదిత్యరూపయనియు నట్లుమాతామహాదులందునుజేసి దేవసమీపమందు సవ్య

ముచే నొకపాత్రయందు రెండుదర్భలుంచి దేవతీర్థముచే "దేవేభ్యోనమ"య
ని జలమును నమయని యవలు గంధపుష్పములు నుంచవలెను ఆపై నపసవ్యము
గ పిత్రుస్థానమున వెండిరాగిమోదుగాకు మొదలగు నారు గానియొకద్రవ్యము
చేతనేచేసినవిగాని పాత్రలారిటియందును రెండేసి దర్భలను దక్షిణాగ్రములుగ
బవిత్రార్థముంచి "అద్భ్యోనమ" యని జలమును "తిలేభ్యోనమ" యని తిలల
ను గంధపుష్పములను జల్లి "అర్ఘ్యపాత్రాణి సంపన్నాని" యని యడిగి "సు
సంపన్నాని" యనినపైని సవ్యముచే దేవవిప్రునిహస్తమందుపాత్రలోదర్భలుం
చి కుడిచేతితో నర్ఘ్యపాత్రబట్టుకొని "పిత్రాదిత్రయమాతామహాదిత్రయసంబం
ధినః పురూరవార్ద్రవ సంజ్ఞక విశ్వేదేవా ఏషవోర్ఘ్యోనమ" యనిగాని "ఇదంవో
అర్ఘ్యంనమః" అని గాని యిచ్చి "అద్భ్యోనమ" యని స్రవించుజలమునభిమం
త్రించియిట్లు రెండవ దేవవిప్రునకును చేసియర్ఘ్యపాత్రమందుపవిత్రాదు లుంచి "వి
శ్వేభ్యోదేవేభ్యస్థానమసి" యనియుత్తరమందు బోరిగిలించునది- కొందరిదిచేయ
రు "న్యుబ్జతాన" యనిధోండుడు చెప్పెను అనగా బోరిగిలించుట లేదనుట- ఆపై
నపసవ్యమున పిత్రువిప్రునిహస్తమునదక్షిణాగ్రముగ పవిత్రముంచి "కాశ్యపగో
త్రాస్మత్పితరముకదాస ఏషతేర్ఘ్య స్స్వధానమః" యని పితృతీర్థమనగనం
గుష్ఠతర్జనీమధ్యమునుండి యిచ్చి "అద్భ్యోనమః" యని సంస్రవముల ననుమం
త్రించి యచట పవిత్రాదులుంచి యిట్లుపితామహప్రపితామహులకు మాతామ
హాదులకు నీవలెను - ఆపైనిపితృపాత్రమందర్ఘ్యోదకస్రావముల నన్నిటిని గ
లపి తండ్రికివామభాగమందు దనకు దక్షిణముగ పితృభ్యస్థానమసియనిబోరిగిలిం
చి దక్షిణపర్యంతముగ గదలింపగూడదు - ఆపైని స్యముచే జలమిచ్చి "విశ్వేదే
వాఏషగంధోవోనమః ఇమాని పుష్పాణివోనమః" అనియిచ్చియిట్లుధూప దీపా
చ్ఛాదన యజ్ఞోపవీతాలంకార తాంబూలములిచ్చిజలమునిచ్చి పిత్రుమందపసవ్య
ముచే "కాశ్యపగోత్రాస్మత్పితరముకదాస ఏషతేగంధోనమః" అని గంధ మిచ్చి
యిట్లు పుష్పధూపదీపాచ్ఛాదన యజ్ఞోపవీతాలంకారములనిచ్చి అట్లుపితామ
హాదులకు నీవలెను - అట్లు మాతామహాదులకుజేసి అర్చనపూర్ణతనుబలికిం
చి బ్రాహ్మణులయెదుట దుడిచి మోదుగాకులు మొదలగువానిచేజేసిన విస్తరు
ల బరచి యెఱ్ఱమృత్తికభస్మము మొదలగువానిచే జుట్టుమండలముగల్పించి "శ్రా
ద్ధీయాదామాన్నాదగ్రంగృహీత్వాగ్నౌ కరిష్యే" యనిపఙ్క్తి- మొదటివిప్రునడిగి

కురుష్వేయని యతడుపలికినపైని సవ్యముచే నతని హస్తమందుఁబ్రోక్షించి దర్భ
లబరచి యవదానము విధమున రెండుమారులు బియ్యముదీసి "అగ్నయేకవ్య వా
హనాయనమః॥" అని వ్రేల్చి "ఇదమగ్నయేకవ్యవాహనాయనమమ॥" యనిత్యజించి
తిరుగ గ్రహించి "సోమాయపితృమతేనమః" అని వ్రేల్చి ఇదం సోమాయపితృ
మతే" యని త్యజించి అపసవ్యపక్షమందు మున్ను సోమాహుతియు వెనుక న
గ్న్యాహుతియు జేయునది ఇట్లువ్రేల్చి హోమశేషముపిండములకై యుంచి పి
తామహాదిమాతామహాది పాత్రలందు నూరకె శేషము వడ్డింప వలెను- ఆపైని
దేవపాత్రమందు మరియొక యామాన్నముంచి పాత్రల నభిఘరించి దైవపూ
ర్వముగా నామద్రవ్యము చతుర్గుణముగాని ద్విగుణముగానియుంచి ప్రోక్షిం
చి దైవస్థలమందు కుడికాలు మణిచి సవ్యముచే దక్షిణ హస్తము వెతికిలించి
యెడమచేతివ్రేళ్లచే పాత్రముముట్టి "విష్ణవేనమ" యనిగాని "విష్ణోహవ్యం రక్ష
స్వ" యనిగాని విప్రునంగుష్ఠముననన్నమంటించి యిట్లు పిత్య్రస్థలముననపసవ్యము
చేపాత్రముముట్టి అంగుష్ఠమునివేదించి తిలలుచల్లి జలముస్పృశించి ఇట్లుప్రతి
పాత్రమునకు జేసి వామహస్తముచే దైవపాత్రముబట్టి కుడిచేతిలో కుశయవ
జలములధరించి "పిత్రాదిత్రయమాతామహాదిత్రయశ్రాద్ధ సంబంధి పురూర వా
ర్ద్రవసంజ్ఞికా విశ్వేదేవాఇదంవః ఆమాన్నం సపరికరంగమేయం భూర్గదా
ధరోభక్తాఅహంబ్రహ్మగ్రహీతాబ్రహ్మబ్రహ్మరూపమామంమనఃకల్పితసువర్ణ
పాత్రస్థమక్షయ్యవటచ్ఛాయాస్థంపురూరవార్ద్రవసంజ్ఞికేభ్యో విశ్వేభ్యోదేవేభ్యః
అక్షయ్యతృప్త్యర్థం సంప్రదదేస్వాహానమమ ఇదమామంసోపస్కరమమృతరూ
పేణ సంపద్యంతాం హవ్యంనమః కాశ్యాంవిశ్వేశ్వరపాదే దత్తమక్షయ్య మస్తు
గయా గదాధరఃప్రీతోభవతు" అనియీవలెనుఆపై పిత్ర్యమందపసవ్యముచే ద్విగు
ణముగ వంచినదర్భలు తిలలు జలము దీసుకొని యెడమచేతితో పాత్రముబట్టి
యెడమకాలు మణిచి "కాశ్యపగోత్రాస్మత్పితరముకదాసపిత త్తే ఆమాన్నంసప
రికరంగమేయంభూః" అనిమొదలుగ "రజతపాత్రస్థమక్షయ్యవటచ్ఛాయాస్థంకా
శ్యపగోత్రాయాస్మత్పిత్రె అముకదాసాయ వసురూపాయేదమామంసో పస్క
రం అక్షయ్యతృప్త్యర్థం సంప్రదదె స్వధానమః - అమృతరూపేణ స్వధాసం
పద్యతాంకవ్యంనమః॥" అనియును కాశ్యామని మొదలగునది మీదజెప్పినట్లు ను
చ్చరింపవలెను - ఇట్లుపితామహ ప్రపితామహులకును మాతామహాదులకు నీ

వలెను-"అసంస్కృత ప్రమీతేభ్యః ఏషపిండః"అని వికిరమిచ్చిమఱియు నామపిండ
ముదీసి"అగ్నిదగ్ధభ్యోనగ్నిదగ్ధభ్యశ్చఎషఉచ్ఛిష్టపిండోనమమ"అని జలముతోనామ
పిండమిచ్చితిలోదకమిచ్చి "మధుమధుమధు" అనిజపించునది-ఇకపిండదానము-అది
గృహాసిద్ధాన్నముచేనైనను పాయసముచేనైనను సత్తుపిండిచేనైనను దుంపలచే
గానిఫలములచేగానిచేయవచ్చును పిండములుంచుటకు వేదికజేసియెడమకాలుమణి
చియపసవ్యముగా దర్భచేదక్షిణమునకు రేఖదీసియిట్లు రెండవదియుజేసిజలము
స్పృశించి రేఖలకొనలను గాల్చినదర్భలుంచి మొదటి రేఖమూలమందు మధ్య
మందునగ్రమందును గ్రమముగ"కాశ్యపగోత్రాస్మత్పితరముకదాసవసు రూపా
వనేనిక్ష్వ"యని మొదలుగ పితామహప్రపితామహులకునుదకము నిచ్చునది- రెం
డవరేఖయందు మాతామహాదులకు నట్లిచ్చి సకృదాచ్ఛిన్నములనగ మొదటి కో
క్కమారెత్రుంచిన కొనలుగలదర్భలను దక్షిణాగ్రములుగ రెండురేఖల పైబర
చిమధువునాజ్యముసర్వవ్యంజనములుగలపినయన్నము నగ్నౌకరణశేషముతోగూడ
పాత్రమందుగలపి యాఱుపిండములజేసి పితృతీర్థమనగ నంగుష్ఠతర్జనులమధ్య
మునుండి "కాశ్యపగోత్ర అస్మత్పితరముకదాసఎతత్తెన్నంస్వధా"యని"ఎషతేపిం
డోనమమ"యనిగానియిచ్చియాపైగుశలద్దనుజేసి"పితామహకాశ్యపగోత్రి"యని
మొదలుగముప్వరకునిచ్చి లేపభుజులకు దర్భమూలములందుహస్తముదుడిచియట్లు
మాతామహాదులు ముప్వరకునిచ్చి హస్తములగడిగికొని యాచమించియుత్తరా
భిముఖుడైమంత్రహీనముగ బ్రాణాయామముజేసి "వసంతాయనమః గ్రీష్మాయన
మ"యనిమొదలుగనారుఋతువులకునమస్కరించియపసవ్యముచే"పితృభ్యోనమ"
యనియంజలిజేసి యట్లుమాతామహేభ్యోనమయనిచేసియాపై నెడమనుండియు
త్తరమునకు దిరిగియూపిరి బిగించితిరుగదిరిగి"పితృభ్యోనమః మాతామహేభ్యోన
మ"యనినమస్కరించి"కాశ్యప గోత్రాస్మత్పితరముకదాస ప్రత్యవనేనిక్ష్వ"యని
యాఱుపిండములందును బ్రత్యవనేజనజల మిచ్చినీవియనగా నడుముకట్టువిప్పి- "పి
తృభ్యోనమః మాతామహేభ్యోనమ"యనినమస్కరించి"పితృభ్యోనమః మాతా
మహేభ్యోనమ"యని ప్రతిపిండముగ సూత్రములనగా నూలుదారములిచ్చి "పితృ
భ్యోనమ"యని అవనేజనశేషమును గాని పిండామత్రమన బార్వణపాత్రగడగినజ
లముగాని పితృపిండములందు బ్రదక్షిణముగ జుట్టునుగార్చియట్లు"మాతామహే
భ్యోనమయని"చేసిఆపైని"దేవతాభ్యఃపితృభ్యశ్చ" యనిముమ్మారుజపించిపిండము

లను పిత్రాదినామములచే గంధపుష్పధూపదీప నైవేద్యఫలతాంబూల దక్షిణల
నిచ్చి "కర్మపాత్రజలంసుప్రోక్షితమస్తు-శివాఆపస్సంతు" అనిదైవవిప్రునకిచ్చి "సౌ
మనస్యమస్తు" అనిపుష్పములు "అక్షతంచారిష్టంచాస్తు"అనియక్షతలునిచ్చియపస
వ్యముచే"పితృభ్యోనమ"యనియు"మాతామహేభ్యో నమ"యనియువారికినిచ్చిశి
రస్సునందు"దీర్ఘమాయురస్తుపుష్టిరస్తు వృద్ధిరస్తు యచ్ఛ్రేయస్తదస్తు యత్పా
పం తత్ప్రతిహతమస్తు"భూమియందు "ద్విపదచతుష్పదేభ్యశ్శాంతిరస్తు" అనిపలు
కగద్విజులు"అస్తు"అనిపలికినపైని"పురూరవార్ద్రవ సంజ్ఞికేభ్యో విశ్వేభ్యోదేవే
భ్యోయద్దత్తం మామహాన్నాదితదక్షయ్యమస్తు" అనియనట్లు"కాశ్యపగోత్రస్యాము
కదాసస్యాస్మ త్పితుర్యద్దత్త"మని మొదలుగబలికియట్లు పితామహాదులకుమాతా
మహాదులకు నడిగినవిప్రులు "అస్త్వక్షయ్య"మనునది."అఘోరాఃపితరస్సంతుఏ
వంమాతామహాః గోత్రంనోవర్ధతాం - దాతారోనోభి వర్ధంతాం సంతతి
శ్చశ్రద్ధా చనోమావ్యగమత్ । బహుదేయంచ నోస్త్వన్నంచనో బహుభ
వేత్ - అతిథీంశ్చలభేమహి-యాచితారశ్చనస్సంతు మాచయాచిష్మ కంచన॥"
అనియనగా పితృదేవతలు ప్రసన్నులగుదురుగాకయట్లు మాతామహులునుమా
గోత్రము వృద్ధినొందుగాక మాదాతలుసంతతియు వృద్ధినొందుగాక మమ్మశ్ర
ద్ధవదలకుండుగాక చాలాద్రవ్య మిచ్చుటకు శక్తిగలుగుగాక సమృద్ధిగానన్నము
నతిథులు గలుగుగాకమమ్ము యాచింపవత్తురుగాక మేముయాచింప కుండుదుము
గాకయని ప్రార్థింపగవిప్రులు"తథాస్తు"అనవలెను అపైని"పిత్రాదిభ్యోమాతా
మహాదిభ్యశ్చ స్వధోచ్యతాం" అనిన"అస్తుస్వధా"యనివిప్రులుపలుకునది-దర్భ
లుపిండములందుంచి యర్ఘ్యపాత్రము వెతికిలించి దైవస్థానమునకు సువర్ణముపి
తృస్థానమునకు రజతము దక్షిణనిచ్చి నానానామగోత్రులైన విప్రులకామాన్న
ముదక్షిణనిచ్చిపిండములనెత్తియాఘ్రాణించి"విశ్వేదేవాఃప్రీయంతాం"అని"బ్రూ
హి"యని-చెప్పించిఇట్లుపిత్ర్యస్థానమందునుజేసినసవ్యముచే"స్వస్తిభవంతోబ్రువం
తు"అనిస్వస్తియన్నపైని సంపూర్ణతనుచెప్పించి కుశలచే"సుత్రిప్తతపితరఃవిశ్వే
దేవైస్సహ"యని యుద్వాసనజేసి మండలమందుండగ ప్రదక్షిణముజేసి నమస్క
రించి పంపవలెను—ఇట్లుశ్రీకమలాకరభట్టునిచే రచింయింపబడినశూద్రధర్మ
మందు శూద్రునికిచార్వణశ్రాద్ధ ప్రయోగముముగిసెను.

"రామకృష్ణతనూజేన కమలాకర శర్మణా । శూద్రధర్మా న్నిరూ

ప్యాథ తదాశౌచం నిరూప్యతే॥" అనగా రామకృష్ణ భట్టునిపుత్రుడైన కమ
లాకరభట్టుడు శూద్ర ధర్మముల నిరూపించి శూద్రులకు జాతాశౌచ మృతా
శౌచముల జెప్పుచున్నాడు - ఇక నిర్ణయసింధువనందాశౌచవిధి సంపూర్ణము
గ నిరూపింపబడినది - అయినను సంక్షేపముగ శూద్రవిషయమై కొంచెము
నిరూపింప బడును - ప్రమాణవిచార మచ్చటనే తెలియునది - అందు గర్భా
శౌచము మొదట జెప్పబడును - గర్భము నాల్గు మాసములలోగా జెడినయె
డ స్రావమనబడును అయిదునారు మాసములలో పాతమనబడును - సప్తమ
మాసము మొదలుగబూర్ణ ప్రసవమనబడును - అందు మనువచనము:. "రాత్రిభి
ర్మాసతుల్యాభి ర్గర్భస్రావేవిశుద్ధ్యతి॥" అనియనగా గర్భస్రావమెన్నోమా
సమందగునో యన్నిరాత్రులచే శుద్ధియగుననుట - ఇదిచతుర్థమాసవిషయము -
మూడు మాసములలోనైన చోరజస్వలయగుట నుండియె మూడు రాత్రులాశౌ
చముసిద్ధించును- మరీచివచనము- "గర్భస్రుతౌ యథామాస మచిరేతూత్తమె
త్రియః। రాజన్యేతుచతూరాత్రం వైశ్యేపంచాహమేవచ । అష్టాహేనతుశూ
ద్రస్య శుద్ధిరేషాప్రకీర్తితా॥" అనియనగా గర్భస్రావమునకు మాససంఖ్యాది
నములాశౌచము అచిరమనగా మూడుమాసముల లోగానైనచో బ్రాహ్మణునికి
మూడురాత్రులు - క్షత్రియునకు నాలుగువైశ్యునకైదు శూద్రునకెనిమిదియు
నాశౌచమని గ్రహించునది- ఈశ్లోకమునకర్థవిశేషము స్మృతికౌముదిలో నున్నది
ఎట్లనిన- గర్భస్రావమందు మూడుమాసములు దాటినదైనచో జతుర్థమాసము
నకుసమమైననాల్గు దినములాశౌచము సర్వవర్ణములకుసమము-మూడుమాసము
లలోగామూడు రాత్రులాశౌచమును సర్వవర్ణముల కగును-మరియేమనినబ్రా
హ్మణునకుత్రి మాసమధ్యమందైనచో మరిమూడుదినము లధికముగ నాశౌచము
త్రియః అనునది యేకశేషముగ నుచ్చరింపబడినది- కనుకబ్రాహ్మణున కట్లుమూ
డుదినములధికములు క్షత్రియునకునాల్గు వైశ్యశూద్రులకు నైదు నెనిమిదియు న
ధికములని తెలియునది-కొందరుప్రథమమాసము మొదలుగ నేకదినాద్యాశౌచాంత
మందువర్ణక్రమమున ద్విరాత్రాది లధికమందురు - అట్లుగానిచో నైదవమాస
ముమొదలగువాని యందువైశ్యాదులకు పంచదినాదికము మూడుమాసములలో
గానైనచోనాల్గు దినములుమొదలుగ నాశౌచమని యనౌచిత్యము సంభవించును
గర్భస్రావమందు సపిండులకు స్నానమాత్రమే- తల్లిదండ్రులకు మాససమసం

శ్యాగలదినములు పిత్రాదులకుత్రిదినము-ఇదిగుణహీనులకు-గుణవంతులకొకదినమే
యనిమదనపాలుడు- ఇదిసర్వవర్ణసమము-ఏమనిన "తుల్యవయసిసర్వేషామతిక్రాం
తేతథైవచ"యని వ్యాఘ్రవచనము అనగావయసును బట్టివచ్చినదియనతిక్రాంతా
శౌచమునందరికి సమములనుట- ఇకబ్రసవాశౌచము అంతటను "జాతేపుత్రే పితు
స్స్నానంసచేలంతు విధీయతే"యని యనగాబుత్రుడు బుట్టగనేతండ్రిసచేలస్నాన
ముజేయవలెననుట- యిక్కడబుత్రపదముచేగన్యయుగ్రహింపబడును_ఇకహారల
తయందు "సూతకేతుముఖం దృష్ట్వాజాతస్య జనకస్తతః । కృత్వాసచేలంస్నా
నంతుశుద్ధోభవతితత్క్షణాత్"అని బ్రాహ్మోక్తి యున్నందున ముఖదర్శనమై
నపైనిదిరుగ స్నానమని చెప్పబడినది- అవిచింత్యము నిమిత్తమేకమైనందున దర్శ
నమనగ జ్ఞానమాత్రమేయని తెలియునది- ఇకగౌడులుసవతితల్లికిస్నానముచేయక
మున్నఅస్పృశ్యత్వము "సర్వాశ్చమాతరస్తద్వత్తద్గృహంనవ్రజంతిచేత్"అనిబ్రా
హ్మావచనమున్నదనియంద్రు- మరియునంగిరోవచనము. "నాశౌచంసూతకేపుంస
స్సంసర్గంచెన్నగచ్ఛతి।రజస్తత్రాశుచిర్జ్ఞేయంతచ్చపుంసినవిద్యతే॥" అనియనగా
నశుద్ధిని గలుగజేయురజస్సు పురుషునియందులేదుగనుక సంసర్గము నొందకున్న
చో సూతకమందు బురుషునకాశౌచము లేదనుట - ఇచటసంసర్గమనగమైథున
ము - శయనాసనాదికమని మాధవుడు- స్పర్శమాత్రమెయనిగౌడులు - అదిచిం
త్యము "సంస్పర్శేసూతికాయాస్తు స్నానమేవవిధీయతే"యని యాంగీరసవచనము
అనగాసూతికనుమాత్రము ముట్టినయెడస్నానము విధింపబడినది - ఏవకారము
వలనబాలునిముట్టినచో దోషములేదనుట - మరియువ్యాసవచనము "ప్రథమేదివ
సేషష్ఠేదశమెచైవసర్వదా । త్రిష్వేతేషునకుర్వీతసూతకం పుత్రజన్మని"-అనియ
నగా మొదటిదినము నారవదినము పదియవదినము వీనియందు పుత్రజననాశౌచ
మంటదని - ఇక్కడవిశేషము షష్ఠీపూజమొదలగునవియు మీదజెప్పబడినది - ప్ర
యోగపారిజాతమందు పుత్రుడుగల్గినచో బదిదినములాశౌచము- కన్యకబుట్టినచో
మూడుదినములే సపిండులకగునట్లు వచనము "స్త్రీజన్మనిసపిండశ్చసోదకశ్చత్ర్య
హాచ్ఛుచిః - స్త్రీషుత్రిపురుషంజ్ఞేయం సపిండత్వంద్విజోత్తమాః" అనియనగా
స్త్రీసంతతిగల్గినపుడు సపిండులకు సోదకులకు మూడుదినములచే శుద్ధియగును
స్త్రీసాపిండ్యము ముగురుపురుషులవరకెయని తెలియునదియని యగ్నిస్మృతియ
నిచెప్పబడినది - గౌడులైనచోవాగ్దానమైనపైని కన్యకకుగల్గినకన్యక విషయమిది

యనియంద్రు- ఇకమృతాశౌచము - అందుహారీతస్మృతి-"జాతేమృతేమృతెజాతే వాసపిండానాందశాహం" అనియనగామృతశిశువును గన్నను బ్రసవించినపైనిశి శువుమృతినొందిన పదిదినములనగా బొడ్డుగోసినపైని ననితాత్పర్యము అట్లు"నా డ్యాంఛిన్నాయామాశౌచ"మనియతనిచేతనేచెప్పబడినది- నాభిచ్ఛేదముగాకము న్మృతినొందె నేనిదల్లికస్పృశ్యతలేదని శుద్ధితత్వవివేకమందున్నది- అపుడువృద్ధ మనువచనము"జీవన్‌జాతోయదిమృతస్తదాసూతకఏవతు।సూతకంసకలంమాతుః పిత్రాదీనాంత్రిరాత్రకం॥"అనియనగాజన్మమైన పైనిబొడ్డుగోయకమున్న మృతి నొందెనేనితల్లికి సంపూర్ణముగ జాతాశౌచము తండ్రిమొదలగువారికి మూ డుదినములు మృతాశౌచమునకు స్నానమాత్రమే అట్లుశంఖవచనము-"ప్రాఙ్నా మకరణాత్సద్యశ్శౌచ"మని- ఇక్కడనామకరణమనగా చాలయోగ్యమగు కాలము వరకుననిమేధాతిథి హారదత్తగౌడాదులు - అట్లుగ్రహింపగూడదని మాధవాదు లు- నామకరణమైన పైనిదంతములు పుట్టువరకును దహనమైనచో నొకదినము సపిండులకాశౌచము ఖననమైనయెడస్నానమాత్రమే - అట్లు- "ఆదంతజన్మన స్సద్యః" అనియాజ్ఞవల్క్యవచనము- దంతములుపుట్టినపైని మూడుసంవత్సరము లలోగా చూడాకర్మలేని యెడనొకపగలు - అపుడగ్ని దాహమైనచో మూ డుదినములని మాధవుడు - మూడువత్సరములలోపునగాని పైనిగాచౌడముజరి గినచో మూడుదినములే సంవత్సరముపైని చూడాకర్మలేక పోయినను మూ డుదినములే ఇదిసపిండులకే - తల్లిదండ్రులకైనచో బదిరోజులైనపైనిమృతినొం దినచో మూడుదినములే- అట్లుకశ్యపవచనము"బాలానామజాత దంతానాంత్రి రాత్రేణశుద్ధిః"అని- మరియు"బైజికా దభిసంబంధాదనురుంధ్యాత్త్యహ"మని మనువచనముగూడ నున్నదనిమితాక్షరామాధవాదులుచెప్పిరి- శుద్ధితత్వముమొద లుగగౌడులైనచో నీత్రిరాత్రాశౌచము శూద్రపరము-ద్విజులకెట్లనినదంతోత్పత్తి కిమున్నొకపగలు దంతములు పుట్టినపైని మూడుదినములు - అట్లువచనము-"అ జాతదంతమరణె పిత్రోరేకాహ మిష్యతె । దంతజాతె త్రిరాత్రంస్యా ద్యది స్యాతాంతునిర్గుణౌ॥" అనికూర్మ పురాణమందున్నది- మఱియును. "అనూఢా నాంతుకన్యానాం తథావై శూద్రజన్మనాం॥" అనిశంఖవచనము అనగావివా హముగాకమున్న కన్యలకును శూద్రులకును త్రిరాత్రమే యనుట మరియును మాత్స్యవచనము "త్రిరాత్రంతు భవేచ్ఛూద్రే షణ్మాసె పితృశౌమృతె॥" అని

యనగాశిశువున కారుమాసములైనను మూఁడురాత్రులే శూద్రున కాశౌచమ
నుట- దంతోత్పత్తియైనపైని శూద్రునకైదుదినములు-అట్లంగిరోవచనము- "శూ
ద్రేత్రివర్షమాసేతు మృతేశుద్ధిస్తు పంచభిః । అతఊర్ధ్వంమృతేశూద్రే ద్వాద
శాహాద్విధీయతే । షడ్వర్షాంతమతీతోయ శ్శూద్రస్సమ్రియతేయది । మా
సికంతు భవేచ్ఛౌచ మిత్యాంగిరస భాషితం॥" అనియనగా మూఁడు వత్సరముల
లోఁగా శూద్రుఁడు మృతినొందెనేని నైదుదినములు ఆపైనారు వత్సరములపర్యం
తముపండ్రెండుదినములు ఆపైని మాసముతో శుద్ధియగును- ఇట్లునిర్గుణశూద్రుని
మృతికని తెలియునది-గుణవంతుఁడైనసచ్ఛూద్రుఁడైనచో బదియారువత్సరములపైని
వివాహముగానిచో మాసమాశౌచము- అట్లుశంఖవచనము "అనూఢభార్యశ్శూ
ద్రస్తు షోడశాబ్దోమృతోయది । మాసికంతు భవేచ్ఛౌచం॥" అనియున్నది వివా
హమైనయెడ నారువత్సరములపైని మృతినొందినను మాసము వరకునాశౌచము క
నుక "తుల్యంవయసిసర్వేషాం" అనువ్యాఘ్రవచనమువలనశూద్రునకువిప్రులకువలె
న్యూనమైన యాశౌచముజెప్పుట దాక్షిణాత్యులకని తెలియునది - అన్యదేశీ
యులకుమీదజెప్పిన కూర్మవచనమున వ్యవస్థయగును - అనిచెప్పిరి - ఇకవిజ్ఞా
నేశ్వరమదన పారిజాతాదులైనచో "తుల్యంవయసి సర్వేషా" మనువచనమునం
దునను శిష్టాచార విరోధమున్నందునను నాంగిరసాదివచనముల నాదరింపగూడ
దనిరి - మరియుబదారువత్సరములలోఁగా వివాహముగానిచో త్రిరాత్రము వివా
హమైనచోమాసము అటుపైని వివాహములేకున్నను మాసమెయనియపరార్క-
మదనపాలాదులు - కన్యలకైనచో చూడాకర్మగాకమున్న మృతియయ్యెనేని
స్నానమాత్రము - అట్లాపస్తంబవచనము- "అచూడాయాంతుకన్యాయాం సద్య
శ్శౌచంవిధీయతే" యని - ఇదిత్రిపురుషసపిండులకని తెలియునది చూడాకర్మ
యైనపైనివాగ్దానముగాక మున్నొకదినమాశౌచము- అట్లంగిరోవచనము "అవి
శేషేణవర్ణానామర్వాక్సంస్కారకర్మణః। త్రిరాత్రాత్తుభవేచ్ఛుద్ధిఃకన్యాస్వహ్న
విధీయతే" యనియనగాసంస్కారకర్మగాకమున్నుసర్వవర్ణములలోను బాలురకు
మృతిగలుగునప్పుడుత్రిరాత్రాశౌచముకన్యలకైనచో నొకదినమనుట- "అహస్త్వ
దత్తకన్యాసు" అనిమరియొక వచనముగూడనున్నది- ఇదియుత్రిపురుష సపిండులకని
తెలియునది అట్లువసిష్ఠవచనము "అప్రత్తానాంస్త్రీణాం త్రిపురుషీవిజ్ఞాయతే" యి
నియున్నది-గాఁడులివివాగ్దానము గాకమున్నని తెలియునది-అట్లైనచో- "అప్రత్తా

నాంతథా స్త్రీణాంసాపిండ్యంసాప్తపౌరుష" మనికూర్మవచనమువలనసాప్తపురు
షలపర్యంతమునగునందు-వాగ్దానమైనపైనివివాహముగాకమున్నుమృతినొందెనే
నిభర్తృకులమందునుబితృకులమందును సప్తపురుషలపర్యంతముత్రిరాత్రిమే "అ
వారిపూర్వంపరిత్తాతు యానైవప్రతిపాదితా । అసంస్కృతాతు సాజ్ఞేయా
త్రిరాత్రముభయోస్స్మృతం॥" అనిమరీచివచనమున రెండుకులములందును త్రి
రాత్రము విధింపబడినది - ఇః సంస్కారముగాకమున్ను శూద్రుడుమృతినొం
దెనేనివిశేషము - మాధవీయములో బ్రహ్మవచనము. "స్త్రీణాంతు పతితోగ
ర్భస్సద్యో జాతోమృతోథవా । అజాతదంతోమాసైర్వా మృతష్షడ్భిర్గతై
ర్బహిః॥ వస్త్రాద్యైర్భూషితం కృత్వానిక్షిపేత్తంతు కాష్ఠవత్ । ఖాని
త్వాశనకైర్భూమావాసద్య శ్చౌచంవిధీయతే॥" అనియనగా స్త్రీలకుగర్భపా
తమైనను బుట్టగానేమృతినొందినను దంతములు పుట్టకమున్నుగానైనను యారు
మాసములపైని మృతినొందెనేని వస్త్రాదులచే నలంకరించి కర్రనువలెగర్తము
లోనుంచిపాతిపెట్టి యాదినముతోడనె శుద్ధియనుట. విష్ణుస్మృతి "అనివృ
త్తేదశాహేతు పంచత్వంయదిగచ్ఛతి । సద్యఎవవిశుద్ధిస్స్యాన్నప్రేతం నోదక
క్రియా॥" అనియనగా బుట్టినపదిదినములలోగా మృతినొందెనేని ప్రేతకర్మ
యనుదకదానము నక్కరలేదు ఆదినముతో శుద్ధియగుననుట - యమవచనము.
"ఊనద్వివార్షికేప్రేతే ఘృతాక్తంనిఖనేద్బహిః॥" అనియనగా రెండుసంవ
త్సరములలోగా మృతినొందినచో ఘృతము బూసిగ్రామము పైనిగర్తములో
బెట్టవలెనని-కనుకనామకరణమునకు బూర్వమందుఖననమే - అటుపై మూడు
సంవత్సరములలోగా చౌలముజరుగనియెడ నగ్నిదానమునకునుదకమునకు వికల్ప
ము. ఏమనిన"జాతదంతస్య వాకుర్యునామ్నివాపి కృతేసతి॥" యనిమనువచన
మట్లగ్నిదాహోదకముల జెప్పుచున్నది. చూడాకర్మజరిగిన పైని మూడుసం
వత్సరములలోగానైనను పైనైనను నగ్నిదాహము నియతముగ జేయవలెను."తూ
ష్ణీమేవోదకంకుర్యాత్తూష్ణీంసంస్కారమేవచ । సర్వేషాంకృతచూడానా మన్య
త్రాపీచ్ఛయాద్వయం" అనిలౌగాక్షిస్మృతియున్నది.అనగాచూడాకర్మజరిగిన
పైననూరకె యగ్నిసంస్కారము నూరకెయుదకదానము జేయునది చౌడముగా
కమునైనను నిచ్ఛగల్గినచో జేయవచ్చును- అనగా వికల్పమనుట - చూడా
నంతరమున దశపిండములుగూడ జేయునది - అట్లుప్రచేతోవచనము. "అసం

స్కృతానాంభూమౌపిండందద్యాత్ సంస్కృతానాంకలశేషు॥" అనియనగా సం స్కారము జరుగనివారికి భూమియందును జరిగినవారికి దర్భలందును పిండము లీవలెననుట. "ద్వాదశాద్వత్సరాదర్వాక్పౌగండేమరణేసతి । సపిండీకరణంన స్యాదేకోద్దిష్టానికారయేత్॥" అనిహారదత్తగ్రంథములో దేవలవచనము - అన గా పండ్రెండువత్సరములలోగా పౌగండవయస్సులో మృతినొందెనేని సపిండీక రణముగూడదు ఏకోద్దిష్టముచేయునది- ఇక్కడపండ్రెండు వత్సరములనుటకువివా హముగాకమున్న శూద్రునకని తాత్పర్యము- మరీచివచనము "ప్రేతపిండంబహిర్ద ద్యాద్దర్భ మంత్రవివర్జితం॥" అనగా ప్రేతపిండము దర్భయుమంత్రము లేకుం డగ వెలుపల భూమియందీవలెను ఇదిసంస్కారము జరగకున్నవాని కనివిజ్ఞానే శ్వరుడుమూడు రాత్రులందు దశపిండములీవలెనని పారస్కరవచనము - "ప్రథ మే దివసే దేయాస్త్రయః పిండాస్సమాహితైః । ద్వితీయే చతురోదద్యాదస్థి సంచయనంతథా । త్రీంస్తుదద్యాత్తృతీయేహ్నివస్త్రాదిక్షాలయేత్తతః॥" అ నియనగా మొదటి దినమందుమూడు పిండములీవలెను- రెండవదినమందు నాలుగు పిండములీవలెను అస్థిసంచయనము గూడజేయవలెను - మూడవదినమందు మూ డుపిండము లీవలెను-ఇట్లుపది- ఇక్కడనస్థిసంచయము సంస్కారము జరిగినవాని కేయని తెలియునది- ఇతరునికక్కర లేదు- ఇక్కడ దేవయాజ్ఞికునిచే జేయబడినక్రి యానిబంధములో విశేషమున్నది- ఎట్లనిన గారుడవచనము - "శిశురాదంతజననా ద్బాలస్స్యాత్ యావదాశిఖః । కథ్యతేసర్వశాస్త్రేషు కుమారోమౌంజిబంధ నాత్।తథా। గర్భేనష్టేక్రియానాస్తిదుగ్ధందేయం శిశౌమృతే। పరంచపాయసం క్షీరం దద్యాద్బాలవిపత్తితః। ఏకాదశద్వాదశాహేవృషోత్సర్గవిధింవినా।తథా। యత్రప్రమీయతేబాల స్తత్రిప్రాయఃప్రదీయతే। కించిత్సమాన వయసేసత్కృ త్యాన్నంయథావిధి। భక్ష్యంభోజ్యంచ దాతవ్యంతథాచసుఖభక్షికా । తద్వ స్త్రాణిప్రదేయానిసోపానత్కానితత్సమే । కుమారాణాంచబాలానాం భోజ నంవస్త్రవేష్టనమ్ । యచ్చోపజీవతేబాలస్తత్తద్విప్రాయదీయతే ॥" అని యన గా దంతోత్పత్తిపర్యంతము శిశువనబడును చూడాకర్మపర్యంతము బాలుడన బడును మౌంజిబంధనమనగా నుపనయనము పర్యంతము కుమారుడనబడును ఇట్లుశాస్త్రసంకేతములు ఇకగర్భపాతమైనచో క్రియయేమియును లేదు శిశువు మృతినొందినచో మరియొకశిశువునకు పాలీవలెను-బాలుడుమృతినొందెనేని పాయ

సమును క్షీరము నేకాదశ ద్వాదశదినములందు దానముచేయునది- వృషోత్సర్గ విధియక్కరలేదు - మరియును బాలుడు మృతినొందిన దినమున సమాన వయస్కుడగు బాలునికి సత్కరించి యన్నము భక్ష్యము భోజ్యము మరియు సుఖభక్షికయనగ లడ్డుకములు చక్కిలములు మొదలగు సూడిదెవంటకములును మృతినొందిన బాలుని వస్త్రములు పాదరక్షలు మొదలగునవియును సమానవయస్కులకీవలెను - మరియు బాలురకును గుమారులకును భోజనమును మిఠాయిలుపాగాలుమొదలగునవియును మృతుని సంబంధించియున్న యన్నివస్తువులు నీవలెననుట- "తధా-భూమిని క్షేపణంబాలఆవర్షద్వయమాశిఖం। తతఃపరంఖగశ్రేష్ఠదేహదాహోయధావిధి॥" అనియనగా రెండువత్సరముల పర్యంతమును చూడాకర్మ జరిగెడు వరకును బాలుడు మృతినొందెనేని ఖననమే గావలెను అటుపైని యధావిధిగ దేహమునకు దహనమే గావలెననుట రెండువత్సరములు దాటినయెడచూడాకర్మ లేకపోయినను దాహమే గాని ఖననముగాదనుటకు "నావర్షద్వయ"మనియు రెండువత్సరములలోగా చూడాకర్మ జరిగినను ఖననముగాని దాహమేయనుటకు "నాశిఖ"మనియును జెప్పబడినది.

"చూడాకర్మణి సంజాతే విపత్తిస్తు యదాభవేత్ । సూతకాంతె ప్రకర్తవ్యం వృషస్యోత్సర్జనంతదా । తత్రదాహః ప్రకర్తవ్య ఉదకం తత్ర నిశ్చితం । శ్రాద్ధానిషోడశాపిస్యు స్సపిండీకరణంవినా॥" అనియనగా చూడాకర్మ జరిగినపైని మృతినొందెనేని శుద్ధియైనపైని వృషోత్సర్గము చేయునది మరియు నపుడు దహనముచేయవలెను ఉదకదానముచేయునది- సపిండీకరణము తప్పషోడశశ్రాద్ధములును జేయవలెను - ఇట్లుచేయుట యైదువత్సరములు దాటినపైనని తెలియునది- అట్లువచనము "జన్మతః పంచవర్షేషు త్రైకదత్తమసంస్కృతం । పంచవర్షోత్తరం బాలేవిపత్తిర్యదిజాయతె। వృషోత్సర్గాదికంకర్మ కర్తవ్య ముదకంతతః । అహన్యహానిసంప్రాప్తె కుర్యాచ్ఛ్రాద్ధానిషోడశ। పాయసేనగుడేనైవ పిండం దద్యా ద్యధాక్రమం । ఉదకుంభప్రదానంచ పదదానాని యానిచ । దీపదానాది యత్కించి త్పంచవర్షాధికె సదా । కర్తవ్యంతు ఖగశ్రేష్ఠవ్రతార్వాక్ప్రేతతృప్తయె । ఋజుదర్భైస్తిలైశ్శుక్లైః ప్రాచీనావీతినాతధా॥" అనియనగా జన్మమొదలుగనైదు వత్సరములలోగా శిశువు మృతినొందినచో సంస్కారమేమియు లేకుండగ నిచ్చినదానినను

భవించును ఆపైని మృతి నొందెనేని వృషోత్సర్గము మొదలగుకర్మ జేయవలె
ను క్రమముగాదినములు ప్రాప్తించునపు డన్యైకకర్మలనగ షోడశశ్రాద్ధములుచే
యునది అపుడుపాయసముచేతను బెల్లము చేతను బిండము లీవలెను- ఉదకుంభ
దానము పదదానములు దీపదానములు మొదలుగ జేయవలెను అపుడు ఋజు
వైన దర్భలును తెల్లనితిలలును గావలెను ప్రాచీనావీతిగాజరపవలెను ఇట్లు ప
నయనములోగా మృతినొందు బాలునికి తృప్తిగజేయవలె నోగరుడుడా యనుట-
ప్రత్యాబ్దికముమాత్రము లేదు ఏమనిన సపిండీకరణము లేనందున పితృత్వసిద్ధిలేదు
దివోదాసీయమందు "అవ్రతేనిధనంప్రాప్తే విప్రాదౌ శూద్రజాతివత్ । క్రియా
స్సర్వాస్సముద్దిష్టా స్సపిండీకరణంవినా । ఉదకం పిండదానంచ కృతచూడేవిధీ
యతే॥" అనియున్నది - అనగా నుపనయనముగాకమున్ను విప్రాది బాలకులు
మృతినొందిరేని శూద్రునికివలె సపిండీకరణము తప్పదక్కిన క్రియలన్నియు జేయ
వలెను చూడాకర్మ జరిగినపైని పిండదానము నుదకమునీవలెను - వివాహము
గాకమున్ను కన్యమృతి నొందెనేని పిండదానము వికల్పితము-అట్లు "స్త్రీణాంచై
కేఽ ప్రత్తానా"మని గౌతమవచనము - ఇకశూద్రునికి జాత్యాశౌచము- అందు
మను పరాశరగౌతమాదులు"శూద్రోమాసేన శుధ్యతి"యని మాసపర్యంత మని
రి - యాజ్ఞవల్క్యస్మృతి-"త్రింశద్దినాని శూద్రస్యతదర్ధంన్యాయవర్తినః॥" అ
నిపంచయజ్ఞాది కర్మలుచేయుచున్న సచ్ఛూద్రులకు పదునైదు దినములనిచెప్పి
నది - అంగిరోవచనము - "సర్వేషామేవ వర్ణానాం సూతకేమృతకేతథా ।
దశాహాచ్ఛుద్ధిరేతేషా మితిశాతా తపోఽబ్రవీత్"అని సర్వవర్ణములకును జాతా
శౌచమృతాశౌచములు పదిదినములేయని శాతాతప మతమని యున్నది - శుద్ధి
తత్త్వమందు దేవలవచనము- "ఆశౌచందశరాత్రంతు సర్వేషామపరే విదుః । ని
ధనేప్రసవేచైవ పశ్యంతః కర్మణాఃఫలం॥" అని యనగా కర్మఫలమనగ సదా
చారసంపత్తినిజూచి సర్వవర్ణములకును పదిదినములే జాతాశౌచ మృతాశౌచ
ములని కొందరిమతమనుట - ఇదిమిగుల నుత్కృష్టమైన విప్రశుశ్రూషా కర్మ
కు విఘ్నము గల్గినదని దుఃఖపడువానికి దశరాత్రమని హారలతాగ్రంథ కారుడు
చెప్పెను - మరియేమనిన దక్షవచనము- "సద్యశ్శౌచం తథైకాహస్త్ర్య హశ్చ
తురహ స్తథా । షడ్దశ ద్వాదశాహాని పక్షోమాస స్తథైవచ । మరణాంతం త
థాచాన్యద్దశపక్షాస్తు సూతకే॥" అనియనగా శూద్రాశౌచమునకు పక్షములు

పదివిధములు-ఎట్లనిన సద్యశ్శుద్ధియు - నొకదినము - రెండుమూడు-నాల్గు-నారు
పండ్రెండు దినములు-పక్షము-మాసము - మరణముపర్యంతమునని - ఇక్కడమ
రణానంతరమందు నాశౌచాదులకంటె వేరుగ సద్యశ్శౌచము మొదలుగ పడ్డిన
ముల పర్యంతమైన పక్షములు యాయావరుడన భిక్షుకుడు మొదలగువారికని తెలి
యునది - మరియు - "అన్యపూర్వాయస్యగేహేభార్యాస్యాత్తస్యనిత్యశః। ఆ
శౌచంసర్వకార్యేషు దేహేభవతి సర్వదా॥" అనిబ్రాహ్మవచనము-అనగా పూ
ర్వమనువు స్త్రీతనకు భార్యయై గృహమందున్నయెడ నతనికి సర్వకార్యములంద
ను నెల్లప్పుడునునాశౌచ ముండునని యున్నందున నట్టివారల విషయు మామర
ణాంతపక్షమని మొదలుగ వ్యవస్థను దెలియవలెననియపరార్కాదులు - అందు
వివాహమైనపైని నంతట శూద్రునకు పూర్ణాశౌచము - వివాహము లేకున్న
ను నిర్గుణులకు నారువత్సరములు దాటినపైని మాసమాశౌచమని గౌడులు -
గుణవంతులకు వివాహముగాకమున్న పదారువత్సరములు దాటినచో మాసమ
ని యపరార్కుడు-ఇక్కడనాపదనాపద్విషయముగగాని గుణవదగుణ విషయము
గగాని దేశభేద విషయముగగాని వ్యవస్థ గల్పించుకొనవలెను - ద్విజులకు దా
సుడై యుండెనేని స్వామికి సజాతీయముగనె యాశౌచ మగును "దాసీ దా
సశ్చసర్వేవై యస్యవర్ణస్య యోభవేత్ । తద్వర్ణస్యభవేచ్ఛౌచం దాస్యా
మాసస్తు సూతకం॥" అనియనగా నేవర్ణమునకు దాసియు దాసుడు నగునో
యావర్ణమునకు విధింపబడిన పరిమితిగ నాశౌచము గల్గును లేనిచో మాసమగు
ను - ఇట్లుశాతాతపవచనము "తదాశ్రితస్యతద్వత్స్యాత్॥" అని-యనగా ద్విజు
నాశ్రయించెనేని ద్విజునికివలె నాశౌచమగుననుట - ఇతరులైన కుండగోళకా
దులకును సూతుడు మొదలగు ప్రతిలోమజులకును మాసమువరకు నాశౌచము
అట్లుమనువచనము - "శూద్రాణాంతు సధర్మాణస్సర్వేఽపధ్వంసజాస్స్మృ
తాః॥" అనిఅనగా వ్యభిచారమువలన బుట్టిన సంకర వర్ణులందరును శూద్రు
నితో సమానమగు ధర్మముగలుగు వారలనుట-మరియును శుద్ధితత్వమందుబ్రా
హ్మవచనము - "శౌచాశౌచేప్రకుర్వీరన్ శూద్రవద్వర్ణ సంకరాః॥" అని-అన
గా సంకరవర్ణులు శూద్రులువలె శుద్ధ్యశుద్ధులు చేయవలెననుట - మ్లేచ్ఛులు
మొదలగువారికైనచో నాశౌచమక్కరలేదు - మరియేమనిన నొక్కమనస్సమా
ధానముకొరకుమాత్రము మూత్రపురీషములందువలె శుద్ధిజేసుకొనుటయేయనివి

జ్ఞానేశ్వరుడు   అందుసూతకమందు దల్లితప్ప దక్కినవారి కస్పృశ్యత్వము లే
దు- అట్లంగిరోవచనము - "సూతకే సూతికావర్జం సంస్పర్శో ననిషిధ్య
తే"యని- ఇట్లుతండ్రికిని స్నానానంతరమందాశౌచమనగ పురుషులేదు - అట్లు
స్మృతివచనము "మాతాశుద్ధ్యేద్దశాహేన స్నానాత్తు స్పర్శనంపితుః॥" అని -
శుద్ధిలో విశేషమునకు దేవలవచనము- "స్వాశౌచకాలాద్విజ్ఞేయం స్పర్శనంతు
త్రిభాగతః॥". అనియనగా దనకు విధింపబడిన యాశౌచకాలములో మూడవభా
గముదాటినపైని స్పృశించుట కర్హుడనుట - ఇదిస్వల్పాశౌచమందగును-పూ
ర్ణాశౌచమం దంగిరోవచనము - "దశాహాదిత్రిభాగేనకృతేసంచయనే క్రమా
త్ । అంగస్పర్శనమిచ్ఛంతి వర్ణానాం తత్వదర్శినః॥" అనియనగా దశదిన
ములు మొదలగుపూర్ణాశౌచమందు మూడవభాగముదాటి యస్థిసంచయనము
జేసినపైని తత్వజ్ఞులు వానిముట్టుకొనవచ్చునంద్రు—అనియిట్లస్పృశ్యత్వము తగ్గిం
చుట కలిలోనిషిద్ధము -"అస్థిసంచయనాదూర్ధ్వమంగస్పర్శనమేవచ"యని హే
మాద్రిలో నాదిత్యపురాణవచనము కలివర్జ్యములలో జెప్పబడినది - సూతిక
యనగా బిడ్డనుగన్నస్త్రీకిమాత్రముపదిదినములాశౌచము - అట్లువచనము"సూ
తికాసర్వవర్ణేషు దశరాత్రేణ శుద్ధ్యతి । ఋతౌచనపృథక్శౌచం సర్వవర్ణే
ష్వయంవిధిః" అనిప్రచేతసుడు చెప్పెను - అనగాబిడ్డను గన్నప్పుడును ఋతు
మతియగునపుడును సర్వవర్ణములందు నొక్కవిధముగనే శుద్ధియగుననుట - ఇ
కచాజిహ్మవచనము -"బ్రాహ్మణీక్షత్రియా వైశ్యాప్రసూతాదశభిర్దినైః । శ
త్రైశూద్రాచ సంస్పృశ్యా త్రయోదశభిరేవచ॥" అనియనగా బ్రహ్మక్షత్ర వై
శ్యస్త్రీలు ప్రసవించి పదిదినములకు శుద్ధలగుదురు శూద్రస్త్రీ ప్రసవించెనేని ప
దుమూడుదినములకు శుద్ధురా లగునని - ఇట్లుచెప్పుట అసచ్ఛూద్రవిషయ మ
ని తెలియునది - కర్మజేయుటకు శుద్ధినిపై రీనసిచెప్పెను - పుత్రునిగనినచో ని
రువదిదినములును కన్యనుగన్నచో మాసము నాశౌచమాపైని గమార్హత గ
ల్గునని - అట్లిరువది దినములనుటయు నాశౌచాంత మందని తెలియునది - అట్లు
గానిచో సపిండులకు మాసాశౌచముండగ మధ్యమందే స్త్రీకిగమార్హత గల్గు
ననియనౌచిత్యము సంభవించును-పదిరాత్రులను విధికి వైషమ్యముగూడవచ్చును-
ఆపస్తంబవచనము-"క్షత్రవిట్ఛూద్రజాతీనాం యెస్త్రోమృతకసూతకే। తేషాంతుపై
తృకంశౌచం విభక్తానాంతు మాతృకం॥"అనియనగా క్షత్రియవైశ్యశూద్రజాతు

లకువిభక్తులుగానియెడ దండ్రివంకను విభక్తులైనచో దల్లివంకనువచ్చునాశౌచమె। మనువచనము - "దశాహంశావమాశౌచం సపిండేషు విధీయతే॥" అని యనగా సపిండులకు పదిదినములాశౌచము అనగా నాయా జాతులకు విధింప బడిన యాశౌచమనుట - అట్లు "శవస్పృశో విశుద్ధ్యంతి త్ర్యహాత్తూదకదాయినః॥" అనియున్నది యనగా శవమును స్పృశించిన వారును సమానోదకులు నుమూడు దినములకు శుద్ధులగుదురనుట - అగ్ని పురాణమందు "సపిండతా తు సర్వేషాం గోత్రత స్సాప్త పౌరుషీ । సమానోదక భావశ్చ నివర్తేతా చతుర్దశాత్॥" అని యున్నది అనగా సర్వవర్ణము లందును సాపిండ్యము సప్తపురుషులపర్యంతముననియు సమానోదకత్వముపదునలుగురు పురుషులవరకు ననియు తాత్పర్యము "జన్మనామస్మృతేరేకేతత్పరంగోత్రముచ్యతే। సమానోదకానాంత్ర్యహోగోత్రజానామహస్మృతం॥" అనగాపదునల్గురుపురుషులపైని కూటస్థుల పేరులు తెలియవుగనుకసగోత్రులనియెవ్యవహారము - అందు సమానోదకులకు మూడురోజులు సగోత్రులకు నొకదినము నాశౌచము-ప్రయోగ పారిజాతమందు - అగ్నిస్మృతి॥ "స్త్రీజన్మనిసపిండశ్చ సోదకశ్చత్ర్యహాచ్ఛుచిః । స్త్రీషుత్రిపురుషంజ్ఞేయం సపిండత్వంద్విజోత్తమాః॥" అని యనగా స్త్రీ పుట్టినపుడు సపిండునకును సోదకునకును మూడుదినములతో శుద్ధియగును- స్త్రీలకు సాపిండ్యముముగురు పురుషులవరకె యని తెలియునది-అట్లువసిష్ఠ వచనము "అప్రత్తానాంతు స్త్రీణాంత్రి పురుషీవిజ్ఞాయతే॥" అని ఇటులాశౌచము నౌరసునకే - దత్తుడుమొదలగునేకాదశపుత్రులకు జననముగాని మరణముగాని గల్గిన యెడరెండువిధములైన తలిదండ్రులకును త్రిరాత్రమె యాశౌచము - అట్లు స్మృతికౌముదియందు బ్రాహ్మవచనము- "ఔరసోయదినో పుత్రస్త్వథవా పుత్రికాసుతః । విద్యతేతత్ర తేషాంతు విజ్ఞేయాః క్షేత్రజాదయః । దత్తకశ్చ స్వయందత్తః కృత్రిమః క్రీతఏవచ । ఇత్యుపక్రమ్య- ఏకాదశపృథగ్గోత్రా వంశమాత్రకరాస్తుతే । శ్రాద్ధాది దాసవత్సర్వే తేషాంకుర్వంతి నిత్యశః । సూతకేమృతకేవాపి త్ర్యహాశౌచస్యభాగినః॥" అని యనగా నౌరస పుత్రుడు గాని దౌహిత్రుడుగాని లేనివారలకు క్షేత్రజాదిపుత్రులు వంశకరులగుదురు దత్తకుడు స్వయందత్తుడు కృత్రిముడు క్రీతుడు మొదలగువారని యుపక్రమించి యీపదునొకండు గురును వంశమాత్రకరులును దాసునివలె శ్రాద్ధాదులు చేయుదు

రు జననమరణాశౌచములు మూడేసి దినములేవారి విషయమగును - శుద్ధితత్త్వ
మందు నిట్లనేయున్నది - అట్లు జనకునికిని త్ర్యహాశౌచమే-అట్లు మనువచనము
"బైజికాదభిసంబంధా దనురుంధ్యాదఘంత్ర్యహ"మని- ఇట్లుజనకులు పాలకు
లనగు తల్లిదండ్రులు మృతినొందినను దత్తకపుత్రులకు మూడుదినములె యాశౌ
చము- ఇదియు విప్రులకె- శూద్రులకైనచో బంన్రెండు దినములు - అట్లుఋ
శ్యశృంగవచనము - "యత్రత్రిరాత్రం విప్రాణా మాశౌచంసంప్రదృశ్యతె। త
త్రశూద్రె ద్వాదశాహం షణ్ణవక్షత్రవైశ్యయోః॥" అని యనగా విప్రులకు త్రి
రాత్రాశౌచము విధించిన చోక్షత్రియుల కారుదినములును వైశ్యులకు తొమ్మిది
దినములును శూద్రులకుబంన్రెండు దినములు విధింపవలెనని యర్థముగల వచ
నమున్నదని మదనపాలుడు చెప్పెను - కనుక వర్ణవిశేషవివక్ష యక్కర లే
కుండగ త్రిరాత్రమువిధించినచోట ననగాసోదకుని విషయముదత్తకాదుల విష
యము నట్లువిధింపబడినది యచ్చటనే శూద్రునికి బంన్రెండుదినములు గాని తు
ల్యవయోవస్థా నిమిత్తమగు నాశౌచమందట్లుగాదు మరియేమనిన "తుల్యేవయసి
సర్వేషా మతిక్రాంతె తథైవచ॥" యనియపుడన్ని వర్ణముల వారికిని సమముగ
నే వ్యాఘ్రపాదునిచే విధింపబడినది - ఋశ్యశృంగాది వచనములు శిష్టాచార
విరోధముండుటచే నాదరింపగూడదని విజ్ఞానేశ్వరాదులు దేశాచారభేదమున వ్య
వస్థయగునని మదనపాలుడు - ఇట్లువ్యభిచారిణులైన స్త్రీలకును దత్తకాదు
లకును యథాక్రమముగ బ్రసవించునపుడును మృతినొందునపుడును పూర్వాపర
భర్తలకును జనకపాలకులగు తల్లిదండ్రులకును త్రిరాత్రమేయగును-అట్లు త్రి
రాత్రాశౌచము విధించు విష్ణుస్మృతి "అనౌరసేషు పుత్రేషు జాతేషుచ మృతేషు
చ। పరపూర్వాసుభార్యాసు ప్రసూతాసు మృతాసుచ॥" యనియు "సూత
కేమృతకె చైవత్రిరాత్రం పరపూర్వయోః॥" అని మరీచి వచనమును గలదు- అ
పుడు సపిండుల కొకదినమే - "ఏకాహస్తు సపిండానాం త్రిరాత్రం యత్రవైపి
తుః॥" అనియున్నది - ఇకయాజ్ఞవల్క్యవచనమెట్లు చెప్పుచున్నదనిన "అనౌర
సేషుపుత్రేషు భార్యాస్వన్యగతాసుచ॥" యని దత్తకాదులకును మారు మనువు
భార్యలకును నొకదినమేయనియున్నదిగాని యదిసపిండులకనియైనను దేశాంత
రాచారమనియైనను తెలియునది - మరియుబృహస్పతి వచనము - "అన్యాశ్రి
తేషుదారేషు పరపత్నీసుతేషుచ। మృతెష్వాశౌచ్యత్యశుద్ధ్యేత్తు త్రిరాత్రేణ ద్వి

జోత్తమాః॥" అని యనగా మారుమనువుభార్యలుగాని దత్తకాది పుత్రులుగా
ని మృతినొందిరేని మూడురాత్రులాశౌచమనుట - మాధవీయమందు హారీత వ
చనము - "పరపూర్వాసు భార్యాసు పుత్రేషు కృతకేషుచ । భర్తృణ పితౄ
స్త్రిరాత్రంస్యాదేకాహస్తుసపిండతః॥" అనియనగామారుమనువుభార్యమృతినొం
దినచో భర్తకునుదత్తకాదులు మృతినొందిరేనితలిదండ్రులకును త్రిరాత్రము సపిం
డులకొకదినమునసుట-ఇదియుద్విజులకే-శూద్రునికిద్వాదశాహముమీద జెప్పబడిన
ది-ఇక్కడమారుమనువుభార్యయనగా సవర్ణస్త్రీయని గ్రహించునది- హీనవర్ణ
స్త్రీయైనయెడనాశౌచమేలేదు అట్లు బ్రాహ్మవచనము "ఆశౌచంతుత్రి రాత్రంస్యా
త్సమవర్ణేషునిశ్చితం॥" అనియనగాసవర్ణస్త్రీలకే త్రిరాత్రమనియున్నది మొద
టివివాహమందును రెండవవివాహమందును భర్తలకు గల్గిన పుత్రులకుమరీచివ
చనము - "మాతురైక్యాద్ద్విపితృకౌభ్రాతరావన్యగోత్రజౌ । ఏకాహం సూ
తకంతత్రత్రిరాత్రం మృతకేతయోః ॥" అని యనగా నొకతల్లికి రెండు వివా
హములలో భిన్నగోత్రులై భర్తలకు బుట్టినసోదరులకు జాతాశౌచమొకదిన
మనియు పరస్పరమృతాశౌచము మూడు రాత్రులనియునర్థము - శూద్రుని
కైనచో వివాహముగాకున్నయెడనారుసంవత్సరములవయస్సుపైని మృతియయ్యె
నేని జాతికివిధింపబడిన యాశౌచమేయని కొందరు - అట్లుకాశ్యపాంగిరస వచ
నములు - "శూద్రేత్రివర్షాన్న్యూనేతుమృతేశుద్ధిస్తుపంచభిః । అత ఊర్ధ్వం మృ
తేశూద్రే ద్వాదశాహో విధీయతే॥" అని యనగాశూద్రుడు మూడువత్సరము
లలోగా మృతినొందెనేని నైదుదినములనియు నటుపైని బండ్రెండు దినములని
యు దాత్పర్యము - మరియు "షడ్వర్షాంతమతీతోయ శ్శూద్రస్స మ్రియతే
యది । మాసికంతు భవేచ్ఛౌచ మిత్యాంగిరసభాషితం॥" అని యున్నది యన
గా నారువత్సరములవయసుపై శూద్రుడు మృతినొందెనేని నొకమాసమాశౌచ
మనుట - ఇట్లు మేధాతిథియు "ప్రాగష్టమాచ్ఛుచిః ప్రోక్తోన్యైస్త్వా షోడశా
ద్బాలః॥" అని పదారువత్సరములవరకు బాల్యమనియంగీకరించువారికి నెనిమిది
వత్సరములపైని మృతిగల్గినచో మాసమాశౌచము కనుకనే "ఊర్ధ్వంతుషడ్భ్యో
వర్షేభ్యశ్శుద్ధి శ్శూద్రస్యమాసికీ" యనియు "అష్టవర్షస్యమాసః॥" అని కొన్ని
టిలోనున్నదని చెప్పెను - అపరార్కమందు శంఖవచనముమాత్రము పదారు
వత్సరములపైనివివాహముగాకున్నచో మాసమాశౌచమని - అట్లువచనము "అ

నూఢ భార్యశ్శూద్రస్తు షోడశాద్వత్సరాత్పరం । మృత్యుంసమధిగచ్ఛేచ్చేన్మా సాత్తస్యాపి బాంధవాః । శుద్ధింసమధిగచ్ఛంతి నాత్రకార్యావిచారణా॥" అని యున్నది - ఇక మదనపారిజాతమందు హారీతవచనము - "ఆమౌంజీబంధనా ద్విప్రః క్షత్రియశ్చధనుగ్రహాత్। ఆప్రతోదగ్రహాద్వైశ్య శ్శూద్రోవస్త్రద్వయ గ్రహాత్॥" అనియున్నది అనగానుపనయనపర్యంతము విప్రుడును ధనుస్సునుగ్ర హించుట పర్యంతము క్షత్రియుడును ప్రతోదమనగ మునికోలపట్టు పర్యంతము వైశ్యుడును వస్త్రద్వయముగ్రహించుటకు మున్నుశూద్రుడునుసములని - ఇక్కా డవస్త్రద్వయగ్రహణమనగ బదియారువత్సరము లనుట- పండ్రెండవవత్సరమున వస్త్రద్వయమని మదనుడుచెప్పెను - అది నిమూలము- ఇట్లు పరస్పరవిరోధ ము గల్గువచనములకు సదసచ్ఛూద్రుల విషయముగగాని యాపదనాప ద్విషయ ముగ గాని వ్యవస్థగల్పించుకొనవలెను - ఇక వివాహమైనపైని కన్యకపితృ గృ హమందు బ్రసవించినచో నొకరాత్రియు మృతినొందెనేని త్రిరాత్రము నాశౌచ మని విజ్ఞానేశ్వరాపరార్కులుచెప్పిరి - మాధవుడైనచో బ్రసవించినపుడును త్రి రాత్రమేతల్లిదండ్రులకనియు బంధువర్గమున కొకదినమనియును జెప్పెను- అ ట్లుబ్రాహ్మవచనము - "దత్తానారీపితుర్గేహే సూయేతా థమ్రియేతవా। త ద్బంధువర్గస్త్వేకేన శుచిస్తజ్జనకస్త్రిభిః॥" అని యనగా వివాహితకన్య ప్రస వించినను మృతినొందినను బంధువర్గమున కొకదినమును దండ్రికి మూడు దిన ములు నాశౌచమనుట - అట్లుకల్పతరుశుద్ధితత్వములలో కూర్మవచనము- "ద త్తానారీపితుర్గేహే ప్రధానే సూయతేయదా । మ్రియతేవాతదాతస్యాః పి తాశుద్ధ్యేత్త్రిభిర్దినైః॥" అని - ఇచ్చట తండ్రిగృహమనగ కాపురమున్నయి ల్లని విశేషమున్నది - పతిగృహమందు బ్రసవించినచో బితాదులకాశౌచములే దు - మృతియందు మాత్రము తల్లిదండ్రులకు ద్విరాత్రము తప్పదు - అట్లుమా ధవీయమందు గార్గ్యజనిస్మృతి"ప్రత్తాఽప్రత్తాసుయోషిత్సుసంస్కృతాఽ సం స్కృతాసుచ।మాతాపిత్రోస్త్రిరాత్రంస్యాదితరేషాం యథావిధి॥"అనియనగాద త్తలైనను గాకున్ననుసంస్కరింపబడినను లేకున్ననుగన్యలుమృతినొందుచోదల్లి దం డ్రులకు ద్విరాత్రమాశౌచమనుట - ఇక సోదరులకు భగినీ మృతియందాశౌచ మునకు శుద్ధితత్వమందు గూర్మవచనము "ఆదంతాత్సోదరేసద్య ఆచూడాదేక రాత్రకం । ఆప్రదానాత్త్రిరాత్రంస్యాద్దశరాత్రమతః పరం॥" అని యనగా

దంతోత్పత్తి లోగానైనచో నాపగలును చౌడములోగా నైనచో నొకరాత్రి యును వివాహము లోగానైనచో మూడు రాత్రులును అటుపైని పది రాత్రులును సోదరుల కాశౌచమనుట - దీని కపవాదము - బృహస్పతి వచనము - "శ్వశురయోశ్చ భగిన్యాంచ మాతులాన్యాంచ మాతులె । పిత్రోస్స్వసరితద్వచ్చ పక్షిణీం క్షపయెన్నిశాం॥" అనియనగా నత్తమామల మృతియందును భగినియు మేనమామయు నతనిభార్యయు మేనత్తపినతల్లియు వీరిమృతియందును వెనుకముందుపగళ్లతో గూడనొకరాత్రి పక్షిణ్యాశౌచమనుట - తల్లిదండ్రుల మృతియందు మాధవీయములో నుదాహరించిన వృద్ధమనువచనము - "పిత్రోరుపరమెస్త్రీణా మూఢానాంతుకథంభవేత్। త్రిరాత్రేణైవశుద్ధిస్స్యాదిత్యాహ భగవాన్యమః॥" అనియనగా వివాహితలైనస్త్రీలకు దలిదండ్రుల మృతియందుమూడు రాత్రులాశౌచమనుట - అన్నచెలియలునిద్దరకు బరస్పరము మృతియందుబక్షిణ్యాశౌచము-అట్లుబ్రాహ్మవచనము-"పరస్పరం మృతౌభ్రాతృభగిన్యోః పక్షిణీభవేత్॥" అనియున్నదిమఱియు షడశీతియందునిట్లున్నది- త్రింశచ్ఛ్లోకియందును-"ప్రేతేష్వాచార్య మాతామహదుహితృసుతశ్రోత్రియర్త్విక్స్వయాజ్యస్వస్రీయెషు త్రిరాత్రం త్రిదివస మశుచిస్సోదకస్తూభయత్ర । పక్షిణ్యాశౌచమృత్విగ్దుహితృసుత సహాధ్యాయి బంధుత్రయాంతెవాసిశ్వశ్రూసుమిత్రశ్వశుర భగినికాభాగినేయప్రయాణే।మాతామహ్యాంచపిత్రోస్స్వసరిచవిరతౌ మాతులెమాతులాన్యాం బాధోసజ్యోతిరేవస్వ విషయన్నృపతౌగ్రామనాథేచనష్టే । శిష్యోపాధ్యాయబంధుత్రయగురు తనయాచార్యభార్యాసగోత్రానూచాన శ్రోత్రియెషు స్వగృహపరమృతౌ మాతులే చైకరాత్రం॥ రాత్రింసబ్రహ్మచారిణ్యథతుకథమపిస్వల్ప సంబంధయుక్తె స్నానం వాసోయుతంస్యాదిదమపిసకలం సర్వవర్ణేషు తుల్యం॥" అనియున్నది- అనగానాచార్యుడు మాతామహుడును దౌహిత్రుడు శ్రోత్రియుడును ఋత్విజుడుననగాయజ్ఞము జేయించినవాడుయాజ్యుడనగాయజ్ఞము జేయింపబడినవాడు మేనల్లుడు వీరిమృతియందు త్రిరాత్రాశౌచము-సమానోదకునికి మృతియందును జన్మమందును మూడుదినములాశౌచము - ఇకఋత్విజుడుదౌహిత్రుడు సహాధ్యాయియుబంధుత్రియమనగా ముందుజెప్పెడు పితృమాతాత్మ బంధువులునుశిష్యుడునుఅత్తయు మిత్రుడునుమామయు చెలియలుమేనల్లుడు మాతామహునిభార్య

యయు మేనత్తయు బినతల్లియు మేనమామయు నతనిభార్యయు ననువీరిమృతియందు
బక్షిణ్యాశౌచము తనదేశాధిపతిగాని గ్రామాధిపతిగాని మృతినొందెనేనినక్షత్ర
దర్శనపర్యంత మాశౌచముమరియు శిష్యుడు నుపాధ్యాయుడు బంధుత్రయము
లోవారును గురుపుత్త్రుడు నాచార్యుని భార్యయు సగోత్త్రుడు సాంగప్రవచనా
ధ్యేతయు శ్రోత్రియుడును దనయింటి పొరుగు గృహాధిపతియు మేనమామయు
మృతినొందినచో నొకరాత్రి యాశౌచము అనగానిట్లుమీద జెప్పినదానికంటె ద
క్కువగుటకు దేశ దూరసామీప్యములు నుపకారా నుపకారములు వానిలో వ్యవ
ధానాదులును హేతువులుగా నూహించునది- మరియు సహాధ్యాయి మృతియం
దొకరాత్రియు మరియేవిధమైన స్వల్పసంబంధము గల్గువాని మృతిలోనను సచేల
స్నానముతప్పదు-ఇట్టియాశౌచ భేదములు సర్వవర్ణములకు సమానములు-వీనికి
మూలవచనములు మాధవీయమందునుమితాక్షరయందును దెలియునది-దౌహిత్త్రు
డుగాని మేనల్లుడుగాని వివాహముగాకమున్ను మృతినొందెనేనిబక్షిణ్యాశౌచము-
అటుపైనచో ద్రిరాత్రము- అట్లువృద్ధవచనము "సంస్థితే పక్షిణీం రాత్రిందౌహి
త్రే భగినీసుతే । సంస్కృతేతు త్రిరాత్రంస్యా దితిధర్మో వ్యవస్థితః॥" అనియున్న
ది- ఇక్కడసంస్కృత శబ్దమునకుదహనసంస్కారమర్థమని గౌడులుచెప్పిరి-యది
చింత్యము-సంకోచించివిశేషార్థముజెప్పుటకు బ్రమాణములేదు- శ్రోత్రియుడుత
నగృహమందు మృతుడయ్యెనేనితనకుత్రిరాత్రము-అట్లువచనము "శ్రోత్రియే
తూపసంపన్నే త్రిరాత్ర మశుచిర్భవేత్॥" అని-ఏకగ్రామమందైన చోనొక
దినము - ఇట్లుమీదజెప్పినట్లు మేనమామ మొదలగువారికి నూహించునది - ఇక
బంధుత్రయమనగ మితాక్షరయందున్నది - "ఆత్మపితృష్వసుః పుత్త్రా ఆత్మమా
తృష్వసుస్సుతాః । ఆత్మమాతుల పుత్త్రాశ్చ విజ్ఞేయా ఆత్మబాంధవాః ॥ పితుః
పితృష్వసుఃపుత్త్రాః పితుర్మాతృష్వ సుస్సుతాః । పితుర్మాతుల పుత్త్రాశ్చ విజ్ఞే
యాః పితృబాంధవాః ॥ మాతుః పితృష్వసుః పుత్త్రా మాతుర్మా తృష్వసుస్సు
తాః । మాతుర్మాతుల పుత్త్రాశ్చ విజ్ఞేయా మాతృబాంధవాః॥" అనియనగాదన
బంధువులును దండ్రిబంధువులును దల్లిబంధువులును బంధుత్రయ మనబడుదురు
వారెవ్వరనిన - మేనమామ పుత్త్రులు పినతల్లి పుత్త్రులు మేనత్త పుత్త్రులు
నని ఇట్లు ముగ్గురి బంధువులలో మృతిగల్గెనేని బక్షిణి యాశౌచ మగును-గౌ
డులు మాత్రము "సమానోదకానాం త్ర్యహం గోత్రజానామహస్స్మృతం

మాతృబంధౌ గురౌమిత్రే మండలాధిపతౌతథా॥" యనియనగా సోదకమృతి యందుత్రిరాత్రము సగోత్రమృతియందును మాతృబంధువులు గురువుమిత్రుడుదేశాధిపతియు వీరిమృతియం దొకదినమునని జాబాలవచన మున్నందున మాతృబంధువులకొక దినమాశౌచమందురు- ఇకమాధవీయమందు ప్రచేతసునివచనము "మాతృష్వసృ మాతులయోశ్శ్వశ్రూశ్వశురయోర్గురోః। మృతేచర్త్విజి యాజ్యేచ త్రిరాత్రేణవిశుద్ధ్యతి॥" అనియనగా పినతల్లి మేనమామయు నత్తమామలుగురువు ఋత్విజుడు యాజ్యుడు వీరిలోమృతిగల్గినేని త్రిరాత్రమాశౌచమనియున్నదిఅది స్వగృహమందైనచో నని తెలియునది - కానిచోపక్షిణియని వృద్ధమనువు-దేశాంతర మందైనయెడ నొకరాత్రి యాశౌచము-ఇట్లుస్యాలకునిమృతి యందును స్వదేశమందైనచో నొకదినము దేశాంతర మందైనయెడ స్నానము-అట్లు మాధవీయమందు విష్ణువచనము - "ఆచార్యపత్నీ పుత్రోపాధ్యాయమాతుల శ్వశురశ్వశ్రూశ్వశుర్యసహాధ్యాయి శిష్యేష్వేకాహం॥" అని- ఇందుశ్వశుర్యుడనగబావమరిది- హరదత్తుడును గౌడులునిట్లనిచెప్పిరి - ఇట్లుషడశీతియందున్నది - "ఏవంపిత్రోర్భగిన్యామేపితామహయోస్తథా। యేమాతామహయోశ్చైవ భగిన్యాతత్ప్రజాశ్చయాః। మాతులాస్స్వస్య పిత్రోశ్చ పత్న్యశ్చైషాం ప్రజాశ్చయాః। మాతరశ్చేతి సర్వేషు పక్షిణీ స్వగృహేత్ర్యహం। ఏవంశ్వశురజామాతృ దౌహిత్ర విపవిస్మృతం॥" అని-తలిదండ్రుల చెలియండ్రును-పితామహ దంపతులచెలియండ్రును మాతామహ దంపతుల చెలియండ్రును వారిసంతతియును తనయొక్కయు దలిదండ్రుల యొక్కయు మేనమామలు వారిభార్యలుసంతతియు తల్లులును నిట్లత్తమామలు దౌహిత్రుడునల్లుడును వీరిమృతిస్వగృహమందైన చోత్రిరాత్ర మునితరస్థలమందైనచో పక్షిణియనుట - ఇకవృద్ధమనువచనము. "భగిన్యాంసంస్కృతాయాంతు భార్యతర్యపిచసంస్కృతే। మిత్రేజామాతరిప్రేతే దౌహిత్రేభగినీసుతే।స్యాలకేతత్సుతే చైవసద్యస్స్నానేన శుధ్యతి॥" అనియనగా వివాహితభగినియు వివాహితభార్యయు మిత్రుడు నల్లుడు దౌహిత్రుడు మేనల్లుడు బావమరిదియునతని పుత్రుడు మృతినొందినచో సద్యస్స్నానముచే శుద్ధియని యున్నదిగాని - యిచట భార్యాదులు దేశాంతర మందును స్యాలక పుత్రుడు నల్లుడును స్వదేశ మందును మృతులైనచో నట్లు చేయుట యని తెలియునది. ఇక విష్ణుపురాణమందు - అసపిండుడు

తన గృహమందు మృతినొందెనేని నొకరాత్రియు దాసు గాపురమున్నయింటిలోనైనచో త్రిరాత్రమనియున్నట్లు మాధవుడు చెప్పెను- శుద్ధితత్వమందు బృహన్మనువచనము. "శ్వశూద్రపతితాశ్చాంత్యా మృతాశ్చేద్ద్విజమందిరే । శౌచంతత్ర ప్రవక్ష్యామి మనునాభాషితంపురా । దశరాత్రాచ్ఛుని భృతేమాసాచ్ఛూద్రేభవేచ్ఛుచిః । ద్వాభ్యాంతుపతితేగేహేచాంత్యే మాసచతుష్టయాత్ । అంత్యజే వర్జయేద్గేహమిత్యేవం మనురబ్రవీత్॥" అనియనగా నిక్కడద్విజయనునది యుపలక్షణము సంబోధనమైన గావచ్చునుగనుక నేవర్ణములోనైనను దనగృహమందు బోషింపబడు కుక్కమృతినొందెనేని పదిదినములు గృహమునకాశౌచము శూద్రుడట్లైన చోమాసమాశౌచము జాతిభ్రష్టుడు మృతినొందెనేని రెండుమాస ములు- మ్లేచ్ఛుడు మృతినొందిన నాల్గుమాసములు-చండాలుడట్లైనచో నాగృహము విడుచునది-మరియుమనువచనము. "ద్విజస్యమరణే వేశ్మ విశుధ్యతి దినత్రయాత్॥" అనియనగా ద్విజుడు తనగృహమందు మృతుడైన యెడ మూడుదినములు గృహమునకాశౌచమనుట - సంవర్తవచనము. "గృహశుద్ధిం ప్రవక్ష్యామి అంతస్థశవదూషితే । ఉత్సృజ్య మృన్మయంభాండం సిద్ధమన్నంతథైవచ । గోమయే నోపలిప్యాథఛాగేనఘ్రాపయేత్తతః । బ్రాహ్మణైర్మంత్రపూతైశ్చ హిరణ్యకుశవారిభిః । సర్వమభ్యుక్షయే ద్వేశ్మతతశ్శుధ్యత్య సంశయం॥" అనియనగా మీదజెప్పినటులా శౌచాంతమందు గృహమునకు శుద్ధియెట్లనిన వెనుకటికుండలును సిద్ధాన్నములును బారవైచిగోమయముతో నంతటనలికించి మేకచేనాఘ్రాణింపజేసి బ్రాహ్మణుల పుణ్యాహవాచనమంత్ర పూతములైన హిరణ్యదర్భోదకములచే నంతయుబ్రోక్షించినచో శుద్ధియగుననుట- ఇకనితరుని ప్రేతకర్మను ధర్మార్థమయినను జేసెనేని బూర్ణాశౌచము- అట్లు వచనము. "నిరన్వయేసపిండేతు మృతేసతిదయాన్వితః । తదాశౌచంపురాచీర్త్వాకుర్యాత్తు పితృవత్క్రియాం॥" అనియనగా కర్తృహీనుడై సపిండులలోనెవ్వడు మృతుడైనను దయావంతుడై యతనియాశౌచము వహించితండ్రికివలెకర్మచేయునదియనుట-"అట్లుదివోదాసీయమందును "సగోత్రోవాఽసగోత్రోవాయోగ్నిందద్యాత్సఖేనరః । సోపికుర్యాన్నవశ్రాద్ధం శుద్ధ్యేత్తుదశమేహని॥" యనియనగా సగోత్రుడుగాని యితరుడుగాని ప్రేతనుదహించువాడు శ్రాద్ధముగూడజేయుకతప్పదు పదిదినములకాశౌచ నివృత్తియగును ఇకయుద్ధమందుమృతు

డైనచో మనువచనము. "ఉద్యతైరాహవే శస్త్రైః క్షత్రధర్మహతస్య చ। సద్యస్సంతిష్ఠతే యజ్ఞ స్తథాశౌచమితి స్థితిః॥" అనియనగా యుద్ధమందు క్షత్రియధర్మముచే నెత్తిన ఖడ్గాద్యాయుధముల హతుడయ్యెనేని తత్కాలమందె ప్రేతకర్మ జరిగించవచ్చుననగా నాశౌచము లేదనుట. ఇక- "ఆహవే నిహతానాంచ ఏకరాత్రమశౌచకం॥" అని యుద్ధహతులైనచో నొకరాత్రియాశౌచమనియున్నదిగాని యది యుద్ధమందు దెబ్బదగిలి కాలాంతరమందు మృతినొందువారికని తెలియునది- సమీపమందైన చో నొకదినము దూరమున నైనచో స్నానమని మాధవీయము- ఇక భారతమందు రాజధర్మములలో। "అశోచ్యో హి హతశ్శూరస్స్వర్గలోకే మహీయతే। నహ్యన్న ముదకం తస్య నస్నానం నాప్యశౌచకం॥" అనియనగా యుద్ధమందు హతుడైన శూరుడు వీరస్వర్గము ననుభవించునుగనుక నతని కుదకమునన్నము స్నానమైనను జేయనక్కర లేదు విచారింపగూడదని శ్రాద్ధాదులకు నిషేధమున్నదిగాని యది పుత్రాదులు లేనిచో నని తెలియునది- కనుకనే యచట కర్ణాదులకు శ్రాద్ధాదులు జేయుట వర్ణింపబడినది- కొందరు యతులకువలె పదిపిండములిచ్చుటకు నిషేధమందురు- శుద్ధితత్త్వమందగ్ని పురాణవచనము -"దంష్ట్రిభిశ్శృంగిభిర్వాపి హతామ్లేచ్ఛైశ్చ తస్కరైః। యే స్వామ్యర్థే హతా యాంతి రాజన్ స్వర్గం నసంశయః। సర్వేషామేవ వర్ణానాం క్షత్రియస్య విశేషతః॥" అనియనగా కోరలుగల జంతువులచే గాని కొమ్ములుగల జంతువులచే గాని మ్లేచ్ఛులచే గాని దొంగలచే గాని స్వామికార్యార్థమై హతులైరేని సర్వవర్ణములవారును వీరస్వర్గమనుభవింతురు క్షత్రియులైనచో జెప్పెడిదేమి యనుట - ఇక బృహస్పతి వచనము- "డింబాహవే విద్యుతాచ రాజ్ఞాగో విప్రపాలనే। సద్యశ్శౌచం మృతస్యాహుః త్ర్యహం వాన్యే మహర్షయః॥" అనియనగా యుద్ధమందుగాని పిడుగుపడిగాని రాజశిక్షచే గాని గోవిప్రుల రక్షించుటకుగాని ప్రాణత్యాగము చేయువారి కాశౌచమక్కర లేదని యొక్క పక్షము మూడు దినములాశౌచ మని కొందరి మతమనుట - ఇచట శస్త్రము లేకుండగ గాని లేదా పరాఙ్ముఖుడై పారిపోవునపుడుగాని హతుడైనచో త్రిరాత్రమనియు లేనిచో సద్యశ్శౌచమనియు రాజశిక్షచే వధ్యుడై హతుడైనచో సద్యశ్శౌచమట్లు గానిచో త్రిరాత్రమనియు దెలియునది- అందు వ్యాఘ్రవచనము- "క్షతేన మ్రియతే యస్తు తస్యాశౌచం భవేద్ద్విధా। ఆసప్తాహాత్త్రిరాత్రం స్యాద్దశరాత్ర మతః పరం। శస్త్రాఘాతే త్ర్యహాదూర్ధ్వం యదిక

శ్చిత్ప్రమీయతే । ఆశౌచం ప్రాకృతంతత్ర సర్వవర్ణేషు నిత్యశః॥" అనియనగా శస్త్రక్షతుఁడై మృతినొందినచో నాశౌచము రెండు విధములు ఎట్లనిన - ఏడురోజుల లోగానైనచో త్రిరాత్రాశౌచము అటుపైని పదిదినములాశౌచమనియు శస్త్రఘాతమైనపై మూఁడు దినములు దాటి మృతినొందెనేని యెప్పటి యాశౌచమనఁగ జాత్యాశౌచమనియు తెలియునది - ఇక్కడశస్త్రి ఘాతమనగా గాయములేని దెబ్బయనుట- శవమును స్పృశించియు మోసియు తద్గృహమందు నివసించియు తదన్నముభుజించియు నున్నవానికి శవజాతికి విధించిన యాశౌచమగును-తద్గృహవాసముమాత్రమే యైనచో త్రిరాత్రము- వాసమునన్న- భక్షణములేనిచో నొకదినము మూల్యమునకు శవము మోసెనేని మాసమాశౌచము- విజాతీయశవమును మోసెనేని దజ్జాత్యాశౌచమగును-మూల్యముగూడ గ్రహించినచో ద్విగుణము- ఆపత్కాలమనగ దనకిబ్బందిచే గ్రహించునెడ సమముగ నాశౌచము సోదరుని శవము మోసినచో బూర్ణాశౌచము బుద్ధిపూర్వముగ శవాలంకరణము జేసిన పాదకృచ్ఛ్రములేనిచో నుపవాసము - దిక్కులేని శవమును ధర్మార్థముగ మోసిసంస్కరించెనేని ననంతఫలము- స్నానమాత్రముచే శుద్ధియునగును - అట్లపరార్కమందు వృద్ధపరాశరవచనము "వోఢాచైవాగ్ని దాతాచసద్యస్స్నాత్వావిశుధ్యతి" యని - మేనమామమొదలగు వారియున్నను మిత్రత్వాది సంబంధమున్నను త్రిరాత్రాశౌచము - గౌతమవ్యాఖ్యలో వృద్ధాత్రివచనము. "సూతకాద్ద్విగుణం శావంశావాద్ద్విగుణ మార్తవం।ఆర్తవాద్ద్విగుణా సూతి స్తతోపి శవదాహకః॥" అనియనగా జాతాశౌచపుమైలకంటె మృతాశౌచపుమైల రెండు రెట్లధికము దానికంటె ముట్టుమైల ద్విగుణము-దానికంటె బ్రసవించినస్త్రీమైలద్విగుణముదానికంటెశవమును దహించినవానిమైల ద్విగుణము - అనుట - శవముతో శ్మశానపర్యంతము నడిచివెళ్లుటయందు సపిండుఁడైనచో దోషములేదు - సపిండుఁడుగానిచో సజాతీయుఁడైన యెడస్నానము ఘృతభక్షణము పక్షిణియు - ఉత్తముఁడైన యెడస్నానముమాత్రమే-రోదనమనగా నాపత్కాలమందు పరామర్శించుట - అదిస్పర్శములేకుండగ శూద్రునికి శూద్రుఁడు సంచయనములోగా జేసినచో నొకదినము - ఆపైనిసజ్యోతి యనగనక్షత్రదర్శన పర్యంతమని మాధవీయము చెప్పును- శుద్ధితత్వమందు పారస్కరవచనము. "అస్థిసంచయనాదూర్ధ్వంమాసం యావద్ద్విజాయతే । దివసేనైవశుధ్యంతి వాససాంక్షాలనేనచ ।. సజాతేర్దివసేనైవ

త్ర్యహాత్ క్షత్రియవైశ్యయోః॥” అనియనగా నస్థిసంచయనమైన పైనిమాసము
లోగా సజాతీయునికిపరామర్శరోదనము జేసినచోబట్టలు దడుపుకొనియొక దిన
మాశౌచము బట్టునది - క్షత్రియవైశ్యులకైన చోత్రిరాత్రాశౌచమనుట- సపిం
డులకైన నెడదోషములేదు-మితాక్షరలో పారస్కరవచనము మాత్రము“మృత
స్యబాంధవైస్సార్ధం కృత్వాతు పరిదేవనం। వర్జయేత్త దహోరాత్రం దాన
శ్రాద్ధాదికర్మచ”యని యంతటను నొకరాత్రియె యాశౌచమని చెప్పెను- ఇకనా
శౌచియన్నము ప్రమాదమున భక్షించినచోనది జీర్ణమగువరకు నాశౌచము బుద్ధి
పూర్వముగ భక్షించెనేని శూద్రునికి స్నానమాత్రమే - ఇకదాసాశౌచము - అం
దుదన దాసియందు బుట్టినదాసునికి దనసపిండునిమృతిలో స్నానమాత్రముచే స్వా
మికార్యకరణమునకై శుద్ధియగును- ఇకభక్తదాసుడనగ దనయింట నన్నముదిను
చుజీవించు దాసునికిమాత్రము మూడుదినములాశౌచమగును అట్లుమితాక్షరలో
స్మృత్యంతరవచనము- “సద్యశ్శౌచో గర్భదాసో భక్తదాస స్త్ర్యహాచ్ఛు
చిః॥” అని-మరియు“మూల్యకర్మకరాశ్శూద్రా దాసీదాసా స్తథైవచ।స్నానేశరీర
సంస్కారే గృహకర్మణ్య దూషితాః॥” అనియనగా కూలికిపనిచేయుశూద్రు
లును దాసీదాసాదులును స్నాన మాత్రముననే గృహమందు బనిజేయ
వచ్చును - అనిశాతాతప వచనమున్నది - అచ్చటనేదత్తుడు మొదలగు పదుము
గ్గురుదాసులకును స్వామ్యాశౌచ సమసంఖ్యములైన దినములపైనిమాసముపర్యం
తమగుదమ యాశౌచమున్నప్పటికిని స్వామికార్యము జేయుటకు శుద్ధియగును-అ
ట్లుబృహస్పతి స్మృతివచనము- “దాసాంతేవాసి భృతకాః శిష్యాశ్చైకత్రవా
సినః। స్వామి తుల్యేన శౌచేన శుద్ధ్యంతి మృతసూతకే॥” అనిఅనగా నొక్కగృ
హమందునివసించిన శిష్యులునుదాసులు భృత్యులునుస్వామి జాతీయాశౌచముచే
మృతసూతకములందు శుద్ధులగుదురనుట అదియుస్వామి కార్యముజేయుటకే మ
రితమ పుణ్యకార్యమునకు మాత్రముమాసము మొదలగు నాశౌచముతప్పదు - ఇ
ట్లుదాసికి నని తెలియునది - ప్రసవించెనేని దానికిని స్వామికార్యమందును మాస
మాత్రమే- అట్లంగిరసు వచనము- “దాసీదాసశ్చ సర్వోవై యస్యవర్ణస్య యో
భవేత్। తద్వర్ణస్య భవేచ్ఛౌచం దాస్యామాసస్తు సూతకం॥” అనియనగాదాసీ
దాసాదులకుదమస్వామి జాత్యాశౌచము గల్గునుదాసి ప్రసవించెనేని మాసమగు
ననుట- ఇట్లుషడశీతియందును-“స్వామిశౌచేన దాసాద్యా స్సప్రశ్యామాసాత్తుక

ర్మణసు । యోగ్యాస్స్వర్ణా సతోదాసీసూతీచే త్స్వస్పృశ్యతామియాత్॥" అనియు
న్నదిఅనగా దాసుడుమొదలగు వారుస్వామిజాతికి జెప్పిన యాశౌచముచే శుద్ధు
లై స్పృశింప దగుదురుగాని పుణ్యకర్మ జేయుటకు మాసము పర్యంతము గావల
యునుదాసిప్రసవించెనేనియట్లనెమాసమాశౌచమగుననుట-దాసులుపదునైదువి
ధములుగ నారదునిచే జెప్పబడిరి- "గృహేజాత స్తథాక్రీతో లబ్ధోదాయా దు
పాగతః । అన్నకాలభృతస్తద్వ దాహితస్స్వామి నాచయః । మోక్షితో మహ
తశ్చర్ణాద్యుద్ధప్రాప్తః పణేజితః । తవాహమిత్యుపగతః ప్రవ్రజ్యావసితః కృతః ।
భక్తదాసశ్చ విజ్ఞేయ స్తథైవబడబాహృతః । విక్రేతాచాత్మన శ్శాస్త్రేదాసాః
పంచదశస్మృతాః॥" అనియనగా గృహదాసికి బుట్టినవాడు మూల్యమిచ్చికొన
బడినవాడు దొరికినవాడుదాయ భాగమందు వచ్చినవాడు నొకసమయ మందు
బోషింపబడినవాడును బ్రస్తుతము తైనాతీనొకరై యున్నవాడు గొప్పఋణము
నుండి విడిపింప బడినవాడు యుద్ధమందు జితుడైనవాడు పందెములో నోడి
దాసుడైనవాడు శరణాగతుడు వైరాగ్యముచే నిలువదలి చేరిన వాడు జీత
మునకై భృత్యుడు భక్తిచేదాసుడు దాసినిమరిగిచేరినవాడు స్వయముగాయావజ్జీ
వముదనునమ్మికొనిన వాడుననియీ పదునైదుగురుదాసులు - అట్టిదాసాదులకు
స్వామి మరణమందును వానిసపిండుని మరణమందును విష్ణువచనము-"పత్నీనాం
దాసానామానులోమ్యేనస్వామితుల్య మాశౌచంమృతేస్వామి న్యాత్మీయం॥" అ
నియనగా నుత్తమవర్ణమునకు దాసుడైనను పత్నియైనను స్వామిసపిండ మరణ
మునస్వామిజాతీయాశౌచము బట్టునది - స్వామిమరణమందు దనజాతికివిధింపబ
డిన యాశౌచము వహింపవలెననుట- "ఇకవర్ణానామానులోమ్యేనదాస్యోన
ప్రతిలోమతః॥" అనియనగా నుత్తమవర్ణమునకు నితరజాతీయుడు దాసుడగు
నుగాని యితరజాతీయుని కుత్తమజాతీయుడుదాసుడుగాడని యాజ్ఞవల్క్యస్మృ
తిచే నిషేధింపబడినప్పటికి దాని నతిక్రమించిదాస్యము జేసిననుస్వామ్యాశౌ
చమంటదు "ఆనులోమ్యేనాశౌచ"మని విష్ణుస్మృతిచెప్పుచున్నది-అట్టిసర్వవిధమైన
యాశౌచముగాని రజోదర్శనముగానిరాత్రిజెలసినచోరాత్రిమూడు భాగములజే
సి-రెండుభాగములుపూర్వదినమందునునుత్తరభాగమునుత్తరదినమందునుభావించు
టయొకపక్షము-లేదాయర్ధరాత్రమునకు పూర్వమైనచో పూర్వదినముపైనైనచో
బరదినమని రెండవపక్షము-లేదాసూర్యోదయ పర్యంతము పూర్వదినమె యని

మూడవపక్షము - ఇట్లుమితాక్షరాదులందున్నది ఇక్కడ దేశాచారము చొప్పున వ్యవస్థ జేసుకొనవలెను- ఇకనతిక్రాంతాశౌచము - అందాశౌచ మధ్యమందు దెలసినచో దాని శేషముతో శుద్ధియగును - అట్లుయాజ్ఞవల్క్యవచనము. "నాధికం ప్రోషితేకాలే శేషస్స్యాత్" అని - ప్రసవాశౌచమందతిక్రాంతాశౌచములేనేలేదు- అట్లు దేవలవచనము- "నాశుద్ధిః ప్రసవాశౌచెవ్యతీతెషు దినేష్వపి॥" యనియనగా జాతాశౌచములో దినములు దాటినయెడ నాశౌచములేదనుట-తండ్రికిస్నానము మాత్రము తప్పదు-ఇకమృతాశౌచ దినములన్నియు దాటినపైని దెలసినచో వృద్ధవసిష్ఠవచనము-"మాసత్రయె త్రిరాత్రంస్యాత్ షణ్మాసే పక్షిణీతథా । అహస్తునవమాదర్వాగూర్ధ్వం స్నానేన శుధ్యతి" అనియనగా మూడు మాసములలోగా దెలిసినచో త్రిరాత్రము నారుమాసములలోగానైనచో బక్షిణి-తొమ్మిది మాసములలోగా దెలసినచో నొకదినము నటుపైని స్నానముచే శుద్ధి యగును- అనుట - ఇదిపూర్ణమగు జాత్యాశౌచవిషయముగాని - వయోవస్థానిమిత్తమగు నాశౌచ విషయముగాదు- అట్లు మనువచనము"అతిక్రాంతె దశాహేతు" అనిమొదలగునది - ఇకమాధవీయమందు దేవలవచనము - "ఆత్రిపక్షాత్త్రిరాత్రం స్యాత్ షణ్మాసాత్పక్షిణీతతః - పర మేకాహమావర్షాదూర్ధ్వం స్నాతో విశుధ్యతి॥" యనియనగా మూడుపక్షములలోగా దెలిసెనేని త్రిరాత్రము నారుమాసములలోపున బక్షిణియునాపై సంవత్సరము వరకునొక దినమునటుపైని స్నానముచే శుద్ధియని యున్నది యది దనకిబ్బంది లేనిచో నని తెలియునది - ఇదియు స్వదేశ మందైనయెడ ననిగ్రహించునది- దేశాంతర మందైనచో స్నానమాత్రమే- "దేశాంతరమృతంశ్రుత్వాక్లీబే వైఖానసే యతౌ మృతెస్నానేన శుధ్యంతి గర్భస్రావేచ గోత్రిణః" అనివిజ్ఞానేశ్వరీయములో బరాశర వచనము- అనగా దేశాంతరస్థుని మృతి గాలాంతరమందు విన్నను నపుంసకుడు వానప్రస్థుడు సన్యాసియు వీరిలోనొకడగు బంధుడు మృతినొందినను సగోత్రులలో గర్భస్రావమైనను స్నానముచే శుద్ధియనుట- ఇకమాధవీయ మందు విష్ణుస్మృతి మాత్రము"అర్వాక్త్రిపక్షాత్త్రినిశంషణ్మాసాచ్చదివానిశం । అహస్సంవత్సరాదర్వాగ్దేశాంతరమృతెష్వపి" యని దేశాంతర మృతి విన్నపుడును మీదజెప్పిన పక్షములు చెప్పుచున్నదిగాని యిచ్చట నాపదనాపద్విషయముగ విరోధ పరిహారము జేసుకొనవలెను.

దేశాంతరమెట్టిదనిన బృహస్పతివచనము - "మహానద్యంతరం యత్రగిరిర్వావ్య వధాయకః । వాచోయత్ర విభిద్యంతే తద్దేశాంతరముచ్యతే॥" అనియనగాగొ ప్పనదులుగాని మహాపర్వతముగాని వ్యవధానముగనుండి దేశభాష భేదించినచో దేశాంతర మనబడుననుట - అనగానిచ్చట వాశబ్ద మొక్కటియె యున్నందున భాషాభేద ముభయవిశేషణమై రెండె పక్షము లనిగ్రహించునది తల్లిదండ్రులవి షయమైనచో దేశాంతరమైనప్పటికి బూర్ణముగనె యాశౌచము- అట్లు పార స్కరవచనము "పితరౌచేన్మృతౌస్యాతాం దూరస్థోపిహి పుత్రకః । శ్రుత్వా త ద్దినమారభ్యదశాహం సూతకీభవేత్॥" అనియనగా పుత్రుడు దేశాంతర మం దున్నను తల్లిదండ్రులమృతి విన్నదిమొదలుగ బదిదినము లాశౌచముబట్టకతీరదు- ఇట్లుదంపతులకును సవతులకును బరస్పర మాశౌచమని స్మృత్యర్థ సారమందు న్నది - సవతి తల్లికిమాత్రము త్రిరాత్రము-వ్యాఘ్రవచనము "తుల్యంవయసిసర్వే షామతిక్రాంతే తథైవచ॥" యని-ఆశౌచసంపాతమనగ నొకమైలలో మరియొక మైలవచ్చుట అందు బూర్ణాశౌచముయొక్క రెండవదినము మొదలగువానియం దు సజాతీయా శౌచముగాని శావాశౌచమందు జాతాశౌచముగాని సమన్యూ నాధికభావములుగల్గి పడినచో నారుపక్షములందును పూర్వాశౌచ శేషముచేశు ద్ధియగును-ఎట్లనిన - పదిరోజుల పురిటిలో పదిరోజులదిగాని యంతకుతక్కువ దిగాని పురుడు పడినచోమొదటి పురుడుతో శుద్ధియగును ॥౧॥ ఇట్లు పదిరోజుల మృతాశౌచములో నంతటిదిగాని తక్కువదిగాని మృతాశౌచము పడెనేని పూ ర్వముచేశుద్ధి ॥౨॥ అట్లుపదిరోజుల మృతాశౌచమందంతటిదిగాని తక్కువదిగా ని జాతాశౌచముపడెనేని నట్లనేపూర్వముతో శుద్ధి ॥౩॥అట్లుత్రిరాత్ర మృతాశౌ చములో నంతటిదిగాని తక్కువదిగాని మరియొకమృతాశౌచమైనను త్రిరాత్ర జాతాశౌచమైనను బడినచో బూర్వాంతమందు శుద్ధియగు ॥౪॥ అట్లుత్రిదినజా జాతాశౌచ మందంతటిదె జాతాశౌచము పడెనేని బూర్వముచే శుద్ధి ॥౫॥ అ ట్లుపక్షిణీ మృతాశౌచమందు మరియొకపక్షిణి గాని యొకదినముందు మృతాశౌ చముగాని పడినచో బూర్వాంతమందు శుద్ధియగును ॥౬॥ అనిగ్రహించునది - అట్లుయాజ్ఞవల్క్యవచనము "అంతరాజన్మమరణే శేషాహోభిర్విశుధ్యతి॥" యని గౌడులుమాత్ర మిట్లుపూర్ణాశౌచమందెకానిత్య్రిహాశౌచమందైనచో నుత్తర సమాప్తిచేతనే శుద్ధియండ్రు - హరదత్తుడు నిట్లనే చెప్పెను-ఇతరులు దానియం

దును బూర్వముచేతనే శుద్ధియందురు - ఇకబురిటిలో మృతాశౌచము సమమైన దిగాని తక్కువదిగాని పడెనేని మృతాశౌచాంతమందేశుద్ధిగానిపూర్వశేషముచే శుద్ధిలేదు - ఏమనిన పురిటికంటెమైలలో నశుద్ధియధికము - అట్లుషట్త్రింశన్మతవచనము "శావేనశుధ్యతె సూతిర్నసూతిశ్శావశోధినీ"-యని-మరియు కూర్మపురాణవచనము "మరణోత్పత్తి యోగేతుగరీయో మరణంభవేత్॥" అనియనగా బురిటికంటె మృతాశౌచమెక్కుడనుట- ఇకషడశీతిలోమాత్రము "స్వభావబహుసూతిస్తున్యూనశావ విరోధినీ॥" అనియనగా నెక్కుడుదినములుండు స్వభావముగలపురిటిలో దక్కువ స్వభావముగల మృతాశౌచము పోవుననియున్నది-మరియు త్రిరాత్రాశౌచమధ్యమందు సజాతీయముగాని విజాతీయముగాని దీర్ఘకాలమైన మరియొకయాశౌచము పడెనేని పూర్వముచే శుద్ధికాదని యపరార్కమతము- శుద్ధివివేకమందు "శావేనశుధ్యతెసూతిః" అనియవిశేషముగ జెప్పినందున పూర్వముచేశుద్ధియగుననియున్నది-అదిచింత్యము- రెండవదానికి కాలాధిక్యముండుటచేబూర్వమునకంటె బలవత్తరమగును-ఎట్లనిన "యదాత్రిరాత్రేప్రక్రాంతే దశాహంప్రవిశేత్తదా। ఆశౌచంపునరాగచ్ఛేత్తత్సమాప్య విశుధ్యతి॥" అనియనగా త్రిరాత్రాశౌచమందు దశాహాశౌచముపడెనేని రెండవయాశౌచము దాటెడువరకు నాశౌచముండునని యమవచనమనిమాధవ హారదత్తమితాక్షరాదులు - ఇది "శావేనశుధ్యతె సూతిః" అనువచనమునకు బాధకము - అట్లుగానిచో వచనమెవ్యర్థమగును - కనుకసూత్యాశౌచముచే త్రిరాత్రాశౌచము శుద్ధినొందిననుశావ నిమిత్తమైన యస్పృశ్యత్వముండక తీరదు-ఏమనిన "గరీయోమరణంభవేత్" అని కూర్మవచనమున్నది - పూర్వశేషముచే శుద్ధియనుట కపవాదము శాతాతపవచనము - రాత్రిశేషేద్వ్యహా చ్ఛుద్ధిర్యామశేషే శుచిస్త్ర్యహాత్॥" అనియనగా బూర్వాశౌచమందు రాత్రిశేషమనగా నొకరాత్రులు మిగిలినయెడ రెండుదినములధికము పట్టవలెను జాముమిగిలినచో మూడుదినము లధికము బట్టునది - కనుకనే శంఖలిఖితవచనము- "అహశ్శేషే ద్వాభ్యాం ప్రభాతేతిసృభిః॥" అనియనగానొక పగలు మిగిలెనేని రెండుదినములు ప్రాతఃకాలమందె పడినచో మూడు దినములని యున్నది - మరియు బౌధాయనవచనము "అథయదిదశరాత్ర సన్నిపాతేపునరాద్యం దశరాత్రమాశౌచ మానవమా ద్దివసాదత ఊర్ధ్వం ద్విరాత్రేణవ్యుష్టాయాం త్రిరాత్రేణ" యని యనగా దశాహాశౌచమందు దొమ్మిదవరో

జులోగా మరియొక దశరాత్రాశౌచము పడినచో మొదటియాశౌచమే యటు
పైని రెండుదినములు ప్రాతఃకాలమున నైనచో ద్విరాత్రమనుట - అనిపరా
శరమాధవ హారలతా శుద్ధితత్త్వాదులు చెప్పును - గౌడులు నిటులనే చెప్పు
దురు - రాత్రిమాత్రమే మిగిలినచో నన-విజ్ఞానేశ్వ రాదులు- ఇచటదేశాచార
మునుబట్టి వ్యవస్థను గల్పించుకొనునది - తక్కినవిశేషము నిర్ణయ సింధువున
దెలియునది - ఒకరాత్రి మిగిలియున్నపుడు త్రిరాత్రాద్యా శౌచము పడునేని
బూర్వశేషముచే శుద్ధియగును - అట్లుపూర్వా శౌచాంతమం దధికముగబట్టు
రెండుమూడు దినములలో మరియొక యాశౌచము పడెనేని వృద్ధ్యాశౌచము
స్వల్పము గనుక నుత్తరాశౌచాంతము నందె శుద్ధియగును - ఇకవృద్ధి దినము
లు పూర్వాశౌచ శేషమనగూడదు రాత్రిమాత్రము శేషించి నపుడు పూర్వ
శేషశుద్ధి కపవాదముగ నైమిత్తిక న్యాయము జీవించినది - అపవాదము లే
నిచో నుత్సర్గము ప్రవర్తించునుగదా - కనుక నట్టియెడపదిదినము లాశౌచ
ముతప్పదు - మరియు నపవాదాంతరము- శంఖవచనము- "మాతర్యగ్రేప్రమీ
తాయా మశుద్ధౌమ్రియతేపితా। పితుశ్శేషేణ శుద్ధిస్స్యాన్మాతుఃకుర్యాత్తు పక్షి
ణీం॥" అని యనగా దల్లిమృతినొందిన నాశౌచ మధ్యమందు దండ్రిమృతి నొందె
నేని శేషముచే దండ్రియాశౌచమునివర్తించును తండ్రిమృతిచేగల్గు నాశౌచము
లోదల్లిమృతినొందెనేని నాశౌచాంతమందు దల్లికిపక్షిణి బట్టవలెను - అదియు
పదియవదినములోగా మాతృమరణమైనచో నని తెలియునది దశమరాత్రియందు
గాని నాటిప్రభాతమందుగాని తల్లిమృతియైనచో ద్వ్యహాశౌచము త్ర్యహాశా
చము గూడ పక్షిణియగునని సముచ్చయము కొందరండ్రు - అదిచింత్యము-దిన
సంఖ్యాకాధిక్యమువచ్చును గనుక త్ర్యహాదిశ్రుతికి బాధగల్గును - కనుకనే "ఏ
కాదేయాషడ్దేయాః॥" అనివినిపించెడు సంఖ్యకుబాధగల్గును గనుక సముచ్చయ
ముగూడదని పూర్వమీమాంసలో పండ్రెండవయధ్యాయమందున్నది - తల్లి స
హగమనము జేసెనేని బక్షిణియక్కరలేదు - అట్లుపృథ్వీచంద్రోదయమందు ల
ఘుహారీతవచనము - "యదానారీవిశేదగ్నిం ప్రియస్య ప్రియవాంఛయా। తదా
శౌచం విధాతవ్యం భర్తృశౌచక్రమేణహి॥" అనియనగా ప్రియుని యందు
మోహముచే స్త్రీ పెనిమిటిచితిలో ప్రవేశించెనేనియామె యాశౌచముభర్త్రా
శౌచముతోడనె నివర్తించును - కనుక తల్లిదండ్రుల యాశౌచమునకు భర్త

యాశౌచమునకును మరియొక సపిండుని యాశౌచముతో శుద్ధికా నేరదు "శ్రు
త్వాతద్దినమారభ్య దశాహం సూతకీభవేత్॥" అని మీదవ్రాయబడినది భర్త
యాశౌచమైనప్పైననుగమనముజేసెనేని త్రిరాత్రాశౌచము - అట్లు పరార్కమం
దు బ్రాహ్మవచనము - "త్రిరాత్రాశౌచేతు నిర్వృత్తే శ్రాద్ధం ప్రాప్నోతి శాస్త్ర
తః॥" అని యున్నది - సహగమనమందు సంపూర్ణాశౌచమె - యుద్ధహ
తునికి సద్యశ్శౌచమున్నప్పటికిని భార్యయనుగమనముజేసెనేని బ్రాహ్మ వచనము
న త్రిరాత్రానంతరమందె భర్తకును పిండదానము - ఒక్కచితియందె సహగ
మనమయ్యెనేని సద్యశ్శుద్ధియగును మరియు షడశీతిలోవచనము "పూర్వాశౌచే
న యాశుద్ధి స్సూతకె మృతకేచసా । సూతికామగ్నిదంహిత్వా ప్రేతస్యచ సు
తానపి॥" అని యనగా పూర్వాశౌచముతో శుద్ధిజాతాశౌచమృతాశౌచముల
కు రెంటికినగునుగాని సూతికాస్త్రీకి నగ్నిసంస్కారము జేసిన వానికి ప్రేత పు
త్రులకు నట్లుకానేరదు - అట్లుమృతాశౌచమధ్యమందు పుత్రోత్పత్తిగల్గెనేని జా
తకర్మాదులు చేయవచ్చును మరియు తల్లికధికముగ బట్టుపక్షిణీ మధ్యమందు
దండ్రికేకాదశశ్రాద్ధము వృషోత్సర్జనము మొదలగునవి చేయ వచ్చునని దేవ
యాజ్ఞికుడు-ఇకనాశౌచమాత్రమునకపవాదము-శుద్ధితత్వములోకూర్మవచనము-
"సద్యశ్శౌచ సమాఖ్యాతం దుర్భిక్షేవాప్యుపద్రవె । డింబాహవహతానాంచ
విద్యుతాపార్థివైర్ద్విజైః॥" అనియనగా దుర్భిక్షమందును అత్యంతమరణో
పద్రవముగల్గినపుడును యుద్ధమృతునివిషయమును పిడుగుపడి మృతినొందినను
రాజుబ్రాహ్మణుడు వీరిచే మృతిగల్గినను సద్యశ్శుద్ధియగుననుట- అట్లుపరాశరవ
చనము "ఉపసర్గమృతేచైవ సద్యశ్శౌచం విధీయతే॥" అని యుపసర్గమనగాన
త్యంతమారకమని శూలపాణిహారలతాదులు చెప్పును - అట్లుమరణ కాలమం
దు దానాదుల విషయమై సద్యశ్శౌచము - "ఆపద్యపిచకష్టాయాం సద్యశ్శౌచం
విధీయతే॥" యని యాజ్ఞవల్క్యవచనము అనగా నాపత్కాల మందు గరిల
కాశౌచములేదనుట- శుద్ధిరత్నాకరమందు దక్షవచనము - "స్వస్థకాలేత్విదంస
ర్వం సూతకం పరికీర్తితం । ఆపద్గతస్యసర్వస్య సూతకేపినసూతకం॥" అన
గా స్వస్థుడైనపుడె యీయాశౌచముగాని - యాపత్కాలమందు లేదనుట-మ
రీచిప్రచేతసునివచనము - "కారవశ్శిల్పినో వైద్యాదాసీదాసాస్తథైవచ। రాజా
నోరాజభృత్యాశ్చ సద్యశ్శౌచాః ప్రకీర్తితాః॥" అనగా "కారవస్సూపకారా

వైశిల్పినశ్చైల ధావకాః" యని యున్నందునవంటవాండ్రును చాకళ్లును దాసీ దాసాదులును రాజులు రాజభృత్యులును వారివారి కార్యములకు సద్యశ్శుద్ధు ల నుట - అట్లు లఘువిష్ణువచనము - "వ్రతయజ్ఞ వివాహేషుశ్రాద్ధే హోమేచరా నేజపే । ఆరబ్ధె సూతకంనస్యా దనారబ్ధెతు సూతకం॥" అనగా వ్రతము య జ్ఞము వివాహముశ్రాద్ధముహోమము దేవపూజయు జపమునివి ప్రారంభించిన పైని సూతకమువచ్చిన నంటదని"ఆరంభోవరణంయజ్ఞేసంకల్పోవ్రతసత్రయోః । నాందీముఖం వివాహాదౌ శ్రాద్ధె పాకపరిక్రియా॥" యని యున్నది వ్రతాదుల కారంభమెట్టిదనిన - యజ్ఞమందు ఋత్విజుల వరించుటయు వ్రతమందునన్నస త్రమందును సంకల్పించుటయు వివాహాదికమందు నాందీశ్రాద్ధము జేయుటయు శ్రాద్ధమందు పాకముప్రోక్షించుటయు నారంభమనబడుననుట - కనుక "నవ్రతి నాంవ్రతె"యనువిష్ణువచనము నారబ్ధవిషయమేయని తెలియవలెను-మరియుత్రింశ చ్ఛ్లోకియందు "నప్రారబ్ధేషుదానోపనయనయజనశ్రాద్ధయుద్ధప్రతిష్ఠాచూడాతీర్థా ర్థయాత్రాజపపరిణయ నాద్యుత్సవేష్వేత తథే॥" అనగా దానముసుపన యనము యజ్ఞము శ్రాద్ధము యుద్ధము దేవప్రతిష్ఠయు చూడాకర్మయు తీర్థ యాత్రయు జపము వివాహము మొదలగు నుత్సవములు వీనిప్రారంభించిన పైని నాకార్యములందు మాత్రము సద్యశ్శుద్ధియగుననుట - మరియు బ్రాహ్మవచన ము "గృహీత నియమస్యాపి నస్యాదన్యస్య కర్హిచిత్॥" అనియనగా మరియే విధమైనపుణ్యకార్యమందు నియమము ప్రారంభించినను సద్యశ్శౌచమనుట- కనుక భారతహరివంశాది శ్రవణమందును శుద్ధి యగునని తెలియునది - మరియు చంద్రికయందు జాబాలివచనము - "సంధ్యాపంచమహాయజ్ఞానైత్యకం స్మృతి కర్మచ । తన్మధ్యేహాపయే త్తేషాం దశాహాంతె పునఃక్రియా॥" అనగా సం ధ్యయు పంచమహాయజ్ఞములు నిత్యమగు స్మృత్యుక్త కర్మయు నాశౌచమధ్య మందుమాని దశాహాంతమందు దిరుగ జేయవలయుననుట- గ్రహణకాలమందా శౌచమధ్యమందును శ్రాద్ధదానాదులుచేయక తప్పదు - "తావదేవభవే చ్ఛుద్ధి ర్యావన్ముక్తిర్నదృశ్యతె" యనిలైంగవచనము అనగావిడుపు సమాప్తియగునం తకు శుద్ధియనుట - ఇకమృతిదోషము విషయమై షట్త్రింశన్మత కౌర్మ వచన ము- "వ్యాపాదయేద్య ఆత్మానం స్వయమగ్న్యుదకాదిభిః । విహితం తస్యనా శౌచం నాపికార్యోదకక్రియా॥" అనగా నగ్నిలో నుదకములోపడి మృతినొందు

వానికి నాశౌచమునుదకక్రియయు జేయగూడదనుట - భవిష్యవచనము "స్వేచ్ఛయామరణం విప్రాశ్శృంగి దంష్ట్రిసరీసృపైః । అంత్యాంత్యజవిషోద్బంధై రాత్మనాచైవతాడనైః । పాఖండమాశ్రితాశ్చైవ మహాపాతకిన స్తథా । స్త్రియశ్చవ్యభి చారిణ్య అనూఢపతితా స్తథా।న తేషాం స్నానసంస్కారౌ నశ్రాద్ధం నసపిండనం॥" అనగా నిచ్ఛాపూర్వముగ కోరలు కొమ్ములుగల జంతువులచేగాని పాములు మ్లేచ్ఛులు చండాలులు విషము నురియు వీనిచేగాని తనుదాను కొట్టుకొనిగాని యాత్మహాని జేసుకొన్నవానికిని వేదబాహ్యుల నాశ్రయించు వానికిని బ్రహ్మహత్యాది మహాపాతకులకును వ్యభిచారిణులైన స్త్రీలకును వివాహముగాని పతితలగు స్త్రీలకును స్నానము నగ్నియు శ్రాద్ధము సపిండనము నెద్దియు చేయగూడదనుట - బ్రాహ్మవచనము - "ఏతానిపతితానాంతుయః కరోతి విమోహితః । తప్తకృచ్ఛ్రద్వయేనైవతస్యశుద్ధిర్నచాన్యథా॥" అనగా నట్టి పతితులకు బ్రేతకృత్యము జేయువాడు రెండుతప్త కృచ్ఛ్రములు జేయకున్నశుద్ధుడుగాడనుట - ఇదియు బుద్ధిపూర్వముగ జేసినచోనని తెలియునది - అజ్ఞానముచేజేసిన సగము ప్రాయశ్చిత్తము-మరియు స్పృశించినను గన్నీరుదెచ్చినను బుద్ధిపూర్వకమైనచో ద్విరాత్రము ప్రమాదకృతమైనచో నొకయుపవాసమని నిర్ణయసింధువు నందు దెలియునది - ఇట్లుప్రేతకృత్యమునకు నిషేధము గర్వమున బుద్ధిపూర్వముగ మృతినొందినచో నగును- అజ్ఞానమున బ్రమాదముచే మృతినొందెనేని సర్వము జేయవలెను - అట్లంగిరసు వచనము- "అథకశ్చిత్ప్రమాదేనమ్రియేతాగ్న్యుదకాదిభిః । తస్యాశౌచం విధాతవ్యంకర్తవ్యాచోదక క్రియా" యని-ప్రమాద మరణమందు ద్విరాత్రాశౌచమని శుద్ధితత్వాదులు గౌడులు-దశాహాదులేయని దాక్షిణాత్యులు- దీనికపవాదము హేమాద్రిలో భవిష్య వచనము - ప్రమాదాదిచ్ఛయావాపిన కుర్యాత్సర్పతోమృతే॥" అనగా నిచ్ఛచేగానిలేకగాని సర్పముచే మృతినొందెనేని బ్రేతకృత్యముచేయ గూడదనుట- అనగా నాగబలిచేయక కూడదనుట - ఇకప్రమాద మృతిలో దుర్మరణ నిమిత్తమైన దానాదులు శాతాతపవచనమున జెప్పబడినవి "వ్యాఘ్రేణనిహతేవిప్రే విప్రకన్యాం వివాహయేత్ । సర్పదష్టే నాగబలిర్దేయస్సర్పశ్చ కాంచనః " అనగావ్యాఘ్రముచే విప్రుడుమృతినొందెనేని విప్రకుమారికకు వివాహముజేయ వలెను సర్పముచేమృతినొందెనేని నాగబలి చేయునది యందుసువర్ణనాగము గావలెన

ని మొదలుగ నిర్ణయసింధువునందు దెలియునది - సర్పదష్టుని విషయమైవ్యా
సవచనము "సౌవర్ణభారనిష్పన్నం నాగంకృత్వా తథైవగాం । వ్యాసాయ
దత్వావిధివత్పితు రానృణ్య మావ్నుయాత్॥" అని యనగా నొకభారపరిమితిగ
లసువర్ణముచే నాగముజేసి గోవుతో వ్యాసునుద్దేశించి దానముజేసినచో పితృ
ఋణము దీరుననుట - హేమాద్రిలో భవిష్యవచనము - "పంచమ్యాం పన్న
గంహైమం స్వర్ణేనైకేనకారయేత్ । క్షీరాజ్యపాత్రమధ్యస్థంపూజ్యం విప్రా
య దాపయేత్ । ప్రాయశ్చిత్తమిదంప్రోక్తం నాగదష్టస్యశంభునా॥" అనియ
నగా పంచమీతిథియందు స్వర్ణవికారమైన సర్పము నిర్మించి క్షీరము ఘృత
ము నింపినపాత్రలోనుంచి దానముచేయునది ఇది సర్పదష్టునికి బ్రాయశ్చిత్తమ
ని శంభునిచే జెప్పబడినదనుట - గర్వమున సర్పముబట్టి దష్టుడైనచో నారా
యణ బలిగూడజేయునది - అట్లు విద్యుత్పాతమున మృతినొందినను దోషము
లేదు - "వృద్ధశ్శౌచస్మృతేర్లుప్తః ప్రత్యాఖ్యాతభిషక్క్రియః । ఆత్మానంఘా
తయేద్యస్తు భృగ్వగ్న్యనశనాంబుభిః । తస్యత్రి రాత్రమాశౌచం । తృతీయే
త్వూదకం కృత్వా చతుర్థేశ్రాద్ధమాచరేత్॥" అని వృద్ధగార్గ్యవచనము అన
గా వృద్ధుడై శౌచము స్మరింపలేక చికిత్సగూడమానుకొనియున్నవాడు రాతిపై
బడిగాని ప్రాయోపవేశమునగాని యుదకములోగాని మృతినొందవచ్చుననుట-అ
పుడు త్రిరాత్రాశౌచము మూడవదినమం దుదకక్రియయు నాల్గవదినమందుశ్రా
ద్ధముజేయవలెననుట - అపరార్కమందుబ్రహ్మగర్గవచనము "యోజీవితుంనశ
క్నోతి మహావ్యాధ్యుపపీడితః । సోగ్న్యుదకం మహాయాత్రాం కుర్వన్నాముత్ర
దుష్యతి॥" అనియనగా మహారోగముచే బీడింపబడుచు జీవించుటకు శక్తుడుగా
నియెడనగ్న్యుదకాదులందు బడిగాని మహాపథము అనగామరణముగోరి ముక్క
నకు సూటిగబోవుటజేసిగాని ప్రాణమువిడిచెనేని పరలోకహానిలేదనుట-అదియు
బ్రయాగక్షేత్రముతప్పనన్యస్థలమందు రోగియగువాని కని తెలియునది - విజ్ఞా
నేశ్వరాదులు మాత్రము జీర్ణుడైన వానప్రస్థుని కంద్రు - ప్రయాగ మందైన
చో రోగములేకున్నను గావచ్చును శూద్రునకు బ్రయాగభిన్నస్థలమందుగూడనగు
ను - అట్లువచనము - "అబ్రాహ్మణోవాస్వర్గాది మహాఫలజిగీషయా। ప్రవి
శేజ్జ్వలనందీప్తం కరోత్యనశనంతథా॥" అని యాదిపురాణ వచనము అనగా
బ్రాహ్మణభిన్నుడు స్వర్గాదిఫలము నపేక్షించి మండు నగ్నిలో బడిగాని ప్రా

యోపవేశమునగాని మృతినొందవచ్చుననుట - ఇట్లువృద్ధాదులు రాయి మొదల
గువానిచే మృతినొందుట "భృగ్వగ్నిపాషైశ్చైవ వృద్ధాదిమరణంతథా॥"యని
మాధవీయమందాది పురాణవచనముచే నిషిద్ధమైనది- అయినను బ్రయాగమందు
గాక తప్పదు - "యేవైతన్వాం విసృజంతి ధీరాస్తే జనాసోఅమృతత్వంభజంతే"
యని యనగా గంగాయమునాసంగమస్థలమందు దేహమువిడుచు జనులు మోక్ష
ము నొందుదురని శ్రుతియున్నది-అది స్మృతికంటెబలవత్తరముగదా- మరియును
"నలోకవచనాత్తాతన వేదవచనాదపి।మతిరుత్క్రమణీయాతేప్రయాగమరణంప్రతి"
యనిభారతమాత్స్యవచనమున్నది - అనగా లోకవచనములుగాని వేదవచనము
లుగాని యెన్నియున్నను ప్రయాగమరణమునుండి నీమనసుమల్లింపకుమని- ఏమనిన
వారాహవచనము "తత్రయోముంచతి ప్రాణాన్ వటమూలేషు సుందరి। సర్వ
లోకానతిక్రమ్య మమలోకం ప్రపద్యతే॥" యని యనగా నచ్చట వటవృక్షమూ
లమందు బ్రాణము విడుచువాడన్నిలోకములనిరసించి వైకుంఠము జేరునని-అపుడు
దశాహాదియగు పూర్ణాశౌచమే యగునని భట్టులంద్రు- త్రిరాత్రాశౌచమనుట
యుక్తము - అనశనమృతియందట్లుమీదజెప్పబడినది - దివోదాసుడు నిట్లనె చె
ప్పును - ఎట్లనిన మీదజెప్పినట్లు పిడుగుచేతగాని యగ్నిజలాదులచేగాని రాతిచే
యుద్ధముచేగాని మృతులైన వారికిని దేశాంతరమృతులకును జాతదంతులకునుత్రి
రాత్రమని కశ్యపవచనమున్నందుననని - ఇకనాత్మఘాతముజేసుకొన్నవారికాశౌ
చాదినిషేధమైనను సంవత్సరపర్యంతమే- ఆపైనంతయు జేయవలెను - అట్లుహే
మాద్రిలో షట్త్రింశన్మతవచనము"గోబ్రాహ్మణ హతానాంచ పతితానాం త
థైవచ । ఊర్ధ్వం సంవత్సరాత్కుర్యాత్సర్వమె వౌర్ధ్వదైహికం"అని-దీని
యర్థము స్పష్టము- అపుడాత్మవధ ప్రాయశ్చిత్తము నారాయణ బలియువిధింప
బడినది-యచ్చటనే "కృత్వాచాంద్రాయణం పూర్వం క్రియాకార్యా యథావిధి।
నారాయణబలిః కార్యోలోక గర్హాభయాన్నరైః । పిండోదక క్రియాఃపశ్చా
ద్వృషోత్సర్గాదికం చయత్ । ఏకోద్దిష్టాని కుర్వీత సపిండీ కరణంచయత్ ॥"
అనియనగా మొదటచాంద్రాయణము జేసి యథావిధిగా ప్రేతక్రియజేయవలెను
లేదా లోకనిందా భయమునుండి యపుడె నారాయణ బలిజేసి పిండోదకక్రియ
లు చేసియటుపైని వృషోత్సర్గము మొదలుగ జేయవలెను సపిండీకరణ మేకోద్ది
ష్టవిధిచే జేయవలెననుట - మదనరత్నమందు బ్రాహ్మవచనము - "ప్రమాదా

దపి నిశ్శంకస్త్వకస్మా ద్విధిచోదితః। చండాలై ర్బ్రాహ్మణైశ్చోరైర్నిహతో యత్రకుత్రచిత్। సమ్యగ్దాహాదికం కార్యం యస్మాన్నపతితస్తుసః। చాంద్రాయణంతతఃకృఛ్రద్వయంతస్య విశుద్ధయె। యద్వాకృఛ్రాణి పంచదశ కృత్వాతు విధినాదహేత్। బుద్ధిపూర్వమృతానాంతు త్రింశత్కృఛ్రం సమాచరేత్॥" అనియనగా ప్రమాదము నుండి దైవప్రేరణచే చండాలులు బ్రాహ్మణులు చోరులు మొదలైనవారివల్ల హతులై మృతినొందెనేని పతితుడుగాడు గనుక చాంద్రాయణము కృఛ్రద్వయముగాని లేదా పదునైదు కృఛ్రములుగానిచేసి యథా విధిగా దహింపవచ్చును బుద్ధిపూర్వముగ మృతినొందినచో ముప్పదికృఛ్రములు చేయునది - స్మృతిరత్నావళియందును ద్విగుణప్రాయశ్చిత్తముజేసి సంవత్సరము పర్యంత మక్కరలేకుండగనే సర్వక్రియలు జరుపవచ్చునని యున్నది - ఇక నారాయణ బలి విధానము మితాక్షరయందును నిర్ణయసింధువునందును దెలియునది- ఇకవిదేశమృతియందు దొరికినయెడ నస్థుల కేదాహము-లేనిచో మోదుగుమూడికలచే ప్రేతాకృతిజేసిలేదా కుశలచే దహనము - అట్లువచనము "విదేశమరణేస్థీని ఆహృత్యాభ్యజ్య సర్పిషా। అస్థ్నామలాభె పర్ణాని శకలాన్యుక్తయావతా। దాహయే దస్థిసంఖ్యాని తతః ప్రభృతి సూతకం॥" అనియనగా నస్థులు దొరికినచో ఘృతముచే దడపి దహించునది లేనిచో నస్థిసంఖ్యచే పలాశములుంచి దహించవలెను అదిమొదలుగ నాశౌచము - హేమాద్రియందు షట్త్రింశన్మతవచనము "కుర్యాద్దర్భమయంప్రేతంకుశైస్త్రిశతషష్టిభిః। స్త్రీపాలాశీభిస్సమిద్భిర్వా సంఖ్యాచైవ ప్రకీర్తితా॥" అనియనగా నస్థులు దొరకనిచో కుశలచేగాని మోదుగు పుడకలచేగాని మున్నూటయరువదింటిచే ప్రేతను నిర్మించి దహించవలెను మదన రత్నమందు యజ్ఞపార్శ్వవచనము - "శిరస్యశీత్యర్ధం దద్యాద్గ్రీవాయాంతు దశైవతు। బాహ్వోశ్చైకశతం దద్యాద్దశచైవాం గుళీషుచ। ఉరసిత్రింశతం దద్యాద్వింశతిం జఠరోదరే। ద్వాదశార్ధం వృషణయోరష్టార్ధం శిశ్నఏవతు। ఊర్వోశ్చైకశతం దద్యాత్త్రింశతం జంఘయోర్ద్వయోః। పాదాంగుళీషు దశదద్యా దేతత్ప్రేతస్య కల్పనం। మస్తకె నారికేలంతు అలాబుంతాలుకేతథా। పంచరత్నం ముఖేన్యస్య జిహ్వాయాం కదళీఫలం। చక్షుషోస్తుకపర్దౌ ద్వౌ నాసికాయాంతు కాల్లకం। కర్ణయోర్బ్రహ్మపత్రాణి. కేశేషు వటరోహకాః। నాలకం కమలానాంతు అం

తస్థానే వినిక్షిపేత్ । మృత్తికాతువసాధాతు హరితాలక గంధకౌ । శు క్రేతు పారదందద్యా త్పురీషేపిత్తలం తథా । సంధిషుతిలపిష్టంతు మాంసేస్యా ద్యవపిష్టకం । మధుస్యా ల్లోహితస్థానే త్వచస్థానే మృగత్వచా। స్తనయోగుంజకేదేయె వపాయాంశత పత్రకం । కమలం నాభిదేశేతు వృంతాకేవృషణాశ్రితే । లింగేచ రక్తమూలంతు పరిధానందుకూలకం । గోమూత్రం గోమయంగంధం సర్వౌషధ్యాది సర్వతః । క్రియానిబంధే గారుడేత్వేతదంతె । ఘృతంనాభ్యాం ప్రదేయం స్యాత్కౌపీనేచత్రపు స్మృతం। మౌక్తికే స్తనయోర్మూర్ధ్ని కుంకుమేనవిలేపనం॥" అనియనగా ప్రేతను కుశలచేగాని సమిధలచేగాని నిర్మించునపుడు సంఖ్యాయుస్థానము నెట్లనిన శిరమునందు నలుబది కంఠమునందు పది బాహువులు రెండిటికినూరు - హస్తముల వ్రేళ్లకు పది - గుండెపైముప్పది కడుపుపై నిరువది - వృషణస్థానమందారు - శిశ్నస్థానమున నాలుగు రెండుతొడలకు నూరు-పిక్కలు రెంటికి ముప్పది-వ్రేళ్లకు పదియు-నిట్లుంచవలెను- మరియు శిరస్సునందు కొబ్బరికాయయు దవడలందు నానబగాయచెక్కలు ముఖమందు పంచరత్నములును నాలుకకు ననటిపండును నేత్రములకు రెండుగవ్వలు ముక్కునకు దిలపుష్పము చెవులకు బ్రహ్మమేడియాకులు కొప్పునకు మర్రియూడలు తామరకాడలు నరములందును గుండెలోవసకు బురదయు ధాతువులకు హరిదలము గంధకమును వీర్యమునకు పాదరసము మలమునకు నిత్తడి సంధులందు తెలకపిండి మాంసమునకు యవలపిండి రక్తమునకు తేనెయు త్వక్కునకు మృగ చర్మము స్తనములందు గురువిందగింజలు వపాస్థానమున శతపత్రము నాభియందు గమలను వృషణములకు వంగ కాయలు శిశ్నమునకు నెర్ర దుంపయు కట్టు కొనుటకు దెల్లబట్టయు పూయుటకు గోమూత్రము గోమయమును సర్వౌషధులు దేహమంతటను నమర్చవలెను మరియును క్రియా నిబంధమందు గారుడ వచనములో నాభియందు ఘృతమును గోచికై తగరమును స్తనములపై ముత్తెములు కుంకుమచే మైపూతయునని యున్నది - దేశాంతరస్థుని వార్త దెలియనిచో దండ్రికి పదునైదు వత్సరములును నితరులకు బండ్రెండు సంవత్సర ములును గనిపెట్టి చూడవలెను - అటుపైని మీదజెప్పిన కృత్యమని మదనరత్నము- అపుడుపత్నీ పుత్రులకు పూర్వ మాశౌచము బట్టనిచో బూర్ణాశౌచము - పట్టినచో త్రిరాత్రము- పం డెండు వత్సరములు ప్రతీక్షిం

చి దాహము జేయుచో బుత్త్రాదుల కందరకు త్రిరాత్రమేయని కల్పతరువు. ప
ర్ణశరదాహానంతర మందు నస్థులు దొరికినచో మదనరత్న మందు బ్రాహ్మ
వచనము - "అథపర్ణశరే దగ్ధే పత్రన్యాసే కృతేసతి। గతేష్వగ్నిషు
తద్దేహో యద్యాద్వర్ణం లభ్యతే క్వచిత్। తదార్ధ దగ్ధ కాష్ఠాని తాని ని
ర్మథ్య తందహేత్। యద్యర్ధదగ్ధకాష్ఠంతు తదీయంనైవ లభ్యతే। తదా
తదస్థి ఖండంతు నిక్షేప్తవ్యం మహాజలె॥" అని యనగా పర్ణశరదాహానంతర
మందు ప్రేతదేహము దొరికిన యెడ పూర్వచితి చల్లారి పోయినను దాని కర్రి
ముక్కలుమథించి యగ్నిచేదహించవలెను అదియు దొరకనిచో మహాజలమందు
స్థాపించవలెను - ఇకప్రేతనుదహించుటకు కాలము - ప్రత్యక్షశవము దహిం
చునపుడు యోగ్యకాల విచార మక్కరలేదు ఆశౌచమధ్యమందు నవకాశమున్న
చో విచారింపవలెను ఆశౌచాంతమందైనచో విచారింపకతప్పదు సంవత్సరాం
తమైనయెడ నుత్తరాయణము శ్రేష్ఠము అందును కృష్ణపక్షము - ఇకభరణి-కృ
త్తిక - రోహిణి - ఆర్ద్ర - మఘ-ఆశ్లేష - మూల - త్రిపాదనక్షత్రము -
జ్యేష్ఠ - ధనిష్ఠ - మొదలుగ నైదును - జన్మనక్షత్రము - దానికి పదియవదిపం
దొమ్మిదవదియు నను నీనక్షత్రములును - చతుర్థాష్టమద్వాదశచంద్రులును ది
నక్షయమును-వైధృతి - వ్యతీపాత-పరిఘ - విష్టియనునీకరణములును నంద-భ
ద్ర-త్రయోదశి-చతుర్దశి - యీతిథులును శుక్రభౌమశనివారములును- గురుశు
క్రాస్తములు పుష్యమాసము మలమాసము నివి సర్వథావర్జ్యములు మన్వాది-
యుగాదిసంక్రాంతి - దర్శము నైనచో నేమియు విచారింప నక్కరలేదు - ఇ
ట్లు మూలవచనములు విశేషము ను నిర్ణయసింధువున దెలియునది - ఇట్లునా
రాయణభట్టసూనుడగు రామకృష్ణభట్టునికి బుత్రుడైన కమలాకరభట్టునిచేరచిం
పబడినశూద్రధర్మతత్త్వమందు నాశౌచ నిర్ణయముముగిసెను.

ఇక శూద్రుల కౌర్ధ్వదైహికకర్మవిధానము - అందు గర్మాధికా
రులు నిర్ణయసింధువునందు జెప్పబడిరి - ఎవ్వరులేనియెడ ధర్మపుత్రుని జేసు
కొనవలెను - అట్లు వ్యాసవచనము "అపుత్రేణసుతః కార్యో యాదృక్తాదృక్ప్ర
యత్నతః। పిండదానక్రియాహేతో ర్ధర్మసంస్థాపనాయచ॥" అని అనగా
పుత్రుడు లేనిచో నెట్టివాని నైననొకపుత్రాభి మతునిజేసుకొనవలెను అట్లైన
చోపిండదానపు ధర్మస్థాపనము నగుననుట- దివోదాసీయమందు "దృష్ట్వాస్థాన

స్థమాసన్న మధోన్మీలితలోచనం । భూమిస్థంపితరం పుత్రో యద్ధిదానంప్ర
దాపయేత్ । తద్విశిష్టంగయాశ్రాద్ధాదశ్వమేధశతాదపి॥" అని యున్నది అన
గా నాసన్నమరణుఁడై భూమియందు బండుకొన్నతండ్రినిజూచి పుత్రుడపుడే దా
నముజేసిన నదిగయాశ్రాద్ధమునకంటెనునశ్వమేధశతమునకంటె నధికపుణ్యమిచ్చు
ననుట - భారతమందు - "శుక్లపక్షేదివాభూమౌగంగాయాం చోత్తరాయ
ణే । ధన్యాస్తాతమరిష్యంతి హృదయస్థేజనార్దనే॥" అనియున్నది అనగాను
త్తరాయణములో శుక్లపక్షమందు పగటియందు భూమిపైని గాని లేదాగం
గాప్రవాహమధ్యమందుగాని భగవంతుని ధ్యానింపుచు మృతినొందువారు ధన్యు
లనుట - హేమాద్రిలో వారాహవచనము "వ్యతీపాతోథ సంక్రాంతి స్తథైవ
గ్రహణంరవేః । పుణ్యకాలా స్తదాసర్వే యదామృత్యురుపస్థితః॥"అనియున్నది
అనగా వ్యతీపాతము సంక్రాంతియు సూర్యగ్రహణముమొదలగు పుణ్యకాలము
లన్నియు మరణకాలమునకు సమములగును అనగా నదియంతటి పుణ్యకాలమను
ట - అప్పటనే వ్యాసవచనము "ఆసన్నమృత్యునా దేయాగౌస్సవత్సాతుపూ
ర్వవత్ । తదభావేతు గౌరేవ నరకోత్తారణాయవై॥" అని యనగా మరణ
కాలమందు వత్సతోగూడిన గోవునుగాని లేదాగోవునైనను నరకము దరించుట
కు దానముచేయవలెననుట - మదనరత్నమందు జాతూకర్ణ్య వచనము- "ఉ
త్క్రాంత్యాదీని దానాని దశదద్యాన్మృతస్యతు । గోభూతిల హిరణ్యాజ్య
వాసోధాన్యగుడానిచ । రూప్యంలవణమిత్యాహు ర్దశదానాన్యనుక్రమాత్ ।
ఏతానిదశదానాని నరాణాం మృత్యుజన్మనోః । కుర్యా దభ్యుదయార్థంతు
ప్రేతేపిహిపరత్రవై ॥" అని అనగా గోభూతిలహిరణ్యాదిదానములు పదియు
జన్మకాలమందభ్యుదయముకొరకును మరణకాలమందు సుగతి కొరకును జేయవ
లెను - బ్రాహ్మవచనము - "తామ్రిపాత్రంతిలైఃపూర్ణం ప్రస్థమాత్రం ద్వి
జాయతు । సహిరణ్యంచ యోదద్యా చ్ఛ్రద్ధావిత్తానుసారతః । సర్వ పాప
విశుద్ధాత్మాలభేతగతిముత్తమాం । ఉత్క్రాంతివైతరణ్యోచ దశదానాని చైవ
హి । ప్రేతేపికృత్వాతం ప్రేతంశవధర్మేణదాహయేత్॥" అని యనగా రా
గిపాత్రను నువ్వులతో నొకసేరుబట్టునట్లు నింపియథాశక్తిగహిరణ్యముతో బ్రా
హ్మణునికి దానముజేసిన సర్వపాపములుపోయి యుత్తమగతి జెందునుమరియు
నుత్క్రాంతివై తరణీగోదానములును దశదానములును జేసి యథావిధిగ దహ

నాదికృత్యములు చేయునది - క్రియానిబంధములో గారుడవచనమందు మాత్ర
మెనిమిది దానములనియున్నది - "తులసీంసన్నిధౌకృత్వా సాలగ్రామ శిలాంత
థా । తిలాలోహం హిరణ్యంచ కార్పాసం లవణంతథా । సప్తధాన్యంక్షి
తిర్గావ ఏకైకం పావనంస్మృతం । తిలపాత్రం యథాశక్తి శయ్యా దానంచ
కారయేత్॥" అని యనగా మరణకాలమందు తులసియు సాలగ్రామము సన్ని
ధినుంచి తిలలు లోహము హిరణ్యము ప్రత్తియు నుప్పునుసప్త ధాన్యములు
భూమియు గోవులునను నీ యెనిమిదింటిలో నొకొక్కటి దానము జేసినను
పాప హర మగుననుట తిలపాత్ర దానము శయ్యాదానము గూడ జేయవలెను
ఇట్లు పరిశిష్టమందునున్నది - "మ్రియమాణస్య కర్ణేతుపుణ్యమంత్రాన్ జపే
త్తతః॥" అని యనగా మరణకాలమందు పుణ్యమంత్రముల నతని కర్ణమం
దు జపించవలెననుట - వారాహమందు మరణ కాలమున మధుపర్కదానము
చెప్ప బడినది - "దృష్ట్వా సువిహ్వలం హ్యేనం యమమార్గాను సారిణం ।
ప్రయాణ కాలేతు నరోమంత్రేణ విధిపూర్వకం । మధుపర్కం త్వరన్ గృ
హ్య ఇమంమంత్ర ముదీరయేత్ । గృహాణచేమం మధుపర్క మాద్యం సం
సార నాశనకరం త్వమృతేనతుల్యం । నారాయణేన రచితం భగవత్ప్రియా
ణాందాహేనశాంతి కరణం సురలోకపూజ్యం । అనేనైవతు మంత్రేణదద్యా
చ్చ మధుపర్కకం । నరస్యమృత్యుకాలేతు పరలోక సుఖావహం॥" అనియన
గా మరణకాలమందు ప్రాణవ్యాకులత నొందువానిజూచి పుత్రాదికము త్వరగా
మధుపర్కముదెచ్చి గృహాణచేమమను శ్లోకమంత్రము నుచ్చరింపుచు బరలోకసు
ఖమునిచ్చు మధుపర్కము దిసిపించునది - దైవజ్ఞానీయమందు నిట్లున్నది - ఇక
ప్రయోగము - పుత్రాదులు పిత్రాదుల మరణకాలము సమీపించుట దెలసియా
రుసంవత్సరములుగానిమూడుసంవత్సరములుగానిసంవత్సరమునరగానిప్రాయశ్చి
త్తముజేయవలెనుఎట్లనిన-ఏడుగురుగానిన్నైదుగురుగానిముగురుగాని యొకరుగాని
బ్రాహ్మణుడుండు సభజేసి తడిబట్టలతోసువర్ణముగానివెండిగానియొకవరా ప
రిమితిగల గోమూల్యము దానికి నాల్గు రెట్టులు వృషభమూల్యమును సమర్పిం
చి సాష్టాంగప్రణామముజేసి వారేమికార్యమని యడిగినపైని "మమజన్మప్రభృత్య
ద్యయావత్ జ్ఞానాజ్ఞాన కామాకామసకృదసకృత్కాయికవాచిక మానసిక
సాంసర్గిక స్పృష్టాస్పృష్టభుక్తాభుక్తపీతాపీతజ్ఞాతాజ్ఞాత సకలపాతకాతిపా

త కోపపాతకసంకలీకరణాపాత్రీకరణజాతి భ్రంశకరప్రకీర్ణపాతకానాం ని
రాసార్థమనుగ్రహంకృత్వా ప్రాయశ్చిత్తముపదిశంతుభవంతః" అనిపలికి "సర్వే
ధర్మవివేక్తారోగోప్తారస్సకలాద్విజాః । మమదేహస్య సంశుద్ధిం కుర్వంతు
ద్విజసత్తమాః । మయాకృతం మహాఘోరం జ్ఞాతమజ్ఞాత కిల్బిషం । ప్రసాదః
క్రియతాంమహ్యాం శుభానుజ్ఞాం ప్రయచ్ఛత । పూజ్యైః కృతః పవిత్రోహంభ
వేయం ద్విజసత్తమైః॥" అని యనగా ధర్మవిచారణజేసి రక్షించునోద్విజులార
నాయందనుగ్రహించి జన్మమొదలుగ జ్ఞానాజ్ఞానములచే నేజేసిన పాపము నివ
ర్తించునట్లు ప్రాయశ్చిత్తముపదేశించి నన్నుపవిత్రుని జేయుడని ప్రార్థించి
నైనను నశక్తిలోనొకరు చెప్పుచుండగ వినయముతో విని యంజలిజేయవలెను-
పుత్రాదులు చేయునపు "దస్య జన్మప్రభృతి" యనియుచ్చరించునది - అటుపైని స
భ్యులు వానిశక్తికను సారముగ బ్రాయశ్చిత్తము ననువాదకుడు విప్రుని ద్వార
మున దెలియజేయవలెను - ఆపైని ప్రార్థించినవాడు గంధాదులచేసభ్యుల న
నువాదకుని బూజించియతనికి పాపానుసారముగ దక్షిణనీవలెను - అనగానిబం
ధపూజకు గోనిష్క్రియమూల్యముపుస్తకముపై నుంచుటయాచారసిద్ధము-ఆపైని
సభ్యులు అముకప్రాయశ్చిత్తెన పూర్వోత్తరాంగయుతేన యథాశక్తి ప్రత్యా
మ్నాయద్వారా చీర్ణేనత్వంశుద్ధోభవిష్యసి॥" యని యనువాదకునిచె తెలియ
జేసిన పైని "అను గ్రహీతాయ" మనిపలికిరి క్తతిథియందు నదిమొదలగు జలాధార
మునొంది ఆచమనముజేసి దేశకాలముల గీర్తించి "మమజన్మప్రభృతి" యని మొద
లుగ నిరాసార్థమను పర్యంతము మీదజెప్పినట్లు సంకల్పించి "సభ్యోపదిష్టమము
కప్రాయశ్చిత్తం పూర్వోత్తరాంగయుతమముక ప్రత్యామ్నాయద్వారాయథా
కాలం కరిష్యే" యనియుచ్చరించి "యానికానిచపాపానిబ్రహ్మహత్యాసమానిచ।
కేశానాశ్రిత్యతిష్ఠంతి తస్మాత్కేశాన్వపామ్యహం ॥" అనిపలికి కక్షోపస్థములు
వర్జించితక్కిన కేశములు మీసముగడ్డము గోళ్లును దీయించుకొని "యాయుబల
ల" మని దంతధావనముజేసియూరకెస్నానము ప్రాయశ్చిత్తాంగత్వేన "భస్మస్నా
నంకరిష్యే" యని "రుద్రాద్యానమ" యనుచుభస్మ బూసుకొనియిట్లు - గోమయ
ము మృత్తికయు గోమూత్రము గోక్షీరము పెరుగు నేయి కుశోదకము వీనిచే
స్నానముజేసి మడిబట్ట కట్టుకొనిబొట్టునుంచుకొని "గవామంగే షుతిష్ఠంతి భువ
నాని చతుర్దశ । యస్మాత్తస్మాచ్ఛివం మెస్యాదిహలోకే పరత్రచ " యా

సుమంత్రముతో గోదానముజేసి పాపహరుడగు విష్ణునకు బ్రీతిగ నాల్గు మొదలి
గు యుగ్మములకన్న మనగ బియ్యము మొదలగునవియిచ్చి పంచగవ్యముభక్షించి
గాని లేకగాని యాదినముపవాసము జేయునది ఇక్కడ శూద్రునకాజ్యహో
మములేదు "ఆజ్యేనైవహి శాలాగ్నౌ జుహుయాద్వ్యాహృతీః క్రమాత్" అను
జాబాలివచనమందాజ్యహోమము గృహాగ్నియందు చేయని నియమింపబడినది అగ్నికి
ప్రతిషేధి లేదుగదా-మరియు "తస్మాచ్ఛూద్రం సమాసాద్య సదా ధర్మపథే స్థితం। ప్రా
యశ్చిత్తం ప్రదాతవ్యం జపహోమవివర్జితం॥" అని పరాశరవచనములో హోమ
ము నిషేధింప బడియున్నది గనుక విప్రద్వారముగ హోమమనుట చింత్యము - అ
టుపైని మౌనముతో నారాత్రి వెళ్లించి తీర్థయాత్రయు ద్వాదశాహాన్నదాన
ములు గోదానము ద్వాదశస్నానములు మొదలగునవి ప్రత్యామ్నాయములచే
బ్రాయశ్చిత్తముజేసి విష్ణుశ్రాద్ధాంతమందు గోదానములు పూర్వమువలెజేసి మీద
జెప్పిన దశదానములు చేయవలెను - దానమంత్రములు దానకమలాకరమందు
దెలియునది - ఆపైని వైతరణీదానము-ఎట్లనిన దేశకాలములు స్మరించి "మమయ
మద్వారస్థనద్యాః సుఖోత్తరణార్థం దివ్యమానుష్య సర్వసుఖప్రాప్త్యర్థం వై
తరణీదానం కరిష్యే॥" యని యుచ్చరించి ద్రోణమనగ కుంచముపాడవుప్రత్తిప్రో
వుపైరాగి పళ్లెమందు మహిషమెక్కినయముని సువర్ణముచే నిర్మించిలోహ
దండము పాశము కుడియెడమల ధరించి నట్లునిల్పి పూజించి యచ్చట చెరుకు కర్రల
చే నిర్మించిన నావను పట్టుదారములచే గట్టి యక్కడనున్న నల్లని గోవును
వత్సతోగూడ స్వర్ణశృంగము వెండి డెక్కలు కంచుగిండియు నీలవస్త్రములు రెం
డును సప్తధాన్యములు గొడుగు పాదరక్షలు వీనితోగూడు నట్లలంకరించి పూ
జించి యధివాసనము జేసి మరునాడు యోగ్య విప్రుని వరించి పూజించి
తూరుపు మొగమగు గోవుతోకను ఘృతము క్షీరము తిలలు కుశలు సువర్ణము
వీనితోబట్టుకొని దేశకాలములస్మరించి "పూర్వోక్తమైనఫలమునుచ్చరించి ఇమాం
కృష్ణాంగాం ద్రోణప్రమాణ కార్పాస శిఖర హైమయమస్వర్ణశృంగ రూ
ప్యఖుర కాంస్య దోహకృష్ణ వస్త్రయుగ సప్తధాన్యచ్ఛత్రోపానదాద్యుపస్క
రయుతామము కగోత్రాయ తుభ్యమహం సంప్రదదే నమమ" యనిపలికిమం
త్రము పఠించునది - అశక్తిలో నొక్కగోవునే స్పృశించి యిచ్చునది "యమ
ద్వారే మహాఘోరే కష్టాం వైతరణీం నదీం। తర్తుకామో దదామ్యేతాం

తుభ్యం వైతరణీంచగాం॥" అని - యీమంత్ర మధి వాసనకని కొందరు - "విష్ణురూప ద్విజశ్రేష్ఠ భూదేవ పఙ్క్తిపావన। సదక్షిణా మయా తుభ్యం దత్తా వైతరణీచగాః। యమద్వారే మహాఘోరేయాసా వైతరణీనదీ। తాం తర్తుంగాందదామ్యేనాం తుభ్యం వైతరణీ మహం॥" అనిపఠించి జలము విడిచి దక్షిణనిచ్చి గోవునకు యమునకు విప్రునకు ప్రదక్షిణముజేసి సర్వముస మర్పించి "ధేనుకేత్వం ప్రతీక్షస్వయమద్వారె మహాభయే। ఉత్తితీర్షు రహం దేవి వైతరణ్యై నమోనమః॥" అనివిసర్జింపవలెను - అనగా నోధేనువు యమద్వారమందు భయంకరమగు వైతరణి యను నిప్పులయే 'రున్నది దానిదాటుటకు నిన్నుదానముజేసితి నన్నుప్రతీక్షించు మనుట - ఇట్లు వైతరణీదానము - దివోదాసీయమందు మరికొన్నిదానములు చెప్పబడినవి ఎట్లనిన " మోక్షం దేహి హృషీకేశ మోక్షం దేహిజనార్దన। మోక్షధేను ప్రదానేనముకుందః ప్రీయతాం మమ॥" యనుమంత్రముతో మోక్షధేనుదానము - "ఐహికాముష్మికం యచ్చస ప్తజన్మార్జితం ఋణం। తత్సర్వంశుద్ధిమాయాతు గామేతాం దదతోమమ॥" యనుమంత్రముతో ఋణధేనుదానము - "ఆజన్మోపార్జితం పాపంమనోవాక్కాయకర్మభిః। తత్సర్వం నాశమాయాతు గోప్రదానేన కేశవ॥" యనుమంత్రముతో పాపధేనుదానము॥" ఇత్యాదులు-ఇక దుర్మరణమందు ప్రాయశ్చిత్తము - అందుచండాలాదిహతుడై మృతినొందినను బట్టబయలున మృతినొందినను కృచ్ఛ్రమునతికృచ్ఛ్రము చాంద్రాయణమైనను జేయునది రజస్వలయు సూతికయగుస్త్రీయు శవమును ముట్టినచోలేదామ్లేచ్ఛునిచే మృతినొందినను సంవత్సర కృచ్ఛ్రములుచేయునది - ఎంగిలితోగాని మూత్రపురీష విసర్జనముచే నశుచియైగానిమంచముపైనిగాని మృతినొందెనేని చండాలులుమాంసము దినుజంతువులు ముట్టినను శవమునకు క్రిమికీటాదులు పుట్టినను మూడునారునైదు పదిగాని కృచ్ఛ్రములైనను రెండు చాంద్రాయణములైననుజేసి దహించునది - చండాల స్పర్శమైనచో సంవత్సర కృచ్ఛ్రములు - గాలివిసిరినను వర్షముగురిసినను దొమ్మిది కృచ్ఛ్రములు - కొమ్ములుగల జంతువులు విప్రుడు శస్త్రము చోరుడుమొదలగువానిచే నాత్మఘాతమైనచో సంవత్సరకృచ్ఛ్రములు - శవమొకదినముండిపోయినచో మూడుకృచ్ఛ్రములు ఆశౌచముతో మృతినొందిన నటులనేచేయవలెను - అట్లుమూలవచనములు నిర్ణయసింధువునందు దెలియునది - అటుపైపుణ్యాస్త్రో

త్రములుగాని రామకృష్ణాది నామజపముగాని చేయునది - లేదావినునది - ఆ పైని ప్రాణోత్క్రమణముగాగానె పుత్రుడుక్షౌరము జేయించుకొనిస్నానముజేసి క్రొత్తవస్త్రఖండము గట్టుకొనిమిగిలిన ఖండమును త్తరీయమనగ పైబట్టజేసుకొ ని ప్రేతకుక్షౌరము స్నానముజేయించి వస్త్రమునగప్పి పుష్పమాలాదులచే న లంకరించునది - అట్లుగాలవవచనము. "ప్రథమేహనికర్తవ్యంవపనం చానుభావి నాం । ప్రేతస్యకేశశ్మశ్రూది వాపయిత్వాథ దాహయేత్॥" అనియనగా ప్రథమదినమందు కర్తక్షౌరముజేసుకొని ప్రేతకుకేశములు మీసముగడ్డము మొ దలుగక్షౌరముజేసి యటుపై దహించవలెనని- మనువచనము "దక్షిణేనమృతం శూద్రం పురద్వారేణనిహరేత్॥" అనియున్నది అనగాశూద్రుడు మృతుడైన యెడ గ్రామమునకు దక్షిణముగదీసుకొని పోవలెననుట - ఇచటక్రియానిబంధమం దుగారుడవచనమున నారుపిండములు చెప్పబడినవి ఎట్లనిన "మృతస్యోత్క్రాంతి సమయేషట్పిండాన్ క్రమశోహరేత్ । మృతిస్థానేతథాద్వారి చత్వరేతార్క్ష్య కారణాత్ । విశ్రామేకాష్ఠచయనే తథాసంచయనేచషట్॥" అనియనగా మృ తునికుత్క్రాంతి సమయమందు క్రమముగనారుపిండము లీవలెను ఎట్లనిన మృతి స్థానమందొకటియు ద్వారమందొకటియు నంగణమందొకటియు త్రోవలోనొ కటియు చితివద్ద నొకటియు నస్థిసంచయన స్థానమందొకటియును గృధ్రికా కా దులకీవలెను - అట్లు- "ఆదౌదేయాస్తుషట్పిండా దశపిండాదశాహికాః । స్థా నేచార్ధపథేతీతే చితాయాంశవహస్తకే । శ్మశానవాసిభూతేభ్యష్షష్ఠం సంచ యనేతథా॥" అనియనగా నారుపిండములు క్రమముగ మృతిస్థానమందు నర్ధ మార్గమందును చితియొద్దను శ్మశానమందుండు జంతువులస్థానమందును సంచ యనస్థానమందును ఇట్లుపదిదినములు పదిపిండములీవలెననుట- ఛందోగపరిశిష్ట మందు - "దుర్బలంస్నాపయిత్వాతు శుద్ధచేలాభిసంభృతె । దక్షిణాశిరసం భూమౌ బర్హిష్మత్యాం నిధాపయేత్ । ఘృతేనాభ్యక్తమాప్లావ్య శుద్ధవస్త్రో పవీతినా।చందనోక్షిత సర్వాంగె సుమనోభిర్విభూషయేత్ । హిరణ్యశకలాన్య స్యక్షిప్త్వాభిద్రెషుసప్తసు। ముఖేష్వథాపిధాయైనం నిహరేయుస్సుతాదయః। కర్ణనేత్రెముఖె ఘ్రాణెహిరణ్యశకలంన్యసేత్॥" అనియనగా ప్రాణములు క్షీ ణించగానే స్నానముజేయించి శుద్ధమైనబట్ట బరచిదర్భలతో గూడినభూమియం దు దక్షిణముదలయుంపిగా బండుకొనబెట్టి శుద్ధవస్త్రముపవీతముగ ఘృతముచే

బూసి చెవులునేత్రములుముఖము ఘ్రాణరంధ్రములనను నేడిటియందు సువర్ణ శకలములనుంచి ముఖముగప్పిసుతుడు మొదలగువారుగొని పోవలెననుట - "ఆమపాత్రేన్న మాదాయప్రేతమగ్ని పురస్సరం। ఏకోనుగచ్ఛేత్తస్యార్థమర్ధపథ్యుత్సృజేద్భువి। ఊర్ధ్వమాదహనంకార్యమాసీనో దక్షిణాముఖః। సవ్యజాన్వాచ్యశనకైస్సతిలం పిండదానవత్ । అథపుత్రాది రాప్లుత్యకుర్యాద్దారూచ్చయం మహత్। తత్రోత్తానంనిపాత్యైనం దక్షిణాశిరసంముఖే॥" అనియనగాక్రొత్తకుండతో నన్నము నగ్నియు బట్టి ప్రేతకుముందగ్నియగునట్లునడువగా నతని వెనుక నొకడు నడచుచు నర్ధమార్గమందు గూర్చుండి దక్షిణముఖముగా నెడమకాలు మణిచిత్తిలలతో పిండదానవిధిగా సగమన్నమిచ్చి యిట్లుదహనస్థానపర్యంతమునిచ్చుచు జేరిపుత్రాదికము స్నానముజేసియచ్చటకట్టులు చాలాచితిగా చేర్చిదానిపైదక్షిణ శిరస్సుగాశవమును వెతికిల బండుకొనబెట్టి ముఖమందగ్ని నిచ్చునదియనుట- ఇక్కడనగ్నికి పాత్రిన్యాసము జెప్పినందున వెతికిలవేయుట సాగ్నికుని కగును- శూద్రుడైనచో బురుషుని నధోముఖముగాను స్త్రీనూర్ధ్వ ముఖముగా నుదహించవలెను- అట్లుశుద్ధి తత్వమందు హారలతయందు నాదిపురాణవచనము- "స్వగోత్రజైర్గృహీత్వాతుచితా మారోప్యతేశవః । అధోముఖో దక్షిణాదిక్చరణస్తు పుమానపి। ఉత్తానదేహా నారీతు సపిండైరపిబంధుభిః॥" అనియనగాతన గోత్రమువారు శవమునుచితిపై బెట్టునపుడు పురుషుడైనచో నధోముఖముగ నుత్తరశిరస్సుగను స్త్రీయైనచో వెతికిలగాను నుంచవలెననుట - ఇట్లునిరగ్నిద్విజులకు గూడనగుననిగౌడులు స్మృతికౌముదియందుమదనపాలుడు- "సదగ్ధవ్యఉపేతశ్చేదాహితాగ్న్యావృతార్థవత్॥" అనియగ్నిరహితునికిగూడనాహితాగ్నికివలె దహనమనియున్నందున-నదియెకాత్యాయనునిచే- "తత్రోత్తానంనిపాత్యైన॥" మనివెతికిలవేయుట చెప్పబడినదిగనుక నిరగ్నికినట్లనేయగునని చెప్పెనుగాని యతిదేశముచేనుపదేశమునకు బాధజెప్పుట యుక్తముగాదుగనుకచింత్యము కొందరువాచనికమైన యతిదేశముపదేశతుల్యము "ఉపేతశ్చేత్" అనువచనము ద్విజపరముగనుక "తత్రోత్తానం నిపాత్యైన" మనుబ్రాహ్మవచనమందు నట్టిపదము లేనందున శూద్రపరమే యనిద్విజులకుత్తాన శయనము లేదంద్రు-ఇతరులుఛందోగద్విజులకెయుత్తాన శయనము తక్కినవారి కధోముఖత్వమంద్రు - ఇట్లు నిరగ్నిద్విజుల వివాదమటుండనిమ్ము- అనుపనీతద్విజ శూద్రులకధో ముఖత్వము

ను త్తరశిరస్కత్వము నిర్వివాదముగదా - శూద్రునికిదహనము మంత్రహీనమే-
"నిషేకాదిశ్మశానాంతోమంత్రైర్యస్యోదితోవిధిః॥" అనివచనమున్నదనిమదనపా
లుడు-యథార్థమైనచో వైదికమంత్రమునకేనిషేధము పౌరాణమంత్రములు
పఠింపవచ్చును - అవిప్రయోగమందుజెప్పబడును- కనుకసేవారాహమందు "చ
తుర్వర్ణేషు సంస్థానమేవంభవతిపుత్రికే॥" అనియున్నది అనగా నాల్గువర్ణము
లందును మరణవిధియిట్లనేయగుననుట- ప్రచేతసువచనము- "నగ్నదేహందహే
న్నైవ కించిద్దేయంపరిత్యజేత్॥" అనగాప్రేతను దిగంబరునిగా దహింపగూడదు
తీసివేయవలసినది మరియేదైనను పరిత్యజింపవచ్చును- "యమస్మృతి "ప్రేతందహే
హేచ్ఛుభైర్గంధైస్స్నాపితం స్రగ్విభూషితం॥" అనగా ప్రేతనుమంచిగంధోద
కములచే స్నానముజేయించి పుష్పమాలలచే నలంకరించి దహించునది- క్రియా
నిబంధమందుగారుడవచనము- "ఉదధారామవిచ్ఛిన్నాంసించేత్కర్తా ప్రదక్షి
ణం। స్కంధావసక్త కుంభేనపాదతఃపరితశ్చితేః॥" అనగానీళ్లతోనిండిన కుండ
ను కర్త భుజముపైనుంచుకొని పాదములవైపుమొదలుకొని యనగాదక్షిణము
మొదలుగచితిచుట్టునునీళ్లధారపడునట్లు ప్రదక్షిణముజేయవలెను దంపతులొక
మారెమృతినొందిరేని బౌధాయనస్మృతిలో దాహాంతమొక్క తంత్రము-సంచ
యనము నొకతంత్రమె ఉదకపిండదానాదికము వేర్వేరుగజేయునది- అనుగమ
నమందు నిటులనెయున్నది - ఉదకదానవిధికిబ్రాహ్మవచనము."ఆపౌతువస్త్రం
ప్రక్షాళ్య తైనైవాచ్ఛాదితైస్తతః। కర్తవ్యంతైస్సచేలంతు స్నానం సర్వమలాప
హం। తతః పాషాణపృష్ఠేతు సర్వైర్దేయం తిలోదకం । త్రిశస్న్యాదాత్రి
యదేయాస్స్యుః ప్రేతభూమిగతాయచ । విశేషోనిర్ణయసింధౌజ్ఞేయః॥" అన
గా మొదటబట్టలు తడపికట్టికొని యామైనాబట్టతోడనె సర్వమలములు పోగొ
ట్టెడి సచేలస్నానముజేసి రాతిపైనందరు ప్రేతనుద్దేశించి మూడేసిమారులు
దకమీవలెననుట- ఇకప్రయోగము - పుత్రాదులపసవ్యముగా దేశకాలములస్మ
రించి "కాశ్యపగోత్రస్యాముకదా సస్యాస్మత్పితుః ప్రేతస్యప్రేతత్వనివృత్త్యాఉ
త్తమలోకప్రాప్త్యర్థమౌర్ధ్వదైహికం కరిష్యే" యనియుచ్చరించి మృతినొం
దినస్థానమందు దర్భలచే- "కాశ్యపగోత్ర అముకదాసప్రేత ఇదంతే అవనేజ
నం ఎష తెపిండః ప్రత్యవనేజనంచ॥" అనియుత్థాపన పిండమిచ్చి ప్రేతవస్త్రమం
దుపిండముగట్టి దక్షిణద్వారమున గొనిపోవలెను - అపుడుద్వారమందును నా

ల్గుత్రోవలు గలసినచోటను చితియందు నిట్లీవలెను - ఆపైశుద్ధదేశమందు బంచ
భూసంస్కారముల జేసిక్రవ్యాద సంజ్ఞగలయగ్నిని జ్వలింపజేసి గంధమాల్యము
లచే బూజించి ప్రేతక్షౌరము జేయించిగంధమాల్యముల నలంకరించిసప్తము
ఖచ్ఛిద్రములందుస్వర్ణశకలములుంచిలేదా ఆజ్యము వేసినేయి పూసిక్రొత్తబట్ట
గప్పి చితియందుత్తరశిరస్కుగ పురుషుడైన యెడనధోముఖముగను స్త్రీయైనచో
వెల్లకిలనుంచి "సంస్కార్యలోకాయస్వాహా" అనిగానియూరకైకాని యాజ్యా
హుతినిచ్చి శిరస్సువైపున నగ్నినీవలెను - మంత్రమువారాహమందు -"కృత్వా
తుదుష్కృతం కర్మజానతావాప్యజానతా । మృత్యుకాలవశం ప్రాప్యనరం
పంచత్వమాగతం। ధర్మాధర్మసమాయుక్తం లోభమోహసమావృతం । ద
హేయం సర్వగాత్రాణి దివ్యాన్లోకాన్సగచ్ఛతు॥" అని"జ్వలమానంమహావ
హ్నింశిరస్స్థానే ప్రదాపయేత్ । చతుర్వర్ణేషు సంస్థానమేవం భవతిపుత్రికే॥"
అని నాల్గువర్ణములకనుట- యనుపనీతద్విజులకని తాత్పర్యము. క్రియానిబంధ
మందుగారు డవచనములో మరియొకమంత్రమున్నది- "త్వంభూత కృజ్జగద్యో
నేత్వంలోకపరిపాలకః। ఉక్తస్సంహారకస్తస్మాదేనం స్వర్గంమ్మృతం నయ॥"య
ని - అటుపైనిగొంచెముశవము దహింపబడగా నుదకుంభముధరించిరాయిచే
దానికి రంధ్రముజేసి పాదస్థానము మొదలుగ ధారతోచితి చుట్టు ప్రదక్షిణమేగి
యిట్లు ముమ్మారు జేసిన పైనిఘటము భిన్నముగ బారవైచి మరితిరిగి చూడక
బాలురు ముందు నడువగ నందరు జలస్థానముజేసి పూర్వవస్త్రముల దడు
పుకొని కట్టి యెడమ ముక్కురంధ్రముచే జలమునాలోడించి వృద్ధులు మొద
లుగ స్నానముజేసి తీరమందు దర్భలపై పాషాణముంచి తిన్నగదర్భలు తి
లలును దోసిలిలోనుంచుకొని కాశ్యపగోత్ర - "అముకదాస ప్రేత ఏష తేతిలాం
జలిరుపతిష్ఠతు॥" అనిగాని" ఉపతిష్ఠతా"మనిగాని యందరుదక్షిణముఖులై యొక
మారుగానిముమ్మారుగాని జలాంజలు లిచ్చితిరుగస్నానము జేయవలెను-మిత్రు
నికి వివాహమైనను లేకున్నను గన్యలకును మేనల్లుడు నత్తమామలు మాతా
మహుడు నతనిభార్యయు మేనమామయు రాజునువీరికిని నుదకదానము వైకల్పిక
ము- నపుంసకుడు గర్భిణిపతితుడు వీరలుదకమీగూడదు- వీరికన్యులునీగూడదు-ఇ
ట్లుముప్పదిగాని పదునైదుగాని పదిగానిదినములు ప్రతిదినము నీవలెను- ప్రతిదిన
మునవొకరెట్టి రెండురెట్టులు మూడురెట్టులుగాని చేయునది- అటుపైని జలము

నుండి యెడ్డునకుజేరి క్రిందికిగొనలు గలుగునట్టు వస్త్రము పిడిచి గృహద్వారము
నకువచ్చి మూడవేపాకులుకొరికి యాచమనముజేసి గోమయము నావాలు వృష
భమునుదకము దూర్వలునగ్నిని ముట్టిరాతి పైకాలుంచి గృహములో ప్రవేశించు
నది- అపుడువృద్ధులు వారినూరడింపవలెను- ఆపైనిమంటి మూకుడులలో "ప్రేతా
త్రస్నాహి" యని జలమును "అత్రపిబ" యనిక్షీరమును నొకదినముగాని మూడుదిన
ములుగాని యుంచవలెను- పదిదినములని హేమాద్రిలోనున్నది ప్రతిదినమును గ
ర్తభోజన సమయమం దన్నము భూమియందు విడువవలెను - అపుడుమూడుదిన
ములుపవాసమైనను లేదాకొని తెచ్చిన వస్తువులచే భోజనమైనను జేయునది- అం
దరాశౌచులుక్రిందనె పండుకొనుటయు గూర్చుండుటయు జేయునది - ప్రథమ
తృతీయ సప్తమదశమ దినములందైనను జ్ఞాతులతోగూడ భుజించునది - అదియు
పగటి యందుమాత్రమే - ప్రతిదినమును ప్రేతకుపైని దీప ముంచవలెనని మొదల
గునియమములు నిర్ణయసింధువున దెలియునది- ఇకసంచయనము - అదియొకటి
రెండుమూడు నాల్గునేడు తొమ్మిదిదినములందును శూద్రులకైనచో విశేషముగ
బదియవదినమందును జేయునది- అటుపైని జేయునెడ మంగళరవిశనివారములను
తిథిద్వయమునేకపాదద్విపాదత్రిపాదజన్మనక్షత్రములను వర్జించిచేయవలెను-
ఎట్లనిన- కర్తదేశకాలములస్మరించి- "అస్మత్పితుఃకాశ్యపగోత్రస్యాముకదాస
ప్రేతస్య ప్రేతత్వ నివృత్త్యా ఉత్తమలోక ప్రాప్త్యర్థమస్థి సంచయన శ్రాద్ధం
కరిష్యే" యనియుచ్చరించి దర్భవటువునుంచి "ఇహలోకం పరిత్యజ్య గతోసి
పరమాం గతిం । మనసా వాయు రూపేణ విప్రేత్వాహం నియోజయే" ॥
అని యావాహనముజేసి "అముకప్రేతఇదం తేఆసనముపతిష్ఠతాం" అని యాసన
మునిట్లర్ఘ్యము గంధపుష్పధూపదీపాచ్ఛాదనములనిచ్చి క్రవ్యాదదేవతలకు ప్రేత
కుదత్సఖులకుమూడామాన్నములిచ్చిఘృతక్షీరోదకముల చేజితిదడిపి మోదుగుశా
ఖచేభస్మనుదుడిచి చిటికెనవేలు బొట్టనవేలు నీరెంటితో శిరస్సుగుండెలు హ
స్తములు పార్శ్వములు పాదములు వీనియస్థులు తీసి పంచగవ్యము గంగోదక
ముబెట్టికడిగి గంధాదులచేనలంకరించి పట్టువస్త్రమున గట్టి క్రొత్తకుండలో
బెట్టిమూకుడుపై మూసివనమందు వృక్షము మొదటనైనను భూమియందు బాతి
శ్మశానభస్మను నదిలోబారవైచి చితిస్థలమందు వేదికనుగట్టి యందు శమీపత్రచ్ఛ
త్ర పతాకలతోగూడిన ఘటద్వయముంచి క్రవ్యాద దేవతలకు ప్రేతకు దత్సఖుల

కు నివేదించి పిండముల ఘటములందు ప్రవేయవలెను-అపుడుమంత్రము "నమః క్రవ్యాద ముఖ్యేభ్యో దేవేభ్య ఇహసర్వదా । శ్మశాన వాసినోదేవాః శవానాం పరికీర్తితాః। తేభ్యోన్న ముదకంకుంభ మక్షయ్య ముపతిష్ఠతు । యేత్రశ్మశానదేవాస్స్యు భగవంత స్సనాతనాః । తేస్మత్సకాశా ద్గృహ్ణంతు బలిమష్టాంగమక్షయం । ప్రేతస్యాస్య శుభాన్ లోకాన్ ప్రయచ్ఛంతు చశాశ్వతాన్ । అస్మాకమాయురారోగ్యం సుఖంచ దదతాచ్చిరం॥" అనియుచ్చరింపుచు ప్రథమపిండము శ్మశానవాసులకును మధ్యమపిండము ప్రేతకునుదక్షిణమందు దత్సఖులకును నిచ్చి స్నానముజేయవలెను-తక్కినయస్థులుగంగలో ప్రవేయవలెను-దానివిధియెట్లనిన, హిరణ్యశ్రాద్ధమును దర్పణమునుజేసియస్థులు పంచగవ్యముచే దడిపిసువర్ణము ముత్తెములువెండియు బగడములు నందుప్రవేసి తీర్థమునకువెళ్లి స్నానముచేసి పంచగవ్యముచేప్రోక్షించి హిరణ్యము మధువునాజ్యము తిలలుగలపి మృత్పిండ మందుంచి దక్షిణ ముఖుడై "నమోస్తుధర్మాయ" యనిజలముప్రవేశించి "సమేప్రీతోస్తు" అనివిడిచివిప్రులకు దక్షిణలిచ్చి తిరుగశ్రాద్ధముతర్పణము జేయునది అపుడు దశదానములుగోదానముమొదలగునవి చేయుదురు - ఇదిమలమాస శుక్రాస్తాదులయందుగూడదు- దశాహ మధ్యమందైనచో దోషములేదు-ఇకపాథేయశ్రాద్ధము-"కశ్యపగోత్రస్యాము కదాసప్రెతస్య మనుష్యలోకా ప్ప్రేతలోకంగచ్ఛతః పాథేయసిద్ధ్యర్థం పాథేయశ్రాద్ధంకరిష్యే" యనియుచ్చరించి దర్భవటువునందు "ఇహలోకంపరిత్యజ్య" యనుమంత్రమునుచ్చరించి "ఇదంతె ఆసనముపతిష్ఠతాం" అనియాసనము గంధముపుష్పధూపదీపములాచ్ఛాదనమునామాన్నమునిట్లీవలెను అటుపైని- "ఇదంతెపిండాసనం అవనేజనం పిండఃప్రత్యవనేజనం॥" అనియు పిండపూజయు దక్షిణయునని సర్వప్రేతశ్రాద్ధములకు నిట్లుప్రయోగము - ఇట్లునగ్నపరిచ్ఛాదనశ్రాద్ధమును జేయునది - అన్నవస్త్రదానము - ఆపైనవశ్రాద్ధము - అదివిషమసంఖ్యయనగ నొకటి మూడునైదునేడు తొమ్మిదిపదునొకండు దినములందుజేయునది - "అముకప్రేతస్యప్రేతత్వ ముక్త్యాఉత్తమలోక ప్రాప్త్యర్థ మాద్యేహ్ని విషమశ్రాద్ధంకరిష్యే॥" అనిసంకల్పము ఇక్కడ విప్రనిమంత్రణమందు మంత్రమువారాహమందున్నది- "గతోసిదివ్యలోకంత్వం కృతాంతవిహితాత్పథః । మనసావాయుభూతెన విప్రెత్వాహంనియోజయె।పూజయిష్యామి భోగైస్త్వామేవంవిప్రం నియోజయేత్॥" అనియావాహనము తక్కినది మీదజెప్పిన

రీతినే చేయునది- భవిష్యమందు "నవసప్తవిశాం రాజ్ఞాం నవశ్రాద్ధాన్యనుక్రమా
త్ । ఆద్యంతయోర్వర్ణయోస్తుషడేత్యాహుర్మహర్షయః॥" అనియున్నదిఅనగా క్షత్రి
య వైశ్యులకు క్రమముగా దొమ్మిదియు నేడును నవశ్రాద్ధములు విప్రశూద్రులకా
రేయగుననుట-ఇక ప్రేతపిండములు-అవియామాన్నముచేత నేయనిహలాయుధుడు-
చయువుచేనని కొందరు - ఇక హేమాద్రిలో పారస్కరవచనమందు "శూద్రే
త్రింశత్ప్రకీర్తితాః" అనిముప్పదిపిండములనియున్నది యైనను "ప్రేతేభ్యస్సర్వవర్ణే
భ్యః పిండాన్దద్యాద్దశైవతు॥" అనియతనిచేత నేసర్వవర్ణములందు "ప్రేతలకుపది
పిండములేయని చెప్పబడెనుగనుక పదియె యీవలెను- ఇతరులు ఆశౌచదినము ల
న్నిటిలో పిండము నుదకమునీవలెనని విష్ణుస్మృతివలన ముప్పదియిరువది పదునైదు
ననుపక్షములచే దినసంఖ్యకు సరిగాపిండములంద్రు- ఇక్కడ హేమాద్రిలో బ్రా
హ్మవచనమున విప్రాతిరిక్తుల కంత్యపిండమున కుత్కర్షము చెప్పబడినది- "దే
యస్తుదశమః పిండో రాజ్ఞాం వై ద్వాదశేహని । వైశ్యానాం వై పంచదశే మా
సే శూద్రేషు దీయతే॥" అనియనగా దశపిండపక్షమందు పదియవపిండము క్షత్రి
యులకు పండ్రెండవ దినమందును వైశ్యులకు పదునైదవ దినమందును శూద్రుల
కుమాసాంతమందు నీవలెనని- త్రిరాత్రాశౌచమందు సద్యశ్శుద్ధియందును-అపుడు-
"సద్యశ్శౌచే ప్రదాతవ్యాస్సర్వేపి యుగపత్తథా । త్ర్యహాశౌచే ప్రదాతవ్యాః
ప్రథమేహ్యేక ఏవహి । ద్వితీయేహానిచత్వార స్తృతీయే పంచచైవహి॥" అని
యనగా సద్యశ్శుద్ధియైన యెడనన్ని పిండములొక్కమారె యీవలె త్రిరాత్రా
శౌచములో మొదటిదినమం దొకటియు రెండవదినమందు నాల్గును మూడవదిన
మందు నైదును నీవలెననుట- శాతాతపవచనము-"ఆశౌచస్య చహ్రాసేపి పిండాన్
దద్యాద్దశైవతు॥" అనగా ఆశౌచోత్తరమందు పర్ణశరాది దహనమైనచో నాశౌ
చహ్రాసము- అపుడును పదిపిండము లీవలెననుట- ఇచట దేశకర్తృద్రవ్యముల
కైక్యమనగా ప్రథమదినమం దెవ్వ డేద్రవ్యముచే నెచ్చట పిండమువిడుచునో ప
దిదినములు నతడట్లనే పిండము లీవలెననుట- అట్లుక్రియా నిబంధమందు వ్యాసవ
చనము- "ప్రథమేహని యద్ద్రవ్యం తదేవ స్యాద్దశాహికం । యత్రాద్యే దీయ
తేపిండ స్తత్రసర్వం సమాపయేత్॥" అనిఇట్లు బ్రాహ్మమందు "ప్రథమేహ
నియోదద్యా త్ప్రేతాయాన్నం సమాహితః । అన్నం నవసుచాన్యేషు సఏవ
ప్రదదాత్యపి॥" అనియనగా దాహకర్తయె పిండములీవలెను- శుద్ధితత్వమందు

వాయవీయ వచనము- "అసగోత్ర స్సగోత్రోవా యదిస్త్రీ యదివాపుమాన్ యశ్చాగ్నిదాతా ప్రేతస్య పిండం దద్యాత్సఏవహి॥ " అనియనగా సగోత్రుడు గాని యితరుడుగాని పురుషుడుగాని స్త్రీగాని దాహకర్తయే పిండము లీవలె ననుట- కర్తమృతి నొందెనేని బృహస్పతివచనము - "ఏవంక్రియాప్రవృత్తానాం యదికశ్చిద్విపద్యతే । తద్బంధునాక్రియా కార్యాసర్వంవా సహకారిభిః॥" అని యనగా కర్మజేయుచు గర్తమృతి నొందెనేని నతని బంధువుడుగాని యన్యుడు గాని చేయవచ్చును అపుడు శేషించినది చేయవచ్చునని గౌడులు- తిరుగమొదలిటి నుండి సర్వము జేయవలెనని యితరులు "ఉపతిష్ఠతామయంపిండః ప్రేతాయేతి స ముచ్చరేత్" అని ఆదిపురాణవచనము - ఇకప్రయోగము- ఈశాన దిక్కునందు వేదికజేసి లోహపాత్రయందుగాని కుండలోగాని చరువును వండి మైననుసత్తు పిండిచేనైనను తిలమధుఘృతములు గలపి వెలగపండు పరిమితిగల పిండమునుజేసి దేశకాలముల స్మరించి "కాశ్యపగోత్రస్యాముకప్రేతస్యమూర్ధావయవసంభూత్యై ప్రథమాహిక దేహపూరక పిండదానం కరిష్యే" యని యుచ్చరిం చి రెండవదినము మొదలగువానియందును "ద్వితీయాహిక దేహపూరక పిండదా నం" అనిసంకల్పము- ఆపైని పాషాణాగ్రమున విష్ణుని బూజించి దర్భాసనమవ నేజనముజేసి "అముకప్రేత" యని మొదలుగ "మూర్ధావయవ సంభూత్యై దే హపూరకః ప్రథమాహికఏష తేపిండ ఉపతిష్ఠతాం" అనిప్రత్యవనేజనము భృంగ రాజపత్రము తులసీమాలయునిచ్చి పిండమును జలమందు విడువవలెను- అంజలి దానముమీద జెప్పబడినది - ఇట్లుపదిదినములు చేయునది అందుసంకల్ప విశేష ము "చక్షుశ్శ్రోత్రనాసాముఖావయవనిష్పత్త్యర్థం" అనిద్వితీయమందును "గరాం సభుజవక్షోనిష్పత్త్యర్థం" అని తృతీయమందును-అపుడు "విషమశ్రాద్ధంచ" య నునది యధికము- "నాభిలింగగుద నిష్పత్త్యర్థం" అని చతుర్థదినమందు "జా నుజంఘ పాదావయవసిద్ధ్యర్థం" అనియు "విషమశ్రాద్ధంచ" యనియు బంచమది నమందును "సర్వమర్మావయవనిష్పత్త్యర్థ మనిషష్ఠమందును "మజ్జామేదోమాం సస్నాయు నాడీరూపావయవ సంభూత్యై" యనియు విషమశ్రాద్ధంచయనియు సప్తమదినమందును "దంతలోమనఖావయవసిద్ధ్యర్థ" మని యష్టమమందును "వీర్యా వయవసిద్ధ్యర్థ" మనియు "విషమశ్రాద్ధంచ" యనియు నవమమందును "దేహపూర్ణ త్వ తృప్తతాక్షు ద్విపర్యయ సిద్ధ్యర్థ" మని దశమ దినమందును ప్రతిదినమునంజ

లి సంఖ్యచే నుదకుంభములు నీవలెను - అత్యశక్తిలో "పిండయజ్ఞాద్యృతేదేయం ప్రేతాయాన్నం దినత్రయం॥" అనగా పిండశ్రాద్ధవిధి లేకుండగ మూడుదినములు ప్రేతకన్నమీవలెననుట - అపరార్కుమందు వ్యాసవచనము "ఆశౌచాంత్యాదినేక్షౌరం జనన్యాంచ గురౌమృతే॥" అనగా జననీజనకుల మృతిలో నాశౌచాంతదినమందు క్షౌరముగావలెననుట- ఆపస్తంబ వచనము "అనుభావినాంచపరివాపనం" అను భావులనగ గనిష్ఠులని మితాక్షర రత్నాకరము మొదలగునవి - ఆశౌచమనుభవించు నందరకు నని శుద్ధితత్త్వాదులైన గౌడులు- అట్లు రత్నమాల యందు-"ఆజ్ఞయానరపతేర్ద్విజన్మనాం దారకర్మమృతసూతకేషుచ।బంధమోక్షమఖదీక్షణేష్వపిక్షౌరమిష్టమఖిలేషుచోడుషు"అనగాద్విజులయాజ్ఞనురాజాజ్ఞచేతను వివాహమందును మృతాశౌచమందును జాతాశౌచమందును కైదు వదలినపుడును యజ్ఞదీక్షయందును సమస్త నక్షత్రములలో క్షౌరము జేయవచ్చును- అపరార్కుమందు వ్యాసవచనము - "పుత్రః పత్నీచవపనంకుర్యాదంతేయథావిధి। పిండదానోచితోన్యోపి కుర్యాదిత్థం సమాహితః॥" అనగాపుత్రుడు పత్నియు పిండదాన కర్తయన్యుడును నాశౌచాంతమందుయథావిధిగక్షౌరముజేసుకొనవలెననుట - ఇక్కడ పుత్రులకాద్యంతములందు రెండిటియందునని సముచ్చయము దశమదినమందవయవ పిండము నిచ్చి ముమ్మూలగ వేదికజేసి ప్రేతకు దత్సఖులకును యమునికిని మూడుపిండము లిచ్చి అపూపములు ధ్వజచ్ఛత్రోదకుంభములు నివేదించి శాకబలినిచ్చి రాతికి దైలముబూసి జలమందువిడిచి ప్రేతను స్పృశించిన వస్త్రములు త్యజించి పుత్రుడు పత్నియు ప్రేతకంటె గనిష్ఠులును క్షౌరము జేసుకొనవలెను - అటుపైని స్నానముజేసి యందరుముమ్మారు ధర్మోదకాంజలియిచ్చి యావపిండిచేగాని తిలలు నుసిరికె పప్పు వీనిపిండిచేగాని స్నానము జేసి గృహమునకు వెళ్ల వలెను - దశాహమధ్యమందు నమావాస్య పడినచో మాధవీయమందు ఋష్యశృంగవచనము - "ఆశౌచమంతరాదర్శోయది స్యాత్సర్వవర్ణానాం । సమాప్తింప్రేత తంత్రస్య కుర్యాదిత్యాహ గౌతమః॥" అనగానాశౌచ మధ్యమందు దర్శవచ్చునెడ మిగిలినప్రేత కర్మయావత్తును దంత్రముచేసమాప్తి సేయునది - మరియుశ్లోక గౌతమవచనములో విశేషము - అంతర్దశాహేదర్శశ్చేత్తత్రసర్వం సమాపయేత్ । పిత్రోస్తుయావదాశౌచం దద్యాత్పిండాన్ జలాంజలీన్॥" అనగా దశాహమధ్యమందు దర్శవచ్చునపుడు తలి

దండ్రులకైనచో నాశౌచాంతము వరకును పిండములు జలాంజలులు నీవలెను ఇత
రులకైనయెడ దర్శలోపునసమాప్తిజేయవలెననుట ఇట్లుచేయుటమూడుదినము
లలోగా దర్శవచ్చునపుడె ఆపైనైనచోదలిదండ్రుల కర్మయు దంత్రముచేసినం
తవుచ్చుకతప్పదు అట్లుగాలవవచనము "పిత్రోరాశౌచమధ్యేతుయది దర్శస్సమా
పతేత్ । తావదేవోత్తరం తంత్రంపర్యవస్యేత్త్య్రిహాత్పరం॥" అనియనగా
తలిదండ్రుల యాశౌచమధ్యమందు మూడుదినములపైని దర్శవచ్చినచో నుత్తర
తంత్రము యావత్తును సమాప్తినొందించవలెను ఇతరులకైనచో మూడుదినము
లలోగా దర్శవచ్చినను నపకర్షము చేయునది- కాలామృతమందును నిర్ణయా
మృతమందు నిట్లనేయున్నది - మదనరత్న పారిజాతములందు మాత్రముగాలవవ
చన మాపత్కాలమం దనౌరసపుత్రుడు కర్తయగునపుడునని చెప్పబడినది కను
కతలిదండ్రులకు మూడుదినములపైని దర్శవచ్చినను నపకర్షలేదని యున్నది -
గానియందు మూలము చింత్యము-ఇట్లుకమలాకర భట్టునిచే రచింపబడిన శూద్ర
ధర్మమందుశూద్రాశౌచనిర్ణయము— ఇక నేకాదశాహ కృత్యము - అందు
మనువచనము "విప్రశ్శుధ్యత్యపస్స్పృష్ట్వా క్షత్రియోవాహనాయుధే । వైశ్యఃప్ర
తోదంరశ్మీన్వాయష్టింశూద్రః కృతక్రియః॥" అనగా విప్రుడు కర్మాంతమునం
దు నుదకము స్పృశించె నేని శుద్ధు డగును క్షత్రియుడు వాహనము నాయు
ధమును స్పృశించి శుద్ధు డగును - వైశ్యుడు ప్రతోద మనగా మునికోలను
గాని పగ్గములగాని ముట్టినచో శుద్ధుడగును శూద్రుడైనచో చేతికర్రను స్పృశిం
చి శుద్ధుడగుననుట - శుద్ధితత్వదేవలవచనము - "ఆద్యాహస్సు నివృత్తేషు సు
స్నాతాః కృతమంగలాః । ఆశౌచాద్విప్రముచ్యంతె బ్రాహ్మణాన్ స్వస్తి వా
చ్యచ॥" అనగా నాశౌచమునకు విధింపబడిన దినములు దాటగనే సుస్నాతులై
మంగలాలంకారములు ధరించి బ్రాహ్మణులచే స్వస్తిపుణ్యాహవాచనముజేయిం
చినచో శుద్ధులగుదురనుట- ఇది సాపిండ్యమైన పైనని శిష్టాచారము - హేమా
ద్రిలో శంఖవచనము "ఆద్యం శ్రాద్ధ మశుద్ధోపి కుర్యా దేకాదశేహని । కర్తు
స్తాత్కాలికీశుద్ధి రశుద్ధః పునరేవసః॥" అనగా కర్తయశుద్ధుడైనను నాద్యమా
సికము నేకాదశ దినమందే చేయవలెను- అపుడుతత్కాలశుద్ధియగును అదిచేసి
నపైనితిరుగనశుద్ధివచ్చుననుట- ఇట్లుశూద్రునకునని తెలియునది - అట్లుపైఠీనసి
వచనము- "ఏకాదశేహ్నియచ్ఛ్రాద్ధంతత్సామాన్యముదాహృతం।చతుర్ణామపివ

ర్ణానాంసూతకంతుపృథక్పృథక్॥" అనగా నాల్గువర్ణములవారికినాశౌచము వే
ర్వేరుగనున్నను నేకాదశశ్రాద్ధముమాత్రముసమానమే యనుట-ఇక మరీచివచనము-
"ఆశౌచాంతేతతస్సమ్యక్పిండదానం సమాప్యతే।సర్వశ్రాద్ధం ప్రదాతవ్యం సర్వ
వర్ణేష్వయం విధిః॥" అనగా సర్వవర్ణములం దాశౌచాంతమందె సర్వశ్రా
ద్ధము చేయవలెనని యున్నదిగాని యిదియందరికి దశాహ మాశౌచమనుపక్షమం
దని తెలియునది - మరియు మాత్స్యమందు "ఏకాదశేహని తథా విప్రానేకాద
శైవతు । క్షత్రాదిస్సూతకాంతేతు భోజయేదయుజో ద్విజాన్॥" అనగా నేకా
దశదినమందు పదునొకండు విప్రులను భుజింపజేయవలెను క్షత్రియాదులైనచో
నాశౌచాంతమందు విషమ సంఖ్యగల ద్విజులను భుజింపజేయవలెనని యున్నదిగా
ని యదిరుద్రగణశ్రాద్ధపరము కనుకనే "రుద్రముద్దిశ్య కర్తవ్యం ప్రేతప్రీతికరం హి
తత్॥" అనియున్నదని మదనపారిజాతము-కల్పతరు శూలపాణి వాచస్పత్యాదు
లు మాత్రము "అస్మాద్వచనాదప్యాశౌచాపగమః" అని విష్ణువచన మున్నందునను
పూర్వోక్తశంఖాది వచనములు నిర్మూలములని యైనను శూద్రాదులకు నాశౌ
చాంతమందె శ్రాద్ధమంద్రు - ఇతరులు రెండువిధములుగా వాక్యములున్నందు
న దేశాచారముచే వికల్పమంద్రు - సత్యవ్రత వచనము "సద్యశ్శౌచేపి దాతవ్యం
ప్రేతస్యైకాదశేహని॥" అనగా సద్యశ్శౌచమందు నేకాదశదినమందె చేయవ
లెననుట - ఉశనసువచనము "త్ర్యహాశౌచేపి కర్తవ్యమాద్యమేకాదశేహని॥" అ
నగా త్ర్యహాశౌచ మందును నాద్యశ్రాద్ధ మేకాదశదినమందే చేయునది-"అతీత
విషయే సద్యస్త్ర్యహోర్ధ్వంవాతదిష్యతే॥" అనగా నతిక్రాంత విషయమందు
సద్యస్కాల మందైనను త్ర్యహానంతరమైనను గావచ్చును - బౌధాయనవచన
ము "ఏకోద్దిష్టంశ్వ ఏవస్యాద్ద్వాదశేహని వా పునః । అత ఊర్ధ్వమయుగ్మేషు కు
ర్యాదహస్సుశక్తితః । అర్ధమాసేథవా మాసి ఋతౌ సంవత్సరేపి వా॥" అనగా
నేకోద్దిష్టము మరునాడే కావలెను లేదా పండ్రెండవదినమందు అది దాటినచో బేసి దిన
ములందు అర్ధమాసమందైనను మాసమందైనను గావచ్చును-ఇక వృషోత్సర్గము-హే
మాద్రిలో మాత్స్యకౌర్మవచనము- "నకరోతి వృషోత్సర్గం సుతీర్థే వా జలాంజ
లిం।నదదాతి సుతోయస్తు పితురుచ్చార ఏవసః।ఏష్టవ్యా బహవః పుత్రాయద్యేకో
పి గయాం వ్రజేత్ । యజేత వాశ్వమేధేన నీలంవా వృషముత్సృజేత్॥" అనగా
వృషోత్సర్గముగాని తీర్థమందు జలాంజలిగాని పుత్రుడీనిచో తండ్రి నతిక్రమిం

చినవాడే యమని బహుపుత్రులను గోరుట-యెందుల కనిన నొకడైనను గయకు వెళ్లును లేదా యశ్వమేధముచేయును లేదా నీలవృషభము నచ్చువిడుచు ను - షట్త్రింశన్మతమందు - "పతిపుత్రవతీనారీభర్తుశ్చరగ్రే మృతాయది । వృషోత్సర్గంనకుర్వీతగాందద్యాచ్చపయస్వినీం।ఏకాదశేహ్ని ప్రేతస్యయస్యనోత్సృజ్యతేవృషః।।ప్రేతత్వంసుస్థిరంతస్యదత్తైః శ్రాద్ధశతైరపి॥"అనగాపతిపుత్రులు గల స్త్రీభర్తకంటెముందుమృతినొందెనేనివృషోత్సర్గము చేయగూడదుమరేమనినమంచిపాలగోవునీవలెనుభర్తమృతినొందినచోవృషోత్సర్గముచేయనియెడనూరు శ్రాద్ధములుచేసిననువానికిప్రేతత్వముపోనేరదు - ఇక హేమాద్రిలోభవిష్యవచనము "చైత్ర్యాంవాపితృతీయాయాం వైశాఖ్యాం ద్వాదశేహ్నివా॥" యనియు విష్ణుధర్మమందు "విషువద్వితయే చైవ మృతాహేబాంధవస్యచ॥" యనియు ననగా చైత్రశుక్లపూర్ణిమయందుగాని తృతీయయందుగాని వైశాఖ శుక్లపూర్ణిమయందుగాని ద్వాదశాహమందుగాని మేషతులాసంక్రాంతి ప్రవేశమందుగాని వృషోత్సర్గమని వికల్పము చెప్పుట మరణకాలమందు జరుగనిచోనని తెలియునది - బ్రాహ్మవచనము - "లోహితోయస్తు వర్ణేన ముఖేపుచ్ఛేచపాండరః । శ్వేతఃఖురవిషాణాభ్యాం సనీలోవృష ఉచ్యతే॥" అనగా దేహమంతట నెఱుపురంగును ముఖపుచ్ఛములందు పాండరవర్ణమును డెక్కలు కొమ్ములను శ్వేతవర్ణముగల వృషభముసీలవృషమనబడుననుట-దేవీపురాణమందు"చతస్రోవత్సికాభద్రే ద్వేహ్యసంభవతోపివా॥"అని యున్నది అనగానాల్గు గోవత్సములుగానియసంభవమందు రెండువత్సములైనగాని యాడుదూడలు కావలెననుట-ఇక ప్రయోగము-అందుమొదట విష్ణుస్వరూపునిగా నుద్దేశించితర్పణముచెప్పబడినదియు దినిమూలము-దేశకాలముల స్మరించి"అముకవాసప్రేతస్యప్రేతత్వనివృత్త్యా రుద్రలోక ప్రాప్త్యర్థంవస్వాదిలోక ప్రాప్త్యర్థం వావృషోత్సర్గం కరిష్యే" యని యుచ్చరించి"నందాహి సుమనాశ్చైవ సుశీలాచపయస్వినీ।సురభిః పంచమీ ప్రోక్తా॥"యని యీయైదునామములచే వృషభమాతకు పూజ వైకల్పికము అటుపై నీశానదిక్కునకుంభమందు రుద్రుని బూజించి యగ్నిప్రతిష్ఠించి బ్రహ్మ సనము జేసి ప్రణీతాపాత్రలయందు రెండు భాగములలోజలక్షీరములుంచి పాయసమునుపిండి చరువును జేసి "ఆదావిహారతిష్టచ్చ ఆజ్యభాగావతఃపరం॥" అనిస్మృతియున్నందున - "అగ్నయేస్వాహా" యనియాఘారాహుతులును ఆపైనాఘార

ములు నాజ్యభాగములను ఆపైని "ప్రజాపతయె- ఇంద్రాయ- అగ్నయె-సోమా
యస్వాహా" యని యాజ్యముఁవ్రేల్చి - "అగ్నయె - రుద్రాయ-శర్వాయ- ప
శుపతయె - ఉగ్రాయ-అశనయె-భవాయ-మహాదేవాయ - ఈశానాయ॥"అ
ని పాయసముఁవ్రేల్చి "పూష్ణేస్వాహా" యని పిష్టచరువును వ్రేల్చి యిద్దరికినిస్విష్ట
కృత్తుఁవ్రేల్చి ఆజ్యముచే ప్రజాపత్యాంతముగనవాహుతులు వ్రేల్చి వృషభమును నా
ల్గుగాని రెండుగాని యొకటిగాని గోవులను నలంకరించునది - ఇక్కడ హో
మము వేదమంత్రములతో నున్నందున శూద్రునకు లేదనిమదనపాలుడు-ఇతరులు
నామమంత్రములచే గావచ్చునంద్రు - ఆపైనివృషభమునకు నగ్నికిని నాల్గుమా
రులు ప్రదక్షిణముజేసి రుద్రకుంభజలముచే నభిషేకించి వృషభమును గోవులను
గంధమాల్యవస్త్రాదులచేనలంకరించి "రుద్రరూపవిప్రామైతత్పాద్యమాసనం" అ
ని పాద్యాసనగంధములు నాలుగింటికి నిచ్చి రుద్రరూపప్రేతరూపులగు విప్రులకు
నల్గురికామాన్నము లిచ్చి "వృషోత్సర్గశ్రాద్ధప్రతిష్ఠార్థం"మని దక్షిణనిచ్చి వృషభ
పాదమందు పిండము లీవలెనని కొందరు - ఆపైని నెడమప్రక్కను త్రిశూలము
చేతను కుడిప్రక్కను చక్రముచేతను గాని విపరీతముగగాని వృషభమునకు గో
వులకును చిహ్నములువ్రేసి కుశతిలస్వర్ణజలములతో దోకను బట్టుకొని "కాశ్య
పగోత్రస్యాస్మత్పితురముకదా సస్యప్రేతత్వవిముక్తిద్వారారుద్రలోక ప్రాప్త్య
ర్థం ఇమంవృషంవత్సతరీసహితం రుద్రదైవతమముకగోత్రాయాముక ప్రేతా
యోత్సృజామియుష్మభ్యం పతిందదామ్యేతేన పతినాస్వచ్ఛందం చరత తేన శ్రీరు
ద్రః ప్రీయతాం॥" అని యుచ్చరించి యపసవ్యముగ తిలలుగలసిన పుచ్ఛోదకము
బట్టి "అముకప్రేత ఇదంతే వృషవత్సతర్యోః పుచ్ఛోదకము పతిష్ఠతాం॥"అని యి
చ్చియిట్లు పఠించునది - "ధర్మత్వం వృషరూపేణ జగదానందకారక । అష్ట
మూర్తేరధిష్ఠాన మతఃపాహి సనాతన । వృషోహి భగవాన్ ధర్మశ్చతు
ష్పాదః ప్రకీర్తితః । వృణోమితమహం భక్త్యా ప్రేతం స్వర్గం నయత్వసౌ।
అయంహివోమయాదత్తస్సర్వాసాంపతిరుత్తమః । తుభ్యంచైతా మయా
దత్తాః పత్న్యస్సర్వామనోరమాః । వృషఏషమయాదత్తస్తంతార యతుసర్వ
దా॥" అని - ఆపైని బ్రహ్మకుపూర్ణపాత్రమునాచార్యునికిహిరణ్యముతో గో
మిథునమునిచ్చి విసర్జించి కర్మనీశ్వరుని కర్పించునది ఇట్లువృషోత్సర్గము- అ
టుపైని నవశ్రాద్ధమువలె ధరుడు ధ్రువుడు మొదలగునష్టవసువుల నుద్దేశించియె

సమందుస్త్రీగాని యొకనిగాని విప్రునివరించి వసుశ్రాద్ధము పదునొకండుగురికిగా ని యొకనికిగాని రుద్రగణశ్రాద్ధమును జేసి యాచమించి దేశకాలముల స్మరించి "కాశ్యపగోత్రస్యాముకప్రేతస్యాస్మత్పితుఃప్రేతత్వనివృత్త్యావస్వాది రూప ప్రాప్త్యర్థ మాద్యశ్రాద్ధమేకాదశేహ్న్యైకోద్దిష్టవిధినా కరిష్యే॥" యని యుచ్చరించి "ఆద్యశ్రాద్ధే అముకప్రేతస్థానేక్షణఃకర్తవ్యః॥" అనియునట్లు "ప్రాప్నోతుభవా"ననియు బదునొకండు గురుగానియొకనిగాని విప్రుని నిమంత్రించిగాని దర్భవటువునుంచిగాని "యక్రోధనై శ్శౌచపరై"రిత్యాది మంత్రములతోసవర్ణన వశ్రాద్ధమును పార్వణ విధిచే జేయునది - అపుడు ద్వారమందు మండలముజేసి యర్చించి "యముకప్రేత ఏతత్తేపాద్యము పతిష్ఠతాం॥" అని పాద్యమిచ్చి యాచమించి యుత్తరముఖముగ గూర్చుండబెట్టి "అముకప్రేతాముకగోత్ర ఏష తేగంధః పుష్పాణి ధూపః దీపః ఆచ్ఛాదనం ఛత్రాలంకారాది ఉపతిష్ఠతాం॥"అని యిచ్చి సంపూర్ణత్వము బలికించి అగ్నౌకరణము లేదని బహుమతము - గృహ్యభాష్యమతమందు మాత్రమున్నది - అపుడు "అముకప్రేతాయస్వాహా"యని యొకయాహుతినామద్రవ్యముచే నీవలెను అటుపైనుదకుంభముతో నుపస్కారములతో గూడిన యామాన్నము - "అముకప్రేతాయ ఆద్యశ్రాద్ధే ఉపతిష్ఠతాం॥" అని యిచ్చునది - వికిరమందు వికల్పము - ఆపైని వేదియందు రేఖ గీసి ఉచ్ఛిష్టపిండమునకు "ఇదంపిండాసనం అవనేజనంఅయంపిండః ప్రత్య వనేజనం"అని యిచ్చి పిండపూజయు సూత్రమునాపైని ప్రోక్షణాదులు చేసి "గోత్రం నోవర్ధతా" మని పలికి యక్షయ్యోదకములిచ్చి దక్షిణనిచ్చి పదు నొకండుగురైన యెడ మొదటివానికి ప్రేతాలంకారవాహనాదు లివ్వవలెను - అట్లు వచనము - బృహస్పతిస్మృతి - "ప్రేతాలంకారవస్త్రాదిపితుర్యద్వాహనాదికం। సంపూజ్యగంధమాల్యైస్తు శ్రాద్ధభోక్త్రేతదర్పయేత్॥" అని-ఆపైని "అభిరమ్యతాం॥" అని విసర్జించునది - తక్కినది నవశ్రాద్ధమువలెనగును - అనంతరమున నాద్యమాసికము చేయునది - దానితో సమానతంత్రములైన షోడశ శ్రాద్ధములైనను జేయునది - ఆద్యాబ్దికముగూడ జేయవలెనని కొందరు అపుడు పదదానముదేవజానీయమందు గారుడవచనములో జెప్పబడినది - ఎట్లనిన - ఏకాదశాహము నుపక్రమించి "తదహ్నాదీయతె సర్వంద్వాదశాహేవిశేషతః। పదాని సర్వవస్తూని వరిష్ఠాని త్రయోదశ । యోదదాతి మృతస్యేహ జీవన్నప్యా

త్మ హేతవే । సుఖీభూత్వా మహామార్గే వైనతేయసగచ్ఛతి । ఆసనోపా నహకాచ్ఛత్రం ముద్రికాచ కమండలుః । భోజనం భోజనాధారో వస్త్రాణ్యష్ట విధంపదం । భాజనాసనదానేన ముద్రికా భోజనేనచ । ఆజ్యయజ్ఞోపవీతేన పదంసంపూర్ణతాం వ్రజేత్ । మహిషీరథగోదానా త్సుఖీభవతి నిశ్చితం। స ర్వోపస్కార యుక్తాని పదాన్యత్ర త్రయోదశ । యోదదాతి మృతస్యేహజీవ స్యప్యాత్మహేతవే । సగచ్ఛతి పరంస్థానం మహాకష్ట వివర్జితః । త్రయోద శపదానీత్థం ప్రేతాయైకాదశేహని । దాతవ్యాని యథాశక్తి తేనాసౌ ప్రీణి తోభవేత్ । అన్నంచైవోదకం చైవో పానహౌచ కమండలుః। ఛత్రంవస్త్రం తథాయష్టిం లోహదండం తథాష్టమం । అగ్నిష్టకాంచదీపంచ తిలాన్ తాం బూల మేవచ । చందనంపుష్పదానంచో పదానాని చతుర్దశ । యోశ్వం రథం గజంవాపి బ్రాహ్మణె ప్రతిపాదయేత్ । స్వమహిమ్నాను సారేణ తత స్సుఖ మవాప్నుయాత్॥" అని - అనగాజీవించియున్నపుడెతనమేలుకొరకునుమృ తునికొరకును శ్రేష్ఠవస్తువులు అనగా పీట గొడుగుసుంగరముకమండలువు భోజ నపదార్థము భోజనపాత్ర వస్త్రములునేయి యజ్ఞోపవీతము గేదెబండి- గోవు నను నీపదుమూడును వానివాని యుపకరణములతో మృతునకేకాదశ దినమందు దానముజేసెనేని మార్గములో కష్టములేకుండగప్రేతయుత్తమలోకము నొందు ననుట మరియు నన్నోదకములు పాదరక్షలుకమండలువు ఛత్రము వస్త్రము చేగ ర్రలోహదండము దీపపుశమ్యదీపము తిలలు తాంబూలము చందనము పుష్పము లు వీనిదానములు నుపదానములు పదునాల్గుమరియు రథగజాశ్వాది దానములు యథాశక్తిగజేసినచో సుఖమగును ఈదానములకుమంత్రములు దానకమలాకర మందు దెలియునది - వీటిమూలము చింత్యము - ఇక శయ్యాదానము హే మాద్రిలో భవిష్యవచనము - "తస్మాచ్ఛయ్యాంసమాసాద్య సారదారుమయీం దృఢాం । దంతపత్రచితాంరమ్యాం హేమపట్టైరలంకృతాం । హంసతూలీ ప్రతిచ్ఛన్నాం శుభగండోపధానికాం । ప్రచ్ఛాదన పటీయుక్తాం గంధధూపా ధివాసితాం । తస్యాంసంస్థాపయెద్ధైమం హరింలక్ష్మ్యా సమన్వితం । ఉ చ్ఛీర్షకేఘృతభృతం కలశంపరికల్పయేత్ । విజ్ఞేయఃపాండవశ్రేష్ఠసనిద్రాకల శోబుధైః । తాంబూలం కుంకుమక్షోద కర్పూరాగా గురుచందనం । దీపికో పానహచ్ఛత్ర చామరాసనభాజనం । పార్శ్వేషుస్థాపయేద్భక్త్యా సప్త ధా

న్యానిచైవహి । శయనస్థస్య భవతి యదన్య దుపకారకం । భృంగారుకనకా
ద్యంచ పంచవర్ణ వితానకం॥" అనగా ప్రశస్తమైన పనసటేకు చందనముమొద
లగుసారమైన దారువుచే నిర్మింపబడి దంతపుపత్రములచేతను స్వర్ణాదళములచే
తను నలంకరింపబడి హంసతూలికా తల్పముతోడను మంచితోడులు తలాడలుదు
ప్పటులుగలిగినశయ్యపై లక్ష్మీనారాయణ రూపముగ బంగారుచేనిర్మించినప్రే
తరూపముంచితలయంపిని ఘృతపూర్ణమైన నిద్రామంగళకలశమును పార్శ్వము
లందు తాంబూల సామగ్రియు కుంకుమచూర్ణము కర్పూరమునగరువు చందనము
నుంచినడబ్బలు దీపముపాదరక్షలు ఛత్రచామరములునాసనముపాత్రలు సప్తధా
న్యములుమరియు శయ్యపైనుండువారి కుపయోగించునవి యన్నియు యథాశక్తి
గనుంచికూజాలు గిండీలునైదురంగులుగల జూలుచాందినీ మొదలగువానితో దా
నముచేయునది- అపుడుమంత్రము "యథా నకృష్ణశయనం శూన్యంసాగరజాత
యా । శయ్యాతస్యాప్య శూన్యాస్తు తథాజన్మని జన్మని । యస్మాద శూన్యం
శయనం కేశవస్య శివస్యచ । శయ్యాతస్యాప్యశూన్యా ఇత్యాది పూర్వవత్॥"
అని- "దత్త్వైవంసకలంతస్య ప్రణిపత్యవిసర్జయేత్ । ఏకాదశాహేపితథా విధి
రేష ప్రకీర్తితః । విశేషం చాత్రరాజేంద్ర కథ్యమానం నిశామయ । తేనోప
భుక్తంయత్కించిద్వస్త్రవాహన భాజనం । యద్యదిష్టం చతస్యాసీత్తత్సర్వంప
రికల్పయేత్ । తమేవ పురుషం హైమం తస్యాంసంస్థాపయే త్తదా । పూజ
యిత్వాప్రదాతవ్యా మృతశయ్యా యథోదితా॥" అనగానిట్లు శయ్యాదానము
జీవించి యున్నపుడుదా నిచ్చిబ్రాహ్మణుని పంపించవలెను ఇట్లు శయ్యాదానము
మృతినొందినవానికై యేకాదశదినమందు నీవిధిచొప్పుననే చేయునది- అపుడువి
శేషమికనేమనిన వానిచేభుక్తమైనవియును వానికిష్టమైనవియునగు వస్త్రవాహ
న భాజనాదులుగూడనుంచి స్వర్ణమయమైన ప్రేతప్రతిమనుంచి బ్రాహ్మణుబూ
జించి దానముజేయునది - మరియు పాద్మ వచనము "మృతకాంతె ద్వితీయే
హ్నిశయ్యాం దద్యాత్సలక్షణాం । కాంచనం పురుషంతద్వ త్ఫలవస్త్రసమన్వి
తం । సంపూజ్య ద్విజ దాంపత్యం నానాభరణ భూషితం । ఉపవేశ్యతు శ
య్యాయాం మధుపర్కం తతోవదేత్ । రజతస్యతు పాత్రేణ దధిదుగ్ధసమన్వి
తం । అస్థిలాలాటికంగృహ్య సూక్ష్మంకృత్వాతు పాయసం । భోజయేద్ద్వి
జదాంపత్యం విధిరేషసనాతనః । ఏషఏవ విధిర్దృష్టః పార్వతిమైద్విజోత్త

మైః॥" అనియనగా నాశౌచాంతమందు రెండవదినమున శుభలక్షణమైన శయ్యపై కాంచనప్రతిమనుంచి ఫలవస్త్రములతోగూడ ద్విజదంపతుల నానాభరణములచే నలంకరించి శయ్యపైనుంచి మధుపర్కమిచ్చి మృతునిలలాటాస్థి చూర్ణముగలపి నపాయసము రజతపాత్రలోనుంచి దంపతులచే దినిపించవలెను ఇదిపార్వతీయులైన బ్రాహ్మణోత్తములచే నిర్ణయింపబడిన ప్రాచీనమైన విధియనుట- శయ్యాదాన ప్రతిగ్రహమందు దోషమచ్చుటనే చెప్ప బడినది - "గృహీతాయాంతు తస్యాంవై పునస్సంస్కార మర్హతి॥" అనగాశయ్యాదానము బట్టినవానికిబునరుపనయనము గావలెననుట- ఇకమృతునికిఫలము - భవిష్యమందున్నది - "స్వర్గే పురందరపురే సూర్యపుత్రాలయే తథా । సుఖం వసత్య సౌజంతు శ్శయ్యాదానప్రభావతః । ఆభూతసంప్లవంయావ త్తిష్ఠత్యాతంకవర్జితః"॥ అని యనగా శయ్యాదానమహిమవలన మృతుడు స్వర్గమందునుసూర్యలోకమందును ప్రళయపర్యంతమునడ్డులేకుండ సుఖముగనివసించి యుండుననుట - ఇట్లుశయ్యాదానము- క్రియానిబంధమందుస్మృత్యంతరము- "సూతకేమృతకే చైవద్వితీయం మృతకం యది । పిండదానం ప్రకుర్వీత వృషోత్సర్గంతథైవచ। నహన్యాత్సూతకం కర్మ ద్వాదశై కాదశాదికం॥" జాతాశౌచ మృతాశౌచములలో మరియొకమృతాశౌచమువచ్చినయెడ పిండదానమువృషోత్సర్గము మొదలగునవియథావిధిగ జేయవచ్చును సూతకమైనచో నేకాదశద్వాదశాహాది కర్మకు ప్రతిబంధింపనేలేదు- "ఇకనుదకుంభశ్రాద్ధము హేమాద్రిలో స్మృతి సముచ్చయమందు "ఏకాదశాహాత్ప్రభృతి ఘటస్తోయాన్నసంయుతః । దినేదినేప్రదాతవ్యో యావత్సం వత్సరంసుతైః॥" అనగా పదునొకండవదినముమొదలుగ నుదకుంభముతోగూడినయన్నముప్రతిదినమున సంవత్సరపర్యంతము నొకవిప్రునికిశ్రాద్ధము చేయవలెననుట- మదనరత్నమందు గౌతమవచనము- "అదైవం పార్వణశ్రాద్ధే సోదకుంభమధర్మకం । కుర్యాత్ప్రత్యాబ్దికాచ్ఛ్రాద్ధా త్సంకల్ప విధినాన్వహం॥ " అనగా ప్రత్యాబ్దికపర్యంతము పార్వణశ్రాద్ధ ధర్మములన్నియు నక్కరలేకుండగ దైవహీనముగ సంకల్పవిధిచే నుదకుంభశ్రాద్ధము ప్రతిదినమున జేయునది - ఇక్కడపిండమువికల్పితము- "అహరహరన్నమస్మైబ్రాహ్మణాయోద కుంభంచ దద్యాత్పిండమప్యేకేనిగృహ్ణంతి" యనిహేమాద్రిలోపారస్కరవచనము తక్కినవిశేషమునిర్ణయసింధువున దెలియునది - దేవజానీయ మందు గారుడ వచనము "ప్రత్యహందీ

పకోదేయోమార్గేతు విషమేనరైః । యావత్సంవత్సరం వాపిప్రేతస్యసుఖలిప్స యా । కుర్యాద్వ్యామ్యే సుఖంపిత్ర్య మద్భిస్సంకల్ప్య సుస్థితం॥" అనగా సంవత్సర పర్యంతము ప్రతిదినమును విషమమార్గమందు ప్రేతకుసుఖమునకు సంకల్పించిదక్షిణాభిముఖముగ దీపదానముచేయునది- ఇకమాసికములు- అవిసపిండనమునకు మున్నెచేయునది-"శ్రాద్ధానిషోడశా దత్వానైవ కుర్యాత్సపిండనం" అనిలౌగాక్షిస్మృతియున్నది- అనగా షోడశశ్రాద్ధములు చేయకసపిండీకరణముచేయగూడదు-సపిండీ కరణమైన పైనవితిరుగ జేయవలెను-"యస్య సంవత్సరాదర్వాక్సపిండీకరణంకృతం । మాసికంచోదకుంభంచ దేయంతస్యాపివత్సరం॥" అని యచ్చటనే యున్నది అనగాసంవత్సరములో సపిండీకరణమైనచోదిరుగ మాసికము లుదకుంభశ్రాద్ధమునువర్ష పర్యంతము జేయునది-మరియు గాలవవచనము- "సపిండీకరణాదర్వాగపకృష్య కృతాన్యపి । పునరప్య పకృష్యంతే వృద్ధ్యుత్తరనిషేధనాత్॥" అనియనగా సపిండీకరణములోగా నపకర్షించి మాసికములు చేసిననుఅనగావృద్ధిశ్రాద్ధముపైని నిషేధింపబడినందున నట్లుచేసినను దిరుగనపకర్షించిచేయబడవలెననియర్థము- విశేషమేమనిన సపిండనమునకు మున్నేకోద్దిష్ట విధిచేతను నటుపైని పార్వణవిధిచేతను జేయునది- అనిమొదలుగ నిర్ణయ సింధువున దెలియునది- అవియేవనిన కాత్యాయన వచనము-"ద్వాదశప్రతిమాస్యాని ఆద్యషాణ్మాసికేతథా । సపిండీకరణంచైవ ఇత్యేతచ్ఛ్రాద్ధషోడశం । త్రిపక్షే కాబ్దికేచేతిశ్రాద్ధాన్యేతాని షోడశేతి జాతూకర్ణ్యపాఠః॥" అనగా పండ్రెండు మాసికములు ఆద్యషాణ్మాసికములును సపిండీకరణమునివి పదారు శ్రాద్ధములు త్రైపక్షికాబ్దికములని జాతూకర్ణ్యపాఠము- ఆద్యమనగా నూనమాసికము షాణ్మాసికమనగనూనషష్ఠము ఆబ్దికమనగ నూనాబ్దికము- కాబట్టి-"అముకదా సప్రేతత్వ నివృత్త్యాపితృలోక ప్రాప్త్యర్థమాద్యమాసిక ద్వితీయత్రైపక్షిక తృతీయచతుర్థపంచమషష్ఠఊనషష్ఠ సప్తమ నవమ దశమ ఏకాదశద్వాదశ ఊనాబ్దికాని శ్రాద్ధానిస్వకాలకర్తవ్యాని సపిండీ కరణాధికార సిద్ధ్యర్థంఏకాదశే ద్వాదశేవాహ్ని అపకృష్యకరిష్యే" - యనియుచ్చరించి "ఆద్యమాసికేఅయం తేక్షణఉపతిష్ఠతాం" అనిమొదలుగపదార్గురు విప్రులనుగాని దర్భవటువులగాని నిమంత్రించి "ఆద్యమాసికెఇదంతె పాద్య"మనిమొదలుగ సర్వము నవశ్రాద్ధవిధిగాజేసిపదారు భోజనసామగ్రులను పిండములనీవలెను- ఇక సపిండనము - అందుభవిష్యవచనము- "ద్వాద

శేహానిషణ్మాసే త్రిపక్షేవాత్రిమాసివా । ఏకాదశేథపూర్ణేబ్దే మంగలస్యాప్యుపస్థితే" అనగా సపిండనము పండ్రెండవదినమందైనను నారవమాసమందైనను మూడవపక్షమందైనను మూడవమాసమందైనను పదునొకండవమాసముననైనను వత్సరాంతముననైనను మంగళకార్యమనగా వివాహోపనయనాదులుప్రాప్తించునపుడునుసపిండనము జేయవలయు నని - విష్ణుస్మృతి - "మాసికార్థవద్ద్వాదశాహంకృత్వాత్రయోదశేహ్నికుర్యాత్ । మంత్రవర్జంహిశూద్రాణాం ద్వాదశేహానికీర్తితం" అనగా మాసికముల సగమువలె ద్వాదశాహశ్రాద్ధము జేసి త్రయోదశదినమందుజేయునది శూద్రులకుమంత్రహీనముగ ద్వాదశదినమందుజేయునది- అనిచెప్పుటదర్శశ్రాద్ధాదులుచేయుశూద్రునకని యపరార్కమందును కల్పతరువునందు నున్నది - ఆశౌచానంతరమందు ద్వాదశ దినములందు ద్వాదశమాసికములజేసి ద్వాదశమందుసపిండనము - అధికమాసమైనచో త్రయోదశమందనియర్థము - తక్కినవిస్తరము నిర్ణయసింధువునందు దెలియునది- ఇకప్రయోగము - దేశకాలములస్మరించి "కాశ్యపగోత్రస్యాస్మత్పితు రముకదాస్యస్య ప్రేతత్వనివృత్త్యావస్వాది పితృలోకప్రాప్త్యర్థ మేకోద్దిష్ట పార్వణోభయాత్మకం సపిండీకరణశ్రాద్ధంకరిష్యే"యని యుచ్చరించి "అస్మత్పితురముకప్రేతస్య స్థానేక్షణంధృత్వాభవద్భిః ప్రసాదః కరణీయః" అనియొక విప్రునినటుపైని సవ్యముచే "కామకాలసంజ్ఞిక విశ్వేదేవస్థానేక్షణ"మనియిద్దరు విప్రులను లేదా దేవనిమంత్రణమైన పైని నపసవ్యముగ ప్రేతనిమంత్రణము- ఇట్లు "నస్మత్పితుఃపితామహస్యఅముకదాసస్యరుద్రరూపస్యస్థానే"యనిమొదలుగనట్లు "అస్మత్పితుఃప్రపితామహస్యస్థానే"యని మొదలుగ నిమంత్రించునది- ఇట్లాగుణారువిప్రులుగానిదర్భవటువులు గాని నిమంత్రింపబడునది- "అశ్రోధనైశ్చాచపరై"అనునది యంతటతుల్యమే- ప్రేతస్థానమందు నవశ్రాద్ధమందువలె పిత్ర్యమందు పార్వణమందువలె జేయునది - ఆపైని పరదినమందు సంకల్పించి క్షణమునిచ్చి దేవార్థమై చతురశ్రమండలమనగానలుపలకలుగను వానికి దక్షిణముగ ప్రేతకైవర్తులముగగాని ముక్కోణముగగాని మండలముజేసి క్రమముగ పాద్యమిచ్చి "కామకాల సంజ్ఞికా విశ్వేదేవాస్సమాధ్వం ప్రేతసమాధ్వంప్రేతస్య పితృపితామహప్రపితామహాస్సమాధ్వం"అనియాసనములపైగూర్చుండబెట్టి నీవీయనేడు బంధముజేసి "ఉపక్రాంతంశ్రాద్ధకర్మకరిష్యే"యనగా "కురుష్వ"యనివారుపలికిన పైని "కామకాలసంజ్ఞి

కానాంవిశ్వేషాందేవానామిదమాసనం - సుఖాసనం - అత్రాస్యతాం- ధర్మోసి- దైవేషుణః క్రియతాం- తథా - ప్రాప్నువాని" అనిచేసియిట్లుద్వితీయదైవవిప్రునికి నిజేసి యటుపైని రెండర్ఘ్యపాత్రములుసంపన్నముల జేసియిట్లుపలికించి "కామకాలసంజ్ఞికాన్ విశ్వాన్దేవాన్ భవత్సువాహయిష్యే-" అని- "ఆవాహయ" యన్నపైని "కామకాలేభ్యోనమః- ఆగచ్ఛంతు మహాభాగా విశ్వేదేవా మహాబలాః॥" అనియావాహించి "కామకాలసంజ్ఞికా విశ్వేదేవాఇదం వోర్ఘ్యం" అని యిద్దరకునిచ్చి యర్ఘ్యపాత్రను బోరగిలించి - గంధపుష్ప ధూపదీపములు నాచ్ఛాదనమునిచ్చి సంపూర్ణతనుజెప్పించి యపసవ్యముచే "అస్మత్పితుః కాశ్యపగోత్రస్యాముకదాసస్య ఇదమాసన ముపతిష్ఠతాం స్వాసనం ప్రాప్నవానియని మొదలుగజేసి పితుఃపిత్రాదులకు పార్వణశ్రాద్ధమందు వలెనాసనములు నాలుగర్ఘ్య పాత్రలు అందుమొదలిటి దానియందునాల్గు పవిత్రములు తక్కిన మూడిటియందుమూడునుంచియటుపైని "కాశ్యపగోత్ర అముకప్రేత ఏష తేఘ్యఉపతిష్ఠతాం" అనియిచ్చి అర్ఘ్యయని మొదలుగ "కాశ్యపగోత్రస్యాముక ప్రేతస్యార్ఘ్యం తత్పితృపితామహ ప్రపితామహార్ఘ్యైస్సంయోజయిష్యే" అని "సంయోజయ" అనినపైని నొకపవిత్రము పితృపాత్రమందుంచి "కాశ్యపగోత్రాముక ప్రేతస్వపిత్రాముకదాసేనసహసంసృజ్య స్వసాయుజ్యం గచ్ఛ" యనితదర్ఘ్యమందుగలపిఇట్లుతని "పితామహేనరుద్ర రూపేణ" యని ద్వితీయునితోగూడను "ప్రపితామహేనా దిత్యరూపేణ" యని తృతీయునితో గూడనుగలపి "ఏషవోనుగతఃప్రేతః పితరస్సం దదామి వః । శుభంభవతు శేషాణాం జాయంతాంచిరజీవినః॥" అనిస్పృశింప వలెను సంసర్గమైనపైని ప్రేతకర్ఘ్యమని మదనపాలుడు ఆపైని ప్రేతయొక్క పిత్రాదులకు పార్వణశ్రాద్ధమందు వలెనర్ఘ్యమిచ్చి పాత్రనుబోరగిలించి గంధపుష్పధూపదీపాచ్ఛాదనాలంకారములను ప్రేతకు నతని పిత్రాదులకునిచ్చి పూర్ణతను బలికించి "ప్రేతాయయమాయచ ఇయమాహుతి రుపతిష్ఠతాం" అని పాణిహోమము జేసిగాని తత్పిత్రాదుల కగ్నౌకరణముజేసి దైవమందుప్రేతకును దత్పిత్రాదులకునామాన్నములువడ్డించియిచ్చియుచ్ఛిష్టపిండమువికిరమునిచ్చి గృహసిద్ధాన్నముచేగాని పాయసముచేగాని సత్తుపిండిచేగానిప్రేతకు దత్పిత్రాదులకును బిండములిచ్చి అద్యేత్యాదికముచ్చరించి "కాశ్యపగోత్రస్యాముక దాసప్రేతస్య ప్రేతత్వవిముక్త్యావస్వాది పితృలోకప్రాప్త్యర్థం తత్పిండంతత్పితృ పితామహ ప్రపితామ

హానాం కాశ్యప గోత్రానామముకదాసానాంవసురుద్రాదిత్య స్వరూపాణాం పింద్రై స్సహసంయోజయిష్యే" అనిపలికి సంయోజయ అనినపైని ప్రేతపిండమును మూడువిధముల భాగించియొక భాగమును మధువును గ్రహించి "కాశ్యప గోత్రాముకప్రేత త్వత్పిండంత్వత్పిత్రాముక గోత్రేణాముకదాసేనవసురూపేణ సంయునజ్మి- ఏష తేపిండః తస్మై తేస్వధానమః" అనియిచ్చియిట్లు "ద్వితీయంభాగం త్వత్పితామహేనరుద్రరూపేణయనియు" తృతీయంభాగం ప్రపితామహేనాదిత్యరూపేణ" యనియుగలిపియిచ్చియాపైని "ఏషవోనుగతఃప్రేత" యనుమీద జెప్పినదిపఠించి ప్రత్యవనేజనపిండ పూజాదికముజేసి దక్షిణనిచ్చి దశదానములువైతరణీదానములుచేసి శేషసమాప్తిజేయవలెను- అటుపైనిపాథేయ శ్రాద్ధముజేసి వర్షాంతపర్యంతమునుదకుంభశ్రాద్ధములను-స్వస్వకాలములందుమాసికములును చేయునది- ఇట్లుకమలాకరభట్టునిచే రచింపబడినశూద్రధర్మతత్వమందు నౌర్ధ్వదైహికప్రయోగముముగిసెను——ఇకశూద్ర ధర్మములు-అందునుపనయనముగాకమున్ను ద్విజులునుశూద్రసమానులు- అట్లుమనువచనము "శూద్రేణహి సమస్తావ ద్యావద్దేహెనయుజ్యతే॥" అనగా దేహమాత్రముతో సంబంధించి కర్మకర్తృత్వమునొందకున్నంతవరకును శూద్రసముడనుట-ఇట్లుసామ్యమును గమార్గనధికారము చేతనేకాని స్నానపంచయజ్ఞాదులు ద్విజునకులేవు- ఏమనిన ప్రాగుపనయనాత్కామచారవాదభక్షాః" అని గౌతమవచనము అయినను శ్రాద్ధముజేయునపుడు మంత్రాదియుక్తముగనే చేయవలెను - అట్లు మనువచనము "నాభివ్యాహారయేద్బ్రహ్మస్వధానినయనాదృతే" యని - అనగా దండ్రిమొదలగువారికిశ్రాద్ధముజేయునపుడు తప్ప దక్కినకాలమందు వేదము ననుపనీతుడు పఠింపగూడదనుట- పాద్మములోస్పృష్టిఖండమందును - "అమావాస్యాష్టకాకృష్ణపక్షపంచదశీషుచ । ఏతచ్చానుపనీతోపి కుర్యాత్సర్వేషుపర్వసు । శ్రాద్ధంసాధారణంనామ సర్వకామఫలప్రదం । భార్యావిరహితోప్యేతత్ప్రవాసస్థోపినిత్యశః । శూద్రోప్యమంత్రవత్కుర్యాదనేనవిధినాబుధః" అనియున్నది అనగా నమావాస్యయు నష్టకయు కృష్ణపక్షాష్టమి పూర్ణిమయు మొదలగు సర్వపర్వములందు ననుపనీతుడు నీశ్రాద్ధము చేయునది- ఇది సర్వకామముల నిచ్చును నందరకుసాధారణమైనది దీనిప్రవాసమందున్నవాడును విధురుడును జేయవచ్చును శూద్రుడునుమంత్రహీనముగజేయవచ్చుననుట - ఇట్లు తీర్థమందువిశేషమునిర్ణయసింధువునందు

శ్రాద్ధాధికారములో దెలియునది - ఇట్లు ద్విజస్త్రీలును శూద్రతుల్యులు "తా
సామపియావదుక్తమాశీర్బ్రహ్మచర్యమతుల్యత్వాత్" అను షష్ఠాధ్యాయము
లో పూర్వమీమాంసాన్యాయముచే గర్మాధికారము వారికినీలేదు - అయిన
ను నగ్నిసాధ్యమైన శ్రౌతస్మార్తకర్మలందధికారము వారికినిగలదు "స్వర్గ
కామోయజేత" యనుశ్రుతియందలి యుద్దేశ్యమునొందిన పుంస్త్వము షష్ఠాధ్యా
యములో జెప్పిన న్యాయముచేతనే యవివక్షితము - "పాణిగ్రహణాద్ధిసహ
త్వంకర్మసు తథాపుణ్యఫలేషుచ" అని యాపస్తంబ వచనముగలదు అనగా వి
వాహసంస్కారమునుండి గదా కర్మలందు పుణ్యఫలములందును స్త్రీలు తోడ
గుటయని - మరియు సూతసంహితయందును "ద్విజస్త్రీణామపి శ్రౌతజ్ఞానా
భ్యాసేఽధికారితా।వదంతి కేచిద్విద్వాంసస్త్రీణాంశూద్రసమానతాం" అని అ
నగా ద్విజస్త్రీలకును శ్రౌతకర్మజ్ఞానాభ్యాసమం దధికారమున్నది కొందరు
విద్వాంసులు స్త్రీలకు శూద్రతుల్యతను జెప్పుదురు అట్లు "స్త్రీశూద్రాశ్చ స
ధర్మాణః" అని స్మృతియుం గలదు - మరియు స్త్రీలకు సంస్కారములు
ను శూద్రునికి వలె మంత్రహీనముగనె కావలెను - అట్లు మనువచనము -
"అమంత్రికాతు కార్యేయం స్త్రీణామావృదశేషతః॥" అని - కాబట్టి "అధి
కారీ భవేచ్ఛూద్రః పూర్తధర్మేణ వైదికే॥" అనియు "బహిర్వేదిచయద్దా
నంతత్పూర్తకముదాహృతం" అనియు అనగాశూద్రుడు వేదమంత్రసాధ్యమగు
కర్మలందధికారి కాడుగాని పూర్తధర్మమందధికారి యగును పూర్తమన
గాయజ్ఞాదులు తప్పదక్కిన వ్రతాదులందుదానము పూర్తమనబడునని జాతూ
కర్ణ్యవ్యాసవచనము లున్నందునశూద్రునికివలె తులాదిషోడశమహాదానములం
దును దేవాలయజలాశయోత్సర్గాదులందును స్త్రీలకధికారముగలదు - వానిఫల
వాక్యములందలి పుంస్త్వము షష్ఠాధ్యాయన్యాయముచే నవివక్షితము- కనుక
సభర్తృక స్త్రీలకు భర్తనుమతిచే ప్రత్యేకముగ నధికారము- ఏమనిన నది
యగ్నిసాధ్యముగాదు విధవలకైనను స్వాతంత్ర్యమున్నందుననధికారము - ఇది
యు విజ్ఞానేశ్వరీయమందు వ్యవహారాధ్యాయమందు సవిస్తరముగ నిరూపింప
బడినది - కనుకనేతులాదిదానములలో "పుమాన్ప్రద్యుమ్నవత్సస్యాన్నారీస్యా
త్పార్వతీసమా" అనిస్త్రీలకును ఫలశ్రవణమున్నది - అట్లయినచో శూద్రులతో
సమానధర్మములున్నందున స్త్రీలకును పంచయజ్ఞాదులు చేయుటప్రసంగించు

ననిన - వినుము - "పంచయజ్ఞవిధానంతు గృహీనిత్యం నహాపయేత్" అని శంఖాదిస్మృతియనగా గృహస్థుడగు పురుషుడు పంచయజ్ఞవిధిని నిత్యమును చేయక తప్పదనియున్నది యజేతయని మొదలగు విధివాక్యములందు గర్తకేకత్వము పుంస్త్వము వివక్షింప బడినది కనుక స్త్రీకి వానియాచరణమందు ప్రసక్తి లేదు - నిత్యకర్మవిషయము శ్రుతిలేదుగదా అట్లున్నయెడనచ్చటపుంస్త్వము వివక్షింపకస్త్రీలకధికారము సిద్ధించును కనుక స్త్రీలకు నిత్యములు కానందున నవిచేయకున్నను ప్రత్యవాయములేదు మరేమనిన వచనమున్నయెడ నిత్యమందు నధికారముండవచ్చును ఎట్లనిన మదనరత్నమందు స్కాందవచనము - "ప్రత్యహంతర్పణం కార్యంభర్తుః కుశతిలోదకైః॥" అనిఅనగా పుత్రహీనురాలగుస్త్రీ భర్తకు నిత్యముకుశ తిలోదకములచే తర్పణము చేయునదియనుట - ఇట్లునిత్య నైమిత్తికకామ్యశ్రాద్ధములందునధికారముగలదు - "భార్యాపిండంపతిర్దద్యాద్భర్త్రేభార్యాతథైవచ" అని శంఖవచనము - మరియును "అపుత్రాశయనం భర్తుః పాలయంతీ వ్రతేస్థితా । పత్న్యేవదద్యాత్తత్పిండం కృత్స్నమంశం లభేతచ॥" అనగా పుత్రహీనురాలగు భార్యభర్తయొక్క శయ్యను పరిపాలించుచు పాతివ్రత్యమందుండి యతనికి శ్రాద్ధము దానేచేయుచు నతనిధనముదానే వినియోగించునది యని వృద్ధమనువచనమున్నది - ఇది సవిస్తరముగనిర్ణయసింధువునందు జెప్పబడినవి - ఇకవిష్ణుశివపూజాదికర్మునకు ఫలశ్రవణమున్నందున స్త్రీలకుదానియం దధికారముగలదు - ఇట్లువ్రతాదు లందునుగలదు- కనుక శూద్ర తుల్యత్వమున్నను పంచయజ్ఞాధికారములేదు మరి యేమనిన భోజనకాలమందు నొకయన్నకబలము ఘృతముతో నగ్నియందు వేయవలెను - అట్లు పృథ్వీచంద్రోదయమందు గోబిల వచనము - "యస్య తేషామగ్రతోన్నం సిద్ధ్యేత్సవహ్నౌకృత్వా అశ్నీయాత్" అనియున్నది - విస్తరభయమున నింతతోనిది ముగింపబడును-

ఇక స్త్రీధర్మములు - అందుమనువచనము- "ఉత్పాదన మపత్యస్య జాతస్య పరిపాలనం । ప్రత్యహం లోకయాత్రాచ ప్రత్యక్షం స్త్రీనిబంధనం । అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషారతి రుత్తమా । దారాధీనా స్తథాస్వర్గః పితౄణామాత్మనశ్చహ । తస్మాద్యత్నేనరక్ష్యాస్తాభర్తవ్యా మనురబ్రవీత్"॥ అని యనగా సంతతిగనుటయు గన్నసంతతిని సంరక్షించుటయుప్రతిదినమునలోకయాత్ర

యనగ దనసజాతీయులతో పాటుగ సదాచారము నడుపుటయు ననునివిస్త్రీసం
ప్రదాయములు ప్రత్యక్ష సిద్ధములు మరియు పురుషునకు వంశము ధర్మాచర
ణము సేవయును త్తమరసా నుభవము పితృదేవతలకు దనకు నంతమున స్వర్గ
మునను నివి భార్యాధీనములు గనుక ప్రయత్నముచే భార్యల బురుషులు సంరక్షిం
చి భరింపవలెనని మనుశాసనము-ఎట్లనిన- "అస్వతంత్రాస్త్రియః కార్యాః పు
రుషైస్స్వైర్దివానిశం । విషయేషుచ సజ్జంత్యః సంస్థాప్యాహ్యాత్మనోవశే । పితా
రక్షతి కౌమారే భర్తారక్షతియౌవనే । పుత్రాస్తుస్థావిరేభావేనస్వాతంత్ర్యం
క్వచిత్త్స్త్రియాః। సూక్ష్మేభ్యోపి ప్రమాదేభ్యస్త్రియోరక్ష్యా విశేషతః। ద్వ
యోర్హి కులయోశ్శోకమావహేయు రరక్షితాః । కాలేదాతా పితా వా
చ్యోవాచ్యశ్చానుపయన్పతిః। మృతేభర్తరి పుత్రస్తు వాచ్యోమాతు రరక్షితా"
అనగా స్త్రీలను పురుషులు సర్వదా స్వాతంత్ర్య హీనురాళ్లగానుంచవలెను-ఎ
ట్లనిన వారిముద్దు ముచ్చటలు జరుపుచు స్త్రీలను తమ యాజ్ఞకు నడుగు దాటని
వారిగా నుంచవలెను - అట్లుబాల్యావస్థయందు దండ్రియు యౌవనమందు భ
ర్తయు వార్ధకమందు పుత్రులును స్త్రీకి రక్షకులు గనుక స్త్రీకెపుడును స్వే
చ్ఛ చొప్పున నడుచుటకూడదు - అనగా నాటలు పరిహాసములు మొదలగుసూ
క్ష్మవ్యసనములనుండియు దప్పించి యదపుగా నుంచవలెను అట్లుసంరక్షింపనియె
డ నత్తింటికి పుట్టింటికి గూడహాని దెత్తురు కాలమందు వివాహము చేయనిచోతం
డ్రిదోషియగును క్రమముగా సంరక్షించి భరింపనిచో భర్తదోషియగును భర్త
మృతి నొందెనేని దల్లిని రక్షింపని పుత్రుడు దోషియగును - కల్పతరువు నందు
హైతీనసివచనము - "అప్రమత్తారక్షతతంతుమేనం మాపరక్షేత్రేపరబీజానివాప్సు
భార్యాంరక్షత కౌమారేబిభ్యతః పరరేతసః స్త్రియోగృహదేవతాస్తాసాంనవ్ర
తం నశౌచం నోపవాసః పతిశుశ్రూషయాగచ్ఛంతి పరమాంగతిం॥" అనగాజా
గరూకులైదమ సంతతి రూపమైన తంతువును సంరక్షించు కొనవలెను గాని పరు
నిభూమిలో నుదకమందు పరబీజముల జల్లినట్లుపేక్షింప గూడదు గనుక పరబీజ
భయమునుండి యౌవనమందు భార్యను రక్షించుకొనునది లేనియెడ వంశసంక
రమగును - స్త్రీలు గృహదేవతలు వారికి శుద్ధియక్కరలేదు వ్రత మక్కర
లేదు ఉపవాసము నక్కరలేదు పతియాజ్ఞచే మెలగిన మాత్రముచే స్వర్గము
నొందుదు రనుట - అట్లు బ్రాహ్మమందును - "అమీమాంస్యాని శౌచాని స్త్రీ

షు బాలాతురేషుచ॥" అనగా స్త్రీలకు బాలురకు రోగులకును శుద్ధియథా
విధిగా నక్కర లేదనుట - భారతమందును - "పానం దుర్జన సంసర్గః ప
త్యాచవిరహోஉటనం । స్వాపోన్య గేహేవాసశ్చ స్త్రీణాం వైదూషణాని
షట్। నైతారూపం పరీక్షంతే నాసాంవయసిసంస్థితిః । సరూపంవాకురూపంవా
పుమానిత్యే వభుంజతే । శయ్యాసన మలంకారం కామంక్రోధ మనార్జవం ।
ద్రోహభావం కుకార్యంచ స్త్రీభ్యోమను రకల్పయత్ । నాస్తిస్త్రీణాంక్రియా
మంత్రైరితి ధర్మోవ్యవస్థితః । నిరింద్రియాహ్యా మంత్రాశ్చ స్త్రియోనిత్యమి
తిస్థితిః । నకశ్చిద్యోషితశ్శక్తః ప్రసహ్యాపరిరక్షితుం । అర్థస్య సంగ్రహే
చైవవ్యయెచైనాం నియోజయేత్ । గ్రామ్యధర్మేచ పత్న్యాంచ పరిగ్రాహ
స్య రక్షణే॥" అనగా మద్యపానము దుర్జన సంగము భర్తను విడిచి యుండు
ట యొంటిగ దిరుగుట పరగృహమందు నిద్రించుట యచ్చట నివసించుటయు నీ
యారును స్త్రీకినింద్యములు - స్త్రీలురూపము నెంచరు యౌవనము నపేక్షించ
రుమరేమనిన సురూపుడైననులేదా కురూపుడైనను పురుషుడైనయెడ చాలును-అ
నుభవించెదరు - ఏమనిన శయ్యయు నాసనము నలంకరించుకొను వస్తువులును
కామము క్రోధము వంకరచేష్టయు ద్రోహబుద్ధియు పాపాచరణము- నివి స్త్రీల
కసాధారణముగ మనువు సృజించెను- ఇకస్త్రీలకు మంత్రసహితముగ నేకర్మ
యులేదు ఏమనిన స్త్రీలు దుర్బలమైన యింద్రియములు గలవారు గనుకనిత్యము
మంత్రధారణమున కయోగ్యలని సిద్ధము - అట్టిస్త్రీలనెవ్వడును బలాత్కారము
గ రక్షింపలేడు- గనుక ధనముయొక్క రక్షణమందును కర్చుపెట్టడమందును ర
తియందును భృత్యుల పాలించుటయందును నియోగించి యవకాశము లేకుండగ
జేయవలెను - మనువచనము "బాలయావాయువత్యావా వృద్ధయా వాపియోషి
తా । నస్వాతంత్ర్యేణ కర్తవ్యం కించిత్కార్యం గృహేష్వపి । పిత్రా భ
ర్త్రాసుతేనాపి నేచ్ఛేద్విరహ మాత్మనః । ఏషాంహి విరహేణస్త్రీ గర్హి
తాస్యాత్కులద్వయే॥" అనగా బాల్యయౌవనవార్ధకా వస్థలలో నెప్పుడును
స్త్రీస్వతంత్రముగ గృహకార్యమైనను జేయగూడదు మరియు తండ్రిగాని భర్త
గాని సుతుడుగాని తనకునొకడు సంరక్షకుడుండవలెనుగాని వారినివిడిచి తాను
స్వతంత్రముగా నుండగూడదు - అట్లున్నచో నత్తింటను పుట్టింటను నిందితురా
లగును- విష్ణువచనము-"భర్తరిప్రోషితే నప్రతికర్మ క్రియా పరగృహేషు నాభి

గమనం ద్వారదేశ గవాక్షేష్వ నవస్థానం॥" అనగా భర్త ప్రయాణము వెళ్లిన
పుడు స్త్రీయలంకరించుకొనగూడదు పరగృహమునకు వెళ్లగూడదు వీధిద్వార
మందు గవాక్షములందును నిల్చియుండగూడదు - యాజ్ఞవల్క్యవచనము-"రక్షే
త్కన్యాం పితావిన్నాం పతిఃపుత్రాస్తు వార్ధకే । అభావేజ్ఞాతయస్తేషాం న
స్వాతంత్ర్యంక్వచి త్స్త్రియాః । భర్తృభ్రాతృ పితృజ్ఞాతి శ్వశ్రూశ్వశుర
దేవరైః । బంధుభిశ్చస్త్రియః పూజ్యాభూషణాచ్ఛాదనాశనైః । సంయతో
పస్కారదక్షాహృష్టావ్యయ పరాఙ్ముఖీ । కుర్యాచ్ఛ్వశురయోః పాదవందనం
భర్తృ తత్పరా।స్త్రీభి ర్భర్తృవచఃకార్యమేష ధర్మస్సనాతనః । ఆశుద్ధేస్సం
ప్రతీక్ష్యోహి మహాపాతక దూషితః । క్రీడాంశరీర సంస్కారం సమాజో త్స
వదర్శనం । హాస్యం పరగృహేయానం త్యజేత్ప్రోషిత భర్తృకా॥" అనియ
నగా కన్యావస్థలో దండ్రియు వివాహమైన పైనిపతియు వార్ధకమందు పుత్రు
లును వారులేనిచో జ్ఞాతులు సంరక్షించునది గనుక స్త్రీకి స్వాతంత్ర్య మెపుడును
లేదు భర్తయు సోదరులు తండ్రియు జ్ఞాతులు న త్తమామలు మరుదులు మొద
లగు వారందరు భూషణాచ్ఛాదన భోజనములిచ్చి స్త్రీనిమన్నించునది - ఆమె
యు నియతురాలై గృహరక్షణమందు నేర్పునొంది కర్చుచేయక య త్తమామ
లయడపులోనుండి భర్తకు వశురాలై యుండునది భర్త్రాజ్ఞలో నుండుటమె
స్త్రీకిముఖ్య ధర్మము- ఒకవేళ భర్త బ్రహ్మహత్యాదులచేబహిష్కృతుడై ననునత
నిశుద్ధి పర్యంతము న త్తింటకని పెట్టియుండునది - భర్త ప్రయాణము వెళ్లినపుడ
లంకారము నాటలు సమాజోత్సవముల జూచుటయు పరిహాసములు పర గృహ
మునొందుట మొదలగునవి విడువవలెననుట- బృహస్పతి వచనము "ప్రసాధనం
నృత్యగీతే సమాజోత్సవ దర్శనం । మాంసమద్యాభిగమనంచ నకుర్యాత్ప్రో
షితేప్రభౌ॥" అనగా నలంకరించుకొనుట నృత్యగీత సేవయు సమాజోత్సవము
ల జూచుట మాంస మద్యము లనుభవించుటయు భర్త ప్రయాణము వెళ్లినపుడు
స్త్రీకిగూడదు - శంఖలిఖిత స్మృతులు "ప్రోషితేభర్తరి ప్రేంఖా తాండవ విహా
రచిత్ర దర్శన వాహనోద్యాన మానవికృతశయనోత్కృష్ట పానభోజన కంచు
కక్రీడాగంధ మాల్యాలంకార దంతధావనాం జనాదర్శ ప్రసాధనాదీనామ నా
రంభః॥" అనగా భర్త దూరమందున్నపుడు స్త్రీకుయ్యాల లూగుట నాట్య వి
హారము చిత్రదర్శనము వాహనము లెక్కుట యుద్యానవిహారము నలుకపుష్ప

శయ్యాదులు మంచిపాన భోజనములు బంతులాట గంధమాల్యాదు లలంకరించు
కొనుట దంతధావనము కాటుక యద్దముజూచుట కేశసంస్కారము మొదలగు
వాని విడువవలెను- కల్పతరువునందె భారతవచనము-" ఎతాశ్శ్రియస్స్త్రియో
నామ సత్కార్యా భూతి మిచ్ఛతా । లాలితా నిగృహీతాచ స్త్రీశ్శ్రీర్భవతి
భారత॥" అనగా స్త్రీలు ప్రత్యక్షమైన సంపత్తులు గనుక శ్రేయస్సును గోరువా
డు వారిని మన్నింప వలెను అట్లుమన్నించి సంరక్షించినచో స్త్రీశ్శ్రీదేవియగునో
భరతవంశ్యుడా - అట్లుమనువచనము "యత్రనార్యస్తుపూజ్యంతె రమంతేతత్ర
దేవతాః । యత్రైతాస్తు నపూజ్యంతె సర్వాస్తత్రా ఫలాః క్రియాః । శో
చంతి జామయోయత్ర వినశ్యత్యాశుతత్కులం । నశోచంతితు యత్రైతావర్ధ
తె తద్ధిసర్వదా । తస్మాదెతా స్సమభ్యర్చ్యా భూషణాచ్ఛాదనాశనైః॥ " అ
నగానే గృహమందు స్త్రీలుసమ్మానింప బడుదురో యచ్చట సర్వదేవతలు ప్ర
సాదమొందుదురు అట్లుగానిచో నచ్చటజేయు సర్వకర్మలువిఫలము లగును-మ
రియును కోడండ్రు నాడుపడుచులు మొదలగువారు సమ్మానములేక శోకించి రే
ని నాకులము శీఘ్రముగనశించును అట్లుకానిచో వృద్ధినొందుననుట - కనుక -
భూషణాచ్ఛాదన భోజనములచే వారిమన్నించునది - కల్పతరువునందు దక్షవచ
నము - "జలౌకెవచసర్వా స్త్రీభూషణాచ్ఛాదనాశనైః । సుభృతాపి కృతా
నిత్యం పురుషంహ్యాప కర్షతి । జలౌకారక్తమాదత్తె కేవలం సాతపస్వినీ। ఇ
తరాతు ధనంవిత్తం మాంసం వీర్యంబలంసుఖం । సాశంకా బాలభావేతుయౌ
వనేభిముఖీభవేత్ ।తృణవన్మన్యతేనారీవృద్ధభావేస్వకంపతిం। అనపత్యాభవేత్పశ్చా
ద్వ్యధావ్యాధిరుపేక్షితః॥" అనగా భూషణవస్త్రభోజనాదులచేబోషింపబడినను
స్త్రీయెవ్వతైననుపురుషుని నిత్యము జెలగవలెపీడించునుఅయ్యయోజెలగచేయ నే
రక యొకరక్తమునే త్రాగును స్త్రీయైనచో ధనము జ్ఞానము మాంసము వీర్య
ము బలము సుఖము నన్నిటిని నపహరించును బాల్యమందు జంకు గల్గినను యౌ
వనమం దెదిరించును- వార్ధకమంచు తృణముగా నెంచును-ఇట్లుపేక్షించినవ్యా
ధివలె నపత్యహీనురాలై బాధించుననుట - మనువచనము"విధాయవృత్తింభా
ర్యాయాః ప్రవసేత్కార్యవాన్నరః । అవృత్తి కర్శితాహిస్త్రీ ప్రదుష్యేత్స్థి
తి మత్యపి॥" అనగా భర్తకార్యవశముచే బ్రవాసము వెళ్లునపుడు భార్యకు జీ
వనార్థమై ద్రవ్యమిచ్చి వెళ్లవలెను లేనిచో మర్యాదగలదైన నొకవేళ జీవనో

పాయములేక కృశించి శీల భంగమునొంది పోవును - యాజ్ఞవల్క్యః "సత్యా
మన్యాం సవర్ణాయాం ధర్మకార్యం నకారయేత్ । సధర్మాసు విధా ధ
ర్మే జ్యేష్ఠయాన వినేతరా॥" అనగా సవర్ణస్త్రీభార్యయై యుండగనన్య వ
ర్ణస్త్రీతో ధర్మకార్యము నడుపగూడదు - ఒకవేళసజాతీయ భార్యలనేక లు
న్నయెడ జ్యేష్ఠపత్ని వినాజేసి యితరస్త్రీతో ధర్మకార్యము నడుపగూడదు -
ఛందోగ పరిశిష్టమందును "అగ్నిశిష్టాదిశుశ్రూషాం బహుభార్యస్సవర్ణయా।కా
రయేత్తద్బహుత్వంచేజ్జ్యేష్ఠయా గర్హితానచేత్ । యావాస్యాద్వీర సూరా
సా మాజ్ఞాసంపాదినీచయా। దక్షాప్రియం వదాశుద్ధా తామత్రవినియోజయే
త్॥" అనగానగ్నిసేవయుశిష్టసేవయు మొదలగుధర్మకార్యములు బహువర్ణభా
ర్యలున్నయెడసవర్ణభార్యతోడనేజేయవలెనుసవర్ణభార్యలలోవీరులగనియాజ్ఞ
లోమెలగుచు ప్రియవాదినియైశుద్ధురాలగు జ్యేష్ఠభార్యతోడనేచేయవలెననుట-క
ల్పతరువునందుదక్షవచనము"ధర్మపత్నీసమాఖ్యాతానిర్దోషాయదిసాభవేత్।
దోషేసతినదోషస్స్యాద్యన్యాకార్యా గుణాన్వితా॥" అనగా స్త్రీదోషహీనురా
లైనచో ధర్మపత్ని యనబడును దుష్టురాలైనచో గుణవతియగు మరియొకతెను
వివాహమాడవచ్చును దోషములేదు - మనువచనము"సంవత్సర ముదీక్షేత ద్వి
షంతీం యోషితంపతిః । ఊర్ధ్వం సంవత్సరాదన్యాం కృత్వాతాంతునసంవసే
త్ । అతిక్రామేత్ప్రమత్తం వామత్తం రోగార్త మేవవా। సాత్రిమాసాత్పరి
త్యాజ్యా విభూషణ పరిచ్ఛదా । ఉన్మత్తంపతితంక్లీబ మపీనం పాపరోగిణం ।
నచద్విషంత్యాస్త్యాగోస్తి నచదాయప్రవర్తనం॥" అనగా దనపై ద్వేషించుభా
ర్యను పతి సంవత్సరపర్యంతము ప్రతీక్షించవలెను అటుపైని మరియొకతెను వివా
హమై దానివిడువవలెను - పతిప్రమాదమనగ వెర్రెత్తియున్నపుడు మదించియు
న్నపుడు రోగాతుర్డై యున్నపుడును స్త్రీయతిక్రమించెనేని దాని మూడుమా
సములలోగానె విడువవలెను - దానిభూషణాచ్ఛాదనములు దానికిచ్చి వేయవ
లెను-ఉన్మత్తాద్యవస్థలలో ద్వేషింపక పతిసేవజేసెనేని దాని విడువగూడదు- దా
యమునివ్వ నక్కరలేదనుట - మనుకాత్యాయన వచనము-"విశీలః కామవృత్తో
వాగుణైర్వాపరివర్జితః । ఉపచర్యస్స్త్రియాభర్తా సతతం దేవవత్పతిః। నా
స్తిస్త్రీణాంపృథగ్యజ్ఞోన వ్రతంనాప్యుపోషణం । పతింసంసేవతే యాతు తేన
స్వర్గేమహీయతే। పత్యౌజీవతి యానారీ ఉపోష్య వ్రతచారిణీ । ఆయుష్యం

హరతే భర్తుర్నరకంచైవగచ్ఛతి॥" అనగా పతిశీలములేనివాఁడైనను స్వేచ్ఛాసంచారియైనను గుణవర్జితుఁడైనను స్త్రీ వానిదేవునివలె సేవింపవలెను- స్త్రీలకు వేరుగ యజ్ఞము వ్రతమునుపవాసమును లేవు-పతిశుశ్రూషచేత నేస్వర్గము గల్గును- పతిజీవించి యుండగ భార్య యుపవాస వ్రతములు చేసెనేని భర్త యాయుష్యము హరించును నరకముగూడ నొందును - కల్పతరువునందు హారీత వచనము- "నప్రోషితేఽలం కుర్యాన్నవేణీం ముంచేత॥" అనగా భర్తవిదేశమందున్నపుడు స్త్రీ యలంకరించుకొనగూడదు కొప్పు దువ్వను గూడదు- మదనరత్నమందు స్కాంద వచనము " ప్రసుప్తంచ సుఖాసీనం రమమాణం యదృచ్ఛయా । ఆతురేష్వపి కాలేషు పతింనోత్థాపయేత్క్వచిత్ । రజోవతీత్రిరాత్రంతు స్వముఖంనైవ దర్శయేత్ । స్వవాక్యంశ్రావయేన్నాపి యావత్స్నాతా నశుధ్యతి । సుస్నాతాభర్తృవదన మీక్షే న్నాన్యస్య కస్యచిత్ । అథవామనసిధ్యాత్వా పతింభానుం విలోకయేత్ । హారిద్రాం కుంకుమంచైవ సిందూరం కజ్జలంతథా । కూర్పాసకంచ తాంబూలం మంగల్యాభరణంశుభం। కేశసంస్కారకబరీకరకర్ణవిభూషణం । భర్తురాయుష్యమిచ్ఛంతీ దూరయేన్నక్వచిత్సతీ । నచదుర్భగయానార్యా సఖిత్వం కురుతేతుసా । భర్తుర్విద్వేషిణీం నారీం నసంభాషే తకర్హిచిత్ । నైకాకినీక్వచిద్భూయా న్ననగ్నాస్నాతివైక్వచిత్ । నోలూఖలేనముసలె నవర్ధిన్యాం దృషద్యపి । నయంత్రికేనదేహల్యాం మధ్నినోపవిశేత్క్వచిత్ । ఉక్తాప్రత్యుత్తరందద్యా ద్యానాగీక్రోధతత్పరా । సాశునీజాయతె గ్రామె సృగాలీ నిర్జనేవనే । అపవాదోనవక్తవ్యః కలహం దూరతస్త్యజేత్। గురూణాం సన్నిధౌచాపినోచ్చైబ్రూర్యాన్నవాహసేత్ । తాడితా తాడితుం యేచ్ఛే త్సావ్యాఘ్రీ ద్వీపదంశికా। భర్తారం యాసముత్సృజ్య మృష్టమశ్నాతికేవలం । గ్రామేసా సూకరీవాస్యాద్గర్భీ వాశ్వవిడ్భుజా॥" అనగా నిద్రించునపుడు సుఖముగాగూర్చుండినపుడు స్వేచ్ఛగా నాడుచున్నపుడును తాను పీడనొందినప్పటికిని పతిని లేపగూడదు - రజస్వలయైన మూడురాత్రులను దనముఖముజూపగూడదు తనమాటనైన వినుపింపగూడదు స్నానముజేసి శుద్ధురాలై భర్తముఖమునే చూడవలెను- సంభవింపనిచో భర్తనుధ్యానించి సూర్యునిజూడవలెను - పసపుకుంకుమ సిందూరము కాటుక రైక తాంబూలము మంగళసూత్రము కొప్పుదువ్వుకొనుట చే

తుల చెవులభూషణములు నివి భర్త్రాయియవ్యము గోరెనేని నెప్పుడునువిడువ గూడదు - దుష్టస్త్రీలతో గురూపులతో స్నేహముగూడదు భర్తనుద్వేషించు స్త్రీతోమాటలాడనేగూడదు ఎపుడు నొంటిగనుండగూడదు దిగంబరమైస్నాన ము సేయగూడదు . రోలు-రోకలి-సన్నెకల్లు-తిరగలి-గడప-కవ్వము-వీనిపైనెపు డు గూచుండగూడదు - పతియొకమాటాడినచోగోపముచేబ్రత్యుత్తర మిచ్చె నేని గ్రామములో కుక్కయైపుట్టును లేదావనమందు నక్కయైపుట్టును-ఒకరిపై నిందలాడగూడదు కలహము చేయగూడదు పెద్దల సన్నిధిని బిగ్గనగా బలుకకూ డదు నవ్వకూడదు - పతిగొట్టిన దిరుగగొట్టనిచ్చగించునది వ్యాఘ్రియైపుట్టును భర్తను వినాగా మృష్టాన్నము భుజించెనేని నది పందియైగాని గాడిదె యైగాని పుట్టి కుక్కపురీషము దినును - కల్పతరువునందు యమవచనము-"ఋ తుస్నాతాతు యానారీ భర్తారం నోపసర్పతి । తాంగ్రామమధ్యే విఖ్యాయ భ్రూణఘ్నీంతు వివాసయేత్॥" అనగా ఋతుస్నానముజేసి భర్తను గలియ కున్నచో నాస్త్రీని భ్రూణహత్యజేసినదానిగా చాటివెళ్లగొట్టవలెను - బౌధా యనవచనము "అపుత్రూపా కరీంవంధ్యాం బంధకీం పరిహింసకీం । త్యజంతి పురుషాః ప్రాజ్ఞా స్సద్యస్త్వప్రియవాదినీం । అప్రజాం దశమేవర్షే స్త్రీప్రజాంద్వాదశేతథా । మృతప్రజాంపంచదశే సద్యస్త్వప్రియవాదినీం॥" అనగా పతిసేవచేయనిదాని గొడ్డురాలిని రంకులాడిని ఘాతుకురాలిని నెదిరించుదానిని ప్రాజ్ఞులు విడుతురు గర్భాధానము మొదలు పదివత్సరములపైని సంతానము గననిచో విడుతురు - స్త్రీసంతతియె గల్గునెడ పండ్రెండువత్సరములపైని విడు తురు మృతినొందు స్వభావముగల శిశువులనేగన్నయెడ బదునైదువత్సరములపై విడుతురు భర్తకు ప్రతికూలముగ నడచునేని నప్పుడె విడుతురనుట - వసిష్ఠ వచనము "వ్యవాయేతీర్థగమనే ధర్మేభ్యశ్చ నివర్తతే॥" అనగా స్త్రీవ్యభి చరించెనేని సంభోగమునకును ధర్మాచరణమునకును తప్పిపోవుననుట- హారీత స్మృతి "ధనధాన్యక్షయకరీం స్త్రియంసద్యోవిసర్జయేత్ ॥" అనగా ధనధా న్యాది సంపదలునశింపజేయునిర్భాగ్యురాలినప్పుడె వర్జింపవలెననుట-నారదవ చనము "వ్యభిచారేస్త్రియామౌండ్య మధశ్శయనమేవచ । కదన్నంచకువాసశ్చ కర్మచావస్కరోద్గతం॥" అనగా స్త్రీవ్యభిచరించెనేని క్షౌరమునధశ్శయనము యుంపుచు కైదులోనుంచి గంజిబోయించుచు మలినవస్త్రమిచ్చి పెంటలెత్తిం

చవలెననుట - శంఖవచనము "నానుక్త్వాగృహాన్నిర్గచ్ఛేన్నానుత్తరీయానత్వరి
తంవ్రజేన్న పరపురుషంసంభాషేత ననాభింసందర్శయే దాగుల్ఫాద్వాసః పరి
దధ్యాన్న స్తనౌవివృతౌకుర్యాన్నహసేదపావృతంనభర్తారం తద్బంధూన్ వా
ద్విష్యాన్నగణికాధూర్తాదిభిస్సహైకత్ర తిష్ఠేత్॥" అనగా భర్తాదులయా
జ్ఞలేకయిలువెడలగూడదు ఆజ్ఞపై వెడలినను పైబట్టగప్పుకొనకకూడదు పరుగె
త్తగూడదు పరపురుషునితో మాటలాడగూడదు నాభిప్రదేశము జూపగూడదుమ
డమలవరకు చీరెగట్టవలెను స్తనప్రదేశముపోల్చబడగూడదు నోరుమూసుకొనక
నవ్వగూడదు భర్తనునతని బంధులను ద్వేషింపగూడదు వేశ్యలు ధూర్తస్త్రీలు
మొదలగువారి సహవాసముచేయగూడదు స్కాందవచనము "యాప్రియం ప్రీ
ణయేత్ప్రీతాత్రిలోకీప్రీణితాతయా । భుక్తేభుక్తే తథాపత్యౌ తస్మింస్తిష్ఠతి
తిష్ఠతి । నిద్రితేచ వినిద్రాతి ప్రథమం పరిబుధ్యతి । అనలంకృతమాత్మానం ప
త్యునోదర్శయేత్క్వచిత్ । కార్యార్థంప్రోషితేపత్యౌ సర్వమండన వర్జి
తా । నచతన్నామగృహ్ణీయాత్తస్యాయుర్వ్యా వివృద్ధయె । ఆక్రుష్టాపినచాక్రో
శేత్తాడితాపిప్రసీదతి । ఏవంకురుకృతంస్వామి న్మన్యతామితివక్తిచ । ఆహూ
తాగృహకార్యాణి త్యక్త్వాగచ్ఛతి సత్వరం । పూజోపకరణం సర్వముప్సనం
శోధయేత్స్వయం । నియమోదకవహ్నీశ్చ యత్రపుష్పాదికంచయత్ । సేవే
తభర్తురుచ్ఛిష్టమిష్ట మన్నంఫలాదికం । మహాప్రసాద ఇత్యుక్త్వా పతి దత్తంప్ర
తీచ్ఛతి " అనగా తానుసంతుష్టురాలై భర్తనుసంతోషింప జేసెనేని త్రిలోకము
లకు సంతుష్టియగును పతిభుజించినపైని భుజింపవలెను అతడు నిల్చియున్నపుడు
తానునునిలువ బడియుండవలెను అతడునిద్రించిన పైని నిద్రింపవలెను అతనికంటె
ముందు మేల్కొనవలెను తానలంకరించుకొనక యతనియెదుట బడగూడదు కా
ర్యవశమున ప్రవాసమువెళ్లెనేని అలంకారము విడువవలెనుఅతనిపేరునెప్పుడును
చ్చరింప గూడదు అట్లైనచో నతనికి బాపము వచ్చును భర్తదన్నుగ సిరినను
దానుగోపింప గూడదు కొట్టినను బ్రసన్నురాలై యుండవలెను ఓస్వామీ యి
ట్లుచేయవలెను ఇట్లుచేసితినితాముచిత్తగించి యాలోచింపుడని పలుకవలెను త
న్నుబిలచినపుడు జేయుగృహకార్యమువిడిచి పరుగెత్తవలెనుపూజా సాధనములై
న పుష్పగంధాదులుంచు పాత్రలన్నియు నిత్యము స్వయముగాగడుగవలెను భ
ర్తభుజించినపైని శేషము భక్ష్యఫలాదులు భుజింపవలెను భర్తయిచ్చునదిమహా

ప్రసాదము గ్రహింపవలెను-కల్పతరువునందు ఋశ్యశృంగ వచనము "గృహామేధాభవేన్నిత్యం భూషణానిచ పూజయేత్ । గృహకార్య పరా నిత్యం పూజయేన్మార్జయేద్గృహం । నిత్యంస్నాన కృతావేణీం పూజయేత్పుష్ప వాససా। పూర్వమేవరహాగచ్ఛే ద్యావన్నాన్యః ప్రబుధ్యతే । దేవతారాధనం కుర్యాద్ధూపపుష్పబలింహరేత్॥" అనగా గృహస్థురాలగు స్త్రీ నిత్యము భూషణములు పూజింపవలెను గృహకార్యమందాసక్తితో నిత్యమును గృహముదుడిపించి యలికించి ముగ్గులచేనలంకరించి స్నానముజేసిన కొప్పును పుష్పమాలికలచే నలంకరించుకొని యితరులు మేల్కొనకమున్నెలోనింటిలో ప్రవేశించిధూపముపుష్పబలిమొదలగువానిచే దేవతారాధనము జేయవలెను - వేలానుత్సవమందు శంఖలిఖితులవచనము - "గంధమాల్యాభరణాని విక్రుతాని వాసాంసి బిభృయాన్నపరపురుషమభిభాషె తాన్యత్రవణిక్ప్రవ్రజితవృద్ధేభ్యః॥" అనగా నిత్యము గంధమాల్యాభరణములు రంగుదారీచీరలును ధరింపవలెను వణిక్కులనగా బేహారులు సన్యాసులు వృద్ధులు తప్పదక్కిన పరపురుషులతో మాడలాడగూడదు- హారీతవచనము- "స్నాత్వాశుక్లేవాససీపరిధాయదేవాగారంప్రవిశ్య నమస్కృత్వాన్నాద్యభిఘార్య తత్రహుతె దేవేభ్యఉద్వాహాగ్నౌ దేవపత్నీభ్యాంహుత్వాబలింహరేత్ - కృతేదేవాతిథ్యేయథాస్వం గృహిణస్తర్పయిత్వా శేషంపత్నీగుప్తేభుక్త్వాభాండాని నిర్ణేజ్యప్రక్షాళ్యబహిరుత్తరపూర్వస్యాం దిశి వాస్తుపతిభూతపతయెరుద్రాయనమ ఇతి నినీయైవంసాయం కృతాది యథార్థసంవిష్టేషునమోభువనపతయెరుద్రాయభస్మసదె భస్మనారక్షాంకరోమీతి భస్మనాద్వార మపిధాయస్వామిసుతాదీనాత్మానంచాలయేత్॥" అనగా మడిబట్టలు కట్టుకొని దేవగృహముప్రవేశించి నమస్కరించియన్నాదుల నభిఘరించి వివాహాగ్నిలోభర్తదేవతలకిచ్చినపైని దేవపత్నులకుర్వేల్చి బలిహరణముచేయవలెను ఇట్లు దేవారాధనమైనపైని గృహస్థులదృప్తినొందించి శేషమును గుప్తస్థలమందు పత్నిభుజించిపాకపాత్రలుతోమికడిగి వెలపలనీశానదిక్కున "వాస్తుపతిభూతపతయెరుద్రాయనమ॥" యని యాజలమువిడిచి యిట్లుసాయంపాకాదికమునైన పైని యథాపూర్వముగనుంచినపాత్రలకు "నమోభువనపతయె రుద్రాయభస్మసదె భస్మనారక్షాంకరోమి॥" యని భస్మచే ద్వారముగప్పి స్వామియు సుతులు మొదలగువారికి దనకును భస్మరక్షను జేయునది - మరియును - "ఆనమ్యభర్తృపాదౌసం విశే

న్నోపవిష్టాస్థిత ఆసీతనోచ్ఛైనర్ వితర్కస్థానేనావీక్షణమీక్షేత్ పరిమృజ్యాసం
వాహయిత్వోపాసీతవ్యజనేనోష్ణే వర్షఘర్మాంభోస్యగాత్రేభ్యః పరి మృజ్యా
త్ గ్రామాంతరాగతంభారాక్రాంతంశయనముద్యచ్ఛేద్ధృష్టమనా అర్ఘ్యైర్ నాచర్
యేత్ తథాపరశయనాసనవస్త్రాభరణాని మనసాపినాధ్యవస్యేత్ తథైక పా
త్ర్యాం మద్యమాంసోచ్ఛిష్ట నిర్మాల్యం చాన్యత్రగురుభర్తృసుతేభ్యః॥" అని అన
గా భర్తపాదములకు నమస్కరించి కూర్చుండవలెను భర్తనిలువబడి యున్న
పుడు గూడదు భర్తయాసనమునకంటె నున్నతాసనమునగూడదుభర్త శంకిం
చుస్థానమున దొంగిచూడగూడదు - తుడిచి పాదములు పట్టుచు సమీపమునసుం
డవలె చెమ్మట గల్గునపుడు వీవనచే విసరి సేవింపవలెను గ్రామాంతరమునుండి
వచ్చునపుడు భారము దెచ్చునపుడు నెదురేగి సంతోషముతో నర్ఘ్యాదులచే ను
పచరింపవలెను అట్ల పరులశయనము నాసనము వస్త్రభూషణాదులను మనసు
చేనైన స్పృశింపగూడదు అట్లుగురువును భర్తయు సుతులును వీరుతప్ప దక్క
నవారి భుక్తశేష మగు మద్యమాంస నిర్మాల్యముల గ్రహింపగూడదు-స్కాం
దవచనము - "తీర్థస్నానార్థినీ నారీ పతిపాదోదకం పిబేత్ । శంకరాదపి
విష్ణోర్వాపతిరేకోధిక స్త్రియాః॥" అనగా స్త్రీతాను పుణ్యతీర్థ స్నానముగో
రెనేని భర్తయొక్క పాదోదకము త్రాగవలెను దానిచే నది సిద్ధించును ఏమని
న స్త్రీకి భర్త హరిహరులకంటె నధికుడు - పరశురామ ప్రతాపమందు ర
త్నావళియందును స్కాందవచనము- ప్రాతఃకాలేతు యానారీదద్యా దర్ఘ్యం
వివస్వతే । సప్తజన్మానివైధవ్యం సానారీనైవపశ్యతి । కృత్వాతు మండలం
బాహ్యే సూర్యంతత్రాక్షతాదిభిః । పూజయేత్సతతం యావై తస్యాస్తుష్యంతి
దేవతాః । ప్రాతఃకాలేతు యానారీ శుచిర్భూత్వా సమాహితా। పూజయే
ద్ద్వారదేశంతు సర్వాన్ కామాన్ సమశ్నుతే । నదదాతి యదానారీ జ్యేష్ఠా
యై ప్రత్యహంబలిం । భోజ్యాచ్చైవయథాశక్తి సా ప్రేత్య నరకం వ్రజేత్ । అ
వశ్యమేవనారీభిర్జ్యేష్ఠాయా బలికర్మణా। ప్రీణనం ప్రత్యహంకార్యంపుత్రపౌత్ర
ధనేప్సుభిః॥" అనియనగా స్త్రీప్రత్యహము ప్రాతఃకాలమున సూర్యునికర్ఘ్య
మిచ్చెనేని సప్తజన్మముల పర్యంతము వైధవ్యము నొందదు కనుక నిరాచ్ఛాదన
ప్రదేశమందుసూర్యునావాహించియక్షతాదులచే నిత్యము పూజించెనేని సర్వదే
వతలు ప్రసాదింతురు - మరియును ప్రాతఃకాలమందు శుద్ధురాలై ప్రతిదినము

జ్యేష్ఠాదేవికి బలిగా ద్వారదేశము ముగ్గులచే పుష్పములచే బూజించెనేని సర్వ మనోరథములు సిద్ధించును అట్లుచేయకున్నను యథాశక్తిగభోజనము పెట్ట కున్నను నంతమున నరకమనుభవించును - కాబట్టి పుత్రపౌత్ర ధనాదులను గోరు స్త్రీలు జ్యేష్ఠాదేవీపూజను నిత్యము జేయునది - కల్పతరువునందు భారత వచనము - "యద్దైవభర్తాజానీ యాన్మంత్రమూల పరాం స్త్రియం। ఉద్విజేత తద్దైవాస్యాః సర్పాద్వేశ్మగతాదివ॥" అనగా భార్యమంత్రములు నోషధులుసంపాదించు శీలము గలదియైనచో భర్తగృహమందు బ్రవేశించిన సర్పమువలెదానిజూచి భయపడ వలెనసుట - కల్పతరువులో భూమికి విష్ణుడు చెప్పినలక్ష్మీవాక్యము - "నారీషునిత్యం శుచిభూతికాసు స్వభర్తృభక్తప్రియ వాదినీషు। అముక్తహస్తాసుసుతాన్వితాసు సుగుప్తభాండాసు బలిప్రియాసు।సుమృష్టవేశ్మాసు జితేంద్రియాసు కలివ్యపేతాసు విలోలుపాసు। ధర్మవ్యపేక్షాసు దయాన్వితాసుస్థితా సదాహం జగతాం విధాత్రీ॥" అనగా నిత్యము శౌచాచార తత్పరలను భర్తకు బ్రియముగ భక్తితో బలుకువారును సొమ్ముపాడుచేయని వారును పుత్రసంపత్తిగల వారును గృహోపకరణముల యథార్హముగ రక్షించు వారును పూజోప హారములుచేయువారును గృహము నిర్మలముగ నుంచువారునునై యింద్రియ జయము గలిగి కలహము వర్జించి వ్యసనములు విడిచి ధర్మమునందె యాసక్తినొంది భూతదయగలస్త్రీలయందు నిత్యము లోకమాతనగునే నుందునని - వ్యాసవచనము-"ద్వారోపవేశనం నిత్యం గవాక్షేణ నిరీక్షణం। అసత్ప్రలాపో హాస్యంచ దూషణం కులయోషితాం॥" అనగానిత్యము వీధిద్వారమున నిల్చియుండుట గవాక్షములలోనుండి చూచుట అయోగ్యవచనములు పలుకుట పరిహాసములాడుటయు నివికుల స్త్రీలకు నింద్యములనుట- భారతమందు గలియుగధర్మములు-"అట్టశూలాజనపదాశ్శివశూలాశ్చతుష్పథాః। ప్రమదాః కేశశూలిన్యోభవిష్యంతికలౌయుగె" దీనికర్థము పరశురామ గ్రంథమందున్నది"అట్టమన్నం శివోవేదశ్శూలం విక్రయ ఏవచ । కెశశ్చభగమిత్యాహుర్వేద తత్త్వార్థదర్శినః॥" అని అనగా కలియుగమందు శౌచాచార హీనముగ నన్నము విక్రయింతురు బ్రాహ్మణులు వేదము విక్రయింతురు స్త్రీలు జాతిభేద మక్కరలేక తమదేహములను విక్రయింతురనుట - మనువచనము - "భర్తాహిదైవంగురుర్భర్తాధర్మతీర్థవ్రతానిచ । తస్మాత్సర్వం పరిత్యజ్య పతిమేకం సమర్చయేత్ ॥ భు

ర్థ్యేభు క్తేపతౌయాతు స్వాసీనా చాపివాసితే। విని్రదితే విని్రదాతి సా స్త్రీ జ్ఞే
యా పతివ్రతా॥" అనగాపతి భుజించినపైని భుజించుటయు నతడు గూర్చుండి
న యనంతరమున గూర్చుండుటయు నతడు నిద్రించిన వెనుక నిద్రించుటయు ని
విపతివ్రతకు లక్షణము లనుట - అంగిరో వచనము "ఆర్తార్తేముదితె హృష్టా
ప్రోషితే మలినాకృశా। మృతేమ్రియెత యానారీ సా స్త్రీ జ్ఞేయాపతివ్రతా "అ
నగా భర్త దుఃఖించునపుడు దుఃఖించుటయు నతడు సంతోషించు నపుడు దా
నును సంతోషించుటయు ప్రయాణము వెళ్లినపుడు మలినాంగియై కృశించుటయు
నతడు మృతినొందిన దానును మృతినొందుటయు నివి పతివ్రతకు ధర్మము లను
ట - ఇకరజస్వలకు గర్భిణికి ధర్మములు సహగమనాను గమనవిధులును నిర్ణ
యసింధువునందు దెలియునది— ఇకవిధవా ధర్మములు - మదనరత్న పారి
జాతములందు స్కాందవచనము - "పత్యౌమృతెపి యాయోషిద్వై ధవ్యంపరిపా
లయేత్ । సాపునః ప్రాప్యభర్తారం స్వర్గలోకం సమశ్నుతే । విధవా కబ
రీబంధో భర్తృబంధాయ జాయతే । శిరసోవపనం తస్మాత్కార్యం విధవ
యాసదా । ఏకాహారస్సదాకార్యో నోద్వితీయః కదాచన । త్రిరాత్రం పం
చరాత్రంవా పక్షవ్రతమథాపివా । మాసోపవాసం వా కుర్యాచ్చాంద్రాయణ
మథాపివా । కృచ్ఛ్రంపరాకం వాకుర్యాత్తప్తకృచ్ఛ్రమథాపివా । యవాన్నే
నఫలాహారైః శాకాహారైః పయోవ్రతైః । ప్రాణయాత్రాం ప్రకుర్వీత యా
వత్ప్రాణస్స్వయంవ్రజేత్ । పర్యంక శాయినీనారీ విధవాపాతయేత్పతిం । త
స్మాద్భూశయనంకార్యం పతిసౌఖ్య సమీహయా।నైవాంగోద్వర్తనంకార్యంస్త్రి
యావిధవయాక్వచిత్।గంధద్రవ్యస్యసంయోగోనైవకార్యస్స్వయంపునః।తర్పణం
ప్రత్యహంకార్యం భర్తుః కుశతిలోదకైః । తత్పితుశ్చాపి కర్తవ్యం నామ
గోత్రాది పూర్వకం । విష్ణోస్తు పూజనం కార్యం పతిబుద్ధ్యా నచాన్యథా ।
పతిమేవ సదా ధ్యాయే ద్విష్ణురూప ధరంపరం । యద్యదిష్టతమంలోకే య
ద్యత్పూర్వ సమీహితం । తత్తద్గుణవతేదేయం పతిప్రీణన కామ్యయా । వై
శాఖే కార్తికేమాఘే విశేష నియమం చరేత్ । స్నానందానం తీర్థయా
త్రాంవిష్ణోర్నామగ్రహంముహుః । వైశాఖే జలకుంభాశ్చ కార్తికేఘృతదీపకాః।
మాఘితిలధనోత్సర్గాః స్వర్గలోకేవిశిష్యతే।ప్రపాకార్యాచవైశాఖేదేవేదేయా
గలంతికా । ఉపానద్వ్యజనంఛత్రం సూక్ష్మవాసాంసిచందనం।దేయాని ద్విజము

ఖ్యేభ్యః పతిర్మే ప్రియతామితి । ఏవంవిధైశ్చవిధవా వివిధైర్నియమైర్వ్రతైః ।
వైశాఖాన్ కార్తికాన్ మాఘానేవమేవాతివాహయేత్ ।నాధిరోహేదనడ్వాహం
ప్రాణైఃకంఠగతైరపి।కంచుకంనపరీదధ్యాద్వాసోనవికృతం వసేత్ ।ఏవంధర్మస
మాయుక్తావిధవాపి పతివ్రతా । పతిలోకమవాప్నోతి నభవేత్క్వాపి దుఃఖినీ”
అనగా స్త్రీయొకవేళ పతితోసహగమనానుగమనములు చేయనశక్తయైనయెడ
వైధవ్యమును పరిపాలించవలెను-అట్లైనచో నంతమందు పతితో స్వర్గలో
కమనుభవించును - అదియెట్లనిన - విధవస్త్రీకొప్పుముడిచినయెడ భర్తకుబం
ధమగుకనుక క్షౌరముజేయించు కొనవలెను - నిత్యమునొంటిపూట భోజనము-
త్రిరాత్రముగాని పంచరాత్రముగాని పక్షవ్రతముగగాని మాసోపవాసవ్రతము
గగాని యుపవసింపుచుండవలెను లేదా చాంద్రాయణము కృచ్ఛ్రము పరాకకృ
చ్ఛ్రముతప్తకృచ్ఛ్రముమొదలుగ జేయవలెను - లేదా యవాన్నము ఫలాహారము
లు శాకాహారములు పయోవ్రతములు వీనిచే యావజ్జీవము ప్రాణయాత్ర నడుప
వలెను - మంచముపై బండుకొనగూడదు అట్లైనచో బతికి నధోగతియగును క
నుక భూమియందేశయనింపవలెను అభ్యంగస్నానముగూడదు సుగంధద్రవ్యము
లు భోగింపగూడదు - పుత్రుడులేనిచో ప్రతిదినమును కుశతిలోదకములచే భ
ర్తకును నతని పిత్రాదులకును నిత్యము తర్పణముజేయునది - పతిబుద్ధితో వి
ష్ణుని పూజింపవలెను ఇతరబుద్ధిచే గూడదు ఎల్లప్పుడు పతినెవిష్ణునిగా ధ్యానింప
వలెను మంచిమంచివస్తువులు దెప్పించి పతికి బ్రీతిగా బ్రాహ్మణులకు దానముచే
యునది - వైశాఖమందు కార్తికమందు మాఘమందును మాసోక్తవిశేష ని
యమము లాచరింపవలెను అవియేవనిన స్నానము దానము తీర్థయాత్రయు వి
ష్ణునామస్మరణము మొదలగునవి మరియు వైశాఖమందు జలకుంభదానములు కా
ర్తికమందు నేతిదీపదానములు మాఘమందు తిలధనదానములుచేసినచో స్వర్గ
మందు బూజింపబడును - వైశాఖమందు చలివెందరలుంచుట రుద్రాభిషేకము
నకు ధారాపాత్రలు గట్టించుటపాదరక్షలు వీవనలు గొడుగులు సన్నపు బట్టలు
చందనమును బతికిబ్రీతిగా బ్రాహ్మణోత్తముల కిచ్చుటయు జేయవలెను - ఇట్లు
నానావిధనియమములతో ప్రతివైశాఖకార్తికమాఘముల వెళ్లింపుచునుండ వలె
ను- ఎడ్లుపూన్చిన బండిపై నెక్కగూడదు రైకయురంగుచీరెయు నెప్పుడు ధరిం
పగూడదు - ఇట్లుధర్మాచరణము జేయువిధవయు బతివ్రతయే గనుక పతిలో

కమునొంది యెప్పుడు నట్టిదుఃఖముననుభవింపదు - శ్రాద్ధము నారుపిండములతో
జేయునది - అట్లు స్మృతిరత్నావళిలో వృద్ధమనువచనము "స్వభర్తృప్రభృతి
త్రిభ్యః స్వపితృభ్య స్తథైవచ । విధవాకారయేచ్ఛ్రాద్ధం యథాకాలమతంద్రి
తా॥" అని అనగా భర్త్రాదులకును దనపిత్రాదులకును పిండము లీవలెననుట-
"తాసాంసులోకాః పతిభిస్సమానాగోమాయులోకావ్యభిచారిణీనాం॥" అనగా
నట్టి ధర్మనిష్ఠగల స్త్రీలకు బతిలోకమేవచ్చును వ్యభిచారిణులకు నక్క జన్మము
వచ్చుననుట - హారీతవచనము "పతివ్రతాతుసాధ్వీయానిష్ఠాంయాతి ప్రభౌమృ
తే । సాహిత్వా సర్వపాపాని పతిలోక మవాప్నుయాత్॥" అనగా పతి మృ
తినొందినను మీదజెప్పినట్లు ధర్మనిష్ఠగలపతివ్రత సర్వపాపములుపోయిపతిలోక
మునొందుననుట - బృహస్పతివచనము - "వ్రతోపవాసనిరతా బ్రహ్మ చర్యే
వ్యవస్థితా । దమదానరతానిత్యమపుత్రాపిదివంవ్రజేత్॥" అనగా వ్రతోప వా
సములుచేయుచు నింద్రియములజయించి బ్రహ్మచర్యనిష్ఠనొంది దానములు చే
యుచు నడచెనేని పుత్రహీనురాలైన విధవయు స్వర్గమునొందుననుట-మనువ
చనము "కామంతుక్షపయేద్దేహం పుష్పమూలఫలోదకైః । నతునామాపిగృ
హ్ణీయా త్పత్యౌ ప్రేతే పరస్యతు॥" అనగా విధవ స్త్రీపుష్పమూలఫల జలము
లాహారముగ దేహమును కృశింపజేయుచు పరపురుషునినామమైనసుచ్చరింపగూ
డదనుట - మనుయమవచనములు - "ఆసీతా మరణాత్క్షాంతా నియతా బ్ర
హ్మచారిణీ । ధర్మేణైవచ కాంక్షంతీ సత్పతిత్వమనుత్తమం । స్త్రియాశ్శ్రౌ
తౌవాశాస్త్రీవాప్రవ్రజ్యానాభిధీయతె।ప్రజాహితస్యాస్యైస్వ ధర్మస్సవర్ణాదితి
ధారణా।అష్టాశీతి సహస్రాణి మునీనామూర్ధ్వ రేతసాం । దివం గతాని వి
ప్రాణా మకృత్వాకుల సంతతిం । మృతేభర్త రియానారీ బ్రహ్మచర్యే వ్యవ
స్థితా । స్వర్గంగచ్ఛత్య పుత్రాపి యథాతేబ్రహ్మచారిణః॥" అనగా మరణ
పర్యంతము క్షమావంతురాలై బ్రహ్మచారిణియై ధర్మముచేతనె సత్పతినిగోరి
నిష్ఠతో నుండవలెను స్త్రీకి శ్రుతియందుగాని శాస్త్రమందుగానిసన్యాసమువిధిం
పలేదు సవర్ణభర్తనుండి సంతతిగనుటయె యసాధారణధర్మమని నిశ్చయ
ము అట్టిభర్తమృతినొందెనేని బ్రహ్మచర్యనిష్ఠతో యావజ్జీవముండినయెడపుత్రు
లులేకున్నను నైష్ఠిక బ్రహ్మచారులవలె స్వర్గమునొందును అట్లుమునులై ద్విజు
లునూర్ధ్వరేతస్కులై పుత్రులులేకున్నను ఎనుబదెన్మిదివేలునైష్ఠికబ్రహ్మచారు

లు స్వర్గమునొందిరి-ఇట్లు విధవాధర్మములుముగిసెను.

అట్లుకుండగోళకులునుశూద్రసములు-అట్లుస్మృతికౌముదియందు దేవలవచనము-"ద్వితీయేనతుయఃపిత్రాసవర్ణాయాంప్రజాయతే।సవర్ణోఢఇతిజ్ఞేయశ్శూద్రధర్మాచజాతితః।వ్రతహీనాస్తసంస్కార్యాస్సవర్ణాస్వపియేసుతాః। ఉత్పాదితాస్సవర్ణేనవ్రాత్యాఇతిబహిష్కృతాః॥" అనగాసవర్ణ స్త్రీయందుభర్తకంటె నన్యునిచే బుట్టింపబడినవాడుసవర్ణోఢుడనబడునుజాతిచేశూద్రతుల్యుడగునుసవర్ణ స్త్రీయందట్లు మరియొకసవర్ణునిచే బుట్టింపబడినవారు వ్రతహీనులు సంస్కారమునకు దగనివారు వ్రాత్యులని బహిష్కరింపదగినవారు - అచ్చట నేమనువచనము "పరదారేషుజాయేతే ద్వౌసుతౌ కుండగోళకౌ । అమృతేజారజః కుండోమృతేభర్తరిగోళకః॥" అనగా పరునిభార్యయందు భర్తమృతి నొందకమున్నె జారుని వలనబుట్టినవాడు కుండుడనబడును మృతినొందినపైని జారునికి బుట్టినవాడు గోళకు డనబడును - ఇట్లు కుండగోళకులు జాతిబహిష్కృతులైనయెడశ్రాద్ధమందు వారికి నిషేధమెట్లు సందర్భించును-ఏమనిన"బ్రాహ్మణశ్రాద్ధ సంపదే"యని బ్రాహ్మణమాత్రునికి ప్రాప్తింపుచుండగగొందరికి నిషేధముగ దావిధింపబడినది-ఎట్లనిన యాజ్ఞవల్క్యుడు చెప్పెను "రోగీహీనోతిరిక్తాంగః కాణః పౌనర్భవ స్తథా । అవకీర్ణీకుండగోళౌ కునఖీశ్యావదంతకః ॥" అనగా రోగియు నారువ్రేళ్లుమొదలగునధికావయవముగలవాడు గుడ్డిపునర్వివాహిత పుత్రుడు బ్రహ్మచర్యభ్రష్టుడగునవకీర్ణియు కుండగోళకులు పుప్పిగోళ్లుగలవాడు మలినదంతములవాడు నునువీరుశ్రాద్ధనిమంత్రణమునకనర్హులనుట- ఇచ్చటకుండగోళకులకు బ్రాహ్మణ్యమే లేనందున నిషేధము వ్యర్థము - ఇట్లు స్మృత్యర్థసారమందు "కేచిదాహుర్ద్విజశ్రేష్ఠా స్సంస్కార్యాకుండగోళకౌ"అని వారికి సంస్కారార్హత్వము చెప్పబడినది-అదియునయుక్తమే యనిన-వినుము- "బ్రాహ్మణ్యాం బ్రాహ్మణాజ్జాతో బ్రాహ్మణః॥" అనగా బ్రాహ్మణ స్త్రీయందు బ్రాహ్మణునికి బుట్టినచో బ్రాహ్మణుడేయగుననుభ్రాంతిచే నిషేధమని విజ్ఞానేశ్వరీయము- కుండగోళకులకు సంస్కార్యత్వమును శ్రాద్ధమందు నిషేధమును క్షేత్రజుని విషయము- ఏమనిన నతనికి శాస్త్రానుజ్ఞ యున్నది - ఇతరులైనకుండగోళకులకు బ్రాహ్మణ్యములేనందున ప్రాప్తియె లేదు-ఉపధేయులగుపుత్రులకుసాంకర్యమున్న నుపాధులైన నియోగజత్వతదభావరూపములైన యుపాధులకుసాం

కర్యము లేదని యపరార్కమతము - కల్పతరువునందు గాత్యాయన వచనము-
“సుఖార్థంయాప్రవృత్తాస్త్రీనభర్తుస్సుతకామ్యయా । పుత్రంతు జనయేదే
వం నింద్యాపాపాచ సాస్మృతా । భర్తృగోత్రం సముత్సృజ్యనారీయద్యన్య
మాశ్రయేత్ । నింద్యైవసాస్మృతాలోకె పరపూర్వేతి చోచ్యతె । పరపూ
ర్వాతు యత్రస్యా త్తత్రస్యాన్నా శ్రితఃప్రభుః । క్రయాద్యతేతుధర్మార్థం
లబ్ధావాస్వామినోభవేత్ । నిరోద్ధవ్యాచతాడ్యాచ పరపూర్వాపరాధతః।చోర
హస్తాన్నదీవేగా ద్దుర్భిక్షాద్దేశవిప్లవాత్ । విని స్త్రీర్యస కాంతారా ల్లబ్ధాత్య
క్తాసమాగతా । ఆసాంభోగేనదోషస్స్యాదితిశాస్త్రవినిశ్చయః। స్వామిదత్తా
తుగృహ్ణీయాద్దేయాచేన్నత్వతోన్యథా । దీయమాన మథాత్మానం యానారీ
నానుమోదతె। నసాదేయానచగ్రాహ్యావిధిరేషస్మృతోబుధైః । నచోత్తమాం
నచాకామాం తథాపుత్రవతీంనచ । ఈదృశీత్వనురూపేణ నిష్క్రయేణ ప్రమీ
లయేత్॥” అనగా భర్తకు వంశవృద్ధికావలెనని యుద్దేశింపక కామ సుఖమున
కై స్త్రీ పరపురుషునాశ్రయించి పుత్రునిగన్నచో నింద్యురాలు పాపిష్ఠురాలు
నగును భర్తృగోత్రమువిడిచి యితరగోత్రముజెందినందున మారుమనువు దనబ
డును - లోకనిందితురాలగు నట్లుపరపూర్వయగునపుడుభర్త దాని నేలుకొన
గూడదు - లేదా నిష్క్రయమక్కరలేకుండగ ధర్మాపేక్షచే వచ్చెనేని భర్త
యంగీకరింపవచ్చుఅపుడుదాని కైదుచేసి యపరాధమునకుదగిన శిక్షజేయవలెను-
చోరులకువశమై తిరుగవచ్చినదియునదిలో గొట్టుకొనిపోయి కాలాంతరమందు
దొరికినదియు కరువుపెట్టినపుడు జీవనార్థమెచ్చటనైన దిరిగివచ్చినదియు దేశో
పద్రవమనగ యుద్ధములుమొదలగువానియందొకరొకరిగానక పారిపోయితిరుగ
వచ్చినదియునడవిలోమార్గముదప్పిపోయి కాలాంతరమున దొరికినదియు నిట్టి
భార్యలను భర్తయేలుకొనిననుదోషములేదని శాస్త్రసిద్ధాంతము - భర్త యి
చ్చినచో స్త్రీనిబరిగ్రహింపవచ్చునుగాని యివ్వదగినదో లేదో విచారింప వలె
ను ఎట్లనిన దన్నునొకరికిచ్చుటకు నంగీకరింపని స్త్రీనివ్వగూడదు గ్రహింపనుగూ
డదు మరియు నుత్తమురాలిని కామములేనిదానిని బుత్రవతిని నీగూడదు తక్కిన
దియుతగిన నిష్క్రయద్రవ్యమిచ్చి విడాకు పుచ్చుకొనవలెను - యమస్మృతి-
“జారజాతస్సవర్ణాయాంకుండోజీవతిభర్తరి । మృతేగోళకనామాతుజాతిహీ
నాచతౌస్మృతౌ । అసవర్ణాసునారీషుద్విజైరుత్పాదితాశ్చయే । పరపత్నీ

షుసర్వాసు కుండాస్తేగోళకాస్స్మృతాః । మాతృవర్ణేనతే ప్రోక్తాః పితృవర్ణేనచస్మృతాః । అవివాహ్యాస్సుతాశ్చైపాంబంధుభిఃపితృమాతృతః" ॥ అనగాసవర్ణ స్త్రీయందుభర్త జీవించునపుడుజారునికిబుట్టినవాడుకుండుడుభర్తమృతినొందినపైని బుట్టినవాడుగోళకుడు ఇట్లువిజాతీయ స్త్రీలయందుద్విజులకుబుట్టినవారును పరభార్యలలోనెవ్వతెకుజారునిచేబుట్టినను కుండులు గోళకులనబడుదురు వారుతల్లిజాతిలోజేరరు తండ్రిజాతిలోనైనజేరరు కనుక పితృమాతృ బంధువులువారితోవివాహసంబంధముచేయగూడదు - మరియును - "కృఛ్రంసాంతపనంకుర్యాద్ధత్వాసంకీర్ణయోనిజం । సూతంహత్వాతికృఛ్రంతు కుండంగోళకమేవచ" ॥ అనగాసంకరజాతివానిజంపెనేని సాంతపనకృఛ్రమునుసూతునిగాని కుండుని గోలకునిగానిచంపెనేనినతికృఛ్రముచేయవలెననిస్వల్ప ప్రాయశ్చిత్తము విధింపబడినది - అయిననుమనువచనము - "జాతోనార్యామనార్యాయామార్యోదర్యోభవేద్గుణైః । జాతోప్యనార్యాదర్యాయామనార్యఇతినిశ్చయః" ॥ అనియనగా నుత్తమజాతీయునిచే దక్కువజాతి స్త్రీయందుబుట్టినవారు సంస్కారమున కర్హులు నీచజాతిపురుషున కుత్తమజాతిస్త్రీయందుబుట్టినవారు సంస్కరింపదగరనుట - స్మృతికౌముదిలోనాదిత్యపురాణము - "సవర్ణాసుసవర్ణైస్తుయేజాయంతేపరైరపి । అవరోధకసంజ్ఞాస్తే వ్రతసంస్కారవర్జితాః" ॥ అనగా బ్రాహ్మణభిన్నజాతులందును సవర్ణ స్త్రీకి సవర్ణజారునికిబుట్టినచో నవరోధకులనబడుదురు వారికుపనయనాదిసంస్కారములుకూడదు - విప్ర స్త్రీయందువిప్రునికిబుట్టినచో గూఢుననుట - మరియును - "చతుర్ణామపివర్ణానాంజీవతామన్యసంభవః । కుండస్తుసంకరోజ్ఞేయో మృతానామథగోళకః । జాతిహీనస్సమాఖ్యాతాం గ్రాహయేత్కర్మనామనీ" ॥ నాల్గుజాతులందును భర్తజీవించి నపుడు పుట్టువాడు కుండుడు లేనిచో బుట్టినవాడు గోళకుడు వారు సంకరజాతులు కనుక తల్లిజాతి కనురూపమైన పనియు నామము నుంచవలెను - "యోజ్యోదేవపురేరాజ్ఞా వర్ణసంకరభీరుణా" ॥ అనగా వర్ణసంకరముగాకుండగ రాజువారిని ప్రభుద్వారమునందు నౌకరుల జేయునది - "కుండోవాగోలకోవిప్రస్సంధ్యోపాసనమాత్రవిత్ । స్నానభోజనసంధ్యాసు దేవేషుసపఠేచ్ఛతత్" ॥ అనగాకుండుడుగాని గోళకుడుగానినైన విప్రుడుసంధ్యావందనమునుమాత్రము తెలియును గనుక ప్రభువులస్నానభోజన సంధ్యాదులందు వందిమాగధులవలెస్తుతిపాఠముల

బఠింపవలెననుట అనగానిచ్చట విప్రుడనియున్నందున నతనికేసంధ్యయునుపనయ
నముననుట-అట్లుమితాక్షరయందును- “కుండగోళకౌయథార్హంసంస్కార్యౌ”
అనియున్నది - అనగాకుండగోళకులయోగ్యతనుబట్టిసంస్కారముచేయవలయు
ననుట - స్మృత్యర్థసారములో ప్రయోగ పారిజాతమందు బ్రాహ్మవచనము-
“ఏవమేవద్విజైర్జాతౌసంస్కార్యౌకుండ గోలకౌ”॥ అని-ఇట్లుకుండగోళకనిర్ణ
యము——అట్లుద్విజునకుబుట్టినషండుడునుశూద్రసముడు- “వసంతేబ్రాహ్మణము
పనయీత”యను నుపనయన విధివాక్యమందు“చమసాధ్వర్యునివలె బ్రాహ్మణుడు
పాదేయుడుగనుక పుంస్త్వమును వివక్షించినందున స్త్రీకివలెనతనికి నుపనయన
ప్రాప్తిలేదు- అష్టవర్షవాక్యమందుద్దేశ్యమైనప్పటికిని ప్రాప్తియుండు వానికె
యనువాదముగనుక పుంస్త్వమున్నవానినే యనువదించును-మితాక్షరయందు దే
వలవచనము- “షండకో లింగహీనస్స్యాత్సంస్కారార్హశ్చనైవసః॥” అనగా
పురుషలక్షణము లేనివాడుషండుడు వానికుపనయనము చేయగూడదు - కనుకనే
యచ్చటవృద్ధ మనువచనము- “షండంతు బ్రాహ్మణంహత్వా శూద్రహత్యా వ్ర
తంచరేత్॥” అనిఅనగా నపుంసకుడగు బ్రాహ్మణుని జంపెనేని శూద్రునిజంపిన
ప్రాయశ్చిత్తము జేయవలెననుట - అయినను- స్మృత్యర్థసారమందు బౌధాయ
నసూత్రములో వచనమునుబట్టి యుపనయనమని యున్నది-ప్రయోగ పారిజాత
మందు బ్రాహ్మవచనము - “బ్రాహ్మణ్యాం బ్రాహ్మణాజ్జాతో బ్రాహ్మణస్సఇతి
శ్రుతిః । తస్మాచ్ఛ షండ బధిర కుబ్జవామన పంగుషు॥” అని మొదలుగ పఠించి
“తస్మాచ్ఛ ధ్వస్తపుంస్త్వేషు సంస్కారాస్స్యు ర్యథోచితం॥” అనియనగాబ్రా
హ్మణస్త్రీకిని బ్రాహ్మణునికిని బుట్టినవాడు బ్రాహ్మణుడేయగునని శ్రుతియున్నం
దున నపుంసకుడు చెమిటివాడు మరుగుజ్జువాడును పొట్టివాడును సొట్టవాడును
మొదలగువారికిని యథార్హ్యముగ సంస్కారములు సేయవలెననుట- ఇదిమున్నె
చెప్పబడినది- షండులుసప్తవిధములు- అట్లుగౌడధృత దేవలవచనము-“షండకో
వాతజష్షండః షండఃక్లీబో నపుంసకం । కీలకశ్చేతి సప్తైవ క్లీబభేదో వ్యవస్థి
తః॥” అనగాషండకుడు వాతకుడు షండుడు షండుడుక్లీబుడు నపుంసకుడు కీలకు
డునని యేడువిధములు- “తేషాంస్త్రీతుల్య వాక్చేష్ట స్త్రీతుల్యష్షండకోభవేత్॥”
అనగా స్త్రీతుల్యమగువాక్కులు చేష్టలుగలిగి పొడవైనకుచములు పేడిగడ్డముగ
లుగువాడు షండకు డనబడును- “పుమాన్కృత్వా సలింగాని పశ్చాచ్ఛింద్యాత్త

థైవచ । స్త్రీచపుంభావ మాస్థాయ పురుషా చారవద్గుణా । వాతకోనామ
షండస్స్యాత్ స్త్రీషండో వాపినామతః॥" అనగా స్త్రీపున్నపుంసక చిహ్నముల
లోనొకొక్కటి కొంత కాలమనుభవించు వాడనగా శిఖండివలె నుండువాడును
స్త్రీయైయుండియు పురుషునికివలె శుక్రములేకున్నను మరియొకస్త్రీని వాతవశము
చేనను భవించునదియును వాతజషండు డనిగాని స్త్రీషండుడనిగానియనబడును-
"అసల్లింగోథషండస్స్యాత్ షండస్తుమ్లానమేహనః। అమేధ్యాశీపుమాన్ క్లీబో న
ష్టరేతానపుంసకః" అనగా మేహనములేనివాడు షండుడనబడును అదియుండి
నను మేకమెడచన్నువలె వ్యర్థమైనచో షండుడనబడును - అమేధ్యమనగా గళ
రోగముచే నన్యుని శుక్రము దినువాడు క్లీబుడనబడును - చెడిపోయిన రేతస్సు
గలవాడు నపుంసకుడు - మీదజెప్పిన క్లీబుడు వైద్యమందాసేక్యుడని చెప్పబడు
ను - అట్లు సుశ్రుతమందున్నది- "ఆసేక్యోనామభవతిదంపత్యోరల్పవీర్యయోః।
సశుక్రంప్రాశ్యలభతేలింగోచ్ఛ్రాయమసంశయం"॥ అనగా దంపతులలో స్వల్ప
వీర్యముగల పురుషుడాసేక్యుడు వాడుపరుని శుక్రముదిని మేహనదృఢత్వము గల
వాడగును- "సకీలకఇతిప్రోక్తోయఃక్లైబ్యాదాత్మనస్స్త్రియం। అన్యేనసహసంయో
జ్యపశ్చాత్తామేవసేవతే॥" అనగా తానుక్లీబుడగుటచే తనభార్యనొకరికొప్ప
గించివారి సంభోగాంతమందు దాని గ్రీడించువాడు కీలకుడనబడును- సుశ్రుతమం
దుమరికొందరు షండులుచెప్పబడెరి - ఎట్లనిన "యఃపూతియోనౌజాయేత ససౌ
గంధిక సంజ్ఞికః । సయోనిశేఫ సోర్గంధ మాఘ్రాయ లభతేబలం॥ అనగా
దుర్గంధయోనిలో బుట్టినవాడు సౌగంధిక షండుడు వాడు భగమేహనముల గం
ధము నాఘ్రాణించిన పైని కామోద్రేకము నొందును- "స్వేగుదే మైథునాద్యస్తు
స్త్రీషుపుంవ ప్రవర్తతే । కుంభీకస్సతు విజ్ఞేయ ఈర్ష్యకం శృణుచాపరం ।
దృష్ట్వా వ్యవాయమన్యేషాం వ్యవాయేయఃప్రవర్తతే । ఈర్ష్యకస్సతు విజ్ఞే
యష్షండకంశృణుపంచమం । యోభార్యాయామృతౌమోహాదంగనేవ ప్రవర్త
తే । తతస్స్త్రీచేష్టితాచారో జాయతేషండసంజ్ఞితః॥ అనగా తన గుదమందు
మైథునమువలన స్త్రీకామమునొందువాడు కుంభీకుడనబడును - ఇతరులసంభో
గము జూచిగాని కామోద్రేకము గలుగనివాడు ఈర్ష్యకుడనబడును - ఋ
తుకాలమందు భార్యచేనుపరతిజేయించినందున బుట్టినవాడు స్త్రీచేష్టాచారము
లుగలషండుడగును - మరియు మాధవీయమందు పదునెనిమిది షండభేదములు

చెప్పబడినవి-యవియచ్చట నే దెలియునది- అట్టిషండులకుపనయనము వేదవ్రతము
లు సమావర్తనము వివాహము నివితప్ప దక్షిణసంస్కారములు మంత్రహీన
ముగనగును-"కుమారంజాత"మనుజాతకమార్దివిధులలో నుద్దేశ్యగతమైన పుం
స్త్వమువివక్షింపకుంటచే స్త్రీకివలె నతనికిని ప్రాప్తింపవచ్చును - అట్లుయాజ్ఞవ
ల్క్యవచనము - "తూష్ణీమేతాఃక్రియాస్స్త్రీణాం వివాహస్తుసమంత్రకః"॥ అనియ
నగా స్త్రీలకువివాహము తప్ప దక్షిణ సంస్కారములు మంత్రహీనముగానగున
నుట - అట్లువృద్ధమనువచనము- "తేచస్త్రీతుల్యవాక్చేష్టాస్త్రీవద్ధర్మాణః ప్రకీ
ర్తితాః"॥ అనగాస్త్రీతుల్యమైన వాక్చేష్టలుగలషండులుస్త్రీలవలెనుసంస్కరింప
బడుదురనుట - ఇట్లుచెరువులు యంత్ర దేవాది స్థాపనములు మహాదానములు
మొదలగువానియందు నధికారమున్నది - షష్ఠాధ్యాయమందైనన్యాయముచేకా
మశ్రుతియందలి పుంస్త్వముద్దేశ్యగతమైనందున వివక్షింపకుండుటచే స్త్రీలకువ
లె వీరికినధికారముండవచ్చును - ఇట్లుసర్వదానములందుదెలియునది-అహింసాది
కము సర్వసాధారణమేకదా - "పితృశ్రాద్ధాదులందు మాత్రమధికారము లేదు
"యశ్చార్థహరస్సపిండదాయీ" యనిద్రవ్యస్వత్వముగల పుత్రునికె పిండాధికార
మాపస్తంబునిచే జెప్పబడినది - షండునకు "అనంశౌ క్లీబపతితౌపంగురున్మత్తకో
జడః" అనిమన్వాదులచే పితృద్రవ్యమందు స్వత్వము నిషేధింప బడినది - అట్లు
యాజ్ఞవల్క్యుడును "క్లీబాద్యానోదకంకుర్యుస్తేనావ్రాత్యావిధర్మిణః"అని య
నగా క్లీబుడు మొదలగు షండులునుచోరులు జాతిభ్రష్టులుధర్మహీనులును పితృ
కృత్యముజేయనక్కరలేదనుట-ఇట్లుషండులకు నిర్ణయము——మరియుగొందరుశూ
ద్రసములుకల్పతరువునందు యమస్మృతి- "ప్రవ్రజ్యోపనివృత్తాశ్చ వృథాప్రవ్రజి
తాశ్చయే।యశ్చప్రవ్రజితాజ్జాతః ప్రవ్రజ్యా వసితశ్చయః।ఏతేశూద్ర సధర్మా
ణోమనునాపరికీర్తితాః॥" అనగా సన్న్యాసమునుండి భ్రష్టుడును వ్యర్థముగ
సన్యసించినవాడునుసన్యాసికి బుట్టినవాడునుబైరాగి వేషముగలవాడును శూద్ర
సములుయాజ్ఞవల్క్యవచనము- "ప్రవ్రజ్యా వసితోరాజ్ఞో దాసఆమరణాంతికః॥"
అనిఅనగాబైరాగులలో గలసినవాడుయావజ్జీవము రాజునకు భృత్యుడు గావలె
ను-మరియు శూద్రసములను యాజ్ఞవల్క్యుడుచెప్పెను- "సద్యఃపతతిమాంసేనలా
క్షయాలవణేనచ । మాసేన శూద్రోభవతి బ్రాహ్మణః క్షీర విక్రయాత్"॥ అన
గామాంసము విక్రయించెనేని బ్రాహ్మణుడు తత్క్షణమందె పతితుడగునులక్కకయు

లవణము విక్రయించిననట్లనెయగును క్షీరమునమ్మెనేని మూసములో శూద్రుడగున
ని- ఇట్లుచెప్పుటచేనాధర్మమునకు నిందామాత్రమేయని భట్టాచార్యులు వార్తి
కమందనిరి - ద్విజాతికర్మహానిపరమని విజ్ఞానేశ్వరుడు - కనుకవారు శూద్రస
ములు- అట్లువ్రాత్యులుగూడ శూద్రసములు - మనువచనము- "బ్రాహ్మణాః క్షు
త్రియావైశ్యాస్స్వవధేరూర్ధ్వమబ్దతః । అకృతోపనయాస్సర్వే వృషలా ఏవతే
స్మృతాః" అనగాబ్రహ్మక్షత్రవైశ్యులకు విధింపబడిన కాలమందు పనయనముగాక
సంవత్సరముదాటినచోవ్రాత్యులనబడుదురు వారుశూద్రసములు - వ్రాత్యస్తోమ
మనుక్రతువునందుమాత్రమధికారులు- అట్లు యాజ్ఞవల్క్యవచనము. "ఆషోడశా
ద్ద్వావింశాచ్చతుర్వింశాచ్చవత్సరాత్ । బ్రహ్మక్షత్రవిశాంకాలఔపనాయనికస్స్మృ
తః । అతఊర్ధ్వంపతంత్యేతేసర్వధర్మబహిష్కృతాః । సావిత్రీపతితా వ్రా
త్యావ్రాత్యస్తోమాదృతేక్రతోః"॥ అనగా బ్రహ్మక్షత్రవైశ్యులకు క్రమముగా ప
దారునిరువదిరెండు నిరువదినాల్గువత్సరములవరకు నుపనయనకాలము విధింపబ
డినది - ఆపైని గాయత్రీభ్రష్టులై వ్రాత్యులనబడి వ్రాత్యస్తోమమనుక్రతువు తప్ప
దక్కినకర్మలందనధికారులగుదురనుట - ఇకశూద్రసములజెప్పుటకు సంకరజాతు
లుచెప్పబడును - కల్పతరువునందు దేవలవచనము - "నష్టఃప్రవ్రజితః క్లీబఃపతితో
రాజకిల్బిషీ । లోకాంతరగతోవాపి పరిత్యాజ్యస్త్రియాపతిః।మృతేభర్తరి జీవే
వాస్త్రీవిందేతాపరంపతిం । సంతత్యనాశార్థతయానస్వాతంత్ర్యేణయోషితః"॥
అని యనగా తనభర్తదేశాంతరమునకుబోయి వార్తయైనవినబడకున్నను లేదా
సన్యసించినను నపుంసకుడైనను జాతిభ్రష్టుడైనను రాజశిక్షచే యావజ్జీవము కై
దులోబడినను మృతుడై లోకాంతరమునొందినను వానిభార్యయైన స్త్రీతానతని
విడిచి యన్యునిభర్తగా జేసుకొనవచ్చును - సంతతి నశింపకుండుటకునియోగము
విధింపబడినదిగాని స్త్రీస్వాతంత్ర్యముచేగాదు - నారదవచనము "అష్టావషాణ్
ణ్యుదీక్షేతబ్రాహ్మణీప్రోషితంపతిం। అప్రసూతాతుచత్వారిద్వేసమేహ్యా ప్రసూ
తికా । నశూద్రాయాస్స్మృతః కాలో నచధర్మవ్యతిక్రమః । విశేషతోఽప్ర
సూతాయాఃస్త్రియాః సంవత్సరాత్స్థితిః"॥ అనగా బ్రాహ్మణస్త్రీతనభర్త దే
శాంతరగతుడైనచో నెనిమిదివత్సరములు ప్రతీక్షించి యుండవలెను - సంతతిలే
కున్నచో నాల్గువత్సరములు గర్భముగాక మున్నె యట్లయినచో రెండువత్సరము
లు ప్రతీక్షింపవలెను - శూద్రస్త్రీకి కాలప్రతీక్షయక్కరయేలేదు - ధర్మాతిక్ర

మణముగాదు-సంతతి గనుటకు మున్నెమైనచో బొత్తిగా నక్కఱలేదు తక్కిన
స్త్రీకిసంవత్సరము ప్రతీక్షించునది - ఇదియు వార్తదెలియనియెడననిగ్రహించున
ది - జీవించిన వార్తదెలియుచుండెనేని రెండువత్సరములుమాత్రము ప్రతీక్షించు
నది-అటుపైని మరియొక భర్తనాశ్రయింపవచ్చును- ఏమనిన స్త్రీలు సంతతి కొర
కేసృష్టికర్తచే సృజింప బడిరి- కనుక నన్యునిగూడినను వారికిదోషములేదు-ఇట్లు ని
యోగనిర్ణయము - యాజ్ఞవల్క్యవచనము - 'విప్రాన్మూర్ధావసిక్తోహి క్షత్రి
యాయాం విశస్త్రియాం । అంబష్ఠశ్శూద్ర్యాం నిషాదోజాతః పారశవోపివా।
వైశ్యాశూద్ర్యోస్తురాజన్యాన్మాహిష్యోగ్రౌసుతౌస్మృతౌ । వైశ్యాత్తుకరణశ్శూ
ద్ర్యాంవిన్నాస్వేషవిధిస్మృతః॥" అనగావిప్రునికి క్షత్రియవైశ్య స్త్రీలయందు బు
ట్టినవాడు క్రమముగ మూర్ధావసిక్తుడు నంబష్ఠుడనబడుదురు - శూద్రస్త్రీయం
దుబుట్టినవాడు నిషాదుడనిగాని పారశవుడుగాని యనబడును - ఇక క్షత్రియునికి
వైశ్యశూద్రస్త్రీలయందు బుట్టినవారు క్రమముగ మాహిష్యుడు నుగ్రుడు ననబ
డుదురు - ఇకవైశ్యునికిశూద్రస్త్రీయందుబుట్టినవాడు కరణుడనంబడును - ఇట్లు
మూర్ధావసిక్తాంబష్ఠపారశవమాహిష్యోగ్రకరణులార్గురును అనులోమజులన
నుత్తమజాతి పురుషునికిని నీచజాతి స్త్రీకిని బుట్టినవారు కనుక తల్లిజాతి కను
రూపమైనకర్మగలవారు - ఇకవిపరీతముగా నుత్తమజాతి స్త్రీలయందు నీచజాతి
పురుషులకుబుట్టినవారు ప్రతిలోమజులనబడుదురు - మనువచనము- "బ్రాహ్మణా
దుగ్రకన్యాయామావృతోనామజాయతే"- అనగా క్షత్రియునికి శూద్రస్త్రీయం
దుబుట్టిన యుగ్రకన్యయందు బ్రాహ్మణునికి బుట్టినవాడా వృతుడన బడును-యా
జ్ఞవల్క్యవచనము - "మాహిష్యేణకరణ్యాంతు రథకారః ప్రజాయతే"॥ అన
గాక్షత్రియునికివైశ్యస్త్రీయందుబుట్టినమాహిష్యునికిని వైశ్యునికిశూద్రస్త్రీయం
దుబుట్టిన కరణజాతి స్త్రీకిని బుట్టినవాడురథకారుడు అనగాసూతజాతి - వీరల
నగాననులోమజుడుమొదలుగ నందరకునువృత్తులు స్మృతికౌముదిలోవసిష్ఠవచన
ము - మూర్ధావసిక్తులకు హస్త్యశ్వ రథశస్త్రశిక్షలును - శస్త్రధారణ
మును - మణిమంత్రౌషధముచేబ్రాణిరక్షణ మంబష్ఠులకును - మాహిష్యులకు
తనృత్యనక్షత్రములచే జీవనమును సస్యరక్షయు - పారశవోగ్ర కరణులకు
ద్విజశుశ్రూషయు ధనాధికారము రాజసేవయు కోటకునంతఃపురమునకుద్వా
పాలకులగుటయును - రథకారునకు నిధిజ్ఞానము హస్త్యశ్వములసారథ్యము

పెంచుటయు శిక్షజెప్పుటయు - శంఖవచనము - క్షత్రియ వైశ్యులకు స్వోత్త
రజాతిస్త్రీలయందు బుట్టినవాడు రథకారుడు వానికి నధ్యయనము యజ్ఞము
దానము నుపనయనమును సంస్కారములు నిషిద్ధములు కావు - రథము ప
న్నుట వాస్తువిద్యాధ్యయనము వీనిచే జీవన మని జాతివివేకమందున్నది-"శూ
ద్రాం శయన మారోప్య బ్రాహ్మణశ్చే త్కథంచన । జనయేద్గ్రామ్యధర్మే
ణ తస్యాం పారశవంసుతం । మహాశూద్రస్స విఖ్యాతః శూద్రేభ్యః కించి
దుత్తమః । స్వర్ణకారస్య తస్యేహ స్నానం ధౌతం పవిత్రకం । సర్వంశూద్ర
స్యధర్మేణ వర్తనంతస్యజీవికా । తథా- కూటస్వర్ణ వ్యవహారీ విమాంసస్యచవి
క్రయీ । రాజ్ఞావిప్రస్తు కర్తవ్యో దాప్యశ్చోత్తమ సాహసం"॥ అనగానొకవే
శబ్రాహ్మణుడు కర్మవశముచే శూద్రస్త్రీని సంభోగించి పుత్రునిగన్నచో వా
డు మహాశూద్రుడనబడును శూద్రజాతికంటె కొంచె ముత్తముడు అట్టిస్వర్ణకా
రుడనగ కంసాలికిస్నానము శుద్ధవస్త్రము పవిత్రముసర్వము శూద్రునిధర్మముచే
జీవనము- అట్లుబంగారుక్రయవిక్రయములనుమాంసముతప్పదక్కినవస్తువులనమ్ము
డుచేయువిప్రునివలన నుత్తమసాహస మనగా మొదటితరగతిధనదండము రాజు
చెల్లింపించ వలెననుట- ఉశనస్స్మృతి- "క్షత్రియావిప్ర సంయోగాజ్జాతో మూర్ధా
వసిక్తతః । రాజన్యః క్షత్ర ధర్మేభ్యో భ్యధికస్సం ప్రకీర్తితః । ఆథర్వణ క్రి
యాంకుర్వ న్నిత్యనైమిత్తికీంక్రియాం । అశ్వంరథం హస్తినంవా వాహయె
ద్వైనృపాజ్ఞయా । సైనాపత్యంచ భైషజ్యం కుర్యాజ్జీవేచ వృత్తిషు । ఆయు
ర్వేదమథాష్టాంగం తంత్రోక్తం ధర్మతశ్చరేత్ । జ్యోతిషంగణితంవాపి కాయి
కీంవృత్తి మాశ్రయేత్ । వైశ్యాయాం విధినావిప్రా జ్జాతోహ్యం బష్ఠఉచ్యతే।
కృష్యాజీవో భవేత్తస్య తథైవాగ్రే ప్రనర్తకః । నరవాజిగజాదీనాం చికిత్సాత
స్యజీవికా"॥ అనగా క్షత్రియ జాతి స్త్రీయందు విప్రునికి బుట్టినవాడు రాజపుత్రు
లై నక్షత్రాదిజాతికంటె కొంచెముత్తముడు వానిక థర్వణశాఖచే నిత్యనైమిత్తిక
ములుచేయుటయు రాజాజ్ఞచే నశ్వగజాదిశిక్షయు సేనాధిపత్యము జీవికలు మరి
యు నెనిమిదంగములుగల యాయుర్వేదమును ధర్మార్థము నడిపించవలెను జ్యోతి
షముగాని లెక్కలుగాని దేహయాత్రకు వృత్తిగా జేసుకొనవలెను - అట్లువైశ్య
స్త్రీయందు విప్రునికిబుట్టినవాడం బష్ఠడనవలెను వానికి వ్యవసాయము నృత్యగీ
తాదికము నరులుగుఱ్ఱములు గజములుమొదలగు వాని వైద్యము జీవనములు- వా

గ్భట్టవచనము - "సప్తవాపంచవాతిస్రో యోనవేత్తిహి సంహితాః । రాజ్ఞా
తస్యతువైద్యస్య ఛ్ఛేత్తవ్యోదక్షిణఃకరః"॥ అనగా నేడుగాని యైదుగాని మూ
డుగాని సంహితలు చదువక వైద్యముచేయువాని కుడిచేయిఖండించి రాజు శి
క్షింప వలెననుట - మనువచనము - "ప్రాయశ్చిత్తంచికిత్సాంచజ్యోతిషం ధ
ర్మనిర్ణయం । వినాశాస్త్రేణయోబ్రూయాత్తమాహుర్బ్రహ్మఘాతకం"॥
అనగా ప్రాయశ్చిత్తమును నౌషధమును జ్యోతిషమును వివాదను దీర్పుటయు
శాస్త్రమెరుగక సేయువాడు బ్రహ్మహత్య జేసినవాడగును - "వైశ్యాయాం
క్షత్రియాజ్జాతోమాహిష్య స్త్వనులోమజః । అష్టాధికారనిరత శ్చతుష్షష్ట్యంగ
కోవిదః । వ్రతబంధా దికా స్తస్య క్రియాస్స్యుస్సకలావిశః । జ్యోతిషంశాకునం
శాస్త్రం స్వరశాస్త్రంచ జీవికా॥" అనగా వైశ్యస్త్రీయందు క్షత్రియునికిబుట్టి
నవాడు మాహిష్యుడనబడును వానికష్టాంగ వైద్యమందును నరువదినాలుగు కళ
లయందు నధికారము ఉపనయనము మొదలగుకర్మలు వైశ్యునికివలె వానికినగు
ను మరియుజ్యోతిషము శకునశాస్త్రము స్వరశాస్త్రము వానికి జీవనోపాయము
లు- విశ్వంభరశాస్త్రమందు- "శూద్ర్యాంక్షత్రా దుగ్రజాతి ర్యుద్ధశస్త్రాదిజీవి
కా । శస్త్రాస్త్రన్యాసకుశలః సంగ్రామ కుశలోభవేత్ । తయా వృత్త్యాహ్య
జీవన్నైవ శూద్రధర్మాంశ్చ పాలయేత్ । శూద్ర్యాంజాతస్తు వైశ్యాద్వై కర
ణోలిపిలేఖకృత్॥" అనగా శూద్రజాతిస్త్రీయందు క్షత్రియునికి బుట్టినవాడు ఉ
గ్రుడనబడును వానికియుద్ధము శస్త్రవిద్యయుజీవిక - దీనిచేజీవనము సంభవింప
నిచోశూద్రధర్మము లాచరింపవలెను - మరియుశూద్రస్త్రీయందు వైశ్యునికిబు
ట్టువాడుకరణుడు వానికి లిపులు వ్రాయుటజీవిక- యాజ్ఞవల్క్య వచనము- "జా
త్యుత్కర్షో యుగేజ్ఞేయః సప్తమె పంచమేపివా । వ్యత్యయే కర్మణాంసా
మ్యంపూర్వవచ్చా ధరోత్తరం॥" అనగా జాత్యుత్కర్షమున నుత్కృష్టజాతిలో
గలియుటసప్తమ పురుషాంతరమందుగాని అపిశబ్దముచే నారవ పురుషునిలోగా
నియైదవ పురుషునందుగాని క్రమముగానగును - ఎట్లనినవిప్రుడు శూద్రస్త్రీని వి
వాహమాడి కన్యనుగన్నచో నదియువిప్రుని వివాహమాడికన్యనుగని యిట్లు స
ప్తమ సంతతి బ్రాహ్మణుడగును - ఇట్లువిప్రుడు వైశ్యకన్యను వివాహమాడి
కన్యనుగన్నచో క్రమముగ నారవసంతతి విప్రుడగును అట్లు విప్రుడు క్షత్రజా
తిస్త్రీని వివాహమాడి కన్యనుగనినచో నిట్లుక్రమముగ నైదవ సంతతి విప్రుడ

గును మరియును క్షత్రియునికి శూద్రస్త్రీయందు బుట్టినకన్య క్రమముగ నారవసం
తతిలో క్షత్రియుని గనును - వైశ్యునికి బుట్టిన కన్యయైనచో నైదవవాని వైశ్యు
ని గనునని పూర్వార్థమున కర్థము - ఇట్లువిప్రుడు క్షత్రవృత్తిచే జీవించిన
చో పుత్రపరంపరచే నట్టివృత్తియె నడచినయెడ నైదవవాడు క్షత్రియుడె యగు
ను - వైశ్యవృత్తిచే జీవించినచో నారవవాడు వైశ్యుడగును - శూద్రవృత్తిచే
నట్లు నడచినచో నేడవవాడు శూద్రుడగును - అట్లుక్షత్రియునికి వైశ్యవృత్తిన
డచినచో క్రమముగ నైదవవాడు వైశ్యుడగును శూద్రవృత్తి నడచినచో నార
వవాడు శూద్రుడగును - అట్లు వైశ్యునికి శూద్రవృత్తి నడచినచో నైదవ
వాడు శూద్రుడగునని యర్థము - ఇక ప్రతిలోమజులు - కల్పతరువు నం
దు కాత్యాయనవచనము - "నియోగోత్పాదనంకుర్యా ద్యథోక్తంతద్విశుద్ధయె।
ద్విజస్త్రీషు చధర్మోయం శూద్రస్య తత్సదాభవేత్॥" అనగా నియోగ విధి
గా పుత్రుని గనుట ద్విజస్త్రీలకు సంభవించును శూద్రులకట్లు సంభవింపదనుట-
బృహస్పతివచనము - "ఉక్తోనియోగోమనునానిషిద్ధ స్స్వయమేవతు।యుగహ్రా
సాదశక్యోయం కర్తుం మర్త్యై ర్విధానతః । అనేకధాకృతాః పుత్రా
ఋషిభిర్యే పురాతనైః । నశక్యంతే ధునాకర్తుం శక్తిహీనై రిదంతనైః ॥"
అనగా మనువుచే నియోగ మనగ నన్యపురుషునిచే సంతతి గనుట విధించియు కా
లము పిదపయగుటచే ముందుమనుష్యులు విధిగా నడుపలేరని తిరుగ నిషేధించె
ను ప్రాచీనులైన ఋషులు సమర్థులు గనుక ననేకవిధములుగ బుత్రులగనిరి -
ఇప్పటివారట్లు దోషములేకుండగ పుత్రులగనుటకశక్తులు గదా-అచటహారీతవచ
నము - "స్వైరిణీచ పునర్భూశ్చ రేతోధాఃకామచారిణీ।సర్వభక్షాచ విజ్ఞేయాః
పంచైతా శ్శూద్రయోనయః । ఏతాసాంయాన్య పత్యాని ఉత్పద్యంతె కదాచ
న।నతాః పఙ్క్తిషుయుంజీత నతేపఙ్క్త్యర్హా కాస్మృతాః॥"అనగా వ్యభిచా
రిణియు మారుమనువు నొందినది జారుని వలన సంతతి గన్నది వేశ్యావృత్తిచే జీ
వించునది కల్లుత్రాగునదియు నేజాతిదైనను శూద్రయోనియగును వారిసంతాన
మును గులములోగలపగూడదువారుపఙ్క్తిబాహ్యులు - యాజ్ఞవల్క్య వచనము
"బ్రాహ్మణ్యాం క్షత్రియాత్సూతో వైశ్యాద్వైదేహక స్తథా। శూద్రాజ్జాతస్తు
చాండాల స్సర్వధర్మ బహిష్కృతః । క్షత్రియామాగధం వైశ్యాత్ శూద్రా
త్ క్షత్తారమేవచ । శూద్రాదాయోగవంవైశ్యా జనయామాస వైసుతం॥" అ

నగా బ్రాహ్మణస్త్రీయందు క్షత్రియునకు బుట్టువాడు సూతుడనబడును వైశ్యునకు బుట్టెనేని వైదేహకుడనబడును శూద్రునికి బుట్టెనేని చాండాలుడు సర్వకర్మల కనర్హుడు క్షత్రియస్త్రీయందు వైశ్యునకు బుట్టువాడు మాగధు డనగస్తుతి పాఠకుడు - శూద్రునికి బుట్టెనేని క్షత్తయనగ కిరాతుడు - వైశ్యస్త్రీయందు శూద్రునికిబుట్టువాడు ఆయోగవుడనగపుల్కసుడనెడుచండాలభేదము-అట్లుహారీత వచనము-"క్షత్రియాయాంవైశ్య శూద్రావంది నిషాదౌ వైశ్యాయాం శూద్రః పుల్కసాః॥" అనిఅర్థము మీదజెప్పబడినదే - మరియొక నిషాదుడు వ్యాసవచనమందు - "శూద్రాన్నిషాదోమత్స్యఘ్నఃక్షత్రియాయాంవ్యతి క్రమాత్॥" అనగా విపరీతముగ క్షత్రియస్త్రీయందు శూద్రునికి బుట్టువాడు మత్స్యఘాతుకుడు జాలరివాడు - కనుక నిద్దరు నిషాదులు మీదజెప్పిన వాడొకడును వీడొకడును - జాతివివేకమందును"క్షత్రియాశూద్రసంయోగాత్ క్షత్తారం జనయేత్సుతం । నిషాదఇతి విఖ్యాత స్సర్వవర్ణ బహిష్కృతః । వాగురాపాశపాణిస్తు మృగబంధనకోవిదః । ఆరణ్యా పశుజాతీనా మంతకశ్చవనేచరః । క్రోధాన్వితో మాంసవృత్త్యాతయాజీవే త్సదైవహి । ఘంటాం పాపర్ధికాం కుర్యాద్రాత్రౌ విస్మయ కారిణీం । ద్విధాచమృగయాప్రోక్తావ్యోమభూచారిణామిహ । విక్రయంమధునఃకుర్యాద్ధన మిచ్ఛన్ సమృద్ధయే॥" అనియున్నదియనగా క్షత్రియజాతిస్త్రీయందు శూద్రునికి బుట్టినవాడు నిషాదు డనబడును సర్వవర్ణములకు వెలియైనవాడు వలలునురులుపట్టి మృగముల వేటాడుచు నరణ్యమృగములకంతకుడై యడవినుండుచు క్రోధస్వభావముతో రాత్రియం దాశ్చర్యమగునట్లు ఘంటవ్రాయించుచు బక్షులను మృగములను బట్టుచు జీవించును మరియు ద్రవ్యలాభమునకు పట్టులుగొట్టితేనె నమ్మును- యమస్మృతిలో మాగధనిషాదులకు వేరునామములున్నవి "క్షత్రియాయాంతు వైశ్యేనముచిపో నామజాయతే । శూద్రేణజాయతే మద్గుః క్షత్రియా యత్రముహ్యతి॥" క్షత్రియస్త్రీయందు వైశ్యునికిబుట్టినవాడుముచుపు డనబడునుశూద్రునికి బుట్టెనేని మద్గుడనబడును -స్మృత్యంతరమందు - "క్షత్రియామాగధంవైశ్యాజ్జనయామాస వైసుతం।సవందీజనఇత్యుక్తో వ్రత బంధ వివర్జితః । శూద్రేభ్యోభ్యధికః కించి త్తస్య జీవనముచ్యతె। కావ్యాలంకార గద్యాదిషడ్భాషాసు కలాక్షమః । గద్యపద్యాది చిత్రాణి విరుద్ధాని మహీభృతాం । క్షత్రియాయాం వైశ్యజాతః క్షత్తా వేత్ర ధరోభవేత్॥" అ

నియున్నది అనగా క్షత్రియస్త్రీయందు వైశ్యునికి బుట్టినవాడు మాగధుడనగవం
ది జనుడు వానికుపనయనాదులు లేవు శూద్రులకంటె గొంచెముత్తముడు కా
వ్యాలంకారములు గద్యములు చదువుటయారుభాషలందు పాండిత్యము రాజులకు
విరుద్ధమగు గద్యపద్యముల చదువుచు బెత్తము పట్టుకొని నౌకరిచేయును - వీడె
క్షత్తయు ననబడును - లఘుజాతి వివేకమందు - "సూతాస్తేయేపురాణస్థా ను
చ్చరంతి నృపాన్ సదా । యేల్పకాలగతాన్ శూరాన్ వర్ణయంతిచ మాగ
ధాః । వర్తమానాం స్తథాసమ్యఙ్నృపాన్ సంగ్రామకారిణః । వర్ణయం
తిప్రబంధైర్యేవందినస్తే ప్రకీర్తితాః॥" అనగా సూతులనువారు పురాణము
లందున్న ప్రాచీన నృపుల వర్ణింతురు - మాగధులు స్వల్పభూత కాలములో
యుద్ధములుచేసిన శూరుల వర్ణింతురు వందులు ప్రస్తుతమందు యుద్ధములు సే
యునృపులను ప్రబంధములచే వర్ణింతురు - మనువచనము "కారావరం నిషా
దాత్తు చర్మకారం ప్రసూయతే । వైదేహకాదంధ్రమేదౌబహిర్గ్రామవ్య
వస్థితౌ॥" అనగామీదజెప్పిన విదేహజాతిస్త్రీయందు నిషాదునికిబుట్టినవాడు చ
ర్మకారుడనగా చెమారీవాడు - విప్రస్త్రీకి వైశ్యునికినిబుట్టినవాడు వైదేహు
డు అట్టివైదేహస్త్రీయందు చెమారీవానికి బుట్టినవాడంధ్రు డనుట చండాలభేద
మునిషాదస్త్రీయందు బుట్టెనేని మేదు డనబడును - ఇద్దరును గ్రామములోనివ
సించగూడదు అనిమేధాతిథివ్యాఖ్యానము - అంగిరసుడు మరికొందరి చండా
లులజెప్పెను "యస్తుప్రవ్రజితాజ్జాతో బ్రాహ్మణ్యాం యశ్చశూద్రజః । తావు
భావిద్ధి చండాలౌసగోత్రాద్యశ్చ జాయతే॥" అనగా సన్యాసికి బుట్టినను బ్రా
హ్మణస్త్రీయందు శూద్రునికి బుట్టినవాడునుసగోత్రస్త్రీయందు బుట్టిన వాడును
చండాలులే యనుట - యమస్మృతి "ఆరూఢ పతితాపత్యం బ్రాహ్మణ్యాం య
శ్చశూద్రజః । సగోత్రోఢా సుతశ్చైవ చండాలాస్త్రయ ఈరితాః॥" అన
గా మీదజెప్పినట్లే యర్థము - మనువు పుల్కసునిగూడ జెప్పెను "జాతోని
షాదాచ్ఛూద్రాయాంజాత్యా భవతి పుల్కసః । శూద్రాజ్జాతోనిషాద్యాంతు
సవై కుక్కుటకస్స్మృతః । క్షత్తుర్జాతస్తథోగ్ర్యాంతు శ్వపాకఇతిచోచ్యతే।
వైదేహకేన త్వంబష్ఠ్యాముత్పన్నోవేన ఉచ్యతే॥" అనగా క్షత్రియస్త్రీ యందు
శూద్రునికి బుట్టినవాడుక్షత్త - శూద్రస్త్రీయందు క్షత్రియునికి బుట్టినదియుగ్ర
స్త్రీ - ఆక్షత్తకు నీయుగ్రస్త్రీయందుబుట్టినవాడు శ్వపాకుడను చండాలుడు -

విప్రస్త్రీయందు వైశ్యునికి బుట్టినవాడు వైదేహుడు - వైశ్యస్త్రీయందు విప్రు
నికి బుట్టినది యంబష్ఠి యనబడును - ఆవైదేహకునికి నంబష్ఠికిని బుట్టినవా
డు వేనుడనబడును - వీరికి జీవనోపాయములు వసిష్ఠవచన మందున్నది - సూ
తులకు మంత్రిత్వము కాయస్థత్వ మనగా మత్సర్ది పని దూతికపనియు కుట్టుపని
యనగును - వైదేహకులకు నాటకాంగములలోనటవృత్తి - వేనులకుకర్రలు
చెక్కుట - సానబట్టుట మణి ముక్తాదులకు రంధ్రములు వేయుటయును - ఆ
యోగవులకు రాగి యినుము తగరము సీసము వీనిపనియు నాయుధములుచేయు
టయు వానికూపుణను పట్టణములు గట్టుటయును - సైరంధ్రి జాతికి సురయు
మద్యము సీధువు మొదలగు నాసవములు సేయుటవాని నమ్ముటపుష్పఫలాదులన
మ్ముటయును - విశ్వంభరశాస్త్రమందు "విప్రాయాంయస్సుతః క్షత్రియాత్సూ
తాఖ్యో గజబంధకృత్ । దమనం తురగాణాంచకుర్యా త్తజ్జీవనంపరం । నృ
పాద్బ్రాహ్మణకన్యాయాం వివాహేషు సమన్వయాత్ । జాతస్సూతస్తునిర్ది
ష్టః ప్రతిలోమవిధిర్ద్విజ ॥" అనగా క్షత్రియుడు పెండ్లాడిన బ్రాహ్మణకన్య
యందు బుట్టినవాడు సూతు డనబడును వానికి గజముల నశ్వముల శిక్షనేర్పు
వృత్తియగు ననుట- మరియు వేదమున కనర్హుడైన వానిధర్మములు తెలుసుకొ
ని బోధించును"బ్రాహ్మణ్యాంతు సుతోజాతో వైశ్యాద్వైదేహకస్స్మృతః। పా
షాణకాష్ఠయో శ్శిల్పంతస్య జీవనముత్తమం॥" అనగా బ్రాహ్మణజాతి స్త్రీ
యందు వైశ్యునికి బుట్టినవాడు వైదేహకుడు వానికి రాళ్లు కర్రలు చెక్కుటప
నియగును - మనువచనము "సూతానామశ్వసారథ్యమంబష్ఠానాంచికిత్సితం।
వైదేహకానాం స్త్రీకార్యం మాగధానాం వణిక్పథః । మత్స్యఘాతో ని
షాదానాం తష్టిరాయోగవస్యచ ॥" అనగా సూతజాతికి గుర్రముల శిక్షించి
తోలుటయు నంబష్ఠులకు వైద్యము జేయుటయు వైదేహకులకు స్త్రీకార్య
మనగా నంతఃపురమందు నౌకరీ నిషాదులనగా జాలారి వాండ్రకు చేప
వేట ఆయోగవునికి కర్రలుచెక్కుటయు వృత్తులనుట - ఉశనముని వచనమం
దు "నృపాయాంవైశ్యసంసర్గా దాయోగవఇతిస్మృతః। తంతువాయా భవం
త్యేతే వస్త్రకాంస్యోప జీవినః । శాలికాః కేచిదత్రైవ జీవనం వస్త్రనిర్మి
తం। క్షత్తుర్గ్రపుల్కసానాంతుబిలౌకోవధబంధనే । ధిగ్వణానాంచర్మకార్యం
వేణానాం భాండవాదనం।చైత్యద్రుమ శ్మశానేషు శైలేషూపవనేషుచ।వసేయు

రేతేవిజ్ఞాతావతేర్యంతస్స్వకర్మభిః॥" అనగాక్షత్రియస్త్రీయందువైశ్యునికిబుట్టినవాడాయోగవుడనబడును వారెతంతువాయులనగ దేవరులు బట్టలునేయుటవారికివృత్తి - ఇందుశాలికులనగ సాలెవాండ్రను గలరువారికినదియె వృత్తి క్షత్రియస్త్రీయందు శూద్రునికిబుట్టినవాడుక్షత్తయనబడును శూద్రస్త్రీయందు నిషాదునికి బుట్టినవాడు పుల్కసుడు ఇట్లువీరిద్దరువిలోమజాతు లగుటచే మధ్యమందున్నయుగ్రుడు నిక్కడవిలోమజాతుడేయని స్మృతిమంజరియందున్నది. ఈ మూడుజాతులకును సర్పాదులనువధించుట బంధించుటయు వృత్తియరియు-ధిగ్వణులను నీచజాతులకు చర్మములమ్మాయుట మొదలగునదియు తుడుములు డప్పులు మొదలగునవివాయించుటయు వృత్తియగును - ఇట్టి నీచజాతులు రథ్యావృక్షములయొద్దను కొండలయొద్దను వనములందును తమజాతిచిహ్నములచే నంకితులై నివసింపవలెను - "చండాలశ్వపచానాంతు నిర్గామస్స్యాత్ప్రతిశ్రయః। అపపాత్రాశ్చ కర్తవ్యాః ధనమేషాంశ్వగర్దభం॥" అనగా చండాలురకును శ్వపచులకును గ్రామమునకు వెలిగానివాసము కుక్కలు గాడిదలు వాండ్రకుధనము-వారు అపపాత్రులనగా భిన్నపాత్రులు గావలెననగా పెంకులు మొదలగునవి వాడుకచేతురనుట లేదా వంటపాత్రలు మొదలుగవాండ్రకుండగూడదనుట అట్లు ముందుచెప్పబడను "అన్నమేషాంపరాధీన"మని- లేదా వారిచేతిలో నున్నపాత్రమందన్నాదులీగూడదు మరేమనిన భూమిపైనుంచిన నీవచ్చునను "వాసాంసిమృతచేలాని భిన్నభాండేచ భోజనం। కార్ష్ణాయసమలంకారః పరివ్రజ్యాచ నిత్యదా॥"అనగా శ్మశానమందిచ్చుశవవస్త్రములుగట్టుట పెంకులు మొదలగువానిలో భోజనమునినుముచే నిర్మించిన నగలు నిత్యమునొకచోనుండకతిరుగుటయు వృత్తులు - "నతైస్సమయమన్విచ్ఛేత్పురుషోధర్మమాచరన్ । వ్యవహారోమిథస్తేషాం వివాహస్సదృశైస్సహ । అన్నమేషాంపరాధీనం దేయంస్యాద్భిన్నభాజనే । రాత్రౌనవిచరేయుస్తే గ్రామేషు నగరేషుచ । కార్యార్థం విచరేయుర్వాచిహ్నితారాజశాసనైః । అబాంధవంశవంచైవ నిర్హరేయురితిస్థితిః॥వధ్యాంశ్చహన్యుస్సతతం యథాశాస్త్రం నృపాజ్ఞయా । వధ్య వాసాంసిగృహ్ణీయుశ్శయ్యాశ్చాభరణానిచ । బ్రాహ్మణార్థేగవార్థేవా దేహత్యాగోనుపస్కృతః । స్త్రీబాలాభ్యవపత్తౌచబలినాంసిద్ధికారణం॥" అనగాధర్మాచరణము జేయుపురుషుడు వారితో వ్యవహారము చేయగూడదు వ్యవహారము

గాని వివాహముగాని వాళ్లలో పరస్పరముసమానులతోఁగావలెను వాళ్ల కన్న మునితరులీవలెను ఇచ్చునపుడు భిన్నపాత్రయందీవలెను రాత్రులందువాళ్లు గ్రామములలో దిరుగుటయెకూడదు లేదా రాజాజ్ఞచే చిహ్నములధరించి కార్యార్థముతిరుగవచ్చును దిక్కులేని శవములవాళ్లుతీసుకొనిపోవలెను రాజాజ్ఞచేనురిదీయవలసినకైదీలను జంపవలెనుఅట్లు చంపబడినవారివస్త్రములు శయ్యలు నాభరణములును వాళ్లుపుచ్చుకొనవలెను - ఇకవాళ్లకు సుగతియెట్లనిన బ్రాహ్మణునికిగాని గోవుకుగాని స్త్రీబాలురకుగాని యుపద్రవమువచ్చునపుడు వారి రక్షించుటకు ధనాదులపేక్షింపకయే దేహత్యాగముజేసిరేనిసుగతిగల్గుననుట- ఉశనసు వచనము - "సీసమాభరణంతేషాంకాలాయసమథాపివా । వధ్రీం కంఠే సమాబధ్య ఝల్లరీకచ్ఛతోపివా । మలాపకర్షణంకుర్యుః పూర్వాహ్ణేపరి శుద్ధికం । పిండీభూతావసెయుస్తెనోచేద్వధ్యావిశేషతః॥" అనగా సీసము నుక్కును వీనిచే జేయబడినవస్తువులలంకారము కంఠమందుతోలుపట్టిధరింపవలెను లేదా ఝల్లరియనువాద్యముమొలను గట్టుకొనవలెనునిత్యముప్రాతః కాలమందు గ్రామములోని రోడ్లుపాయఖానాలుతుడువవలెను వాళ్లు గ్రామములోనున్నపుడునొకవైపు ప్రోగుగానుండవలెనుగాని చెదిరియుండగూడదు అట్లున్నచో శిక్షింప వలెను - అట్లువ్రాత్యులకు బుట్టినవారును శూద్రసములు- వారెవ్వరనినమనువచనము - "వ్రాత్యాత్తు జాయతేవిప్రాత్ పాపాత్మాభృజ్జకంటకః । ఆవంత్యవాటధానౌచ పుష్పశేఖరఏవచ॥" అని అనగా గాయత్రీపతితుడై వ్రాత్యుడైన విప్రునికి విప్రస్త్రీయందుబుట్టినవాడు భృజ్జకంటకుడు ఆవంత్యవాటధానాది సంజ్ఞలచేనతడె పిలువబడునని మేధాతిథివ్యాఖ్యానము ఇతరులు భృజ్జకంటకునికి విప్రస్త్రీయందుబుట్టినవాడావంత్యుడు వానికట్టి స్త్రీయంబుట్టినచో వాట ధానుడనబడును వానికివిప్రస్త్రీయందు బుట్టినవాడుపుష్పశేఖరుడనియంద్రు-ఇట్లుముందును దెలియునది - విశ్వంభరశాస్త్రమందు వీరి జెప్పి " ఏతైస్తు జీవనార్థాయ కార్యంవిష్ణ్వాదిపూజనం । నృత్యగీతాది వాదిత్రశంఖవీణాది వాదనం॥" అనగా వీరలకు దేవాలయమందు శివవిష్ణ్వాది పూజయు నృత్యముగానము వాద్యములు శంఖవీణాదులువాయించుటయు నివిజీవనార్థమైన వృత్తులు - "ఝల్లోమల్లశ్చరాజన్యా ద్వ్రాత్యాద్విచ్ఛిబిరేవచ । నటశ్చకరణశ్చైవ ఖసోద్రమిడ ఏవచ॥" అనగా వీరువ్రాత్యుడైనక్షత్రియునికి క్షత్రియస్త్రీయందుబుట్టినవారనితా

త్పర్యము-ఇచ్చటకరణుడనగా మీదజెప్పిన శూద్రస్త్రీయందు వైశ్యునికిబుట్టినయ
నులోమజునికంటెభిన్నుడు - "వైశ్యాత్తుజాయతేవ్రాత్యాత్సుధన్వాచార్యఏవచ।
కారూషశ్చ విజన్మాచ మైత్రస్సాత్వత ఏవచ॥" అనగా వ్రాత్యుడైన వైశ్యునికి
వైశ్యస్త్రీయందుబుట్టినవాండ్రు సుధన్వుడు నాచార్యుడు కారూషుడు విజన్ముడు
మైత్రుడు సాత్వతుడు ననబడుదురు - ఆదిత్య పురాణమందు "బ్రాహ్మణ్యాం
బ్రాహ్మణా ద్వ్రాత్యా జ్జాయతే భృజ్జకంటకః । ఆవంత్యవాటధానౌచ పు
ష్పశేఖర జాతయః । ఆభిచారిక కర్మాణ్యత్ర భృజ్జకంటకి నోశనం । మంత్రౌ
షధీశాత్రవాణాం సంముఖీకరణాన్యపి । కుర్వంతి రాజ్ఞాంహితతస్తైనైవావిక్రి
తాఃపరే॥" అనగా వ్రాత్యుడైన విప్రునికి విప్రస్త్రీయందుబుట్టినవాడు భృజ్జకం
టకు నావంత్యవాటధానులు పుష్పశేఖరుడు ననుజాతులువీనికి రాజాజ్ఞచే నభిచా
రమనగనితరుల బాధించు ప్రయోగములు సేయుటయు మంత్రౌషధాదులచే శ
త్రువులను ననపరాధులైన యితరులను వశీకరించుటయు వృత్తులు "రాజ్ఞీషుక్ష
త్రియాద్వ్రాత్యా జ్ఝుల్లమల్లనటాఝుషాః । అవిద్ధిబీకాః కరణాద్రమిడాస్సంతి
భూరిశః । విజ్ఞేయాః పరరాష్ట్రాణాం తైశ్చరాజాజ్ఞ యాక్రియాః। ఖసోమల్ల
స్తథావృత్తం మిత్రామిత్రత్వమేవచ। వైశ్యస్త్రీషుతథావ్రాత్యాద్వైశ్యాత్కా
రూషకోభవేత్ । చతుష్పథేశ్మశానేచ సభవేన్మిత్రమండలం॥" అనగా వ్రా
త్యుడైన క్షత్రియునికి క్షత్రియస్త్రీయందు ఝల్లుడు మల్లుడు ఝషుడు అవిద్ధిబీకు
లు కరణులుద్రమిడులునని యనేకులు పుట్టిరి - వారికిరాజాజ్ఞచే శత్రురాజ్య
ములక్రియలు తెలియుటవృత్తి - ఖసజాతికి మల్లజాతికిని వృత్తాంతములు దెచ్చు
టయు మిత్రత్వము విరోధము ఘటించుటయు వృత్తులు - వ్రాత్యుడైన వైశ్యు
నికి వైశ్యస్త్రీయందుబుట్టినవాడు కారూషకుడు వానికి చతుష్పథములందునుశ్మ
శానములందును జరిగెడు వృత్తాంతముల రాజాజ్ఞచే దెలుసుకొనుటవృత్తి "మా
తృమండనః" అనుపాఠమందు దేవీపూజవృత్తియనుట - "సుధన్వాచార్యస్త్వప
రోభవేద్రుద్రస్యపూజకః । తృతీయశ్చ విజన్మాఖ్యస్సూతికావేశ్మపూజకః।భూత
ప్రేతపిశాచాంశ్చ పూజయేద్రాజశాసనాత్ । సాధ్యానాంపూజకోమైత్రశ్చై
త్యాదీనాం చతుర్థకః । పంచమస్సాత్వతోనామ విష్ణోరాయతనార్చకః॥" అ
నగా సుధన్వాచార్యుడను మరియొకడు రుద్రపూజకుడగును - విజన్ముడను మూ
డవవాడు సూతికాగృహదేవతను బూజించువాడు రాజాజ్ఞచే భూతప్రేత పి

శాచాదులనుగూడను బూజించును - మైత్రుడనునాల్గవ వాడు సాధ్యులను ర
థ్యావృక్షములందున్నయక్షులను బూజించువాడు - సాత్వతుడనునైదవవాడు
విష్ణుదేవాలయమందర్చకుడుగావచ్చును - మరియునిట్టివ్రాత్యజుల కన్యోన్యసం
కరమైనచో మరియు నీచజాతులు పుట్టును-అట్లుమనువచనము"యథైవ శూద్రో
బ్రాహ్మణ్యాం బాహ్యంజంతుం ప్రసూయతే । తథాబాహ్యతరంబాహ్యశ్చా
తుర్వర్ణ్యే ప్రసూయతే." అని యనగా శూద్రుడు బ్రాహ్మణస్త్రీయందువర్ణ
బాహ్యుడైన చండాలుని గన్నట్లు ఆబాహ్యుడునుచతుర్వర్ణస్త్రీలయందు మరి
కొందరు బాహ్యులగుదురనుట- వర్ణజులకన్యోన్యసంకరమైనచో భేదములసం
ఖ్యనుమనువు చెప్పెను - "ప్రతికూలం వర్తమానా బాహ్యాబాహ్యతరాన్పు
నః । హీనాహీనాత్ప్రసూయంతేవర్ణాఃపంచదశైవతు॥" అనగా బాహ్యు
లైనచండాలాదులు నాల్గువర్ణముల స్త్రీలయందుదమకంటెనీచజాతుల బుట్టింతు
రు తిరుగవారునుచ్చనీచస్త్రీలయందు నీచజాతులనుచ్చజాతులగంద్రు-అవి పదునై
దగుచుండును ఎట్లనిన - విప్రునికనులోమజులేయగును శూద్రునకు విలోమజు
లేయగును - మధ్యములైన క్షత్రియవైశ్యులకు రెండువిధములును గలవు-అందు
క్షత్రియునికి వైశ్యశూద్రస్త్రీలయందనులోమజులిద్దరు - విప్రస్త్రీయందు విలో
మజుడొక్కడే వైశ్యునకు విప్రక్షత్రస్త్రీలయందు విలోమజు లిద్దరు శూద్రస్త్రీ
యందనులోమజుడొక్కడే - ఇకశూద్రునకు విప్రాది స్త్రీలయందు క్రమముగ
చండాలుడు క్షత్తయునాయోగవుడునని మువ్వురు చండాలునికి విప్రాది స్త్రీల
యందు నల్గురు - ఇట్లుక్షత్తకునాయోగవునికిని నల్గురేసి వెరసి పండ్రెండుగురు
పుత్రులు తండ్రులు ముగురునని పదునైదుగురు - అట్లు వైశ్యునికి క్షత్రియ స్త్రీ
యందు మాగధుడు విప్రస్త్రీయందు వైదేహకుడు శూద్రస్త్రీయందు కరణుడను
ననులోమజుడునని ముగురు సంకరులు వారిచే విప్రాది స్త్రీలు నల్గురి యందును
ప్రత్యేకముగబుట్టినవారు నల్గురేసి గనుక బెరసి పండ్రెండుగురుపుత్రులు తండ్రు
లు ముగురు గలసి పదునైదుగురు - అట్లుక్షత్రియునికి వైశ్యస్త్రీయందు మా
హిష్యుడు శూద్రస్త్రీయందునుగ్రుడు విప్రస్త్రీయందు విలోమజుడు సూతుడు
ఈముగ్గురికి ప్రత్యేకముగ చతుర్వర్ణస్త్రీలయందు బుట్టినవారు నల్గురేసి గనుక
పండ్రెండు గురుపుత్రులు తండ్రులుముగురుగలసిన పదునైదుగురు - అట్లువిప్రు
నికిముగ్గురనులోమజపుత్రులుమూర్ధావసిక్తుడునంబష్ఠుడు పారశవుడుననునీసంక

రులకు నాల్గువర్ణముల స్త్రీలయందు ప్రత్యేకముగ నల్గురేసీ పుత్రులుగాన పం
డ్రెండుగురు తండ్రులుగలసి పదునైదువిధములు- ఇట్లిరువదిసంకరజాతులు-మొద
టినాల్గువర్ణములతోనిరువదినాల్గుజాతులు - జాతివివేకమందుమరియొకరీతి ను
న్నది - "అనులోమ్యేన వర్ణానాం షణ్ణరాస్సం ప్రకీర్తితాః । ప్రాతిలోమ్యే
న తేషట్ స్యురికి ద్వాదశ భేదతః । ఏతేద్వాదశ మిశ్రాస్తుచత్వారింశ ద్విమిశ్రి
తాః । అష్టాచయేస్యుర్భేదాస్తేషష్టిర్ద్వా దశసంయుతాః । హతాస్తే షష్టి
సంఖ్యాత్తైష ట్త్రింశచ్ఛాతసంఖ్యయా। భేదాస్సం కరజాతీనాం బహవస్స్యు స్తతః
పరె॥ " అనగా బ్రహ్మక్షత్రవైశ్యులకనులోమజులాగురు క్షత్రవైశ్యశూద్రుల
కు విలోమజు లాగురుబెరసి పండ్రెండుగురు వీరుప్రత్యేకముగ నాల్గుజాతుల
స్త్రీలయందు నల్గురేసి పుత్రులగనినచో నలుబది యెనిమిది భేదములు తండ్రులు
పండ్రెండుగురును గలసి యరువది భేదములు ఈయరువదిభేదములకు సంకరము
చే నొక్కొక్కటి యరువదియైనచో మూడువేలయారునూరు భేదములగును అటు
పైని బహుభేదములగును- వీరందరు శూద్రసములు - అట్లుమనువచనము "శూ
ద్రాణాంతు సధర్మాణస్సర్వేఽపధ్వంసజాస్స్మృతాః॥" అనియపధ్వంస జా
అనగా వ్యభిచారముచే బుట్టిన సంకర జాతులందరు శూద్రునితో సమాన ధర్మ
ము గలవారనుట - సంకరజాతులస్వరూపము జీవికలు నాదిపురాణ మందున్న
వి - "మూర్ధావసిక్తో విప్రాద్యః క్షత్రియాయాం ప్రసూయతే । సకరోతి మ
నుష్యాణాంచికిత్సాంరోగి ణామపి।బ్రాహ్మణాచ్ఛూద్రకన్యాయాం భవేత్పారశ
వస్తుసః । నిషాదోమత్స్యఘాతిత్వంచక్రె రాజాజ్ఞయాసదా । బ్రాహ్మణేనో
గ్రకన్యాయామంబష్ఠోనామ జాయతె । సకరోతి మనుష్యాణాం చికిత్సాం రో
గిణామపి । బ్రాహ్మణేన తథాంబష్ఠ్యామాభీరోజాయతే సుతః । గోజీవిర
క్షాంకురుతె సచరాజ గృహేష్వపి । ఆయోగవ్యాం బ్రాహ్మణాత్తు జాయతే
ధిగ్వణోనరః । సచర్మకారో విజ్ఞేయోగహీతశ్చర్మజీవనః। ఏతేమాతృ సధ
ర్మాణోన పితుః పుత్రకాశ్చషట్॥" అనగా విప్రునికి క్షత్రస్త్రీయందు మూ
ర్ధావసిక్తుడు వానికి రోగుల చికిత్సయు నాయుధ జీవనమును వృత్తులు । బ్రా
హ్మణునికి శూద్రస్త్రీయందు పారశవుడు వీడే నిషాదుడనగ జాలరి , చేపల
వేటచే జీవించును।బ్రాహ్మణునకుగ్ర కన్యయందంబష్ఠుడు గల్గును వానికి వైద్యము
వృత్తి - బ్రాహ్మణునికి వైశ్య స్త్రీయందును క్షత్రియునికి శూద్ర స్త్రీ యందు

ను గల్గువారు గూడనంబష్ఠు లనబడుదురు - బ్రాహ్మణునకం బష్ఠ స్త్రీయందు బుట్టినవాడు ఆభీరుడనబడును ఇదిఆలగొల్ల జాతి గోజీవనమును రాజగృహరక్షణమును వృత్తులు। బ్రాహ్మణున కాయోగవియనగా వైశ్య స్త్రీయందుశూద్రునకు బుట్టినగన్యదానియందు బుట్టెనేని ధిగ్వణజాతి యనబడును వాడేచెమారీ చర్మములపనిచేజీవించును - నింద్యజీవనుడు । ఈయార్గురు ననగామూర్ధావసిక్తపారశవాం బష్ఠాభీర చర్మకారులును మీదజెప్పిన యవరోటుడును వీరు తల్లిజాతిలో జేరుదురుతండ్రికి పుత్రులుగానేరరు-అందుమూర్ధావసిక్తాంబష్ఠనిషాదులు ముగ్గురునాల్గు వర్ణముల స్త్రీలయందును ప్రత్యేకముగ నల్గురేసిపుత్రులగనిరేని బండ్రెండుగురగుదురు తండ్రులుముగురు గలసి పదునైదుగురు మొదటి విప్రుడొకడు బెరసి పదారుగురు । అందుమూర్ధావ సిక్తునికి విప్రస్త్రీయందు విలోమజుడొకడు క్షత్రియాదులం దనులోమజులు ముగ్గురు వెరసి నల్గురు - ఇట్లంబష్ఠనిషాదులకునైనచో బండ్రెండుగురు - తండ్రులుముగ్గురు బెరసి పదునైదుగురు - వ్రాత్యుడైన విప్రుడుగాని యవరోటుడుగాని కలసి పదార్గురు-"దస్యుసంజ్ఞాభవంత్యేతే మాతృవత్కర్మ కారిణః" వీరందరు దస్యువులనబడుదురు తల్లిజాతిలో జేరుదురు- "రాజ్ఞోబ్రాహ్మణకన్యాయాం సూతోవర్ణస్తుజాయతే । సరాజ్ఞామశ్వసారథ్యం చక్రేదక్షశ్చ నిత్యశః। సూతః ప్రజాపతి స్త్వన్యో మాయారూపీజనార్దనః । వక్తావేదాది శాస్త్రాణాం పురాణానాంచ సస్మృతః॥" అనగా శౌనకాది ఋషులకు బురాణములు వేదార్థములు చెప్పు సూతుడు సూతజాతికాడుమాయచే నవతరించిన భగవంతుడు - ఉగ్ర సంజ్ఞయు నట్లనెరెండు విధములుగా నున్నది "సూతపుత్ర ఉగ్రశ్రవాస్సౌతిః పౌరాణికోపిచ॥" అని అనగా సూతపుత్రుడు ఉగ్రశ్రవుడను వాడును పౌరాణికుడు నగును - అట్లు"క్షత్రియాద్వైశ్యకన్యాయాం మాహిష్యోనామజాయతే। నక్షత్రగాన నృత్యజ్ఞోధనానాం పరిరక్షితా । రాజ్ఞస్తుశూద్రకన్యాయాం ముగ్రాఖ్యోనామజాయతే । మార్గాంతః పురకోశానాం రక్షాంవిప్రేషు వాచనం। ఉగ్రోదుష్టశ్చదస్యూనాం కశ్చిదన్యోపివిద్యతే । సూతమాహిష్యకోగ్రాస్తు క్షత్రియో వర్ణచతుష్టయాత్। ఏకైకశస్తుచతురో జనయంతి సుతానపి । ఆత్మనాసహరాజ్ఞాతు తత్రషోడశసంతితే॥" అనగాక్షత్రియునికి వైశ్యకన్యయందు బుట్టినవాడు మాహిష్యుడు. వానికి నక్షత్రజ్ఞానము నృత్యగీతములును ధనరక్షణమునువృత్తులు -

అట్లుక్షత్రియునకు శూద్రకన్యయం దుగ్రుండుగల్గును వానికి కోట యంతఃపురము
ధనము వీనిరక్షణము విప్రులచే జదివించుటయుపని - మరియుదొంగలలో దుష్టు
డగునుగ్రుడొకడు గలడు - అట్టిసూత మాహిష్యకోగ్రులు ముగ్గురును నాల్గు వ
ర్ణముల స్త్రీలయందు నల్గురేసి పుత్రులగనిరేని పండ్రెండుగురు తండ్రులుముగ్గు
రు తాతయగు క్షత్రియుడును గలసి పదార్గురు- దేవలవచనము - "దేవబ్రా
హ్మణబాలస్త్రీదీనాంధ కృపణైస్తుయత్ । ఉపార్జితంధనంతస్య పరిత్యాగా
త్తు దస్యవః॥" అనగా దేవతలు బ్రాహ్మణులు బాలురుస్త్రీలు దీనులునంధులుకృ
పణులు వీరిచే నార్జింపబడిన ధనము వారియనంతరమున దస్యువులకుజేరును -
"బ్రాహ్మణ్యా మథవైశ్యేన వైదేహోనామజాయతే।రక్షితారాజదుర్గాణాం
తద్వృత్తి పరసంయుతః । క్షత్రియాయాంతు వైశ్యేనముచుకోనామతోభవేత్।
జలేస్థలేచయోమార్గే స్తత్రరక్షాంకరోతిసః । రాజదూతో వాద్యజీవో భవే
త్కీర్తి ప్రకాశకః । వైశ్యేనశూద్ర్యాంకరణో వర్ణస్యాత్యప్రికరోతిసః। దు
ర్గాంతః పురగంజానాం రక్షాం బ్రాహ్మణసంగ్రహం।వైదేహమాగధావేతౌ
కరణశ్చేతితేత్రయః । వర్ణేభ్యః పూర్వవత్పుత్రాన్ జనయంతివిమోహితాః ।
ఏతేద్వాదశ విద్యంతే మూలప్రకృతిభి ర్యుతాః । భవంతి పంచదశవైవైశ్యాష్షో
డశకోభవేత్ । దుష్టానివైశ్యకర్మాణి తేపికుర్వంతి దస్యవః॥" అనగా బ్రా
హ్మణస్త్రీయందు వైశ్యునకు వైదేహుడు - వానికిరాజాజ్ఞచే గోటసంరక్షిం
చుటవృత్తి। అట్లుక్షత్రియస్త్రీయందు వైశ్యునికి ముచుకుడుగల్గును వానికిజలస్థల
మార్గములందు రక్షణము దూత్యము వాద్యముస్తుతి పాఠమును జీవికయగును।అ
ట్లుశూద్రస్త్రీయందు వైశ్యునకు బుట్టువాడు కరణుడు వానికి బ్రాహ్మణులు గో
టయు నంతఃపురము సారాయిల్లు వీనిరక్షణమువృత్తి - ఈవైదేహమాగధ క
రుణులు ముగ్గురును నాల్గుజాతుల స్త్రీలయందు బ్రత్యేకము బుత్రులగనిరేని బం
డ్రెండుగురగుదురు - మొదటితండ్రులతో బదునైదుగురు తాతయగు వైశ్యుని
తో బదారుగురు - వీరుదుష్టమైన వైశ్యవృత్తి జేతురు - ఇకశూద్రునికి బ్రా
హ్మణస్త్రీయందు బుట్టెనేని చండాలుడగును అట్లువచనము "బ్రాహ్మణ్యామథ
శూద్రేణ చండాలస్స్యాజ్జుగుప్సితః । సచక్రే రాజమార్గాది శోధనం చకుక
ర్మచ । రాజస్త్రియాంచశూద్రేణ క్షత్తామైందశ్చజాయతె । శ్వావిధ్య మ
ధగోధానాంసచక్రేవధ బంధనం । ఆయోగవస్తుశూద్రేణ వైశ్యాయాంతు భ

వేత్తుసః । తక్షాస్థపతిరిత్యుక్తో రాజ్ఞాంవేశ్మ కరస్సదా । ఆయోగవ స్తథాక్షత్తాచండాల శ్చేతితేత్రయః । చతుర్వర్ణాసు తనయాన్ జనయంత్యథ పూర్వవత్ । శూద్రేణ సహితాస్తేతు సంతిషోడశసంఖ్యయా । దుష్టానియాని కర్మాణితేపి కుర్వంతి దస్యవః ॥" అనగానట్లు విప్రస్త్రీయందు శూద్రునకు బుట్టిచండాలుడగు వానికి నిందితమైన రోడ్డుదుడుచుట మొదలగు కర్మవృత్తి- అట్లు క్షత్రియస్త్రీయందు శూద్రునికి బుట్టినవాడు క్షత్తయుమైందుడనబడును ఉడుములు నేదు బందులు మొదలగువాని బట్టుటయు వధించుటయు వానికివృత్తులు అట్లు వైశ్యస్త్రీయందు శూద్రునికి బుట్టువాడాయోగవుడువాడు తక్షయనగా కర్రలుచెక్కెడువాడు స్థపతియనగ రాతిపని జేయువాడు ననబడును రాజగృహములుకట్టుట వానికివృత్తి - ఇట్టియాయోగవుడు క్షత్తయు చండాలుడును ముగ్గురు నాల్గువర్ణములస్త్రీలయందు బుత్రులగనిరేని పండ్రెండుగురగుదురు తండ్రులు ముగ్గురు తాతయగు శూద్రుడును గలసి పదారుగురు - వీరుదస్యువులై దుష్టకర్మలు చేయుదురు - "ఏతేవిప్రాదయోజ్ఞేయాః శ్చతుష్షష్టిషుయోనిషు। ఉత్పాదయంతి సదృశాన్ సంకీర్ణానన్య యోనిషు॥" అనగా మీదజెప్పినవిప్రక్షత్రవైశ్యశూద్రులు కూటస్థులుగాగల సంకీర్ణభేదములు పదారేసియు గలసియరువది నాలుగుభేదములలో నొకొక్కడు భిన్నజాతిస్త్రీలయందరువది ముగురియందు బుత్రులగనినచో నరువదిమూడు భేదములగును తనజాతిస్త్రీలయందితరులరువది ముగ్గురును బుత్రులగనిరేని మరియు నరువది మూడగును ఇట్లొకొక్కనికి నూటయిరువదారుభేదములువచ్చినవి గనుక నరువది నాల్గింటిచే నూటయిరువదారురెట్టించినచో దొమ్మిదివేలయారుదూటయరువదెనిమిది సంకర జాతులగుచున్నది-వారలకునన్యోన్యసంకరముచే నగుభేదములనంతము గనుక విస్తరభయమునుండె విచారింపబడవు - మనువచనము "శనకైస్తుక్రియాలోపాదిమాః క్షత్రియజాతయః । వృషలత్వంగతాలోకే బ్రాహ్మణాతిక్రమేణచ । వ్యభిచారేణ వర్ణానా మవెద్యావేదనేనచ।సంగేన ధర్మత్యాగేన జాయతెవర్ణ సంకరః॥" అనగా క్రమముగా కాలదౌర్బల్యముచే గర్మలోపము గలిగి వర్ణధర్మములు నడిపించుటకు సమర్థులైన క్షత్రియులు సహితము బ్రాహ్మణులమన్నింపక శూద్రత్వమునొందిరి కనుక వర్ణముల కన్యోన్య వ్యభిచారము చేతను దుష్టవివాహములచేతను మ్లేచ్ఛాదుల సాంగత్యముచేతను ధర్మ మాచరింపకుం

డుటచేతను వర్ణసంకరము గల్గినదనుట - అందుగొందరు మనువుచే జెప్ప బడిరి "ప్రసాధనోపచారజ్ఞ మదాసందాసజీవినం । సైరంధ్రిం వాగురావృత్తిం సూతేదస్యుమయోగవీ॥" అనగా శూద్రునకు వైశ్యస్త్రీయందుబుట్టినకన్యఆయోగవియనబడునది యలంకరించుట పాదసేవయు మొదలగు నౌకరీచేయనేర్పు గలసైరంధ్రిజాతిని వలచే జీవించుజాలరిని దస్యువునుగన్నది - దస్యువులనగవర్ణసంకరజులు మనువుచే చెప్పబడిరి - "పౌండ్రకాశ్చోండ్రద్రమిడాః కాంబోజాయవనాశ్శకాః । పారదాః పహ్లవాశ్చీనాః కిరాతాదరదాస్తథా। ముఖబాహూరుజాతానాంయాలోకే జాతయోబహిః । మ్లేచ్ఛవాచోర్యవాచోవా సర్వేతేదస్యవస్మృతాః॥" అనగా పౌండ్రకులు మొదలుగదరదుల పర్యంత మగు వేదబాహ్యమగు మ్లేచ్ఛ భాషగలవారును బ్రహ్మక్షత్ర వైశ్యులకు భిన్నులైన యయ్యార్యవాక్కులనగ లేదా విరుద్ధభాషగలవారునుదస్యువులనబడుదురు. వసిష్ఠుడు వృత్తివేరుగజెప్పెను. "సైరంధ్రీణాం సురామద్యసీధుకరణం తద్విక్రయః పుష్పఫలశాకవిక్రయశ్చ॥" అనగా సురామద్యసీధువులను మద్యభేదములని ర్మించుటయు నమ్ముటయు పుష్పఫలశాకాదులమ్ముటయు వృత్తులు సైరంధ్ర జాతినడుచుననుట - మనువచనము- "మైత్రేయకంతు వైదేహోమాధూకంసంప్రసూయతే । నౄన్ప్రశంసత్యజస్రం యోఘంటాతాడోరుణోదయే।భవంత్యయోగవీష్వేతే॥" అనగా వైశ్యస్త్రీయందు శూద్రునకుబుట్టినయయోగవియను స్త్రీయందు విప్రస్త్రీయందు వైశ్యునికిబుట్టిన వైదేహకుడు పుత్రుని గనె నేని వాడుమాధూకుడనబడును వానికి నరులనెల్లపుడు ప్రశంసించుటయు సూర్యోదయమునందు ఘంటమ్రోయించుటయువృత్తులు - నిషాదోమార్గవంసూతే దాశనౌకర్మజీవనం । కైవర్తమితియంప్రాహు రార్యావర్త నివాసినః॥" అనగా క్షత్రియస్త్రీయందు శూద్రునికి బుట్టునిషాదునికినయోగవియందుబుట్టినవాడు మార్గవుడు దాశుడు కైవర్తుడు ననబడును నావలు నడిపించుటజీవనము- మరియు మనువచనము - "ఆభీరోంబష్ఠకన్యాయామాయోగవ్యాంతు ధిగ్వణః॥" అనగా వైశ్యస్త్రీయందు విప్రునికిబుట్టినస్త్రీ అంబష్ఠిదానియందు విప్రునకు బుట్టువాడు ఆభీరుడు అనగా ఆలగొల్లజాతి ఇది పూర్వమనులోమజాతిప్రసంగములో మీదజెప్పబడినది - జాతివివేకమందు "వర్తనంగోమహిష్యాది పోషయేత్తృణవారిభిః । పయోదధిఘృతంతక్రం విక్రేతవ్యం ధనార్థిభిః॥" అనగాగో

వులు గేదెలు మొదలగువాని తృణజలములచే బోషింపుచు వానిపాలుపెరుగునే
యి చల్ల మొదలగునవి విక్రయించుట యాభీరజాతికి వృత్తి మరియు వీనియన్న
ము దినవచ్చునని యాజ్ఞవల్క్యుడు చెప్పెను "శూద్రేషు దాసగోపాల కులమి
త్రార్ధసీరిణః । భోజ్యాన్నానాపి తశ్చైవ యశ్చాత్మానం నివేదయేత్॥" అన
గా శూద్రులలో దాసుడు గోపాలకుడు మిత్రుడు వ్యవహారప్రయోజనము గ
లవాడు- సైరియతు- అనగా దనభూమిదున్నువాడు నాపితుడనగ - మంగలియు
ఆత్మనివేదనము అనగా నీవాడనని సమర్పించువాడునువీరియన్నము దినవచ్చున
నుట - శూద్రాన్నభక్షణమందు మనువచనము - "రాజాన్నంతేజ ఆదత్తేశూ
ద్రాన్నం బ్రహ్మవర్చసం । ఆయుస్సువర్ణకారాన్నం యశశ్చర్మావకర్తి
నః । భుక్త్వాతోన్యతమస్యాన్న మమత్యాత్క్షపణంత్ర్యహం । మత్యాతుభక్షణే
కృఛ్రంరేతోవిణ్మూత్రమేవచ॥" అనగా రాజాన్నము దినినచో తేజస్సుపోవును
శూద్రాన్నముభుజించెనేని బ్రహ్మవర్చసమనగ నాచారమునధ్యయనము జెడు
ను స్వర్ణకారుడనగ కంసాలియన్నముదిన్నయెడ నాయుష్యమేతరుగునుచండా
లునియన్నము భక్షించెనేని జన్మమేవ్యర్థమగును కనుక వీరిలో నొకరి యన్న
మునజ్ఞానముచే భక్షించెనేని మూడుదినములుపవాసము బుద్ధిపూర్వముగభక్షిం
చెనేని కృఛ్రవ్రతము సేయవలెను- ఇకశంఖస్మృతిమాత్రము "శూద్రాన్నం బ్రా
హ్మణోభుక్త్వా తథారంగావతారిణః । చికిత్సకస్యక్రూరస్య తథాస్త్రీమృగ
జీవినః । చండాలాన్నం భూమిపాన్న మజజీవిశ్వ జీవినాం । శౌండికాన్నం
సూతికాన్నం భుక్త్వామాసం వ్రతంచరేత్॥" అని యున్నది అనగా శూద్రా
న్నమునటునియన్నము వైద్యునియన్నము ఘాతకునియన్నము స్త్రీ సంపాదించిన
జీవించువానియన్నము మృగములచే జీవించువాని యన్నము చండాలు నన్నము
రాజాన్నము మేకలు కుక్కలు మొదలగువానిచే జీవించువారియన్నము కల్లున
మ్మువానియన్నము సూతికాన్నమనగ నాశౌచము గలవారి యన్నముభుజించెనే
ని నొకమాసము గోమూత్రయావకములు భక్షింపుచు వ్రతముజేయవలెనని విశే
షమున్నదిగాని యది యనేకావృత్తులు భుజించినచో నని యెరుంగునది - ఆమా
న్నము భక్షించెనేని నందుమూడవభాగము చేయవలెను ఏమనిన మాధవీయమం
దు విష్ణువచనములో చండాలాన్నము బియ్యముమొదలగు నామద్రవ్యము దిన్న
చో త్రిరాత్రోపవాసము సిద్ధాన్నముదిన్నచో పరాకకృఛ్రమని ఆమమందుస్వల్ప

ప్రాయశ్చిత్తము జెప్పబడినది- ఆపత్కాలమందు బరాశరవచనము- "ఆపత్కాలేతువిప్రేణ భుక్తంశూద్రగృహేయదిామనస్తాపేనశుద్ధ్యేత్ద్రుపదానాంశతం జపేత్॥" అనగా నాపత్కాలమందు విప్రుడు శూద్రగృహమందన్నముదినినను పశ్చాత్తాపము నొందెనేని శుద్ధియగును లేదా ద్రుపదాదివయను మంత్రమునూరు మారులు జపించునది - అనునిదియామద్రవ్యపరము ఏమనిన "నాద్యాచ్ఛూద్రస్యపక్వాన్నం విద్వాన్న శ్రాద్ధినోద్విజః । ఆదదీతామమేవాస్మాదవృత్తావైకరాత్రకమని॥" మనువచనము - అనగా శూద్రుని గృహమందుశ్రాద్ధాతిరిక్త కాలమున బక్వాన్నము ద్విజుడు భక్షింపగూడదు శ్రాద్ధమందైనను నామాన్నమునే గ్రహింపవలెను ఆపత్కాలమందుభక్షించెనేనినొకరాత్రియుపవాసమనుట- ఇట్లుండగా మీదవ్రాసిన యాజ్ఞవల్క్యవచనము "శూద్రేషుదాస గోపాలకుల మిత్రార్ధసీరిణః । భోజ్యాన్నానాపితశ్చైవ యశ్చాత్మానం నివేదయేత్॥" అనియుమరియు దేవలవచనము - "స్వదాసోనాపితోగోపఃకుంభకారః కృషీవలః । బ్రాహ్మణైరపిభోజ్యాన్నాః పంచైతే శూద్రయోనయః॥" అనియనుభోజ్యాన్నత్వము విధించుట యన్నమునకు దగినద్రవ్యము గ్రహింపవచ్చు ననుటగాని సిద్ధాన్నము భుజింపవచ్చుననుటగాదు - ఇకభవిష్యవచనము "ఉపక్షేపణ ధర్మేణ శూద్రాన్నంయఃపచేద్ద్విజః । అభోజ్యంతద్భవేదన్నం సచ విప్రః పురోహితః॥" అనగాదనకుగా వండుటకు శూద్రుడు వస్తువులిచ్చినపుడు ద్విజుడు వండెనేని నదిభుజింపగూడదు అట్టిశూద్రపురోహితుడైన విప్రుడు నభోజ్యాన్నుడని యన్నదిగాని - అదిద్విజ శుశ్రూషజేయని శూద్రుని పరముకనుకనే "త్రిషు వర్ణేషుకర్తవ్యం, పక్వభోజనమేవచ । శుశ్రూషామభిపన్నానాం శూద్రాణాంచ వరాననే" యని వరాహపురాణ వచనము అనగా బ్రాహ్మణాదులగుమూడు వర్ణములందును పక్వాన్నమైనను భుజింపవచ్చును అట్లుద్విజశుశ్రూష జేయు శూద్రులయింటనుగూడ భుజింపవచ్చునని యున్నది - కనుక దేవతలకు నివేదనముగూడ బక్వాన్నముచేతనేయని గంగావాక్యావళిలో నున్నది శుద్ధితత్వమందుమాత్ర మిదియంతయు పూర్వయుగాచరణమనిగాని కలిలో నిషిద్ధమేయనియున్నది - మరియు నపరార్కమందు శూలపాణి గ్రంథమందును సుమంతు వచనము "సంసృష్టదుష్టభోజ్యాన్నా" యని విశేషము జెప్పుచున్నది - అనగాజలాది సంసర్గముచే శూద్రునన్నము దుష్టమగుననుట అట్లువచనము "గోరసంచైవసక్తూం

శ్చ తైలం పిణ్యాకమేవచ । అపూపాన్ భక్షయేచ్ఛూద్రాద్యచ్చాన్యత్పయసా కృతం॥" అనగా గోక్షీరము మొదలగునవియు సత్తుపిండియు నూనెయు తిలకపిండియు నప్పములను మరియు కేవలముగ పాలచేతనే జేయబడువస్తువులును శూద్రునియొద్ద గ్రహింపవచ్చును ఇక్కడ పయసాయను తృతీయచే జలాదిసంసర్గము పాకమును నివర్తించును శూద్రజలమునకు నిషేధముగూడనున్నది కనుకన పూపములును క్షీరములచే జేసినవేయని గ్రహించునది కాబట్టి పాయసాన్నముగాని జలముచే వండుపోలెలు మొదలగునవిగాని నిషిద్ధములే- ఇక్కడనిదియథార్థము - రాజులు రెండువిధములు శూద్రాన్ననివృత్తియెందు నియమముగలవారును అట్టి నిష్ఠలేని వారును - అందు రెండవవారు మీద జెప్పినట్లు శూద్రాన్నము భుజింపవచ్చును - ఇతరులకుగూడదు- కనుకనే యపరార్కమందు శూలపాణిగ్రంథమందును హారీతవచనము - "కందుపక్వం స్నేహపక్వం పాయసందధి సక్తవః । ఏతానిశూద్రాన్నభుజో భోజ్యాని మనురబ్రవీత్॥" అనియనగా మంగలములో వేచిన పేలాలు పప్పులు మొదలగునవియు తైలముచే వండినవియు పెరుగు సత్తుపిండి పాయసమనగా బియ్యము జలము వేయక చిక్కగమరిగించిన పాలు నివి శూద్రాన్నత్యాగ నిష్ఠలేనిద్విజులు భుజింపవచ్చును - తక్కువారుభుజింప గూడదు - "ఆమంశూద్రస్యపక్వాన్నం పక్వముచ్ఛిష్ట ముచ్యతే॥" యని నిషేధమును "యచ్చాన్యత్పయసాకృతం॥" అని విధియునున్నందున నిట్లు నిర్ణయింపబడినది - ఇది కోవా మొదలగునది-శూద్రగృహమందునుభుజింపవచ్చును- అట్లుశూలపాణిగ్రంథమందు బ్రాహ్మవచనము - "రాజ్ఞాంపర్వణి వైశ్యానా మశ్నీయాన్మంగళే గవాం । వాసోభూరత్నహేమాన్నం సచ్ఛూద్రస్యగృహేతథా। రాజులయొక్కయు వైశ్యులయొక్కయు సచ్ఛూద్రులయొక్కయు గృహమందుత్సవములందును గోవులకు మంగళమందును వస్త్రములు భూమిరత్నములుసువర్ణము నన్నము గ్రహింపవచ్చునని ఇదియును కలియుగమందు వర్జ్యము - అట్లు వచనము - "శూద్రేషు దాసగోపాలకుల మిత్రార్ధ సీరిణాం । భోజ్యాన్నతాగృహస్థస్య తీర్థసేవాతి దూరతః । బ్రాహ్మణాదిషు శూద్రస్య పక్వతాది క్రియాపివా॥" అనగా శూద్రులలో దాసగోపాలాదులయన్నముదినుట గృహస్థుడతిదూరముగ దీర్ఘయాత్రకు వెళ్లుట ద్విజులకుశూద్రుడు వండుటమొదలగునవి కలివర్జ్యములని మాధవీయమందున్నది - శూద్రాన్నముత్యజించు నిష్ఠగల

వారికి శూలపాణిలో నంగిరసు వచనము - "పాత్రాంతర గతంగ్రాహ్యం శూ
ద్రాత్స్వగృహమాగతం । శూద్రవేశ్మని విప్రేణ క్షీరంవాయది వాదధి । నివృ
త్తేననభోక్తవ్యం శూద్రాన్నంతదపిస్మృతం॥" అనగాశూద్రునివలన దనయిం
టికివచ్చిన క్షీరాదివస్తువులను మరియొకపాత్రలోవేయించి గ్రహించవలెను క్షీర
ముగాని పెరుగుగాని నిష్ఠగలవాడు శూద్రునింటిలో భుజింపగూడదు అదియును
శూద్రాన్నమేయనబడును - విష్ణుపురాణమందును- "సంప్రోక్షయిత్వా గృహ్ణీ
యాచ్ఛూద్రాన్నం గృహమాగతం॥" అనగా దనయింటికివచ్చిన శూద్రునిబియ్య
ము శాకము మొదలగునవి ప్రోక్షించి గ్రహింపవలెననుట - ఇకయాజ్ఞవల్క్య
వచనము "వికర్మస్థాన్ ద్విజాన్‌శూద్రాన్ సవాసా జలమావిశేత్॥" అనికర్మ
హీనులైన ద్విజులను శూద్రులను స్పృశించెనేని సచేలస్నానము చేయవలెనని
నిషేధవచనమున్నదిగాని , యదిదాసుడు మొదలగుశూద్రులుతప్ప దక్కిన వా
రికని తెలియునది - లేదా యంతటనిష్ఠగలవానికైన గావచ్చును - అట్లు గాని
చో "మూల్యకర్మకరాశ్శూద్రాదాసీదాసాస్తథైవచ।స్నానే శరీరసంస్కారే
గృహకర్మణ్యదూషితాః । సద్యస్స్పృశ్యో గర్భదాసో భక్తదాసస్త్ర్యహా
చ్ఛుచిః।" అనువిధి వచనములకువిరోధమువచ్చునుఅనగాకూలికి పనిజేయు శూద్రు
లు దాసీదాసాదులును స్నానమందును శరీరమును దోముటయు పాదసేవజేయు
ట మొదలగువానియందును గృహములో గావలసినపనులు జేయుటయందునుశు
ద్ధులని జన్మమొదలుగ దమయింటిలో దాసుడైయున్న శూద్రునికి సద్యశ్శుద్ధి య
గు భక్తదాసుడైనచో మూడుదినములతో నాశౌచ శుద్ధియగునని మొదలగునది
మనువచనము "అభోజ్యానాంతు భుక్త్వాన్నం స్త్రీశూద్రోచ్ఛిష్టమేవచ । భు
భుక్త్వామాంస మభక్ష్యంచసప్తరాత్రం యవాన్‌పిబేత్ ॥" అనగా భుజిం
పగూడని వారియన్నము దిన్నను స్త్రీశూద్రాదుల యుచ్ఛిష్టముదినిననుతిన గూ
డని జంతువుల మాంసము దిన్నను నేడుదినములు యవోదక పానముజేసి యు
పవసించునది బుద్ధి పూర్వముగ జేసినచో ద్విగుణము - విశ్వంభర శాస్త్రమం
దును - " మాహిష్యాయాం ద్విజాజ్జాత ఆభీరః క్షీరవిక్రయీ । ఉదవాహ
స్సుతో విప్రాద్వైదేహ్యాం వ్యభిచారతః । సహ్రతం ధారయేత్తుకార్యాన్న
రాణాం విక్రయం తథా ॥ " అనగాక్షత్రియునికి వైశ్యస్త్రీయందు బుట్టినది
మాహిష్య యనబడును వైశ్యునికి విప్రస్త్రీయందు వైదేహి యనబడును - అట్టి

మాహిష్యయందువిప్రునికి బుట్టువాడు ఆభీరుడు వానికి క్షీరమునమ్ముటవృత్తియ గును అట్లువైదేహియందు వ్యభిచరించుటచే విప్రునికి బుట్టువాడు ఉదవాహుడ నబడును - అనగా నీళ్లుమోసెడువాడు - ఛత్రము ధరించుటయు నరులనమ్ము టయు వృత్తులు "విప్రాన్నిషాద్యాం యోజాతః పౌష్టికస్స్కంధ వాహకః॥" అన గాశూద్రస్త్రీయందు విప్రునికి బుట్టునది నిషాది దానియందు విప్రునికి బుట్టిన వాడు పౌష్టికుడును స్కంధవాహకు డనబడును అనగా సవారిమొదలగునవిమో సెడు బోయీలనుట - అంబష్ఠాయాం ద్విజాజ్జాతః పుత్రఃకాంస్య స్వకర్మకృ త్ । కాంస్యపాత్రాణి చిత్రాణిరచయేజ్జీవనాయసః । శూద్రధర్మేణ సర్వ త్రస్థితిరస్యవిధీయతే । ఉగ్రాయాంయోద్విజాజ్జాతః కుంభకారస్స ఉచ్యతే । స శూద్రాద్ధీయతే ధర్మేఘటయేన్మృన్మయాన్ ఘటాన్॥ " అనగా అంబష్ఠస్త్రీ యందు ద్విజునికి బుట్టువాడు కాంస్యు డనగ కంచుపనివాడు చిత్రమైనకంచు పా త్రలుచేయుట వానికివృత్తి - శూద్రసముడు - ఉగ్రస్త్రీయందు ద్విజునికి బుట్టు వాడుకుంభకారుడు అనగాకుమ్మరి - కుండలుచేయుట వానివృత్తి - శూద్రజా తికంటె దక్కువజాతి ధర్మము గలవాడు - జాతివివేకమందు -"వ్రాత్యః క్షత్రి యతశ్శూద్ర్యాం జాతశ్శూద్ర విధానకృత్ । సకుర్యాద్రాజపుత్రాంశ్చశస్త్రా స్త్ర కుశలాన్ధనం । తేభ్యోలబ్ధ్వాత్మవృత్త్యర్థం స్వధర్మ మనుపాలయే త్॥" అనగాక్షత్రియునికి శూద్రస్త్రీయందు బుట్టినవాడు వ్రాత్యుడనబడును వా డుశూద్రకర్మజేయువాడు రాజపుత్రులకు శస్త్రాస్త్రవిద్యలనగ సాముగరిడీలు నేర్పుచు దానిద్రవ్యమున స్వధర్మ మాచరించుట వానికివృత్తి । రాజగురుడన బడును "తస్మాన్మల్లిస్సుతో జాతః క్షత్రిణ్యాం వ్యభిచారతః । రాజ్ఞాంకౌతుకమా పాద్యనియుద్ధేనార్జయేద్ధనం । వైశ్యాచ్ఛూద్ర్యామథాంబష్ఠ్యాంజాతోవైతా ళికాభిధః । జీవనంకామ శాస్త్రేణస్తుత్యావా వంది కర్మణా। క్షత్రాత్సార సవీ పుత్రోవిన్నాట స్త్రావకుందకః । వణిజ్జనాత్తు విప్రాయాం జాతోంతః పుర పాలకః । బ్రాహ్మణ్యాం జాయతేవైశ్యా దోసౌవైదేహకాభిధః । శుద్ధాం తరక్షణంరాజ్ఞాం కుర్యాదనుపమం హిసః॥" అనగామీదజెప్పిన వ్రాత్యునికిక్షత్రి యస్త్రీయందు వ్యభిచారము గల్గినవాడు మల్లు డనబడును వాడురాజులకుల్లాస ము బుట్టించుచు జెట్టీపట్లచే ధనమార్జించును - వైశ్యునికి శూద్రస్త్రీ యందు గాని యంబష్ఠస్త్రీయందుగాని పుట్టినవాడు వైతాళికు డనబడును వాడు కామ

శాస్త్రజ్ఞానముచేగాని వందులు చేయునట్లుస్తుతిపాఠములచేగాని జీవించునుక్షత్రి
యునికి పారసవస్త్రీయందు బుట్టువాడు విన్నాటుడుస్తావకుందకుడు ననబడును
వైశ్యునికి బ్రాహ్మణస్త్రీయందు బుట్టిన వైదేహకుడు రాజులయంతఃపురమందు
ద్వారపాలకుడై జీవించును - "సామాన్యవనితాః పోష్యాస్తాసామాద్యాచ జీవి
కా । పణ్యాంగనానాంరాజ్ఞాంచ కుర్యాత్సంగం తదిచ్ఛయా । రూపాజీవసు
తాస్వేవ విశిష్యాసంగతోవిటః । సఏవ తాసాంప్రాణేశోనాన్యః కాంతోపితత్ప
తిః । చతుష్షష్టికలాః కామశాస్త్రంతదుపజీవనం॥" అనగాసానిజాతిపోషింప
దగినది వాళ్లకు ముఖ్యజీవనమేదనిన రాజులకును పణ్యాంగనలకును సంగము వా
రియిచ్చుచేగావలెను - అట్టివేశ్యాస్త్రీలయందు విశేషాసక్తితో దిరిగెడువాడువి
టుడనబడును అతడె సానులకు ప్రాణేశ్వరుడు తక్కినవారెంత సుందరులైనను
వాళ్లకు బ్రియుడు కానేరడు - అతనికి కామశాస్త్రమును నరువదినాల్గు విద్య
లలో నేర్చినంతమట్టుకును జీవనము - ఆవిద్యలేవనిన - "వేదాంగాగమనీతిశా
స్త్రకవితావక్తృత్వతౌర్యత్రికద్యూతాస్త్రాద్భుత వాదసూపరచనాచిత్రంపణో
వైద్యకం । నానారత్నపురాణలేఖపురుషస్త్రీధాతు భాషాలిపిప్రజ్ఞానాటకకే
లిదండి తురగ ప్రజ్ఞాచసాముద్రికం । శయ్యాభోజన యుద్ధమర్దన విభూషా
బంధ సర్వేంగితజ్ఞానంరజ్జు తరీకలారథ కృతిస్సౌఖ్యేష్టభోగేషుధీః॥" వేదములునం
గములు నాగమములు నీతిశాస్త్రము కవిత్వము వాచాలత్వము నృత్యగీత వాద్య
ములు ద్యూతము నస్త్రవిద్యయు నాశ్చర్య కథలు పప్పుమొదలగువాని పాకవిద్య
చిత్తరువుల వ్రాయుట క్రయవిక్రయవ్యవహారము వైద్యము రత్నజ్ఞానము పురా
ణజ్ఞానము పత్రికలువ్రాయుట పురుషభేదజ్ఞానము స్త్రీభేదజ్ఞానము దేహధాతుభేద
జ్ఞానము భాషలు తెలియుట లిపులనేకములు వ్రాయుట నాటకములు క్రీడలు గ
జతురగాముల భేదజ్ఞానము సాముద్రికము శయ్యాభేద జ్ఞానము భోజన విశేష
ముల దెలియుట యుద్ధ భేదములు నంగ మర్దనములు అలంకరించు నేర్పుస
మస్తజనుల హృదయముల పోల్చుట త్రాళ్లపై నడచుట పడవలునడిపించుట ర
థముదోలుట మొదలుగ నెరుగుట సౌఖ్య మెరుగుట యెనిమిది భోగముల చా
తుర్యము మరియును - "త్రాణేచారి విషాగ్నివారిషు తథారేఖాంగ శీర్షే
షయ ద్దుర్గారామకృతిః పశుద్వీప చమత్కార శ్శివాచార్దయః ॥" అ
నగాశ్రుతువు-విషము-అగ్నియు-ఉదకములువీనినుండి రక్షించు నేర్పు అవయవములం

దుశిరస్సులందునుండు రేఖలగ్రహించుట కోటలు తోటలునిర్మించు నేర్పు పశు
వులు యేనుగులు మొదలగువానియెందు చమత్కృతిదెలియుట శివార్చ లుమొ
దలగునవి యెరుంగుటయనునవికళలు-భోగములెవ్వియని న- "సుగంధంవనితావ
స్త్రం గీతం తాంబూలభోజనం । శయ్యావిభూషాసురతం భోగాష్టకముదా
హృతం॥" అనగానీ యెనిమిదింటి ననుభవించు నేర్పు- "శూద్రాద్వైశ్యస్త్రీ
యాంజాతో వణిగ్జన ఇతిస్మృతః । పారసవ్యాంచ మాహిష్యాం మాలాకార
స్స ఉచ్యతే । కుసుమాని సశాకాని వర్ధయేద్ధనవృద్ధయే । సహీనశ్శూద్రధ
ర్మేభ్యస్సమాహేపద్మకేప్రభుః॥" అనగాశూద్రునికి వైశ్య స్త్రీయందుబుట్టు
వాడువణిగ్జను డనబడును - అట్లుపారసవస్త్రీయందును మాహిష్యస్త్రీ యందు
ను బుట్టువాడు మాలాకారుడనగ తోటమాలి యతనికి పుష్పములు శాకములు
పెంచుట జీవనము అతడు శూద్రధర్మములతో హీనుడైతన వర్గములో ప్రభు
వగును "సూతాజ్జాతస్తువై దేహ్యాం సూతకారస్స జాయతే । ఆయోగవ్యాంతు
వై దేహాజ్జాతోమైత్రేయకోభవేత్ । ఘంటావాదన కృత్ప్రాతస్తథా మంగళ
గానకృత్॥" అనగా వైదేహస్త్రీయందు సూతునికి బుట్టువాడు సూతకారు
డు - ఆయోగవియందువైదేహునికి బుట్టువాడు మైత్రేయు డనబడును - వా
డుప్రాతఃకాలమందు ఘంటలు వాయించుటమంగళగానము పాడుటయు వృత్తి
గానడును - "ఆయోగవ్యాంతు కరణాత్సైరంధ్రీ గంధ కర్మకృత్ । పు
ష్పచందన పణ్యాదిశృంగారైస్తస్యజీవనం । పాదయోఃక్షాలనంచైవ ధమ్మిల్లా
నాంప్రసాధనం । ప్రత్యంగ మర్దనంచైవ చందనేనాను లేపనం । మృగనా
భాశ్చంద్రయోగం శృంగార రచనాంనవాం । ఆజీవనంతు తస్యోక్తం తత్స్త్రీ
సైరంధ్రీకాస్మృతా॥" అనగా నాయోగవస్త్రీయందు కరణునికి బుట్టినవాడు
సైరంధ్రుడు మైపూతలిచ్చి జీవించువాడు పుష్పచందములు మొదలగుశృంగారవ
స్తువు లమ్మును పాదములదోముట కొప్పులలంకరించుట - యవయవముల మ
ర్దించుట చందనముబూయుట కస్తురికర్పూరము గలుపుట క్రొత్తశృంగారము
చేయుటయు నతనికివృత్తులు అతనిస్త్రీసైరంధ్రీ యనబడును- విశ్వంభర శాస్త్ర
మందు "ప్రసాధనోప చతురాసైరంధ్రీతిప్రకీర్తితా॥" అనగానలంకరించుటకు
నేర్పుగలది సైరంధ్రీయనబడును - "శైవః పాశుపతః కశ్చిదారూఢః పతితో
యది। తస్మాజ్జాత శ్శూద్రపత్న్యాం పుత్రోభస్మాంకురస్స్మృతః। శివార్చనంతు

తత్కార్యం శివచార్యేనజీవనం। సజటాభస్మధారీచ శివలింగంప్రపూజయేత్ ।
తాంబూల మక్షతాద్రవ్యం గావఃక్షేత్రాణి కానిచి । శివాయప్రాణిభి ర్దత్త మన్యత్కిమపి భక్తితః । చండీశాయత్త్రితా ఖ్యాతం తేవతస్యోపజీవికా ॥"
అనగా శివారాధనపరుడగు పాశుపతదీక్షితుడు దీక్షాభంగమొందెనేని జంగమై పుట్టును వానికి శూద్రపత్నియందు బుట్టువాడు భస్మాంకురుడనబడును-శివపూజనమును శివుని నైవేద్యభక్షణమును జటలు భస్మముధరించుటయు శివలింగ పూజనమును వృత్తులు తాంబూలము నక్షతలు ద్రవ్యము గోవులుభూములుగాని యొక గవ్వగాని శివునకు భక్తులు సమర్పించునది చండీశ్వరునకని జగత్ప్రసిద్ధమైన వస్తువంతయు నితనికి జీవనము - "కుశీలవస్సుతోంబష్ఠా ద్వైదేహ్యాం నర్తనాదికృత్॥" అనగా నంబష్ఠునికి వైదేహియందు బుట్టువాడు కుశీలవుడు నృత్యముగానముమొదలగునదివానివృత్తి - జాతివివేకే-"మహిష్యామాగధా చైవ శుద్ధమార్దకసంజ్ఞికం । జనయేత్తనయంసోపి శూద్రధర్మవినాకృతః।గీతంచ తుర్విధంవాద్యమభ్యసే జ్జీవనాయసః॥" అనగా మాహిష్యగానిమాగధగాని శుద్ధమార్దకుడనువాని గనును వాడు శూద్రధర్మహీనుడై గానముచతుర్విధవాద్యము లభ్యసించి జీవించును - సంగీతశాస్త్రమందు- "తత్రాదౌత్రివిధం గీతం వాద్యంచాపి చతుర్విధం । చతుర్దశవిధంనృత్యం గీతపూర్వంవిచక్షణైః॥" అనగా గానము మూడువిధములు వాద్యమునాల్గువిధములు నృత్యము పదునాల్గువిధములని ప్రాచీనవిద్వాంసులచే జెప్ప బడినది - చతుర్విధవాద్యములమరసింహునిచే జెప్పడెను - "తతంవీణాదికంవాద్యమానద్ధం మురజాదికం । వంశాదికంతు సుషిరం కాంస్యంతాళాదికం ఘనం॥" అనగావీణెఫిడేలు మొదలగునవి తతవాద్యములు మద్దెల మొదలగునవి యానద్ధవాద్యములు వాసికర్రలు ముఖవీణమొదలగునవి సుషిరవాద్యములని నాల్గువిధములు వాద్యములు - అందు మీద జెప్పిన శుద్ధమార్దకుడు మృదంగవాదనముచే జీవించుననుట - "నిర్మండలక ఆభీరాజ్జాతో సౌ బాణపిచ్ఛకృత్ । శరాణాం శరపత్రైశ్చ రచనాతస్యజీవికా॥" అనగా నాభీరునికి బుట్టినవాడు నిర్మండలకు డనబడును వాడు బాణములకు పింఛములనగా రెక్కలు కట్టుట బాణములునిర్మించుటయు తనజీవిక గానడచును - "ఉగ్రాయాంమాగధాజ్జాతః కుంతలశ్మశ్రుకర్మకృత్ । సనాపిత ఇతిప్రోక్తః క్షౌరకర్మ విధానకృత్॥" అనగా క్షత్రియునికి శూద్రస్త్రీయందుబుట్టినస్త్రీఉ

గ్రయనబడును దానియందు మాగధునికి బుట్టినవాడు తలయు గడ్డము క్షౌరము
జేయు నాపితుడనగ మంగలియనబడును - "శ్మశ్రుకర్తనకృచ్చైవ నఖకర్తన
కోవిదః । వృత్త్యానయా గ్రామమధ్యే తిష్ఠేద్వర్ణేషు సేవకః । నరాణాం నా
పితో ధూర్త శ్శూద్రేభ్యోభ్యధికస్స్మృతః॥" అనగా క్షౌరము జేయుటకును
గోళ్లుతీయుటకును నేర్పుగలిగి అదియేవృత్తిగా వర్ణములకు సేవకుడై గ్రామ
మధ్యమందుండవలెను నరులలో నాపితుడు ధూర్తుడు శూద్రులకంటెనధికుడ
ని చెప్పబడెను - వృద్ధమనువచనము " శూద్రకన్యాసముత్పన్నో బ్రాహ్మణేన
తుసంస్కృతః । అపరో నాపితః ప్రోక్త శ్శూద్రధర్మాధికోపిసః ॥ " అనగా
శూద్రకన్యయందు బ్రాహ్మణునకు బుట్టి సంస్కరింపబడినవాడు నాపితుడనబడు
ను వాడు శూద్రధర్మము గల్గియు నధికుడు - యాజ్ఞవల్క్యుడు మాత్రము
నాపితుడు శూద్రుడేయని చెప్పెను - "శూద్రేషు దాసగోపాల కులమిత్రార్ధ
సీరిణః । భోజ్యాన్నా నాపితశ్చైవ॥" యని విలోమజుడు మీద జెప్పబడెను-ఇ
కసూతసంహితయందు మూర్ధనాపితుడునధోనాపితుడునని రెండువిధములుచె
ప్పబడెను అవి వ్యవస్థచే దెలియవలెను - ఇక కాయస్థుని యుత్పత్తి క్రమము -
పాద్మములో సృష్టిఖండమందు - "సృష్ట్యాదౌ సదసత్కర్మజ్ఞప్తయే ప్రాణినాం
విధిః । క్షణంధ్యానేస్థిత స్తస్య సర్వకాయాద్వినిర్గతః । దివరూపః పుమాన్
హస్తే మషీపాత్రం చ లేఖనీం । చిత్రగుప్త ఇతిఖ్యాతో ధర్మరాజసమీపతః । ప్రాణి
నాం సదసత్కర్మ లేఖనాయ నియోజితః । బ్రహ్మణాతీంద్రియజ్ఞానీ దేవాగ్ర్యో
యజ్ఞభుక్సదా । భోజనాచ్చ సదాతస్మా దాహుతిర్దీయతే ద్విజైః । బ్రహ్మ
కాయోద్భవోయస్మా త్కాయస్థోజాతి రుచ్యతే । నానాగోత్రాశ్చ తద్వంశ్యా
కాయస్థాభువి సంతివై॥" అనగా సృష్ట్యాదియందు సర్వ ప్రాణులయొక్క పు
ణ్యపాపములు తెలియజేయుటకు గోరి బ్రహ్మ క్షణమాత్రము ధ్యానింపగనత
నిదేహమునుండి దివ్యరూపముగ నొకపురుషుడు సిరాబుడ్డియు కలముపట్టుకొని
బయలుదేరిన నతని యమునియొద్ద చిత్రగుప్తుడని ప్రసిద్ధుడుగా ప్రాణి కర్మల
వ్రాయుటకు దివ్యజ్ఞానమిచ్చి నిలిపెను అతనికి దేవతలలో శ్రేష్ఠుడుగా యజ్ఞ
భాగమీబడెను ద్విజులు ప్రతిదినమున భోజనసమయమందు చిత్రగుప్తునికాహుతి
నిత్తురు అతడు బ్రహ్మకాయముననుండి పుట్టెను గనుక కాయస్థుడనబడెను వాని
వంశస్థులందరు నిప్పటికి కాయస్థజాతి యనబడిరి ఇది మహారాష్ట్రులలో ప్రసిద్ధ

ముగానున్నది - స్కాందములో రేణుకామాహాత్మ్యమందు - "ఏవంహత్వా ర్జునంరామ స్సంధాయ నిశితాన్ శరాన్ । అన్వధావత్సతాన్ హంతుం సర్వానే వాతురాన్నృపాన్ । కేచిద్గహనమాశ్రిత్య కేచిత్పాతాళమావిశన్। సగర్భా చంద్రసేనస్య భార్యాదాల్భ్యాశ్రమంయయౌ । తతోరామస్సమాయాతో దాల్భ్యాశ్రమమనుత్తమం । పూజితో మునినారామో హ్యర్ఘ్యపాద్యాసనాదిభిః । దదౌమధ్యాహ్నసమయె తస్మైభోజనమాదరాత్ । రామస్తు అయాచయామాస హృదిస్థం స్వమనోరథం । యాజయామాస రామాచ్చ కామం దాల్భ్యమహామునిః । తతోద్వౌపరమప్రీతౌ భోజనం చక్రతుర్ముదా। భోజనానంతరందాల్భ్యః పప్రచ్ఛభార్గవంతదా । యత్త్వయా ప్రార్థితం దేవ తత్త్వం శంసితుమర్హసి॥" రామఉవాచ "తవాశ్రమేమహాభాగ సగర్భాస్త్రీ సమాగతా । చంద్రసేనస్య రాజర్షేః క్షత్రియస్యమహాత్మనః । తన్మేత్వం ప్రార్థితందేహిహింసేయం తాంమహామునే । తతోదాల్భ్యః ప్రత్యువాచదదామి తవ వాంఛితం । యన్మయాప్రార్థితం దేవతన్మేదాతుం త్వమర్హసి । తతస్త్రియం సమాహూయ చంద్రసేనస్యవైమునిః । రామాయప్రదదౌభీతాం రామఃప్రీతమనా అభూత్ - రామఉవాచ - "యత్త్వయాప్రార్థితంవిప్ర భోజనావసరేపురా । తన్మేశంసమహాభాగ దదామి తవ వాంఛితం - దాల్భ్యఉవాచ "స్త్రీయాగర్భమముంబాలం తన్మేత్వం దాతుమర్హసి । తతోరామోబ్రవీద్దాల్భ్యంయదర్థమహమాగతః । క్షత్రియాంతకరశ్చాహంతంత్వంయాచితవానసి । ప్రార్థితశ్చత్వయావిప్రకాయస్థొగర్భఉత్తమః। తస్మాత్కాయస్థ ఇత్యాఖ్యాభవిష్యతి శిశోశ్శుభా। ఏవంరామో మహా బాహుర్హిత్వాతంగర్భముత్తమం । నిర్జగామాశ్రమాత్తస్మాత్క్షత్రియాంతకరఃప్రభుః।కాయస్థఏష ఉత్పన్నః క్షత్రిణ్యాంక్షత్రియాత్తతః। రామాజ్ఞయాసదాల్భ్యేన క్షాత్రధర్మాద్బహిష్కృతః । దత్తః కాయస్థధర్మోస్మై చిత్రగుప్తస్య యస్స్మృతః । తద్గోత్రజాశ్చ కాయస్థాదాల్భ్యగోత్రాస్తతోభవన్। దాల్భ్యోపదేశతస్తేవై ధర్మిష్ఠాస్సత్యవాదినః । సదాచారపరానిత్యం రతాహరి హరార్చనే । దేవవిప్రపితౄణాంవై అతిథీనాంచపూజకాః॥" అని ప్రకారాంతమున్నది - అనగా పరశురాముడు కార్తవీర్యార్జునుని జంపితక్కిన రాజులవధించుటకు బయిగెత్తునపుడు కొందరడవులకుబారిరి కొందరునేలమాన్యములలో డా

గిరి కొండరుచచ్చిరి అందుచంద్రసేనమహారాజు భార్యగర్భిణి దిక్కులేక పరు
గెత్తుచు దాల్భ్యముని యాశ్రమముజొచ్చెను వెంటనే పరశురాముడునువచ్చెను
ఆపైని దాల్భ్యమునిచే నాతిథ్యముగ్రహించుటకు ప్రార్థింపబడి నాకొకకోరి
కయున్నది అదితీర్చెదవేని భుజించెదనని పలుకగ దాల్భ్యుడు నాకు నొకకో
రికయున్నది యదియిచ్చితివేని నీకోరికచెల్లింతునని యిద్దరుసంతుష్టులై భుజించి
న పైని దాల్భ్యుడు తమకోరికయేదనిన నీయాశ్రమములో చంద్రసేన మహారా
జు భార్యయున్నది యిచ్చితివేని దానివధింతు క్షత్రియులకంతము జేయప్రతిజ్ఞ జే
సితిననిన యామెను బిలచి భీతిచేదీనురాలై యుండగ నామెను సమర్పించెను ఆ
పైని సంతోషించి పరశురాముడు మీకోరికయేదనిన నీమెగర్భమందున్న శిశువు
ను దయచేయవలయుననిన నేనుకోరినదే మీరునుగోరితిరి అయిననేమాయెను ఆ
శిశువును క్షత్రియధర్మము లేకుండగదొలగించికాయస్థునిగ జేయవలెనని చెప్పి
పోయిన దాల్భ్యుడు నట్లనే యతని కాయస్థునిగ జేసి క్షత్రియధర్మము దప్పిం
చెను అతని వంశస్థులందరు కాయస్థులు దాల్భ్యగోత్రులు నైరి-వారికిచిత్ర గు
ప్తునికివలె వ్రాతపని ప్రధానవృత్తిగానడచును - ధర్మిష్ఠులు సదాచారము హ
రిహర పూజనము నిత్యము దేవవిప్రపూజయు నతిథిపూజయు జేయుదురు వీరు
మహారాష్ట్రిలలో బ్రాహ్మణులై కూడనుండిరి - "మాహిష్యవనితా సూనుం
వైదేహాద్యం ప్రసూయతే । సకాయస్థ ఇతిప్రోక్తస్తస్యకార్యంవిధీయతే॥" క్షత్రి
యునకు వైశ్యస్త్రీయందు బుట్టునది మాహిష్యయనబడును విప్ర స్త్రీయందు
వైశ్యునికి బుట్టువాడు వైదేహుడు వానికి నామాహిష్యయందుబుట్టువాడు కా
యస్థుడనబడును - అతనికి వృత్తియేదనిన "లిపీనాందేశజాతానాంలేఖనం సస
మాచరేత్ । గణకత్వం విచిత్రంచ బీజపాటిప్రభేదతః । అధమశ్శూద్ర జాతి
భ్యః పంచసంస్కారవానసౌ । చాతుర్వర్ణ్యస్యలేఖాహి లిపిలేఖన సాధనం ।
వ్యవసాయశ్శిల్పకర్మ తజ్జీవన ముదాహృతం । శిఖాంయజ్ఞోపవితంచ వస్త్రి
మారక్తమంభసా । స్పర్శనందేవతానాంచ కాయస్థాహ్యోవివర్జయేత్॥" అ
నగా నిట్లుసంకరజాతియగు కాయస్థుడు అనగా కరణపుజాతి దేశములలో నుం
డు లిపులునేర్చుట ఆశ్చర్యమైనలెక్కదారుడై బీజగణితపరిపాటిగలిగి శూద్ర
జాతికంటె నధముడై యైదు సంస్కారములుగల్గి నాల్గువర్ణముల వారికి నుత్త
రపత్రికలు మొదలగునవి వ్రాయుచు వ్యసాయమును బహువిధరచనాజ్ఞానము వృ

త్తిగా నడచును - మరియును శిఖను యజ్ఞోపవీతము నీరుకావిపంచెలు గట్టుట దేవతామూర్తుల ముట్టుటయు వర్జింపవలెను - ఇతడీదేశమందు ప్రసిద్ధుడు- ఇట్లు కాయస్థుని నిర్ణయము - "మాలాకారాచ్చలావద్యః కరణ్యాం మణిరంధ్రకృత్ । మణిహార కరః ప్రోక్తస్సమంజురితి చోచ్యతే॥" అనగా మాలాకారునికి కరణస్త్రీయందు చలావద్యుడను పుత్రుడుపుట్టును మణులకు రంధ్రములు వేయుటవృత్తి - మణిహార కరుడును మంజుడు ననబడును - "కులాల్యాంశాల్మలో మంజోనాగ పల్ల్యాస్తు విక్రయీ । తాంబూలక్రీతసంభూతం ద్రవ్యంతస్యేహ జీవనం॥" అనగా కుమ్మరిదానియందు మీదజెప్పిన మంజునికి శాల్మలుడను పుత్రుడు గల్గును - వానికితమలపాకు లమ్ముటయె వృత్తిదానిచే జీవించును ఇదియె అగరుజాతి "మాలాకారాత్క్షత్రియాయాం శిలింధ్రో మర్దనక్రియః । హీనస్స శూద్రధర్మేభ్యో జీవికాస్యాంగ మర్దనం॥" అనగా మాలాకారునికి క్షత్రియస్త్రీయందు శిలింధ్రుడనువాడు పుట్టును అంగమర్దన మతనికి వృత్తి వాడు శూద్రధర్మములతో హీనుడై దేహముపట్టి సుఖపెట్టుటచే ధనమార్జించి జీవించును ఇదె దిడ్డె మంగలిజాతి— "శిలింధ్రాత్క్షత్రియాయాంచ కోల్హాటీనామ జాయతే॥" అనగా నాశిలింధ్రునికి క్షత్రియస్త్రీయందు కోల్హాటియను జాతి పుట్టును బహురూపియని ప్రసిద్ధము - "వైశ్యాత్కరణ్యాంయోజాతో గోచారీ వత్సపాలకః । నామ్నాభాగలకం పుత్రంఘటధానాద్వ్యజీజనత్ । మంజుభార్యాసవై లోకేఅజాపాలఇతిస్మృతః" - అనగా వైశ్యునికి కరణస్త్రీయందు వత్సపాలకుడను గోపాలుడుపుట్టును - మీదజెప్పిన మంజునిభార్యయందుఘటధానునికిబుట్టువాడు అజాపాలుడు అనగామేకల గొల్లజాతి - "కర్మచండాలభార్యాయాం యోజాతః పుష్పశేఖరాత్ । సవై మండలకోనామ శునాం మండల పోషకః। యుగళంశునకానాం స ధత్తూర్ణం యోజ్యోమహీభృతా। విధవాయాంయతేర్జాతః కర్మచండాల ఉచ్యతే।వాపీకూపాదిమృత్కర్మ కర్తాచాస్పృశ్యఏవసః॥" అనగావిధవస్త్రీయందు యతికి బుట్టినవాడు కర్మచండాలు డనబడును వాపీకూపాదులత్రవ్వుట వానికివృత్తి వానిభార్యయందు మీదజెప్పిన పుష్పశేఖరునికి బుట్టువాడుమండలకు డనబడును కుక్కలబోషించుటవానికివృత్తి కనుక రాజు వానికి వేటకుక్కల జోడు పోషించుట కధికారమీవలెను - జాతివివేకమందు - "అంబష్ఠాచ్చైవవైదేహ్యాం జాతః పుత్రః కుశీలవః । సంగీతజ్ఞోనృత్యకర్తా దేశాద్దేశాం

తరంవ్రజేత్ ॥ ” అనగానంబష్ఠునికి వైదేహస్త్రీయందు బుట్టువాడు కుశీలవుడు వానికి సంగీతజ్ఞానమున్నృత్య మాడుటయు వృత్తులు దేశమునుండి మరియొక దేశమున దిరుగును - “ఆయోగవాన్మాగధాయాంభ్రికుంసఇతి జాయతే। సవర్ణబాహ్యధర్మేషుసమ్యక్ సంగీతకోవిదః। కాంతానాంన్నృత్యశాలాయాంన్నృత్యంలాస్యం చ శిక్షయేత్।రంగావతారః కర్తవ్యోనాట్యేచ నృపసంసది। చతుర్విధైరంగభావైర్దేశభాషాంగసంభవైః। కాయికోవాచికశ్చైవ ఆహార్యస్సాత్వికస్తథా। చత్వారోభినయాః ప్రోక్తాః నాట్యశాస్త్రవిశారదైః । గీతంవాద్యంచనృత్యంచ త్రియంసంగీతముచ్యతె । సంగీతశబ్దో నృత్యేతు కేవలెనైవగీయతే । సుకుమారంభ వెల్లాస్యముద్ధతం తాండవంవిదుః । తాండవంపదఘాతాద్యైర్లాస్యంరస సమన్వితం । దృష్టిహస్తకభాషాద్యైర్భ్రమరీచారికాదిభిః । కుచబాహూరుదృక్పాతైస్తరుణీనాంతదద్భుతం ॥ ” అనగా నాయోగవునికి మాగధయందు భ్రికుంసుడని పుట్టును స్త్రీవేషధారిపురుషుడు వాడువర్ణబాహ్యములైనధర్మములజేయుచు సంగీతమందనగా నృత్యగీత వాద్యములందు మిక్కిలి నేర్పుగలిగి నృత్యశాలయందు స్త్రీలకు నృత్యలాస్యముల నేర్పును- అవి యేవనిన సుకుమారమనగ మృదుపాదన్యాసములుగలదిలాస్యమనబడును అదిరసయుక్తమగును పాదఘట్టనములతోగూడు నృత్యము తాండవమనబడును అవి నేర్పి రాజసభయందు రంగావతారమన మేళము గట్టించి కాయికవాచికాహార్య సాత్వికములను నాల్గువిధములయభినయములచే నాడించునపుడుదృష్టిభేదములుహస్తభేదములుభాషాభేదములు భ్రమరీచారిక మొదలగువానిచేకుచములందు బాహువులందునూరువులందుదృష్టులువడుటచేజవ్వనుల యాటచూపరులకతిమనోహరముగనుండును“కాయస్థవనితాయాంతుమాలాకారేణసంగతా। తస్యాంయస్తేనపుత్రస్స్యాత్సశాకల్యఇతిస్మృతః । కాంతాకరేషు రచయేద్గజదంతకలాపికాః । సహీనశ్శూద్రజాతిభ్యో మణీన్విరచయేత్సదా । స్ఫాటికాన్బదరాదీంశ్చ కుర్యాత్తద్ద్రవ్యజీవికాం ॥ ” అనగా, మాలాకారునికి పీద జెప్పినకాయస్థస్త్రీయందు బుట్టినవాడు శాకల్యుడనబడును స్త్రీలహస్తాభరణములు గజదంతముచే జేయును మరియు మణులు స్ఫటికపుపూసలు మొదలైనవికూర్చి వానివలన జీవించును శూద్రధర్మములచే హీనుడై యుండును - “వైదేహాచ్ఛూద్రకన్యాయాంజాతస్స్యాం ధసికాభిధః। కుర్యాదన్నాని భక్ష్యాణి విక్రయార్థం స సంధితం। అతోవిక్రయతోలబ్ధంతద్ధనం

తస్యజీవనం॥" అనగావైదేహునికి శూద్రకన్యయందు బుట్టువాడు ఆంధ్రసికుడన
బడును వాడు బహువిధాన్నములను భక్ష్యములను విక్రయించి జీవించును ...
కాంతూజాతి యని యుత్తరదేశమందుప్రసిద్ధము-"కరణీవైశ్యసంయోగాజ్జాతో
వత్సకసంజ్ఞికః । సహీనశ్శూద్రధర్మేభ్యశ్శ్చాద్వలేగాశ్చ చారయేత్॥" అనగా
కరణ(స్త్రీ)యందు వైశ్యునికి వత్సకుడనిపుట్టునువాడు శూద్రధర్మములచే హీను
డైగోవులపచ్చికమేపుచుండును- "వైశ్యస్త్రీ శూద్రసంయోగాదాయోగవకసం
జ్ఞికః । సశూద్రాద్ధీయతే ధర్మైః పాషాణేష్టక కర్మకృత్ । సకుర్యాత్కు
ట్టిమాంభూమించూర్ణేనాస్యచ జీవనం॥" అనగా వైశ్య(స్త్రీ)యందు శూద్రు
నికాయోగవకుడని పుట్టును వాడు శూద్రధర్మములచే హీనుడై రాతిపనియు ని
టికలపనియు సున్నపు పనియుజేయును - "నిషాదకన్యకా శూద్రసంగాద్యం జన
యేత్సుతం । సక్రోధకః కుక్కుటక ఇతిప్రోక్తో ద్విసంజ్ఞకః । టంక శాలాసు
సర్వత్రనాణకానాం విధాయకః॥" అనగానిషాదకన్యయందు శూద్రునికిబుట్టువా
డు క్రోధకుడు కుక్కుటకుడు ననబడును వాడుటంకశాలలో నాణ్యములన్నియు
జేయును- "యోమాగధీక్షత్రియయోజాత ఉల్ముకసంజ్ఞికః। సలోహకర్మణాఽ
జీవే దుత్తమస్త్వంత్యజాతితః । లోహకారఇతిఖ్యాతో లౌహంకర్మాస్యజీవ
నం । తేషాంతు గుణసంయోగం జ్ఞాత్వాశస్త్రవిధాయకః॥" అనగామాగధి
యందు క్షత్రియునికి బుట్టువాడు ఉల్ముకు డనబడును వాడుఅంత్యజాతికంటె ను
త్తముడులోహములపనిచే జీవించును అనగాలోహముల నాణెము తెలిసిశస్త్ర
ములు నిర్మించును - లోహకారస్మృతిలో లక్షణకాండమందు"శస్త్రాంగులం
షట్సమేతంసప్తహృచ్ఛేదకాభిధం । శస్త్రంస్వామిశయోర్వైరం మృత్యుకార్య
స్యథాశుభం"అనగాశస్త్రమారంగులములుగాని యేడంగులములుగాని యున్న
చోహృచ్ఛేదకమనబడును అదిరాజునకు బంటునకు వైరము మృత్యువుజేయును త
క్కినదిశుభము- "తైలభ్రమణయంత్రాణాం యావచ్ఛబ్దః ప్రవర్తతే । తావ
త్కర్మ నకుర్వీతశూద్రాంత్యజ సమీపతః॥" అనగాతెలుకులగానుగయొక్కధ్వ
నివినుపించుప్రదేశములోగాను శూద్రునంత్యజుని సమీపమందును గమనచేయగూ
డదు -"కుక్కుటస్యేహభవతి కుంభకారేణ సంగతా । తస్యాస్సూనుస్తువిఖ్యా
తఃకువిందక ఇతిస్ఫుటం॥" అనగాకుక్కుటజాతి(స్త్రీ)యందు కుమ్మరవానికిబుట్టిన
వాడు కువిందుడనబడును - "కౌశేయానిసవస్త్రాణిరచయేదాత్మవృత్తయేఽత

ల్యోసావంత్యజాతీనాం స్వధర్మంసతుపాలయేత్॥" అనగా కువిందకుడు పట్టు
బట్టలు పొత్తిపంచలు నేయును అంత్యజాతులకు సమానధర్మముగలవాడుస్వధ
ర్మము నడచును - వీడె పట్టుసాలి - "సంగతా వేన వనితా వర్తకేనయదార
హః । తస్యాశ్శాబరికాభిఖ్యఃపుత్రో సౌలోకసంమతః । సహీనస్త్వంత్యజాతి
భ్యఃశుచివాసో విధాయకః॥" అనగా వేనస్త్రీయందు వర్తకునికి బుట్టిన వాడు
శాబరికుడనబడును అంత్యజాతికి హీనుడు శుద్ధవస్త్రములు నేసిజీవించును- "ఆభీ
రీకుక్కుటాభ్యాంయోజాత స్సోఖిరసంజ్ఞకః । సకుర్యాత్తు సవీణాంహివాసాం
సిస్వాత్మవృత్తయే॥" అనగా నాభీరస్త్రీయందు కుక్కుటునికి బుట్టినవాడు అఖి
రుడనబడునువాడుతొగరుపట్టు నార మొదలగువానిచే బట్టలు నేయును-"తద్వైవ
పరీత్యాజ్జాతో యో నీలీకర్తాసకథ్యతే॥"అనగా కుక్కుటస్త్రీయందాభీరునికిబు
ట్టువాడు నీలిపనిజేయువాడు అనగారంగురీజు- "మార్గనాపితయోర్జాతోయో
సౌసాఖిల్య సంజ్ఞకః । హీనస్సగుహ్యకేశానాం కుర్యాద్వపనమంజసా॥" అన
గామార్గస్త్రీయందు నాపితునకు బుట్టువాడు సాఖిల్యు డనబడును వాడు హీ
నుడు అధోరోమముల క్షౌరముజేయును - "జలూకాతుంబిశృంగాణి రక్తస్రా
వేప్రయోజయేత్॥" అనగా జెలగయు నానబగాయతుంబయు కొమ్ముసుప్రయో
గించి శరీరమందు రక్తముదీయును - "జాతోమైత్రేయ శుక్లేన జాంధికాయాం
స్వయంసుతః । అసౌబంధుల సంజ్ఞోత్ర అధమ స్సర్వ జాతిషు । సువర్ణ
కారవిపణెధూల్యాం హేమాదిపశ్యతి॥" అనగామైత్రేయునికి జాంధికస్త్రీయం
దు బంధిలుడనగా జలగడుగుల జాతిపుట్టును కంసాలులకుంపట్లలో బుగ్గి గడగి
స్వర్ణము వెండిమొదలగునవి తీయుటవృత్తి - "నిషాదనారీసంయోగా త్పౌ
ష్టికం జనయేత్సుతం । సచపాంసుల సంజ్ఞోహి శణసూత్ర విధాయకః । క
ర్తాచగోణీ పట్టానాం జీవికాతస్య తద్ధనం॥" నిషాదస్త్రీ సంయోగముచే
పౌష్టికుడనగా పెరికి జాతిపుట్టును పాంసులజాతి యనబడును త్రాళ్లు వేయు
టయు గోనెపట్టలు నేయుటయు వృత్తిగా జీవనము- "పుల్కసస్త్రీ పాంసు
లకా త్సూతేయావాసికాభిధం । కుర్యాత్సతురగాదీనాం శష్పైణైవచ వర్త
నం॥" అనగా పుల్కసస్త్రీయందు పాంసులకునికి బుట్టువాడుయావాసికు డనబ
డును గుర్రములు మొదలగువానికి గడ్డి తెచ్చుటవాసికివృత్తి యగును - "మేదస్య
వనితాకార్యా త్సంగతాం ఘ్రేణచేద్రహః । సాసూతయవనంపుత్రం తురుష్క-

స్సప్రకీర్తితః । ప్రసిద్ధోమ్లేచ్ఛదేశేయోగోవధే నాస్యజీవనం॥" అనగా మేద
స్త్రీకి నాంధ్రునికిబుట్టువాడుతురష్కుడు యవనుడువానికి గోవధవృత్తి-"వందినీ
శూద్రసంయోగా జ్జాతస్పంచాలికాభిధః । చతుర్వర్ణవిహీనోసౌ మంజిష్ఠా
రంగకారకః । తేనరంగేణ వాసాంసి చిత్రాణి రచయేత్సదా । హస్తలేఖ్యం
విచిత్రంచ ద్విధాతచ్చిత్రసాధనం । సఏవ శుచికః ఖ్యాతః కర్తరీసూచికాజన
కః॥" అనగా వందిస్త్రీయందు శూద్రునికిబుట్టినవాడు స్పంచాలికుడనువాడు చ
తుర్వర్ణములకు హీనుడై మంజిష్ఠచే బట్టలకు చిత్రమైన రంగు వేయును హస్త
ముతోశలాకచేగాని అచ్చుగుద్దుటగాని రెండువిధముల పనిజేయును అట్లుపుట్టి
నవాడే శుచికుడనబడును వాడుకత్తెరతో సూదితోపనులుచేయును . "మాగ
ధ్యాం క్షత్రియాజ్జాత ఉల్ముకోలోహ కర్మకృత్ । ఉగ్రాత్పారసవీపుత్రోమా
కళిస్తైలికోభువి । రజకో వర్ణతోహీనః ప్రథమశ్చాంత్యజేషుసః । వస్త్రాని
ర్ణేజనంకుర్యా దాత్మవృత్త్యర్థమేవచ॥" అనగా మాగధియందు క్షత్రియుని
కి బుట్టినవాడు ఉల్ముకుడనబడును లోహకర్మనుజేయువాడు ఉగ్రునికిపారసవ
స్త్రీయందు బుట్టినవాడు మాకళియనగా తిలఘాతకుడును రజకుడనగ చాకలి
యు వర్ణములకుహీనుడు అంత్యజులకు బ్రథముడునగును - వస్త్రముల నుదు
కుటయేవానికి వృత్తియగును - "ఉగ్రజాతంతు వైదేహ్యాం మంజూషంరజకం వి
దుః । వహేదసౌతైలయంత్రముత్తమశ్చాంత్య జాతితః । తైలహింసాయంత్ర
రవాకర్షణాత్పాపసంభవః । అతోమాకళికోనిత్యంనిర్వాస్యోనగరాద్బహిః"
అనగా విప్రస్త్రీయందువైశ్యునకు బుట్టినస్త్రీవైదేహిదానియందు (శూద్రస్త్రీ
కిని క్షత్రియునికి బుట్టిన)యుగ్రునికి బుత్రుడుగల్గెనేని వాడు మంజూషరజకుడనబ
డును అంత్యజులకుత్తముడు తైలయంత్రముచే పనిజేయుతిలలుగానుగలో నాడు
టచే పాపియగును కనుక పట్టణమునకు వెలిగా గాపురముంచవలెను- "రథకా
రస్యదుహితా సాయోగవసమాగతా । సూతేయంతనయంసోపి సూత్రధార
ఇతీరితః । జాయాజీవశ్చశైలూషో నాట్యశాస్త్ర విశారదః॥" అనగా రథకా
రుని కన్యయందాయోగవునికి బుట్టినవాడు శైలూషుడు సూత్రధారుడువానికినా
ట్యశాస్త్రజ్ఞానమువృత్తి తనభార్యనొకరికిదార్చి జీవించును "వేన్యామావర్త
కాజ్జాత స్సచార స్సూత్రవాయకః । ఛాగలీభృజ్జకంతాత్తు ఔరభ్రింమేషపాల
కం । కుర్యాదూర్ణాపటాంశ్చిత్రాన్ మేషాణాం పరిపాలనం॥" అనగావేన

స్త్రీయందావర్తకునికి బుట్టినవాడు చారుడు సూత్రములనేయువాడు - ఛాగల స్త్రీయందు భృజ్జకంఠునికి బుట్టువాడౌరభ్రిషు గొర్రెలగాచును గొర్రెరోమము లచే చిత్రకంబళులనేయును - "ఆవర్తకస్యభార్యాయాం క్షేమకాదుష్ట్రిపాలకం । రౌమికం దేశికామల్లా ద్యుక్త్వంలవణ కర్మణి॥" అనగా నావర్తకుని భార్యయందు క్షేమకునకు బుట్టినవాడు ఉష్ట్రిపాలకుడు వీడెరౌమికుడు దేశికా మల్లుడనబడును ఒంటెలకు లవణక్రియజేయును - "ఆయోగవ్యాం ద్విజాజ్జాతో ధిగ్వణఃకవచాదికృత్ । సచర్మణాశ్వపల్యాణం యథాశోభం ప్రకల్పయేత్॥" అనగా ఆయోగవస్త్రీయందు ద్విజునికి బుట్టువాడు ధిగ్వణుడనబడును వాడుకవ చనములును నశ్వములకు చార్జామా మొదలగునవి నిర్మించును "ఆయోగవీచకై వర్తం జజ్ఞేపారస వాత్సుతం । సహీనస్సర్వజాతిభ్యో జాలం స్వీకృత్య సర్వ దా । మత్స్యాన్జలచరానన్యాన్ ఘాతయే దాత్మ వృత్తయె । నావ్యం క ర్మప్రహరణం నద్యాంవర్షాసు వాహయేత్ । నదీముత్తారయేల్లోకాం స్తే భ్యశ్చె చ్ఛేద్ధనం సదా॥" అనగా నాయోగవస్త్రీయందు పారసవునికి బుట్టువా డుకైవర్తుడు జాలరివాడు వలచే మత్స్యములను దక్కినజలజంతువులను హిం సించును ః మరియు నదులలో వర్షాకాలమందు పడవచే నందరదాటించి ద్ర వ్యముపుచ్చుకొని జీవించును - "ధిగ్వణ్యాంతు నిషాదాద్య శ్చర్మకారస్స తు స్మృతః । గోచర్మణామహిష్యాశ్చ చర్మణాతస్య జీవనం॥" అనగా ధిగ్వ ణియందు నిషాదునికి చర్మకారుడు పుట్టునువానికిగోచర్మాలుగేదెచర్మములు నమ్ముటచే జీవనము - "ఆభీర స్త్రీలభేద్వైనా త్పుత్రం శౌండిక సంజ్ఞికం । సు రాం సకృత్వావిక్రీయ కుర్యాత్తేనప్ర వర్తనం॥" అనగా నాభీరస్త్రీయందు వే నునకుబుట్టినవాడు శౌండికుడనబడును - వాడుమద్యముచేసియమ్మి జీవించును- "కర్మచండాలకా త్పుత్రం వైదేహీపాండుశోపకం । లేభే బురుడ జాతిత్వం సదావంశవిదారణం॥" అనగా భ్రిష్టసన్యాసికి వైదేహస్త్రీయందు పాండు శో పకుడని పుట్టును వీడె బురుడజాతియనగ మేదరివాడు వానికి వెదురు బ్రద్దలచేప నిజేయుటవృత్తి- "జాతోనిషాదా ద్వైదేహ్యాం గారుడీడిండి మోత్తమః॥" అన గా వైదేహస్త్రీయందు నిషాదునికి గారుడి జాతి పుట్టును దానికి డిండిమవాద్య ముజీవనము ః ఇవిమొదలగునవి - మనుస్మృతి - "చండాలాత్పాండు శోపా క స్త్వక్సారవ్యవహారవాన్ । ఆహిండకోనిషాదేన వైదేహ్యామేవజాయతే॥"

అనగా చండాలునికి వైదేహియందు పాండుశోపకుడు పుట్టివెదురుబ్రద్దలుచే జీ
వించును మరియు దానియందే నిషాదునికాహిండకుడను వాడు పుట్టును - వె
దురుపేళ్లచే బనిజేయుటయే వృత్తిఇదె మేదరిజాతి - "చండాలేనతు సోపాకో
మూలవ్యసన వృత్తిమాన్ । పుల్కస్యాం జాయతేపాప స్సదాసజ్జన గర్హి
తః॥" అనగా చండాలునికి పుల్కసస్త్రీయందు శ్వపాకుడనుచండాల భేదముపు
ట్టును వానికపరాధుల నురిదీయుటవృత్తి - పుల్కసియనగా క్షత్రియ స్త్రీయం
దు శూద్రునికి బుట్టిన నిషాదునికి శూద్రస్త్రీయందుబుట్టినది - "నిషాదస్త్రీతు
చండాలా త్పుత్రమంత్యావసాయినం । శ్మశానగోచరంసూతె బాహ్యానామపి
గర్హితం॥" అనగా నిషాదస్త్రీయందు చండాలుని కంత్యావసాయిజాతిపు
ట్టును - దానికి శ్మశానమందుండుట వృత్తిచండాలజాతికంటె నీచమైనది- అట్లు
కొందరాదిపురాణమందు జెప్పబడెరి - "నిషాద్యామథశూద్రేణ కుక్కుటస్యా
త్కరోతిసః । చక్రతోమరశూలాసీ లకుటప్రాసతోమరాన్ । చక్రాణిశస్త్రి
జాలాని భిండిపాలాంశ్చ భూభుజాం । కుక్కుటానాం ప్రహర్తాచ రాజకు
క్కుటఖేలనః । అంబష్ఠ్యాం జాయతేవేనో వైదేహేన కరోతిసః । పటహం
వాదయన్ స్ఫీతం రాజాదేశం ప్రజాస్వపి॥" అనగా నిషాదస్త్రీయందు శూద్రుని
కి కుక్కుటుడని పుట్టును చక్రములు తోమరములు శూలములు కత్తులు లకుటము
లు ప్రాసములుతోమరములు భిండిపాలములు మొదలుగజేయును కోళ్లను జం
పుటయు పుంజులచే పందెములాడుటయువృత్తి - అంబష్ఠియందు వైదేహునికి
వేనుడుబుట్టును డప్పువాయించుచు రాజాజ్ఞను ప్రజలకుదెలుపుట వాని వృత్తి-
"పుల్కసః కుక్కుటోవేన స్త్రియఆరణ్యావాసినః॥" అనగా పుల్కసుడు మొద
లుగ ముగ్గురు నడవియందుండవలెననుట - "ఆయోగవ్యాం దస్యునాచ సైరం
ధ్రో నామజాయతే । మృగాదివధజీవీచ పాశబంధేన నిత్యశః । రాజ స్త్రీ
ణాం సూతికానాం ద్వారరక్షాంకరోతిసః॥" అనగా మీదజెప్పిన దస్యునికాయో
గవియందు సైరంధ్రిడనువాడు పుట్టి పాశబంధాదులచే మృగాదుల వధించుచు
రాజస్త్రీలుప్రసవించునపుడు ద్వారపాలకుడై జీవించును "ఆయోగవ్యాం నిషా
దాత్తు ధీవరోనామ జాయతే । నావోనదీనాం కర్తాస తాంచసంవాహయే
త్సదా । నిషాదాదథవైదేహ్యాం కారావారఃకరోతిసః । చర్మణాంభేదనం
నిత్యం సీవనం క్రయవిక్రయం॥" అనగా నాయోగవస్త్రీయందు నిషాదునకు ధీ

వరుడని పుట్టును వాడు నదులపడవలచే దాటింపుచు జీవించును - నిషాదునికి వైదేహియందు కారావారుడని పుట్టును వాడుచర్మములు ఛేదించుట కుట్టియమ్ముటవృత్తిగా జీవించును - "నిషాద్యామథవైదేహా జ్జాయతే చంద్రమేచకః । అరణ్యానాం పశూనాంస కరోతి చవధంసదా । తస్య(స్త్రీ)గమనాత్సత్తా శ్వపాకం జనయేత్సుతం । శ్వమాంసాదమరణ్యస్థం పాపశూపోాప జీవినం॥" అనగా నిషాద(స్త్రీ)యందు వైదేహునకు చంద్రమేచకుడుపుట్టును కుక్క మాంసము భక్షించుచు నడవిలోని వసించి గ్రామములో పెంటలనెత్తుచుండును - "చండాలాదపి వైదేహ్యాం పాండుసోపాక సంజ్ఞికః । ఉపానచ్చర్మవేణూనాంవిక్రియంహికరోతిసః॥" అనగా వైదేహ(స్త్రీ)యందు చండాలునికి- పాండుసోపాకుడనువాడు పుట్టి చెప్పులు చర్మములు వెదుళ్లునమ్ముటచే జీవించును "ఆహిండకోనిషాద్యాంచ వైదేహా దపిజాయతే । యోదస్యూనాంతువధ్యానాంపరిరక్షాంకరోతిచ॥" అనగా నిషాద(స్త్రీ)యందు వైదేహునికి ఆహిండకుడను వాడు పుట్టును వాడుదొంగలకును వధార్హులకును రక్షకుడు - అంత్యావసాయీ చండాలాన్నిషాద్యాం జాయతేనరః । శ్మశానవాసీ తద్వృత్తిశ్చండాలేష్వపి గర్హితః । అనాథంనగరాచ్ఛవం దూరంతేచనయంత్యపి । శయ్యాభరణవస్త్రాణి వధ్యానాం రాజశాసనాత్ । నిర్దిష్టం వధదండంతు కృత్వా గృహ్ణంతి నిత్యశః । వివాహాది ప్రకుర్వంతి సమానే వర్ణసంకరే । మృతాగ్రో బ్రాహ్మణార్థంతు కదాచిత్సంతరంతితే॥" అనగా నిషాదియందు చండాలునికి బుట్టువాడు అంత్యావసాయియనబడును వాడుచండాలజాతికె నీచుడుశ్మశానమందు వసింపుచు పట్టణములో దిక్కులేనిశవములమోసి పారవైచుచు రాజాజ్ఞచే వధ్యులగు వారిజంపుచువారి శయ్యాసనవస్త్రాదులగ్రహించి జీవించును - వసిష్ఠస్మృతిలో సంకరులకుజెప్పినవృత్తులు - కైవర్తులకు నావలచే జీవించుట-నిషాదులకు మృగపశుపక్షులజంపిమాంసమమ్ముట - ఆవృత్తులకు గజాశ్వములరక్షించుట- ఆభీరులకు గోవులు మేకలు గొర్రెలు మొదలగువానిరక్షించుటధిగ్వణులకు చర్మములపనియమ్ముకొనిజీవించుట- కారావరులకు చర్మములుదీయుట దీపాసనములరక్షించుట సవారీలు మోయుటయు - కుక్కుటజాతికి బట్టలునేయుట వృక్షములఛేదించుటతోటలు వేయుటయు - ఆంధ్రులకు మేదులకును- వీధులలో బెంటదుడుచుట పాయఖానులు దుడుచుట గుహ్యావయవము స్పృశించుటయనగా

శుద్ధిజేయుటగాని క్షౌరముజేయుటగాని యగును- సూనెగానుగ నాడుటయు-
మధూకులకు రాజగృహమందు ప్రాతఃకాలమున స్తుతి పాఠముల జదువుట మేలు
కొలుపుట- ప్రవ్రజ్యావసితులకు యావజ్జీవముగ దాసవృత్తి- పుల్కసులకునోష
ధుల ద్రవ్యముల్కొనుట చేటలుచేయుట- చండాలులకు నంత్యావసాయులకునువన
శ్మశానముల రక్షించుట గరళము నగ్నివిషమూలికలు ప్రయోగించుట-స్త్రీలకుభ
ర్తనుసేవించుట వృత్తి మరియు నన్నవ్యంజనపాన సంస్కారమునృత్యగీతములు
కామసూత్రము నభ్యసించుటయు భర్తకుపయోగించునట్లు చేయుటయేవృత్తి -
చారణస్త్రీలకు గీత నృత్యాదికమువృత్తి - వర్ణసంకరులందరును వర్ణములకు
జెప్పిన ధర్మముతోహీనులై యుందురుకాయహింసాది ధర్మములుమాత్రమం
దరకును గావలసినవి - ఏవనిన "అహింసా సత్యమస్తేయం శౌచమింద్రియని గ్ర
హః । దానందమోదయాశాంతి స్సర్వేషాం ధర్మసాధనం" అని యాజ్ఞవ
ల్క్యస్మృతి - అనగా ప్రాణిహింస జేయకుండుట - సత్యవచనము - చౌర్య
ములేకుండుట - శుచిత్వము - ఇంద్రియముల వ్యసనము లేకుండ నిగ్రహించు
ట-యథాశక్తిగ దానము- ఓరుపు - కనికరము - తృప్తి - యనునివి యన్ని
జాతులకు సుగతి నిచ్చుననుట - తల్లిదండ్రుల మృతతిథియందు సజాతీయుల క
న్నముబెట్టుట వస్త్రాహారద్యాది దానమునని మీదజెప్పబడినది - శంఖ స్మృతి
లోమాత్రము - వృత్తులు వేరుగ జెప్పబడినవి - సూతజాతికి కేశశ్మశ్రు నఖ
లోమాదుల క్షౌరముజేయుటయు స్నానము జేయించుట గంధాభరణాదుల
నలంకరించుట గుర్రములందృణాదులచే బోషించుటయు వృత్తి - క్షత్తకుద్వార
పాలకత్వమువార్తలు దెచ్చుటయు - మాగధులకు మృదంగ వేణువీణాదివాద
నము నృత్యగీతాదులు కోపాది వికారములందు జయశబ్దము లుచ్చరింపుచు స్తు
తించి శాంతిజేయుట మేలుకొల్పుటయువృత్తి - అంబష్ఠులకు దేహమందుగ్రుచ్చు
కొన్నశల్యాదులదీసివేయుటఉన్మాదముక్లీబత జ్వరము నపస్మారము మొదలగు
వాని చికిత్సయు వృత్తి-వైదేహకులకు వస్త్రములచింపికుట్టుటరంగువేయుటయు
దుకుటవాపీకూపాదులజలము దెచ్చుట తోటల దుడుచుటయు వృత్తులు - ఉగ్రు
లకు గజశిక్షయు రాజచ్ఛత్రము బట్టుట పురముగాచుట కైముఖానా రక్షించుట
మొదలగునదివృత్తి - వేనులకు దూరముచాటుట వేగముగబరుగెత్తుట మల్లయు
ద్ధముజేయుట యింద్రజాలము మొదలగు గారిడీలుచేయుటయువృత్తులు - కుక్కు

టులకు ఖడ్గపరశుభిండివాలతోమర ముద్గ రాద్యాయుధములను లోహకవచముల
ను జేయుటవృత్తి - ఆయోగవులకు నినుపపనిచేయుట కర్రలుచెక్కుట కుంభ
ములజేయుటయువృత్తి - సువర్ణరజతలోహములపనియు డాలుతరవారుపట్టి
పనిచేయుటయు వృత్తులు - పుల్కసులకు నగరవీధుల సంరక్షించుట దిక్కులే
నిశవముల మోయుట చిత్తరువులు వ్రాయుట పత్రముల ఛేదించుట తేనెపట్టులు
గొట్టి తేనెదెచ్చుట- బిలములుచేయుట కూపాదులు త్రవ్వుటయు వృత్తులు-చం
డాలులకు శ్మశానము రక్షించుట కొరతదీయుట వధ్యులజంపుటయు వృత్తులు -
శ్వపచులకు నివియెవృత్తులు - ఇందునొక జాతికి నానావృత్తులజెప్పుట వికల్ప
మనిగాని సముచ్చయమనిగాని తెలియవలెను - తక్కినవి జాతి వివేకములో గ్ర
హించునది - ఇకకలియుగమందు క్షత్రియ వైశ్యులు లేరని భాగవతములోనవ
మస్కంధమందు జెప్పబడినది - ఎట్లనిన "ఇక్ష్వాకూణామయంవంశ స్సుమిత్రాం
తోభవిష్యతి । యతస్తం ప్రాప్యరాజానం సంస్థాంప్రాప్స్యతివైకలౌ। దేవా
పిర్యోగమాస్థాయ కలాపగ్రామమాశ్రితః । సోమవంశం కలౌ నష్టం కృతాదౌ
స్థాపయిష్యతి॥" అనియనగా నీసూర్యవంశము సుమిత్రుడంతముగ నశించిపోవు
ను - దేవాపియనువాడు శంతనుని తమ్ముడుమాత్రము కలాపగ్రామమందు గూ
ఢమైయుండి తిరిగి కృతయుగమందు క్షత్రియులలో చంద్రవంశము వృద్ధి నొందిం
చుననుట - ద్వాదశస్కంధమందును " ఏతేషాంనామలింగానాంపురుషాణాం
మహాత్మనాం । కథామాత్రా వశిష్టానాం కీర్తిరేవస్థితాభువి । దేవాపిశ్శం
తనోర్భ్రాతా మరుశ్చేక్ష్వాకువంశజః । కలాపగ్రామఆసాతేమహాయోగ బలా
న్వితౌ । తావిహైత్యకలేరంతే వాసుదేవాను శిక్షితౌ । వర్ణాశ్రమ యుతం
ధర్మంపూర్వవత్ప్రథయిష్యతః॥" అనగా ఇట్లుపూర్వయుగములందు ప్రసిద్ధు
లైనమహాత్ములందరకును నామలింగములచే గీర్తిమాత్రమె కలిలో నిల్చునుగాని
వంశములుండవు మరియేమనిన శంతనుని తమ్ముడు దేవాపియు నిక్ష్వాకు వంశస్థు
డు మరుడనువాడును యోగబలముచే జీవించి కలాపగ్రామమందుండి కలియుగాం
తమందు భగవంతునిచే బోధితులై తిరుగ వర్ణాశ్రమధర్మములనడిపింతురని -
అట్లువిష్ణుపురాణమందును "దేవాపిః పౌరవో రాజామరుశ్చేక్ష్వాకువంశజః। కృతే
యుగఇహాగత్యక్షత్రప్రావర్తకౌహితౌ - తథా - మహాపద్మపతిః కశ్చిన్నం
దః క్షత్రవినాశకృత్ । ఆరభ్యభవతోజన్మయావన్నందాభిషేచనం । ఏతద్వర్ష

సహస్రంతుశతంపంచ దశోత్తరం॥" అనగాపూరువంశోత్పన్నుడగు దేవాపియు నిక్ష్వాకువంశమందుబుట్టినమరుడను రాజును కృతయుగమందు దిరుగవచ్చిక్షత్రియ జాతిని ప్రవర్తింపజేయుదురు-మరియును మహాపద్మపతియగునందుడనువాడుక్ష త్రియవంశనాశకు డొకడుపుట్టును ఇతడు పరిక్షిత్తునకుపైని కలియుగాది యం దుండెడురాజు - నీజన్మము మొదలుకొని నందునిపట్టాభిషేక పర్యంతమగుకాల మువేయునూటపదునైదు వత్సరములుండునని పరిక్షిత్తునితో జెప్పుట - పురా ణాంతరమందును - "బ్రాహ్మణాః క్షత్రియావైశ్యాశ్శూద్రవర్ణా స్త్రయో ద్విజాః । యుగెయుగె స్థితాస్సర్వే కలావాద్యంతయో స్థితాః ॥ " అని అనగా యుగాంతరము లందున్న బ్రహ్మక్షత్ర వైశ్యులను ద్విజులందరు కలి యుగాది యందు నంతమందును శూద్ర వర్ణులగుదురు - అనియిట్లు ద్విజులే లేని యెడ ద్విజులవలన సంకరజాతులు పుట్టునని యెట్లుమీదజెప్పబడెనదనిన విను ము విష్ణుపురాణమందే-"కలౌతు బీజభూతాస్తుకేచిత్తిష్ఠంతి భూతలే । యథైవ దేవాపి పురూ సాంప్రతంసమవస్థితౌ॥"అనియున్నది అనగామీదజెప్పినదేవాపి పు రువు లిద్దరివలె బీజభూతులై ద్విజులు కలియుగమందు నుండుదురనుట - మరి యు మత్స్యపురాణమందును - "బ్రహ్మక్షత్ర విశశ్శూద్రా బీజార్థేయ ఇహ స్థితాః । కృతేయుగేహితైస్సార్థం నిర్విశేషా స్తదాభవన్॥ " అని యున్న ది అనగా బ్రహ్మక్షత్ర వైశ్యశూద్రులు ముందు విత్తనముకొరకు గలియుగ మం దును నిలుతురు తిరుగ కృతయుగమందు వారితోసమానులగు వారు పుట్టిరి అని యున్నందున ప్రచ్ఛన్నరూపులై స్వకర్మభ్రష్టులైన క్షత్రియులువైశ్యులును క్వ చిత్తునుండే యున్నారని మాతండ్రిగారగు రామకృష్ణ భట్టులు చెప్పిరి - "యో భాట్టతంత్రగహనార్ణవకర్ణధార శ్శాస్త్రాంతరేషునిఖిలేష్వపి మర్మభేత్తా। యోత్రోత్తమః కిలకృతః కమలాకరేణ ప్రీతోమునాస్తు సుకృతీబుధరామ కృష్ణః॥" అనగాదుర్గ్రహమైనపూర్వమీమాంసాతంత్రమనుసముద్రమునకర్ణధారుడువలె నందరినిదాటించెడువ్యాఖ్యానముజేయుచుతక్కినశాస్త్రములలోగూడ సిద్ధాంత ములనిర్ణయించునేర్పుగల్గినమహాపండితుడగురామకృష్ణభట్టాచార్యుడను మా తండ్రిగారు నేనుజేసినగ్రంథములోనుత్తమాంశచేతృప్తి నొందుగాకయనుట ఇట్లు జగద్గురు నారాయణభట్ట సూనుడగు రామకృష్ణ భట్టుని పుత్రుడగు కమలాకర భట్టునిచే రచింపబడిన శూద్రధర్మమందు సంకర జాతినిరూపణము ముగిసెను.

